# శ్రీరామ తీర్థ వేదాంతభాష్యము

# శ్రీరామ తీర్థ సంపూర్ణ సారస్వతము



తృతీయ సంహిత

[7, 8, 9, సంపుటములు]

శ్రీరామ తీర్థ సేవాశ్రమము

పిడుగురాళ్ల (పోష్టు) - గుంటూరుజిల్లా - ఆంధ్ర

దీపావళి – 1966
ద్వితీయ సంస్కరణము
1000 ప్రతులు

పుటలు : 320

మూల్యము :
రు.

ముద్రణ :
వెల్కం ప్రెస్ (ప్రైవేట్ లిమిటెడ్)
గుంటూరు-2

# శ్రీ రామతీర్థస్వామి

## శ్రీ శ్రద్ధానందస్వామి

"శ్రీరామతీర్థస్వామి, ప్రాపంచక వ్యామోహబంధాలన్నిటినీ త్రెంచివైచి, జంఝూనిలమువలె స్వేచ్ఛామూర్తి ఐనాడు. ఆయన ప్రవర్తన మహోన్నతాదర్శవంతమై, నేటి సన్న్యాసులకు అనుసరణీయమైయున్నది. సరళజీవనానికి, సమున్నతభావనకు - ఆయన మచ్చుతునక. ఆయన, గురుకుల విద్యావిధానం అత్యావసర మని ఉద్ఘాటించాడు. రాముడు, జపాన్ అమెరికాలలోకూడా పరివ్రజించాడు. ఆయన మహోన్నత ఆధ్యాత్మిక సౌశీల్యం, అమెరికా దేశీయులను ఎంతగా ప్రముగ్ధపరిచిందంటే - అమెరికా అధ్యక్షుడు రూజువెల్టుకూడా, ఏతద్భారతీయ సన్న్యాసిని అభినందించడానికివచ్చాడు. ఆయన, అనేక అమెరికా విశ్వవిద్యాలయ కార్యనిర్వాహకులతో సంప్రతించి, అక్కడి భారతీయవిద్యార్థులకు ప్రత్యేక సౌకర్యాలు కల్పింపజేశాడు. జపానులో స్వామిచే ప్రారంభింపబడిన ఇండో - జపానీస్ సొసైటీ, ఇప్పటికీ పని చేస్తున్నది. ఆయన మహోన్నత శ్రేణికిచెందిన దేశభక్తు డనడంలో అభిప్రాయభేదా లుండవు. శ్రీరామతీర్థస్వామి తన దేశానకై తన సర్వస్వాన్ని ఆహుతిచేసిన మహాత్యాగి."

---

* శ్రీ శ్రద్ధానందస్వామి, ఆర్యసమాజస్థాపనాచార్యులైన శ్రీ దయానంద స్వామివారి సంప్రదాయమునకుచెందిన మహాపురుషులలో నొకరు. దేశసేవలో తన ప్రాణమును బలిదానమొనర్చిన ధర్మవీరుడు.

జయ జయ శ్రీనారసింహ

# రామ వేదాంత వేణురావం - రాసక్రీడకు రమ్మంటున్నది:

శ్రీ కేశవ తీర్థ స్వామి

జీవగోపీ ప్రపంచమంతా నిద్రాముద్రిత మైంది. పాశవిక ప్రవృత్తియే పరమావధిగా తలచింది. విషయ సుఖాలలో వివశమైంది. అహంభావకంసాసురుని హింసాత్మకచర్యలు లోకాన్ని ఆక్రమించాయి. భక్తి అనే దేవకీదేవి బంధింపబడింది. జ్ఞాన మనేవసుదేవుడు చెరపట్ట బడ్డాడు. సత్కర్మానుష్ఠాన మనేసాధుసమాజం స్వాతంత్ర్యమును కోల్పోయింది. పృథ్వీమాతహృదయగర్భమునుండి నిర్వేదనాదములు ఉద్ఘాతమైనవి. భారతవర్షమున - "మురళీవాలా" జనపదమందు - మురళీధరుడు, శ్రీరామతీర్థస్వరూపుడై, అవతరించాడు. సర్వప్రపంచం సనాథమైంది. విశ్వప్రతికూలశక్తులకు విలయ మాసన్నమైంది.

మన శ్యామసుందరుడు - రామతీర్థభగవానుడు - విశ్వబృందా వన నికుంజపుంజచ్ఛాయలలో వేదాంతవేణుగానమును ప్రారంభిం చాడు. నిద్రాప్రపంచం ప్రకంపించింది. దిశలు పులకించాయి. మహీతలి మధుమాసశోభారంజితమైంది.

జీవగోపీలోక మింక కనుమూయదు. "తత్త్వమసి"-" - "నీవు పరమాత్మవు" - అన్నరామవేదాంతవేణురావం, జగతిని జాగరితం చేసి, సత్యానందబృందావనానికి ఆకర్షిస్తున్నది. శ్రీరామతీర్థజగదా చార్యస్వామివారి వేదాంతవేణుగానముచే ఆకర్షింపబడినవా రంతా, జీవన్ముక్తులై విశ్వబృందావనమధ్యమందు, ఆత్మాలింగనసౌఖ్యంలో - అద్వైతానందంలో - సత్యైక్యప్రమోదంలో - ప్రమత్తులౌతారు. తృష్ణావిముక్తులై, కృష్ణానురక్తులైనవారంతా, కృష్ణరతిసౌఖ్యపర వశులై, సత్యైక్యరసానందపరవశులై, "శివోఽహం" అని గానం

చేస్తారు. "అహం బ్రహ్మాస్మి" - "నేను పరబ్రహ్మమును", "సర్వం ఖల్విదం బ్రహ్మ" - "సర్వమూ బ్రహ్మమే" - అని పరమాత్మతో కలిసి నృత్యం చేస్తారు. రాసక్రీడలో రాత్రింబవళ్ళు ఒళ్ళు మరుస్తారు.

విశ్వబృందారామమున రామవేదాంతవేణుగానం వినబడడం లేదా ? కళ్ళు నులుపుకోవడంతోటే కాలం గడచిపోతున్నది. రండి రండి! - రామారామంలో, రాసక్రీడామహోత్సవానికి :

విశ్వాత్మమైన ఆత్మారామునితో రమించడమే - రాసక్రీడ. బ్రహ్మజ్ఞానరసమయజీవనమే - రాసక్రీడ. సత్యసాక్షాత్కారానంద ప్రకటనమే - రాసక్రీడ. తనలోనూ, యావద్విశ్వమునందునూ వెలుగొందుచున్నపరమాత్మతో ఏకమై - ఆ అద్వైతానుభూతితో ఆనందించడమే - రాసక్రీడ.

ఆ బ్రహ్మైక్యరసమయరాసక్రీడానిమగ్నజీవులు క్షుద్రవిషయ సుఖనిమగ్నులు కారు. దేహభావకారాగారబద్ధులు కారు. అరిషడ్వర్గ పీడితులు కారు. ఈ బ్రహ్మైక్యరూపరాసక్రీడాపరాయణులు, తమలో, యావద్విశ్వంలో, సర్వేశ్వరుని సందర్శిస్తారు. సంసేవిస్తారు.

ఈ వేదాంతవేణురావం - సనాతనమైనది. అనుక్షణ మిది ఆగక, ముకుందుని చే ముఖరితమవుతునే ఉన్నది. వేదవీథులలో దానిని వినవచ్చు. ఖురాన్‌లో దానిని గుర్తుపట్టవచ్చు. బైబిలులో దానిని అలింపవచ్చు. సమస్తమతారామములందు దానిని, ఆలకించవచ్చు. ప్రకృతిలోని ప్రతిఅణువున దానిని శ్రవణించవచ్చు. నే, డా సనాతన ధర్మమురళీ రవళిని స్పష్టాతిస్పష్టంగా రామభగవానుడు నవప్రపంచ బృందావనమధ్యమందు వినిపిస్తున్నాడు.

రామముఖరితమైన ఈ అనుష్ఠానవేదాంతవేణురావం, బ్రహ్మానందరాసక్రీడాసుఖమును ప్రసాదిస్తుంది. సర్వకులస్థులు, సర్వమతస్థులు, సర్వజాతిమానవులు రావచ్చు. రాసక్రీడలో పాల్గొని ఆనందించవచ్చు.

జయ జయ శ్రీనారసింహా

# రామవేదాంతవేణురావం - రాసక్రీడకురమ్మంటున్నది:

శ్రీ కేశవతీర్థస్వామి

జీవగోపీ ప్రపంచమంతా నిద్రాముద్రిత మైంది. పాశవిక ప్రవృత్తియే పరమావధిగా తలచింది. విషయసుఖాలలో వివశమైంది. అహంభావకంసాసురుని హింసాత్మకచర్యలు లోకాన్ని ఆక్రమించాయి. భక్తి అనే దేవకీదేవి బంధింపబడింది. జ్ఞాన మనే వసుదేవుడు చెరపట్ట బడ్డాడు. సత్కర్మానుష్ఠాన మనే సాధుసమాజం స్వాతంత్ర్యమును కోల్పోయింది. పృథ్వీమాతహృదయగర్భమునుండి నిర్వేదనాదములు ఉద్భూతమైనవి. భారతవర్షమున - "మురలీవాలా" జనపదమందు - మురళీధరుడు, శ్రీరామతీర్థస్వరూపుడై, అవతరించాడు. సర్వప్రపంచం సనాథమైంది. విశ్వప్రతికూలశక్తులకు విలయ మాసన్నమైంది.

మన శ్యామసుందరుడు - రామతీర్థభగవానుడు - విశ్వబృందా వన నికుంజపుంజచ్ఛాయలలో వేదాంతవేణుగానమును ప్రారంభిం చాడు. నిద్రాప్రపంచం ప్రకంపించింది. దిశలు పులకించాయి. మహీతలి మధుమాసశోభారంజితమైంది.

జీవగోపీలోక మింక కనుమూయదు. "తత్త్వమసి"-" - "నీవు పరమాత్మవు" - అన్న రామవేదాంత వేణురావం, జగతిని జాగరితం చేసి, సత్యానందబృందావనానికి ఆకర్షిస్తున్నది. శ్రీరామతీర్థజగదా చార్యస్వామివారి వేదాంతవేణుగానముచే ఆకర్షింపబడినవా రంతా, జీవన్ముక్తులై విశ్వబృందావనమధ్యమందు, ఆత్మాలింగనసౌఖ్యంలో - అద్వైతానందంలో - సత్యైశ్వర్యప్రమోదంలో - ప్రమత్తులౌతారు. తృష్ణావిముక్తులై, కృష్ణానురక్తులైనవారంతా, కృష్ణరతిసౌఖ్యపర వశులై, సత్యైశ్వర్యరసానందపరవశులై, "శివోఽహం" అని గానం

చేస్తారు. "అహం బ్రహ్మాస్మి" - "నేను పరబ్రహ్మమును", "సర్వం ఖల్విదం బ్రహ్మ" - "సర్వమూ బ్రహ్మమే" - అని పరమాత్మతో కలిసి నృత్యంచేస్తారు. రాసక్రీడలో రాత్రింబవళ్ళు ఒళ్ళు మరుస్తారు.

విశ్వబృందారామమున రామవేదాంతవేణుగానం వినబడడం లేదా ? కళ్ళు నులుపుకోవడంతోటే కాలం గడచిపోతున్నది. రండి రండి! - రామారామంలో, రాసక్రీడామహోత్సవానికి :

విశ్వాత్మమైన ఆత్మారామునితో రమించడమే - రాసక్రీడ. బ్రహ్మజ్ఞానరసమయజీవనమే - రాసక్రీడ. సత్యసాక్షాత్కారానంద ప్రకటనమే - రాసక్రీడ. తనలోనూ, యావద్విశ్వమునందునూ వెలుగొందుచున్నపరమాత్మతో ఏకమై - ఆ అద్వైతానుభూతితో ఆనందించడమే - రాసక్రీడ.

ఆ బ్రహ్మైక్యరసమయరాసక్రీడానిమగ్నజీవులు క్షుద్రవిషయసుఖనిమగ్నులు కారు. దేహభావకారాగారబద్ధులు కారు. అరిషడ్వర్గపీడితులు కారు. ఈ బ్రహ్మైక్యరూపరాసక్రీడాపరాయణులు, తమలో, యావద్విశ్వంలో, సర్వేశ్వరుని సందర్శిస్తారు. సంసేవిస్తారు.

ఈ వేదాంతవేణురావం - సనాతనమైనది. అనుక్షణమిది ఆగక, ముకుందునిచే ముఖరితమవుతునే ఉన్నది. వేదవీధులలో దానిని వినవచ్చు. ఖురాన్‌లో దానిని గుర్తుపట్టవచ్చు. బైబిలులో దానిని ఆలింపవచ్చు. సమస్తమతారామములందు దానిని, ఆలకించవచ్చు. ప్రకృతిలోని ప్రతిఅణువున దానిని శ్రవణించవచ్చు. నేడా సనాతన ధర్మమురళీ రవళిని స్పష్టాతిస్పష్టంగా రామభగవానుడు నవప్రపంచ బృందావనమధ్యమందు వినిపిస్తున్నాడు.

రామముఖరితమైన ఈ అనుష్ఠానవేదాంతవేణురావం, బ్రహ్మానందరాసక్రీడాసుఖమును ప్రసాదిస్తుంది. సర్వకులస్థులు, సర్వమతస్థులు, సర్వజాతిమానవులు రావచ్చు. రాసక్రీడలో పాల్గొని ఆనందించవచ్చు.

ప్రతిజీవి తన యిష్టస్వరూపంలో స్వస్వరూపబ్రహ్మమును సాక్షాత్క రించుకొని, పరమాత్మతో కలిసి క్రీడించడమే — రాసక్రీడారహస్యం. క్రైస్తవుడు తన క్షుద్రాహంకృతిని వదలి, యెహోవాను దర్శించి, ఏతద్దైక్యానందమును పొంది, సత్య క్రైస్తవుడుగా జీవించడంద్వారా రాసక్రీడానందము ననుభవిస్తాడు. మహమ్మదీయుడు దేవుని తన యిష్ట రూపంలో దర్శించి, అల్లాతో ఐక్యమై జీవించడంద్వారా, రాసక్రీడా సుఖాన్ని అనుభవిస్తాడు. హైందవుడు పరమాత్మను తన యిష్టదైవ రూపంలో సందర్శించి, ఏతద్బ్రహ్మానందరసమును అనుభవించడం ద్వారా, రాసక్రీడారసమును అనుభవిస్తాడు. ప్రపంచమందలి ప్రతి మానవుడు తన స్థానంలోనే, తన విధానంలోనే, తన స్వధర్మకర్మలోనే ధర్మమును దర్శించి, ధర్మైక్యానందరాసక్రీడాహ్లాదమును పొందు తాడు. ఈ అహంకార రాహిత్యరూపకమైన — ఈ ఆత్మజ్ఞాన రూపక మైన —రాసక్రీడలో, జీవుడు దేవుడౌతాడు. జీవితం ఆనందక్రీడగా మారుతుంది. విశ్వమంతా వైకుంఠ మవుతుంది. ఇంతకంటే — మన కేమి కావాలె? వస్తారా, రామవేదాంతజీవనరాసక్రీడామహోత్సవానికి! వచ్చేవారు రండి! మాయాలోకసంరంభకోలాహలములను చీల్చు కొనివస్తున్న రామవేదాంత వేణురావ మిదే వినండి! దీని ననుసరించి మనం బ్రహ్మైక్యజ్ఞానరాసక్రీడారంగమును చేరుకోగలం :



పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీ కేశవతీర్థ స్వామివారు**

# విషయానుక్రమణిక

## తృతీయసంహిత

### సప్తమసంపుటం - "వందేమాతరం"



### అష్టమసంపుటం – "శ్రీరామతీర్థలేఖావళి"

## నవమసంపుటం - "భక్తి-ఉపాసన"

ఓం

# శ్రీ రామతీర్థ పరమహంస

రాయబహదూర్ లాలా బాజీనాథ, బి. ఏ.

(భారత మహాసంస్కర్త త్రయము)

"......నేనతి సన్నిహితంగా ఎరిగి కలిసి పనిచేసిన మూడవ మహాత్ముడు, పంజాబును తన జన్మచే పవిత్రపరిచిన శ్రీ రామతీర్థ స్వామి. ఇలాంటి మహాత్ములు, పరమ పవిత్రులు, ఎప్పుడో అసాధారణావకాశములలో గంభీర బ్రహ్మజ్ఞానమునకు ఆదర్శంగా మానవుల మధ్య సాక్షాత్కరిస్తారు. కేవల దారిద్ర్యంలో పుట్టి, పంజాబులోని గుజరన్వాలా జిల్లాలోని ఒక ప్రాచీనాచార బ్రాహ్మణకుటుంబంలో ఉదయించి, ఇరవై-ఇరవై ఒక్క ఏండ్ల వయస్సులో పంజాబు విశ్వవిద్యాలయంలో సుప్రసిద్ధి వహించి, గణితశాస్త్రంలో యం. ఏ. పదవి నలంకరించాడు స్వామి. తర్వాత ఆయన లాహోరు ఫోర్మన్ క్రిష్టియన్ కాలేజీలో అధ్యాపకుడుగా పనిచేశాడు. కానీ, అచిరకాలంలోనే 'తత్త్వమసి'— అన్న ఉపనిషత్ప్రవచన సత్యదర్శనానికి ఉద్యోగాన్ని వదలివేసి, ప్రాపంచికమైన సర్వసంబంధాలు పరిత్యజించాడు. చేతిలో ఒక్క ఉపనిషత్ గ్రంథముతో, వన మృగ పక్షిసంఘాలు, హిమాలయ నిర్మలగంగాజలాలు సహవాసులుకాగా, శీతోష్ణ బాధలను, అరణ్యాపాయాలను ధైర్యసాహసాలతో సహిస్తూ, ఈ యువకుడు సంవత్సరాల తరబడి జీవిత సమస్యల మీద గాఢ ధ్యాననిమగ్నుడై సంచరించాడు. ఒకసారి కైలాసపర్వతాలకు నిర్గమిస్తూ, ఇంకొకసారి కాశ్మీరములోని అమరనాథానికి పయనిస్తూ, ఒకసారి యమునోత్రికి, మరొక సమయంలో గంగామూలమైన గంగోత్రికి పయనిస్తూ, కొన్నాళ్లు నదీ తీరముల యందు ధ్యానమగ్నుడై, రోజులకు రోజులు అలాగే కూర్చుంటూ, తన అన్వేషణావస్తువు దొరకని పరిస్థితుల్లో, తనచుట్టూ ఉన్న ప్రపంచాన్ని పూర్ణంగా మరిచిపోయి, తీవ్ర విరహావేశంతో ఒకొక్కప్పుడు నదిలో దూకుతూ, స్వామి బ్రహ్మాన్వేషణ చేశాడు.

చివరకు ధ్యానయోగంచేత తన అన్వేషిత పరమవస్తువును ఇరువై తొమ్మిదోయేట దర్శించాడు. భారతవర్ష సేవకు సంసిద్ధుడై, తర్వాత ఆయన ప్రజల మధ్యకు వచ్చాడు. సమస్త జాతులకు, వేలకు వేలమంది ప్రజలకు తన దివ్యసందేశాలను ఉపన్యసించాడు. తన మనోవాక్కాయ నైర్మల్యము, మనోహర వ్యక్తిత్వము చేతనే ప్రజలను తనలోకి ఆకర్షించుకొన్నాడు. దేహసుఖభావన అనేది పూర్ణంగా మరిచిపోయి, తనకు లభ్యమైన ఏదో నిరాడంబరాహారాన్ని భుజించేవాడు. తన జీవిత ముఖ్యావసరాలకు కావలసిన దాన్ని తప్ప ఎక్కువ యే వస్తువు వుంచుకుండేవాడు కాదు. డబ్బుగాని, వస్త్రాలుగాని, ఇంక యే వస్తువులనుగాని తన కెవరైనా బహూకరించినపుడు తక్షణమే ఇతరులకు ఇచ్చేసేవాడు. తనను ప్రేమించే భక్తులచే యివ్వబడిన రుచ్యాహారాలను నిరాకరించేవాడు. సత్యజీవితాన్ని వాంఛించేవాళ్ళకు నిరాడంబర జీవితము, ఉన్నతభావన అవసరమని స్వామి కారణం చెప్పేవాడు.

ఆయనకు ఆధిక్యతాభావన లేదు. గర్వప్రవర్తన లేదు. నేను గొప్పవాణ్ణి అనే స్మృతే లేదు. స్వామి సన్నిధికి వచ్చిన ప్రతివ్యక్తి ఆయన చిరునవ్వుల వెన్నెలలో మున్గుడై తన దుఃఖమంతా, మనోవ్యథనంతా తక్షణమే మరచి, ఆనంద పడేవాడు. ఆయనకు ఎంత గాఢమైన విద్యా ప్రేమ వున్నదంటే - పాశ్చాత్య మతతత్వ వాఙ్మయ సముద్రమంతా ఏకొద్ది కాలంలోనో ఆపోశించాడు. ఉపనిషద్ఋషుల, వ్యాస, కృష్ణ, శంకర, బుద్ధాదుల సిద్ధాంతములు ఆయనకు షేమ్సు టేబ్రిజ్ (Shames Tabrez) మౌలానా రుమీాల (Maulana Rum) సిద్ధాంతాలవలె అరచేతిలో వుండేవి. కాంట్, స్కోపెన్ హార్, ఫిచిట్ (Fichte) హెగల్ మొదలయిన వాండ్లు కబీరు, నానక్‌లవలె ఆయనకు సన్నిహితులు. స్వామియొక్క ముఖ్యాంశములన్నీ వురుదు కవిత్వంలో వున్నప్పటికి, ఆయన గీతాలు ఇతర సుప్రసిద్ధ వేదాంత శ్లోకాలవలె భారతీయుల్లో ఎక్కువ పరివ్యాపించినవి. 1902 లో జపానునుంచి అమెరికాకు పోతున్నప్పుడు ఆయనను మేము దర్శించాము. అక్కడ వున్న ఒక్క రెండుసంవత్సరాల స్వల్పకాలంలోనే స్వామి అనేకమంది విద్యాజ్ఞాన సంపన్నులను ఆకర్షించాడు. అమెరికాలోని గ్రేట్ పసిఫిక్

రైలురోడ్డు మానేజరు, స్వామికి పుల్‌మాన్ కార్ ఇచ్చే సందర్భంలో 'ఆయన మందహాసాలు అనివార్యములయినవి' అని నిర్వచించాడు. అమెరికాలో తన అభిమానులిచ్చే ఆతిధ్య పూజాసత్కారాలతో తృప్తిపొందక వాటి కతీతుడై భారతదేశ సముద్ధరణానికై పనిచేశాడు. ఆయన నిరంతర కృషిని గురించి ప్రబోధించాడు "మనముందర వున్న సమస్య దరిద్రప్రజానీకాన్ని రక్షించే, సేవించే సక్రమ యజ్ఞాన్ని నిర్వర్తించటం. దాని ఫలితాన్ని నిష్ప్రయోజనం కాకుండా నిర్వర్తించటం, ప్రతి భారతీయుడు తనకంటే, కులములో సంపదలో జ్ఞానములో శక్తిలో తక్కువగావున్న సోదర ప్రజలకు తాను కన్నబిడ్డలవలె సహాయం చేయాలి. లాభంమీాద దృష్టిలేకుండా తల్లియొక్క పరమోత్కృష్టమయిన అవ్యాజానురాగంతో సోదరప్రజలకు ఆత్మాహారమివ్వాలి. ఉత్సాహము, జ్ఞానము, ప్రేమ అందరికి పంచిపెట్టాలి. ఇదే నిజమైన నిష్కామ యజ్ఞం."

స్వామి తన సహజస్వభావాన్ని వ్యక్తీకరిస్తూ యిల్లా చెప్పాడు:—
కావాలి — సంస్కర్తలు.
పరసంస్కర్తలుకాదు — ఆత్మసంస్కర్తలు.
విశ్వవిద్యాలయ పట్టభద్రులుకాదు——
అహంకార విజయ పట్టభద్రులు.
వయస్సు :— దివ్యానంద నవయౌవనం.
ప్రతిఫలము :— బ్రహ్మపదవి.
త్వరగా దరఖాస్తులు పంపుకోండి —
భైక్షుక ప్రార్థనలతో కాదు.
అర్హతా యుతమైన దృఢ సంకల్పంతో.
ఎవరికి— జగదీశ్వరుడైన నీ ఆత్మకే."

పాశ్చాత్యభూమిలో ఒక రెండు సంవత్సరాలుమాత్రం నివసించి స్వామి భారతభూమికి తిరిగివచ్చాడు. కాని ఎవరైనాసరే యితరవ్యక్తి యిరవై సంవత్సరాల్లోనైనా గ్రహించలేని దాని అనుష్ఠాన జీవిత జ్ఞానంతో తిరిగి వచ్చాడు. ఈ జ్ఞానాన్ని తన దేశీయులముందు రచనల్లో ఉపన్యాసాల్లో స్వేచ్ఛగా పెట్టాడు. ఆయన వ్రాసినటువంటి, చెప్పినటు

వంటి ప్రతి విషయములో ప్రాచ్య దేశపు గాఢమైన వేదాంత విజ్ఞానము, పాశ్చాత్యదేశపు అనుభవరూపకమైన భౌతిక కృషి కలిసి ముద్రితములై వున్నవి. పరిష్కరించవలసిన భారతసమస్య "మితిమించిన జన బాహుళ్యంతో గూడిన అనుభవజ్ఞాన దారిద్ర్యము." ఈ అనుభవజ్ఞాన శూన్యతలోనే కాయకష్టాన్ని నిర్లక్ష్యించడం, అసహజములైన కుల జాతివిభేదములు, పరదేశయాత్రా నిరాకరణ, బాల్యవివాహము, స్త్రీలపైన బలాత్కారముగ నెట్టిన మానసికమైన, దైహికమైన అంధ కారము—ఇమిడి యున్నవి. "మన పూర్వీకుల సంప్రదాయమును మనము వదలి పనిచేయలేము. దానిని పూర్ణంగా వదలినా సంఘము నశిస్తుంది. దాన్ని పూర్ణంగా పాటించినా సంఘము నశిస్తుంది...చిన్న భావాలతో వున్న పెద్దలకంటే, పెద్దభావాలతో వున్న చిన్నవాళ్ళ వల్లనే దేశం బలపడుతుంది.......చాలా కొద్దిరాబడి, దానికితోడు ఏటేటా పెరిగిపోతున్న కుటుంబంతో పాటు అర్థంలేని కూరాచారా లకు దాసులై వృథాగా చేసే వ్యయాలు. ఈవిధంగా ప్రతి భారతీయ గృహము జాతి మొత్తానికి ఉదాహరణగా ఉన్నది...జనాభాసమస్య పరిష్కృతం కాకుండా వదలబడితే జాతీయైక్యతను గురించి, సమిష్టి సహకారాన్ని గురించి చేసే ప్రసంగాలన్నీ శవాలంకారాలే". పరదేశ యాత్రలచేత మతము, జాతి భ్రష్టమవుతుందనే భావనను పరిత్యజించ టంలోనే ఉపశమనమార్గం ఇమిడియున్నది. 'అపుత్రస్య గతిర్నాస్తి' అనే సిద్ధాంతాన్ని వదలిపెట్టాలి. వివాహము పవిత్రబాంధవ్యంగా మాత్రమే యుండాలి. అనర్హులైన, నిష్ప్రయోజకులైన, విషక్రిమి సమానులను దేశంలో కోటానుకోట్లను అధికంచేయటానికి కాదు వివాహ సంబంధం. అసిధారావ్రత రూపకమైన పవిత్రతను సంపా దించు...పవిత్రత లేకుండా వీరత్వం ఉండదు; పవిత్రత లేకుండా ఐక్యత వుండదు; పవిత్రత లేకుండా శాంతి వుండదు. విద్యారంగంలో మన ముందరవున్న పరమోత్కృష్టమయిన విధి—ఎక్కువ అభివృద్ధి చెందిన దేశాలలో వ్యవసాయకళాపారిశ్రామిక విజ్ఞానాన్ని ఆర్జించటానికి, దరిద్ర ప్రజానీకాన్ని స్త్రీలను పంపి, విద్యనేర్పించి, ఆ ఉపయుక్త జ్ఞానాన్ని భారతదేశంలో వ్యాపింపచేయడమై యున్నది, "విశ్వాస జ్యోతిని, ప్రజ్వాలన జ్ఞానకాంతిని నీ హృదయంలో ఆరక వెలిగేటట్లు

చేయకుండా నీవు ఒక్క అడుగైనా ముందుకు వేయలేవు...ప్రగల్భ పరిస్థితులు దాటి అగాధమైన అంతస్థితిలో జీవించటం, నీ జీవితపు లోతులను స్పృశించటం, ప్రకృతిలోను, నీలోను ఏకమైవున్న పరమ సత్యాన్ని దర్శించి అనుభవించడం, 'తత్త్వమసి' అన్న మహావాక్యానికి సజీవరూపమై భాసించడం—"ఇదే జీవితం, ఇదే అమృతత్వం." ఏ మతాచార్యుడుగాని, ఏ సంఘసంస్కర్తగాని ఈ మహామహునికంటే అతి విస్పష్టంగా సమస్యను, దాని పరిష్కృతిని నిర్వచించలేదు. ఆ మహాత్ముని ప్రబోధాలలోని సత్యాన్ని గుర్తించినవాళ్ళు భారత దేశంలో చాలా కొద్దిమంది అవడమే చాలా విచారకరము. కొద్ది కాలం ప్రజలమధ్య పనిచేసిన తర్వాత స్వామి తన మామూలు తపో ధ్యానాదులకై హిమాలయారణ్యాలకు నిర్గమించాడు.ఒకనాడు టెహ్రీ సమీపంలోని గంగానదిలో స్నానంచేస్తూ తన ముప్ఫైమూడో యేట దేహపరిత్యాగం చేశాడు.

స్వామివారిప్రబోధ సారాంశం – ప్రాచ్య ఆధ్యాత్మిక జ్ఞానంతో జపాను అమెరికాల భౌతిక విజ్ఞానాన్ని మేళవించడం; ఆత్మను కప్పిపుచ్చటంకాదు. తనచేతులార తన ఆత్మ నాశన కార్యంలో మగ్నత పొందడంకాదు. ప్రజల యోగక్షేమాన్ని రవ్వంతకూడా పట్టించుకో కుండావుండటంకాదు. నిగ్రహంలేకుండా వివేచనలేకుండా కేవల పశు దృష్టితో చేసే ప్రజాబాహుళ్య సృష్టిగాదు. అజ్ఞానంలో బానిసత్వంలో మునిగి పడే తృప్తిగాదు. మానసిక పరిశ్రమలేని జడత్వంగాదు. గతించిన పూర్వవిషయాలను పూరక పొగడుతూ, వర్తమానభవిష్యత్తులను నిర్లక్ష్యించడం గాదు. మరి – పూర్వపు బరువు వేస్తున్న వస్త్రాచ్ఛాదనాలను తీసివేయడమై యున్నది. అజ్ఞాన బానిసత్వాన్ని పటాపంచలు చేయడమై యున్నది. ఈ మహర్షి పుంగవుని మహత్తర సందేశమిదే! ఆయన శరీరం గతించినా, ఆ మహాత్ముని ప్రభావం గతించలేదు. సంవత్సరానికి సంవత్సరం గడచిన కొద్దీ అది నెమ్మది నెమ్మదిగా, దృఢంగా మన యువక ప్రపంచంలో మాత్రమే వ్యాపించడమేకాక, ఒకప్పుడాయన సిద్ధాంతాలను అపహాస్యంగా చూచిన సాధు వర్గంలో కూడా పరివ్యాపిస్తున్నది.............

# శ్రీ రామతీర్థస్వామి



"బుద్ధునిలాగా, మహమ్మదుమాదిరి, క్రీస్తువలె, ఆయా ప్రవక్తలరీతి, అవతారాలవిధంగా, అనుచరకోటిని సమకూర్చడంకాదు— ఇప్పుడు రాముని ఆశయం. ప్రతిస్త్రీలో, ప్రతి శిశువులో, ప్రతి మానవునిలో - రామచైతన్యమును జాగరితం చేయడమే రామోద్యమం. ఓం! ఓం!! ఓం!!!"

SRI RAMA TIRTHA SEVASHRAM, PIDUGURALLA (P. O.) GUNTUR DT., A. P.

# శ్రీరామతీర్థ వేదాంతభాష్యము

## శ్రీరామతీర్థ సంపూర్ణసారస్వతము

# హిందూదేశముయొక్క ప్రస్తుత అవసరాలు

### శాస్తాజల ప్రవంతి, క్యాలిఫోర్నియా, యు. యస్. ఏ.

......స్వర్గసుందరమైన సుస్వచ్ఛహిమవర్షం అతి తీవ్రంగా, సుఖప్రదంగా రాముని కుటీరానికి వెలుపల కురుస్తూ, వున్నది. నిజంగా ఈ పర్వతమంతా 'శాస్తా' అన్న పేరును అన్వర్థం చేసికుంది. ఫ్రెంచి భాషాదృష్టితో 'శాస్తా' అన్న పదానికి అర్థం అందమైన, పవిత్రమైన, ప్రశాంతమైన అని. రాము డింతకుముందే పరిణామసిద్ధాంతమును గురించిన ఒక నవ్యరచనను చదవడం పూర్తిచేసి అవతలపెట్టాడు.

ప్రసిద్ధిపొందా లనే వాంఛ, కీర్తితృష్ణ తరచు మానవులను సత్యపథాన్నుంచి తొలగిస్తుంది. అలాంటి దృష్టిని వదలివేసి నిష్పాక్షిక దృష్టితో హిందూదేశపు ప్రస్తుతావసర సమస్యను మనం సమీక్షించి నట్లయితే, మనమెదుట ఒక శోచనీయదృశ్యం కనపడుతున్నది.అందరూ ఒకే పవిత్ర భూమిలో నివసిస్తూకూడా పరస్పర సోదరప్రేమ అనేది లేకుండా ఉన్నారుకదా! మత విభేద విద్వేషాలు శాఖోపశాఖలుగా పెరిగిపోయి, జనులలోని మానవత్వాన్ని కప్పివేసి, జాతీయ సామరస్యాన్ని విధ్వంసం చేసినవి.

అమెరికాలోసైతం హిందూదేశంలోకంటే ఎక్కువ కాకపోయినా, సమానంగానైన వివిధమత శాఖోపశాఖలున్నవి. అయినా కేథాలిసిజం, మెథాలిజం, ప్రెస్బిటరేనిజం మొదలైన కొన్ని ప్రత్యేక మతావేశసంఘువిషయాల్లోతప్ప పరస్పర మానవప్రేమ పతనంకాలేదు. హిందూదేశంలో మాదిరి అమెరికాలో మతాభిమానం మానవహృదయాన్ని చంపలేదు. మహమ్మదీయులు తరతరాలనుండి హిందువుల పొరుగున ఒకే హిందూదేశపుగడ్డమీద నివసిస్తున్నారుకదా! కానీ పొరుగునఉన్న హిందువులమీదకంటే, దక్షిణయూరప్ నివాసులైన

తురుష్కులమీదనే వారికి ఎక్కువ సామరస్యం ఉన్నది. ఒకశిశువు క్రైస్తవమతం తీసికోనివ్వండి. బజారుకుక్కకంటే అతడు క్రొత్తగా కనిపిస్తాడు. మధురలో ఉన్న వైష్ణవుడు, దక్షిణ దేశంలోఉన్న ఒక సహవైష్ణవునికోసం తనపట్టణంలోనే అద్వైతిని వ్యతిరేకిస్తాడు. ఎవరిది తప్పందాము ? సర్వమత శాఖల్లో ఈ అసూయ, సంకుచితజ్ఞానం సమానంగా ఉన్నది. నేటి యీ పరిస్థితులను అవలోకిస్తే, "శత్రువులందరూ కలసి ఒకేచోట నివసిస్తున్నారు" అనిపిస్తుంది. సామాన్య జాతీయతాభావమే అర్థరహిత మైపోయింది. ఐక్యసామరస్య వినాశనానికి కారణ మేమిటి? ఈ వికృతత్వానికి కారణం గతించిన మృత్యుస్వరూపాలమీది అంధవిశ్వాసం, పవిత్రమైన మతనామంతో బోధింపబడిన విపరీత మూఢాచారములకు నికృష్టబానిసలు కావడం. ఇంకోవిధంగాచెపితే, పైపైపూతతో పైకి న్యాయంగా కనపడే "ప్రమాణదాస్య' మనే పేరుతో చేసే ఆత్మహత్య.

ఈ విధమైన పారతంత్ర్యభావాలు పోవాలంటే ఉదాత్త విద్యాదానం పవిత్రవిజ్ఞానం సక్రమమైన విజ్ఞానశాస్త్రసమావలోకనం కావాలి. (అధునాతన విజ్ఞానశాస్త్ర పరిశోధనలయొక్క సక్రమ పరిజ్ఞానఫలితాలతో సమన్వయత పొందలేని ఏ మతానికి నిలవడానికి అధికారం లేదు). చాలావరకు వెనకటికాలపు మతాచారనియమాదులన్నీ, ఆనాటి శాస్త్రశోధనల ఆదేశాలని రాముని అభిప్రాయం. ఈ సిద్ధాంతాలు ముందర ప్రజలచేత తీవ్రనిరాకరణతో స్వీకరించబడినవి. తరువాత స్వతంత్రభావనామాత్ర విస్మరింపబడి మరణించేటంతగా మితిమించిన ఉత్సాహంతో ఇవి ఆచరింపబడినవి. క్రమక్రమంగా ప్రబోధాలను గ్రుడ్డినమ్మకంతో ప్రజలు స్వీకరించారు. మానవుడు తాను పుట్టిపుట్టకమునుపే, తాను మానవుణ్ణని తెలుసుకోకమునుపే, క్రైస్తవుడైనాడు. మహమ్మదీయుడైనాడు. హిందువుడైనాడు. ఈ మత స్తంభన అనుయాయుల సోమరితనంవల్ల కలిగింది. ఈ మతాచార విశ్వాసాలను, ప్రవక్తలయొక్క వ్యక్తిత్వాలమీదా, వాండ్లు వ్రాసిన గ్రంథాలయొక్క స్థూలస్వరూపాలమీదా ఆధారపడి మాఢ్యంగా గ్రహించడంచేత, మతం గడ్డకట్టింది. క్రమక్రమంగా క్రీస్తు పర్వత

ప్రసంగాలుగానీ, వేదయజ్ఞాలుగానీ విస్మరింపబడి వాటిస్థానంలో ఏవో వట్టి పేరులు ప్రాముఖ్యానికి వచ్చాయి. ప్రాణరహిత శవపూజకై నిజంగా ఆత్మ తరుమగొట్టబడింది. క్రీస్తు, మహమ్మదు, వ్యాసుడు, శంకరుడు మొదలగు సత్యకర్మిష్ఠులైన ప్రవక్తలందరూ స్వర్గంలోనించి పవిత్ర జ్ఞానాగ్నిని అపహరించి తెచ్చిన చోరు లని చెప్పవచ్చు. వీరి రచనలు ప్రకృతిమహాగ్రంథములోని కొన్ని భాగములయొక్క అస్పష్టచ్ఛాయలు మాత్రమే. ప్రకృతి మూలగ్రంథమును మరిచిపోయి, ఈ అస్పష్టచ్ఛాయామాత్రములైన ప్రవక్తల గ్రంథాలకు ప్రాముఖ్య మిచ్చి, ప్రజలు ప్రవక్తల గ్రంథాలను న్యూనపరిచారు.

ఈ ప్రవక్తల మార్గాలవల్ల ప్రపంచానికి ఉపయోగంలేదని రాము డనడు. తప్పక ఉపయోగ మున్నది. ఒకవిత్తనానికి పై పొట్టు ఎంతకాలంవరకు ఉండాలనో అంతవరకే ఉండాలి. ఒకస్థితికి వచ్చేసరికి పై పొట్టు ఉండకూడదు. ఉంటే పొట్టుకంటే విలువగల లోపలి మొక్కకు, ఈపొట్టు జై లయిపోతుంది.

ప్రకృతియొక్క ఈ ఛాయాపతనము లతిక్రమించడానికి— అవరోధావరణాలను విభేదించడానికి— ప్రతిమానవుడు ప్రవక్తలకున్న శక్తి, తనకుకూడా జన్మహక్కు అనుకోవాలి. ప్రవక్తల శక్తి మానవాతీతమైనదని జంక నవసరంలేదు.

కొంతమంది యిల్లు కట్టి వారిముందర చూపిస్తేనేగాని, ఇంటి స్వరూపాన్ని అర్థంచేసికోలేరు. అదేప్రకారం, భూత వర్తమానకాల స్థితులలోనుంచి ఒక్కడుగు ముందుకు వేసిన అభ్యుదయరూపాన్ని ఊహించలేనివా రున్నారు. ఇలాంటివాండ్ల సంఖ్య హిందూదేశంలో తీవ్రగమనంతో పడిపోతున్నది. రామదర్శితమైన అనుష్ఠాన జీవద్వేదాంతముయొక్క ఆశయం— మానవులను చాంచల్యాభయాందోళనా దార్బల్యములకు అతీతులనుచేయడం; తమ సహజమైన ఆత్మప్రతిభను, సర్వైక్యమును, విశ్వబాంధవ్యమును తెలిసికొనేలాగు చేయడం; అకృత్రిమమైన, ఉపయోగవంతమైన బాహ్యావిభజీకరణముద్వారా, సహజమైన శాశ్వతమైన ఆత్మికమైన అభిన్నతాజ్ఞానమును పరిరక్షించడం. ఇట్టి

వేదాంతం అవసరంలేని దేశమేది? కాని, భారతవర్షమునకు ఈ మహా వేదాంతానుభూతి అత్యవసరమై యున్నది.

హిందూదేశ ప్రస్తుతావసరాలను తీర్చడానికి, ప్రేమ తేజమును జ్ఞానకాంతిని పరివ్యాప్తం చేయడానికి 'జీవితసంస్థ' అనే ఒకసంస్థను ప్రారంభించాలని రాముడు తలచాడు.

# సంస్థ స్వరూపం

## 1 మతతత్వం

భిన్నమతాలయొక్క, భిన్నతత్వాలయొక్క సామరస్య పరిశోధన ప్రధానంగా జరగాలి. ప్రశాంతమైన సాక్షిలాగ నిష్పాక్షికదృష్టితో విద్యార్థులు ప్రాచీన నవీన మతతత్వ సిద్ధాంతాలను చదువుతారు. ప్రతివిద్యార్థి తనంతటతానే (అవసరమైనప్పుడు ఆచార్యుల సహాయంతో) మతతత్వసిద్ధాంతాలు చదివి సాయంకాలానికి సభలోతాను చదివినదాన్ని గురించి చెప్పడం అవసరం. ఇలా సూక్ష్మసమీక్షణాలు విన్నతరువాత ప్రతిదినమూ రాత్రివేళ వివిధవిషయాలను సమన్వయ పరచడానికి రాముని మధ్యవర్తిత్వాన సంస్థయొక్క వివిధశాఖీయ సభ్యులు గౌరవనీయములైన విమర్శనారూపక ప్రసంగాలు చేస్తారు. ఇలా ప్రతివ్యక్తీ అందరియొక్క మానసిక పరిశ్రమ ఫలితజ్ఞానమును పంచుకొని తిరిగి, తన పరిశ్రమచేత ఆర్జించిన విషయాలను ఇతరుల ముందు పెడుతున్నాడు. ఈ రకంగా పరస్పరమైన సామరస్యం, పరస్పరాభిప్రాయ గ్రహణశక్తి, ప్రేమ అభివృద్ధి అవుతుంది.

ప్రస్తుతం దేశానికి అవసరమైన ఈ మానసిక సాంఘిక సహకారం చేత మానసిక పరిశ్రమయొక్క ప్రయోజనం అభివృద్ధి పొందుతుంది. సత్యమైన సంస్కృతి అనంతంగా ప్రబుద్ధమవుతుంది.

## 2. విజ్ఞానశాస్త్రం

వచ్చిన విద్యార్థులకు మతతత్వదృష్ట్యా ఈ సహకార విద్యావిధానం రుచిచూపినతరువాత, ఈ విద్యాప్రణాళికలో విజ్ఞానశాస్త్ర

వివిధశాఖలైన వృక్షశాస్త్రం, జంతుశాస్త్రం, విద్యుచ్ఛాస్త్రం, భూగర్భశాస్త్రం, రసాయనికశాస్త్రం, గ్రహగణితశాస్త్రం మొదలైన వన్నీ చేర్చబడతాయి. మతతాత్త్వికదృష్టితో సహకారవిద్యావిధానం నేటి భారతవర్షమునకు అత్యవసరమై యున్నది. తరువాత ఈ సంస్థకు ఒక గ్రంథాలయం ఒక విజ్ఞానశాస్త్ర పరిశోధనాశాల మొదలైనవి అత్యవసరం.

ఈ సంస్థద్వారా జరిగే విజ్ఞానశాస్త్ర బహుళ ప్రచార ప్రయత్నముయొక్క ఆశయం– మత దురభిప్రాయాలను పోగొట్టి ప్రజాశక్తులను అత్యంత వివేచనాత్మకమైన సక్రమోపయోగవంతమైన పథంలో పెట్టడమై యున్నది. అదిగాక ఇక్కడ విజ్ఞానశాస్త్రంకూడా సంపూర్ణ మతదృష్టితో బోధింపబడుతుంది. ఇక్కడ చూడటానికి ఐహికంగా కనబడే విజ్ఞానశాస్త్రం, కళలు మొదలైనవన్నీ అనుష్ఠాన వేదాంతాభ్యాసానికే లక్షితాలు. ఆగసీజ్ (Agassiz) అనే ఒక గొప్ప ప్రకృతిశాస్త్రవేత్త ఉన్నాడు. అతనికి చర్చి ఎంత పవిత్రమో, పరిశోధనశాలకూడ అంతపవిత్ర మట. ఒక భౌతికశోధనా ఫలితంగాకూడ ఒక నైతికసూత్రమంత పవిత్ర మట. ప్రకృతిలోని వివిధపదార్థాల్లోని ఏకైక బాంధవ్యమును గ్రహించడం అతనికి "భగవదాశయాలను పునశ్చరణ చేయడమే" నట.

## 3. పారిశ్రామిక కళలు

ఈ సంస్థయొక్క పనులలో పారిశ్రామిక కళలనుగూర్చిన మూడవ శాఖకూడా చేర్చబడుతుంది. భారతదేశానికి పారిశ్రామిక కళలు ఎంత అవసరమో చెప్పనవసరంలేదు. అమెరికాలో, యూరప్‌లో, (యేల్, హార్వర్డు, స్టాండుఫోర్డు, చికాగో, మొదలైన) పెద్ద పెద్ద విశ్వవిద్యాలయాలు కొన్ని ప్రభుత్వానికి సంబంధించినవి కావు; పూర్ణంగా వ్యక్తిగతమైనవి. ఇండియాలో ఇంకా ప్రజలు తమ అవసరాలను చూచుకోకుండా, ప్రభుత్వవిద్యాపద్ధతికే దేవులాడుతున్నారు. ఇది శోచనీయం!

రాముడు సూచించిన యీ జీవితసంస్థలో శాస్త్రీయమైన సమచిత్తంతో సమస్త మతసంబంధరచనలూ ఆహ్వానింపబడుతాయి. ఈ జీవితసంస్థ (మఠం) యొక్క ప్రధాన ధర్మమంత్రం– "సత్యం; సర్వం సత్యం; సత్యంతప్ప వే రొకటి లేదు."

ఓమ్ ఓమ్ ఓమ్

[ఇది మథురానగర శాంతి ఆశ్రమవాసులైన శ్రీ శివగుణాచార్యస్వామి వారికి వ్రాయబడిన విషయం.]

ఓ మ్

# జాతీయ ధర్మము

"బహువిధమతములు బహుళసంఘములు
అగణితమార్గంబు లెన్నేని గలవు!
శోకవిశ్వము కోరు, కారుణ్య మొకటె!"

అది సూర్యాస్తమయసమయం. దీర్ఘనిశ్వాసలతో, యీక్రిందిది ఉచ్చరించబడింది, అశ్రుపరివాహాలతో, నిది వ్రాయబడింది :—

"ఒకనాడు నేనొక్క దృశ్యంబుగంటి;
అప్పుడప్పుడాదృశ్య మగపడుచుండు.
అది అసత్యమొ – సత్యమో నేనెఱుంగ:
కారణ–మీజనుల్ సరియైన స్థితిని
నే లేనటంచు వచించుచున్నారు.
సూర్యుడు క్రుంగిపోయెడి కాలమందు
నాకండ్లు నీళ్ళతో నిండిపోయెడిని
అప్పు డా దృశ్యంబుకనపడు – నందు –
నాకు హిందూదేశ మగపడు కనుల!

మెల్లగా సూర్యాస్తమయ మాచునుండె
గాలి నిశ్శబ్ద మాచున్నది – చాల
దూరాన పడమటివైపు సంద్రంబు
గంభీరశాంతముద్రాంకితం బయ్యె!
మబ్బు, లాకాశంబు, సాగరోర్మికలు
ప్రకృతి సర్వం బస్తమయసూర్యబింబ
కిరణ సహస్రారుణం బయ్యె నపుడు

నిశ్శబ్దముగ నేను నిలుచుండి కంటి
దుఃఖనేత్రముల ప్రాచీనవైభవము.
గతకాలశోకసంస్మృతి కల్గె నెదను.
నా యౌవనము బాల్య మరు దెంచె మరల.

నా మనస్సెల్ల నాచ్ఛాదితం బయ్యె
అ స్తమయారుణ సూర్యు నీక్షింప!
గతచరిత్రంబెల్ల నాహృది జొచ్చె.
మృతులు నాదగ్గర నిల్చియున్నారు;
వారి బుగ్గలలోన తిరిగి వుప్పించె
వెచ్చని జీవితజ్యోతి; వారలకు
కప్పిన గుడ్డలు విడివడిపోయె.

మంగళకల్యాణ ఘంటిక లటుల
వారికంఠములు విన్పించగాసాగె:
నా కండ్లతో వారి కన్నులు కలసి
అ స్తమించెడి సూర్యు నరయుచునుండె.
ఎన్నిదినంబులు గడచిబోయినవి!

ఎన్నిశోకావృతవత్సరాల్ గడచె!
ఎంతదూరము నే పరిభ్రమించితిని!
స్వస్థత కలుగ దీనాటికిన్ నాకు!
సూర్యు డ స్తంగతుం డయ్యెడికొలది,
నా కండ్లు చెమరించు – చెమరించునపుడు
కనవచ్చు నా దృశ్య – మాదృశ్యమందు
ప్రత్యక్షమగును నా భరతమాత.''

ఓ అ స్తమయసూర్యదేవ! నీవు భారతదేశంలో ఉదయించ బోతున్నావు. దయతో నీ వీ రాముని సందేశాన్ని ఆ దివ్యభూమికి తీసుకుపోతావా ? ఈ ప్రేమాశ్రుబిందువులు భారతక్షేత్రాలలో శుభోదయ తుషారబిందువు లవుగాక! శైవుడు శివుని, వైష్ణవుడు విష్ణువును, బౌద్ధుడు బుద్ధుని, క్రైస్తవుడు క్రీస్తును, మహమ్మదీయుడు మహమ్మదును, సేవించినమాదిరి– శైవునిలో, వైష్ణవునిలో, బౌద్ధునిలో, క్రైస్తవునిలో, మహమ్మదీయునిలో, పార్సీలో, శిక్కులో, సన్న్యాసిలో, చండాలునిలో, సర్వ భారతపుత్రులలో– నేను భారతమాతను సందర్శించి సంసేవిస్తాను. భారతమాత, నా గంగాదేవి, నా కాళీజనని,

నా యిష్ట దేవత, నా సాలగ్రామం. ఓ భారతజననీ! సర్వరూపాలలో నిన్ను సమర్పిస్తాను. 'అర్చనావిషయాన్ని సంభావిస్తూ, భారత వర్షం లోని మట్టినిసైతము తినడానికి ప్రేమించిన భగవానుడంటాడు. "నిర్గుణోపాసన చేసేవారి కష్టం గొప్పది. ఎందుకంటే, శరీరాభిమానులకు అది దుస్సాధ్యమైనది." మంచిది. మంచిది. మనోహర! శ్రీకృష్ణా! ఎవని సర్వసంపదా ఒక ముసలిఎద్దూ, చినిగిపోయిన చర్మమూ, ఒక పాతబడిన చిన్న గొడ్డలీ, బూడిదా, పాములూ, ఒక కపాలమూ– ఆ రూపంలో ఉన్న పరమేశ్వరుని ఆరాధించడమే నాకు కలుగుగాక! మహిమ్న స్తోత్రంలోని మహాదేవుడా యితడు? కాదు – భారతదేశంలో మలమల మాడుతూవున్న దరిద్ర హైందవరూపంతో వున్న సజీవనారాయణుడు. ఇదే నామతం. ప్రతిభారతీయునికిదే ధర్మమై ఉండాలి. ఇదే సాధారణమార్గం అనుభవవేదాన్తం లేక భగవద్భక్తియై ఉండాలి. శుష్కక్రియాలతో పనిజరుగదు. ఈ జాతీయమహాశక్తిని వ్యాపింపచేయడానికి, ప్రతిభారతీయశిశువునుండీ, నేను క్రియారూపకమైన సహకారాన్ని (Active co - operation) వాంఛిస్తున్నాను. బాల్యాన్ని దాటందే, శిశు వెప్పుడూ యౌవనాన్ని పొందదు. నరనరంలో సర్వజాత్యైక్యత ప్రతిస్పదించినప్పుడు తప్ప, మానవుడు సర్వేశ్వరానుసంధానం పొందలేడు. భారతీయులు, తమలో పరస్పరం అఖండ భారతాన్ని దర్శించి దేశసేవకు బద్ధకంకణు లవుతారుగాక! హిందూదేశంలో ప్రతినగరమూ, ప్రవాహమూ, కొండ, రాయి, ప్రతిజంతువూ చేతనత్వం పొందింపబడి, పావనంగా భావింపబడుతున్నాయి. సర్వమాతృభూమిని దైవంగా పూజించడానికి, కనబడే ప్రతివస్తువు అందరికి భక్తిప్రేరణ చేయడానికి ఇది తగినసమయం కాదా? ప్రాణప్రతిష్ఠచేసి హిందువులు దుర్గావిగ్రహంలో రక్తమాంసాలు సృష్టిస్తారు. అంతకంటే నిజమైన దుర్గ – భారతమాతృదేవిలో, మళ్ళీ సహజ ప్రతిభను ఆహ్వానంచేసి అగ్నిని, ప్రాణాన్ని ప్రబుద్ధంచేయడం శ్రేష్ఠం కాదా? ముందర మన హృదయాలు కలుపుకుంటే తలలూ, చేతులూ వాటంతట అవ్వే కలుస్తాయి. "మానవుడు తన విశ్వాసాన్నిబట్టే ఒకదాన్ని పొందుతాడు. దేనిమీదనమ్మకముంటుందో అదేఅవుతున్నాడు" అని నిర్వచించాడు జగదేకవీర ప్రవక్త శ్రీకృష్ణుడు.

ప్రియమైన భారతీయ పూర్వాచారపరాయణులారా! సక్రమంగా శాస్త్రాలను ఆచరణలో పెట్టండి. దేశంయొక్క ఆపద్ధర్మం మిమ్ములను కులాచారబంధాలను సడలించం డని, తీవ్ర జాతిభేదాలను తృణీకరించం డని శాసిస్తున్నది. ఆశ్రయించిన వాళ్ళందరికీ సాహసికులందరికీ ద్వారం తెరచి, అనేకజాతులను దేశాలను భరించిన భారత దేశం, నేడు తనబిడ్డలకే కూడు బెట్టలేని దుస్థితిలో వుండడం మీకు కనబడడంలేదా? తన స్థానాన్ని తాను గుర్తించుకోడానికి, ప్రతి మానవునకూ సమానస్వాతంత్ర్యముండాలి. నీ తల నీ యిష్టం వచ్చినంత ఎత్తున ఉంచుకో. కానీ నీ పాదా లెప్పుడూ నేలమీదనే వుంచు. దుర్బలుడైనా యిష్టపడ్డా యింకొకని భుజాలమీదా, మెడమీదా ఎప్పుడైనాసరే పెట్టవద్దు.

సంస్కర్త కాబోయే యువకుడా! భేదించే నూతనశాస్త్రాన్ని పరిచయంచేస్తూ, సనాతనాచారాలను, భారతదేశపు ఆధ్యాత్మికతను నిందించవద్దు. భారతీయులు ఐకమత్యాన్ని పొందలేరు. భారతదేశపు భౌతికపతనానికి, భారతదేశపు మతమూ, ఆధ్యాత్మికత దూష్యాలు కావు. తోటలో దొంగలు పడడానికి కారణం— చుట్టూ ముండ్లతీగ—కంచె, లేకపోవడమే. అవి ఏర్పాటు చేయండి. ఆలోచించకుండా మధ్య ఉన్న గులాబిలను, పండ్ల చెట్లనూ, సంస్కరణమూ అభివృద్ధీ అనే పేరుతో పీకివేయకండి! ఓ ధన్యకంటకాల్లారా! కంచెల్లారా! మీరే రక్షణకు సాధనాలు! భారతదేశంలో మీతోటే అవసరమున్నది.

నేను శూద్రకృషియొక్క ఘనతనుగూర్చి కీర్తించేటప్పుడు రాజస త్త్వగుణాలకంటే తామసగుణానికి గౌరవం ఎక్కువ ఇవ్వడంలేదు. భారతదేశంలో తామసగుణమును మనం, చాలినంత నిందించాము. దానినట్లు అవమానంగా తలచడంచేత, అవరోధించడంచేత, మనమధ్య దాన్ని భయంకరంగా వృద్ధిచేశామని మాత్రం నే నంటాను. ఈ సమయంలో మనం, తామసత్వాన్ని ఉపయోగించడం నేర్చుకొని, దాన్ని ఆ విధంగా దివ్యం చేద్దాము. మనం, మురిగి ఎరువును ఉపయోగించకుండా పారవేస్తే, తోట లేవిధంగా పెరుగుతాయి?

'తామసత్వం' బాగు. అది లేకపోతే, అగ్ని, ఆవిరీ (రాజసత్వం), తేజస్సూ (సత్త్వం) ఉండనేరవు.

ప్రగతిగల ఒక దేశమందు తామసగుణ సమృద్ధితోపాటు, దానికి సరిసమాన ప్రతిపత్తితో రాజసగుణమనేఅగ్నియొక్క సుతీక్షణత, సాత్త్విక గుణమనే మహాతేజమూ ఉంటాయి. త్రిగుణములయొక్క సమ శ్రుతిలో కనపడే ఈ విషయమును ఆధునిక కపాల (సాముద్రిక) శాస్త్రంకూడా నిరూపిస్తున్నది. శౌర్యాధిక్యతకు, సౌశీల్యబలానికి, నైతిక మానసిక అభివృద్ధిమాత్రమే చాలదు. తామసికమైన- పాశవిక మైన- శక్తికూడా ఆధారభూతంగా ఉండాలి.

అందుకనే హైందవులు మహాదేవుని తామసగుణమునకు అధి ష్ఠాన దేవతగా అభివర్ణించారు.

భారత దేశచరిత్రయొక్క క్లిష్టపరిస్థితుల్లో మనంపుట్టి నట్లయితే యింకా విస్తారమైన సేవచేయడానికి అనుకూలించిన యీ తరుణాలకు మనం కృతజ్ఞులం. మనకర్మ యింకా ఎక్కువ అసమానంగా ఉంటుంది. కావ్యమనోజ్ఞంగా ఉంటుంది. అద్భుతంగా ఉంటుంది. "బాగా నిద్ర పోయినవాండ్లు. బాగా నిద్రలేస్తారు" అనే ఒక సామెత ఉంది. భారత దేశం గాఢ నిద్రపోయింది. అందుచేత ఆమె ప్రబుద్ధస్థితి అతివిశేషంగా వుంటుంది. హైందవప్రజానీకంలో మనం ఉద్బోధించవలసింది-విమర్శన కాదు-గుణగ్రహణత్వం; సహోదర భావం; ఐక్యమత్యజ్ఞానం, సర్వ వృత్తుల సామరస్యం, కృషి ప్రాముఖ్యం.

ఓహో! ఒక సంఘాన్ని ఇంకొకసంఘం ఊరక విమర్శించడంలో దేశంలో ఎంత అనంతశక్తి వృధా వ్యయమైపోయింది! మనం పరస్పర సామరస్య ముఖ్యాంశాలను గుర్తించడానికి ప్రయత్నించి వాటిని మనలో దృఢీకరిస్తాముగాక! ఆర్యసమాజమంటే యిష్టమనీ, సనాతన ధర్మమంటే యిష్టం లేదనేవాండ్లు కొందరు, బ్రహ్మసమాజం మాత్రమే నచ్చుతుందనే వాండ్లుకొందరు, ఆ విధంగానే వైష్ణవమతమో మరొక మతమో మాకు ఆదరణీయమనేవాండ్లు కొందరూ, ఇట్లు ఒక్కొక్క మతాన్ని ఒక్కొకరు అభిమానించే ప్రజలున్నారు. నామతంయిచ్చే

ఆనందాన్ని, బలాన్ని ఒప్పుకోని వాండ్లలో తప్పు ఎన్నడానికి నా కేమి అధికార మున్నది?

ఎవరు వచ్చినాసరే పోయినాసరే నేను ఎవరిదారిన వాండ్లను పోనిస్తాను. నీవుగాని, నేనుగాని అనుయాయులను గుత్తకొనడానికి ప్రయత్నించడం దేనికి? ప్రేమించేవాండ్లను,(ఉంటే) ద్వేషించేవాండ్లను సర్వులనూ సేవించడమే నాహక్కు. తల్లి తన సంతానంలో అందరి కంటె బలహీనులను, అల్లరివాండ్లనే ప్రేమిస్తుంది. నీ అభిప్రాయాలతో భేదించినవాం డ్లందరూ చెడ్డవాండ్లా? దేశానికి వాండ్లుకూడా అవసరమే. ఒక్క కుడికాలుమీాదనే ఆధారపడి నడిచేవాడి స్థితి నిజంగా విచారకరం. వస్తువులను దైవనేత్రాలతో సందర్శించడమే నిజమైన విద్య.

ఓ ప్రభూ! నా దోషముల చూడకోయి!
సమదృష్టి వీవు సంకల్పమాత్రమున
స్పర్శమాత్రమున నన్ విమలు జేసెదవు.
విమలమా యమునలో నొక నీటిచుక్క
రెండును గంగలో కలసినయెడల
రెండు సమానపవిత్రంబు లవును.
ఆలయమందున్న లోహవిగ్రహము
కటికి కసాయిహస్తంబున కత్తి -
ఈరెండు - స్పర్శవేదిని తాకెనేని
రెండు బంగారమై సమముగా వెలుగు.

ఓ ప్రభూ! కాన నాదుర్గుణంబులను
జూడకు, సర్వసమానుండ వీవు
భవదీయసంకల్పమాత్రంబుచేత
భవదీయమంగళ సంస్పర్శనముచే తృటిని
నే పవిత్రుడ గానె జగదీశ! నాథ!

[ఇది సూరదాసుపాట. "భారతీయజీవనవ్యూహము" అన్న తన రచ్యూరచనలో సోదరి నివేదితచేసిన ఆంగ్లానువాదమునకిది అనుకృతి]

మన వ్యక్తిగతమైన - కుటుంబ సంబంధమైన ధర్మమును - జాతీయ ధర్మంకంటే ఎక్కువగా చూడకూడదు. దేనికి తగినస్థానంలో దానిని మన్నించడమే శుభప్రదం.

జాతియొక్క అభ్యుదయము నుద్దేశించి చేసే ప్రతికార్యమూ, ప్రకృతిశక్తులసేవే - దేవతాసేవే. నేడిట్టి యజ్ఞమును మనం భారత మాతృదేవీ ప్రీత్యర్థంగా నిర్వహించాలి. గీతలోని ఈక్రింది శ్లోకం ఇట్టి యజ్ఞానికే నేడు అన్వయిస్తున్నది.

యజ్ఞ శిష్టా శినస్సంతో, ముచ్యంతే సర్వ కిల్బి షైః।
తేత్వఘం భుంజతే పాపా, యేపచంత్యాత్మ కారణాత్ ॥

యజ్ఞశేషమును భుజించే సత్పురుషులు, సమస్త పాపవిముక్తు లవుతున్నారు. తమకోసమే అన్నంవండుకొనే స్వార్థపరులు, పాపమునే భుజిస్తున్నారు." (శ్రీ భగవద్గీత - 3అ - 13శ్లో)

పరమాత్మ దర్శనానికి నీవు సన్న్యాసశక్తిని కలిగియుండాలి. అంటే స్వార్థసర్వస్వమును పరిత్యజించి అఖండభారతాత్మతో సమైక్యం కావాలి! దైవసాక్షాత్కృతికి బ్రాహ్మణత్వంతో నీవు దీపించాలి. అంటే జాతీయాభ్యున్నతికి నీ బుద్ధిని అంకితంచెయ్యి! బ్రహ్మానందాను భూతికి నీకు క్షత్రియహృదయం ఉండాలి. అంటే అనుక్షణం దేశానికి ప్రాణం అర్పించడానికి సంసిద్ధంగా ఉండు! భగవత్సాక్షాత్కారానికి నీకు నిజమైన వైశ్యభావం ఉండాలి. అంటే నీ ఆస్తికి జాతితరపున యాజమాన్యం వహించడమే నీ కర్తవ్యం. నీవు బ్రహ్మానందస్వరూప రామసాక్షాత్కారం పొందడానికి - నీ విశిష్టమైన ఆత్మధర్మానికి, ఒక సజీవమైన స్థూలరూప మివ్వడానికి - నీవు సన్న్యాసశక్తిని, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య వీరత్వమును ప్రకటించాలి. ఏవిధంగా? ఒకప్పుడు పవిత్ర శూద్రసోదరులపై నెట్టిన కాయకష్టమును నీ కరచరణాదులతో నిర్వర్తించడంద్వారా ప్రకటించాలి. సన్న్యాసశక్తి హరిజనకర్మతో వియ్యమందాలి. ఇదే నేడు ఏకైక మార్గం! మేలుకోండి! మేలు కోండి! సర్వప్రపంచమున బ్రాహ్మణభూమియైన భారతదేశమునకు, పరదేశములుసైతం తమ ఆచరణద్వారా ఈ ధర్మమునే నేడు ప్రబోధిస్తున్నది.

ఒక జపానీయువకుడు తన తల్లితోకూడిన అవరోధాలచేత (కుటుంబధర్మంచేత) సైన్యంలో చేరడానికి ఒప్పుకోనప్పుడు తల్లి ఆత్మ హత్య చేసుకుంటుంది; ఉత్తమ (జాతీయ) ధర్మానికై సామాన్య (కుటుంబ) ధర్మాన్ని బలిచేస్తుంది.

ఆదర్శదివ్యగురువు (గోవిందసింగ్) జాతీయధర్మంకోసం చేసిన వ్యక్తిగత గృహసాంఘిక ధర్మ పరిత్యాగంతో ఏ వీరకర్మలు సాటి వస్తాయి?

జనులు శక్తికోసం సంతసిస్తారు. సర్వజాతి హృదయంతో నీ హృదయం ఐక్యమై నిల్చినప్పుడు నీవు ఆజ్ఞయిస్తే, ఏ అనంతశక్తి నీకు లభ్యంకాదు ? ఉపసంహారంలో ఈ తత్వమును యిస్లాము ప్రవక్త యొక్క మనోహర వచనాలతో నిర్వచిస్తాను :—

"నా కుడిచేతిమీద సూర్యుడు, ఎడమభుజంమీద చంద్రుడూ నిల్చొని వెనుకకు తిరుగమని ఆజ్ఞాపిస్తున్నా, నేను లొంగను."

"తిండికి గంజియే గతియైనగాని,
భరతవర్షంబున కసువు లొద్దుదము !
కూటికే కరవయి బిచ్చమెత్తినను
భరతప్రతిష్ఠను నిలుపుద మోయి !
గోచికే కరవయి గోడుబొందినను
భరతవర్షమునకు ప్రాణ మొడ్డుదము !
మనపైన కోపించి మనుజులు మనల
వాకిళ్ళకడ నెట్టితన్నిన గాని,
ప్రేమాశ్రువులతోడ దీవింతమోయి !
ఈ బాహ్యబంధాల ద్రెంపివైచినను,
ఏకసత్యాత్మతో, ఏకమైయుండ
మనమెద లొక్కటై ముడిపడుగాక !
విషయభోగంబుల విడనాడి మనము
చెడుగునెదిర్చి నిర్జించి నిలుచుదము !

ఓమ్ ఓమ్ ఓమ్

# భారతదేశ సమస్య

ఈపత్రం స్వామి రామతీర్థులవారిచే లాహోరు యువజన భారతీయ సభా సాంవత్సరికోత్సవంలో చదవడానికి లాలాహరిదయాళు, యం. ఏ. వారికి పంపబడింది. ప్రాక్పశ్చిమాలలో, ప్రబుద్ధభారతాని కది సర్వజనీన సందేశంగా గ్రహింపబడింది.

ఐకమత్యం! ఐకమత్యం! – ఐకమత్యావశ్యకత అందరికీ తెలుసు. లక్షలకొలది శక్తులు, పరస్పరసంఘర్షణ చేస్తున్నవి. అయితే ఫలిత శక్తిలేదు. కోట్లకొలది మేధస్సులూ, చేతులూ కొట్టుకపోతున్నవి. నెట్టుకపోతున్నవి. ఎక్కడకో ఎవరు చెప్పగలరు? వేలకొలది సంఘాలు, జాతులు, దేని కది తన కిష్టంవచ్చిన గమ్యస్థానం చేర్చాలని నావను నడుపుతున్నాయి. కానీ సక్రమంగా నడపడంలేదు! తెడ్లు ఎక్కడ వున్నవో అక్కడ వుంచండి. మీ స్థానంలో మీరు ఉండండి. కదలవద్దు. అందరూ ఒకే పథంలో పడవను నడపండి. అలాంటి అనుకూల శ్రుతి, నానావిధసంఘీభావం అభ్యుదయాన్ని భద్రపరుస్తుంది. ఆ విధంగా మీమీ స్థానాల్లో పనిచేస్తూ, గానం చెయ్యండి; ముందడుగు వెయ్యండి, జాతీయప్రయోజనం పై విధంగా శాసిస్తున్నది. సర్వుల ప్రయోజనంలో ప్రతివాని వ్యక్తిగత ప్రయోజనం ఇమిడియున్నది.

ఆ విధంగా మాట్లాడడం చాలా సులభమే. అయితే, ఎన్ని శక్తులుపనిచేస్తున్నా ఐకమత్యభావం, సమరసత్వం భారతదేశంలో యింతకాలంనుంచి లేదు. ఈ విచిత్రమేమిటి?

ముఖ్యకారణాలు :—

(1) అనుభవజ్ఞానశూన్యత.

(2) అత్యధిక జనసంఖ్య.

వీటిని క్రమంగా మనం చర్చిద్దాము.

(1) అనుభవజ్ఞానశూన్యత:—

మహమ్మదీయులు హిందేదూశమును పరిపాలించడానికి పూర్వం 'ఖొరాసాను' (Khurasan) దేశీయుడైన 'ఆల్బేరూని' హిందూ

దేశమంతా సంచారంచేశాడు. అతడు మంచి తత్త్వవేత్త. గొప్ప విద్వాంసుడు. అతడు సంస్కృతం చదివాడు. ప్లేటో, అరిస్టాటిలు మొదలైనవాండ్ల సిద్ధాంతాలను ఎంతసామర్థ్యంతో పఠించాడో నున మతగ్రంథాలుకూడా అంత జాగ్రత్తగా చదివాడు. ఆతడు తాను చూచిన హిందూదేశపు స్థితిగతులనుగూర్చి విపులంగా వ్రాశాడు. హైందవ కవిత్వ తత్త్వజ్ఞానజ్యోతిష శాస్త్రాలనుగురించి, తాను కలుసుకున్న పండితుల జ్ఞానప్రతిభనుగూర్చి మిక్కిలి శ్లాఘించాడు. కానీ, సామాన్య ప్రజాసమూహాలయొక్క, స్త్రీలయొక్క స్థితి కడు హీనంగా ఉన్నదని వర్ణించాడు. దైహికంగా, మానసికంగా, నైతికంగా, ఇంకా ఆధ్యాత్మికంగా చాలా హీనస్థితిలో ఉన్నారనీ, ఏ విషయంలోబట్టినా వాండ్లు తిరస్కరింపబడి అణగద్రొక్కబడ్డారనీ సాంఘికంగా, మత విషయకంగా, రాజకీయంగా భేదభావాలతో, పరస్పరస్పర్థలతో, దుర్బల శరీరాలతో ఉన్నారనీ, సంఘీభావశూన్యులై మహమ్మద్ ఘుజనీక్రింద భారతవర్షాన్ని దోచుకోడానికి ఏటేటా వచ్చిన ముస్లిము దండయాత్రీకుల ముందు క్రమశిక్షణ లేకపోవడంచేత, ధూళిలాగా ఎగిరిపోతూ వున్నారని వ్రాశాడు. తరువాత, హిందూదేశంమీాదకి దండయాత్ర చేసింది బేబరు. బేబరు హిందువులకు వ్యక్తిత్వం, నేర్పు పారిశ్రామిక విద్యల్లో అభినివేశం, శిల్పం, వనసౌందర్యపోషణ, యుద్ధయంత్ర సామగ్రి మొదలైన నాగరికతలేదని విమర్శిస్తాడు. కలుపుగోలుతనము లేదంటాడు. అతని వ్యక్తిగతాభిప్రాయాలనూ, అతిశయోక్తులనూ తీసివేసిచూస్తే ఇవి కొంతవరకు నిజమనిపించక తప్పదు. అనుష్ఠానజ్ఞానము లేకపోడమే హిందూదేశపతనానికి కారణం. విదేశ చరిత్రకారులు చెప్పేదానిని వాదనారూపకంగా ఖండించడం కష్టమేమిా కాదు. రాముని కెంత సులభమో అందరికీ అంతే సులభం కాని, చరిత్రకారులు వ్రాసిన వన్నీకూడా నిజం. కంటికి ఎదురుగ్గా కనిపించే వాటిని నేను ఎట్లా కాదనగలను? సాంఘిక దురాచారాలు అనుష్ఠానవిజ్ఞానం లేకపోవడమువల్ల ఏర్పడ్డవి. సాంఘిక దురాచారాలు లెక్కలేకుండా ఉన్నవి. కాయకష్టమును నిర్లక్ష్యించడం, ప్రకృతివిరుద్ధమైన వర్ణశాఖావిభేదం, సముద్రయాన నిషేధం, బాల్య వివాహం, స్త్రీలను అజ్ఞానాంధకారంలో అణచి పెట్టడం, మొదలయిన

వెన్నో దురాచారాలు, ఈ సాంఘిక ఘోరం దుర్భరమైంది. సంస్కరణం ఎంతో కష్టం. బర్కు ఇలా అన్నాడు: "సంస్కరణమును దూరంగా ఉంచితే ప్రీతికరంగా కనుపిస్తుంది" ఆచారాలను బ్రద్దలు చెయ్యడం చాలాకష్టం. ఆచారాలను బ్రద్దలు చేస్తే సంఘంలో ఎన్ని అపోహాలు ఎన్ని విమర్శలు, ఎంత కల్లోలం! ఇలా అని ఊరుకోవలసిందేనా? సంఘంపాటికి సంఘాన్ని పోనిచ్చి, నీదారి నీవు చూచుకోవలసిందేనా? అథఃపాతాళంలోకి మునిగిపోతున్న సంఘము నిన్ను విడిచిపెడుతుందా? సంఘము మునిగితే నీవూ మునుగుతావు. సంఘము మళ్ళీ ప్రబుద్ధమైతే, నీవూ ప్రబుద్ధమౌతావు. సరిగ్గాలేని సంఘములో ఒక్కవ్యక్తి సరిగ్గా వుంటాడని నమ్మడం మౌఢ్యం. దేహంలో కలిసి ఉన్నంతసేపే చేతికి బలం. కోసేస్తే చెయ్యెందుకు ?

హిందూదేశంలో యుగయుగాలనుంచీ ఆ వైదాంతికమైన మౌఢ్యం గడ్డకట్టిపోయింది. జాతిని పీల్చేసింది. భావిభారత నిర్మాతలైన యువకులారా! భారతభవిష్యద్భాగ్యోదయం మీభాగ్యోదయమే! భావిభారతభాగ్యం మీమీదనే ఆధారపడియున్నది. పిరికిపందలు, అందరూ ఏమంటే దాన్ని మూఢంగా నమ్ముతారు, నిజమైన జీవత్రాణి ప్రపంచ మానవ భావరాజ్యాలను పరిపాలిస్తాడు. రాజైనైనా కావచ్చు, మనోరాజ్యానికి రాజు వేరు. బి. ఏ. కావడానికి, యం. ఏ. కావడానికి ఆ డిగ్రీలు యూనివర్సిటీనుంచి తీసుకుంటారు. కానీ పిరికిపంద కావడమో, వీరుడు కావడమో మీరే నిర్ణయించుకోవాలి! మీకేం కావాలో కోరుకోండి. జీవితసామ్రాజ్య నియంతలౌతారా? లేక నీచబానిసలై బ్రతుకుతారా ? చరిత్రకు ముఖ్యప్రాణం – స్వేచ్ఛమైన బలమైన జీవితం. న్యూటను ద్వితీయచలన సిద్ధాంతంలో శక్తిని గురించి యిలా అంటాడు :– "శక్తి అదిపనిచేసే వస్తువుయొక్క చలనంలో మార్పు కలిగిస్తుంది." శతాబ్దాలనుంచీ హిందూదేశంలో ప్రకృతివిరుద్ధమైన ద్వేష భావతమస్సులు క్రమ్ముకొనియున్నవి. అంధాచారాలను, మూఢనమ్మకాలను సహించే బానిసత్వం పేరుకపోయింది. విద్యావంతులై, సత్ప్రవర్తనగల యువకుల్లారా! మీ సజీవశక్తిచేత ఇంక అవసరంలేని వృథావిధానాలను మార్చండి; పురాతన జడత్వ

మును జయించండి. అవసరమైనచోట ప్రవాహపథాన్ని మార్చండి. కావలసినచోట ప్రవాహవేగమును ఉద్ధృతం చేయండి. ఉచితమైన మార్పులు చేయండి. నడుము గట్టి పనిచేయండి. పనిచేయండి! గతమును, వర్తమానంతో సమన్వయించండి. ధీరులై మీ పవిత్రమైన బలసంయుక్తమైన వర్తమాన జీవితమును, భవిష్యత్తులో సంగమించనివ్వండి. మన ప్రాచీనుల సంప్రదాయమును సంపూర్ణంగా విడిచిపెట్ట కూడదు. విడిచిపెడితే, సంఘం బాహ్యారూపకంగా నాశనం కాక తప్పదు. కాక ఎక్కువగా అనుసరించినా, సంఘం ఆంతరంగికంగా నాశనం కాక తప్పదు. ప్రాచీనసంప్రదాయ మాధ్యం ఎక్కువైతే, సంఘం కుళ్ళి చచ్చిపోతుంది. అయితే సత్యజీవితంలో నడిస్తే, సంఘం మిమ్ము బహిష్కరిస్తుందనా భయం? అధైర్యపడకు. అందరూ నిన్ను విడిచిపెట్టినా స్థిరుడవై నిలువు. భయపడవద్దు. అందరూ మిమ్ములను విడిచినా కార్యరంగంలో ఒక్కరు నిలుచున్నప్పటికీ స్థిరంగా ఉండండి. ఇదే పురుషార్థం! అనుకూలప్రవాహం మీవైపే, తరంగాలు మీవైపే వస్తున్నవి. భవిష్యత్తు మీది. సత్యమైన పథాన్ని తప్పవద్దు. సత్యంకోసం ఐక్యమైన యత్నమే జాతిని రక్షిస్తుంది. అంధకారంలో మగ్గుతూ యున్న ప్రజలను వెలుగులోకి తెస్తేనేకాని, ఐక్యం చెయ్యలేము. మాధ్యం, బానిసత్వం ఉన్నంతకాలమూ జాతిలో సమశ్రుతి ప్రతిధ్వనించదు. అందరు నావికులూ ఐక్యంతో ఉండికూడా తప్పుదారి పట్టితే నావగతి ఏమిటి? అలాగే సత్యపథయాత్రకూడా. సత్యమార్గోన్ముఖి కాని పడవ బద్దలుగా పగిలిపోతుంది. మునిగిపోతుంది. ఆత్మస్వర్గంలోనే సంయోగం సాధ్యం. ఐక్యత - పవిత్రతలో, సత్యంలో- మాత్రమే సాధ్యం. జాతీయైక్యతకు పాటుపడే ఆదర్శజీవనులారా! మీరు ముందు జాతిని అమానుషమైన ఘోరాలనుంచి విముక్తిచెయ్యండి! మీ త్యాగబాధమీదనే భవిష్యద్భాగ్య నిర్మాణము ఆధారపడి ఉంటుంది. త్యాగమే జాతియొక్క ఆధ్యాత్మిక సజీవత్వమును సూచిస్తుంది.

ఆదర్శమైన ప్రవర్తనకు బాధలేదు. ఆదర్శమైన ప్రవర్తనలో ఒక్క శాంతిమాత్రమే వర్షిస్తుంది. ప్రేమకాంతి వర్షిస్తుంది. వెలుగే

చూడలేని ఒకజాతిలో, వెలుగే బాధాకరంగా తోస్తున్న ఒక జాతిలో, బాధావిహీనమైన శాంతి, ప్రబుద్ధవిజ్ఞానజ్యోతి ఐక్యమై ఎలాఉంటాయి? ఆదర్శమైన ప్రవర్తనకలిగియుండ లేకపోతే లేకపోయినారు, సత్యంగానైనా జీవించండి. ఇది ముఖ్యం. అల్పభావాలు కలిగిన గొప్పవాండ్లవల్ల దేశం బలవంతం కాదు. గొప్పభావాలు కలిగిన అల్పజనులవల్లనే దేశం వర్ధిల్లుతుంది. శాంతి అంటే ఏమిటి? అనాగరికమైన నిదురమత్తుకూడా శాంతికరమైనదే. చీదరపుట్టించే గోరీకూడా శాంతికరమైనదే. మనకు కావలసింది శివశాంతిగాని, శవశాంతి కాదు. అంధకారంలో ప్రజలు దారితప్పి పడిపోతున్నప్పుడు వెలుగును వారికి చూపించకుండా దాచుకోవడం వెలుగు లేకపోవడంకంటే హీనమైన విషయం. ప్రజలు చీకటిలో పడిపోతూవున్నప్పుడు సహాయవాక్కు పలకనివాడు హంతకుడు.

(2) ఇప్పుడు జనాభావిషయాన్ని గురించి ఆలోచిద్దాం. రాజకీయ ఆర్థికవేత్తలైన మల్థస్ (Malthus) మొదలైనవాండ్ల అభిప్రాయాలను ఇప్పుడు ఆలోచించనక్కరలేదు. జీవశాస్త్రబోధను మల్థస్ ప్రతిధ్వనిస్తాడు. అంతే. ప్రకృతి శాస్త్రవేత్తలేమి చెబుతారో చూద్దాం. ఒక సంఘసంస్థను ఒక పెద్ద అడవిలోవున్న తోటకు పోలుస్తాడు హక్స్లే. సాంఘిక పరిణామ క్రమం (నైతికపరిణామక్రమం) తోటపనికి సాదృశ్యమైంది. కాని ఈ తోట పరిణామక్రమానికి యీ నైతికపరిణామ క్రమానికి అరణ్య ప్రకృతిపద్ధతి— లేక జగత్పరిణామపద్ధతి విరుద్ధమైనది. ఆరణ్య ప్రకృతియొక్క అభివృద్ధిక్రమం— అస్థిత్వంకోసమైన నిరంతర సంగ్రామంగా పోల్చబడింది. ఉద్యానవన పరిణామక్రమం—లేక— నైతిక పరిణామక్రమం— ఆ సంగ్రామమును ఆపడంతో పోల్చబడింది; ఆ పోరాటానికి త్రోవదీసిన పరిస్థితులను తొలగించడముతో పోల్చబడింది. హెన్రిడ్రమ్మండు (Henry Drummond) ఈ పరిణామాలు రెండిటికీ ఉన్న ఏకత్వాన్ని నిరూపించడానికి చాలా పాటుబడ్డాడు. ఎంత గందరగోళం చేసినా డార్విన్, హక్స్లేల సిద్ధాంతాలను దాటి ఒక్కడుగు వేయలేదు. ఇతడు చెప్పిన సిద్ధాంతం సామాన్యమైందే. ఈ సిద్ధాంతాన్ని ప్రతి సామాన్య విజ్ఞుడూ ఒప్పుకుంటాడు. తోటమాలి ప్రతిరోజు

కలుపుదీసి తోటలో మొక్కల ఒత్తిడిని నిరోధించకపోతే, తోటలో తిరిగి అరణ్యప్రకృతి గడ్డిగాదం విజృంభించి వన సౌందర్యశాంతులను భగంచేయడం జరుగుతుంది. ఈ విధంగానే జనాభా అపరిమితంగా పెరిగి పోయినప్పుడు పోరాటాలు సంభవిస్తాయి. శాంతి నశిస్తుంది. నైతిక పథాలు చెరిగిపోతాయి. భగవదాజ్ఞలు మృతాక్షరా లవుతాయి. ఇలాంటి క్లిష్టసమయాల్లో పతనం వస్తుంది. రోం, గ్రీసూ మొదలైన దేశాల పతనానికి యీ జనాభా సమస్య కారణంగా వుంది. ఇండియాలో చాలాదినాలక్రితమే ఈ కష్టం వచ్చింది. దీనికి నివృత్తి మన మేమీ ఆలోచించలేదు. సకలప్రపంచంలో యిండియాలో జనాభా ఎక్కువ. ఇండియాలో దారిద్ర్యం ఎక్కువ. ప్రతి సామాన్యహిందూ గృహస్థజీవనంలో సకల హైందవజాతిస్థితి ప్రతిబింబిస్తున్నది. ఏటేటా పెరిగిపోతున్న కుటుంబంతో పాటు అంతులేనిఖర్చు, అనవసరమైన అర్థం లేని క్రూరమైన మూఢాచారాలకు మూఢకర్మలకుఖర్చు! గాడిలోగడ్డి తక్కువైనప్పుడు జంతువులెక్కువైనప్పుడు పోరాటంరాకమ రేమవుతుంది? ఈ బాధలు తీర్చకుండా వృథాబోధలు చెయ్యడం, శాంతిబోధను అవ మానించడమే. నా దేశీయులు అమాయకులు. హృదయంలో శాంత మూర్తులు. ఏంచేస్తారు? విషమపరిస్థితులచేత పాపం దేహదౌర్బల్యం వాండ్లు ఎంత మంచివాండ్లయినా వాండ్లచేత స్వార్థద్వేష కార్యాలను చేయిస్తున్నది. హృదయం ఒప్పుకోవడంలేదు. కానీ దేహం బలవంతంగా ద్వేషపూరితులను చేస్తున్నది. ఈ జనాభాసమస్య ఇలాగే ఉంటే, తీరక పోతే జాతీయైక్యత కేవలం ఒక వెఱ్ఱితలంపుగా నిల్చిపోతుంది.

ఈ సమస్య తీరడమో లేక చావడమో. జీవశాస్త్ర సిద్ధాంతాల ప్రకారం బాధలతో, ఘోరాలతో క్షోభించి పోతున్న సంఘంలో కారుణ్య నిస్వార్థతలకు స్థానంలేదు. మీ చుట్టూ యింత దారిద్ర్యం కల్లోలం ఉన్నప్పటికీ ప్రేమాభివృద్ధిని గురించి మీరు ఊహించడం – ఆశకు వ్యతిరేకంగా ఆశించడం.

ఒకపదార్థ రాసియొక్క (Mass of Matter) అంతస్సమత, దాని అంగికాణువులు ఒకదాని కొకటి పరస్పర సమదూరంలో ఉంటేనే నిలుస్తుంది. ఇలా ఉంటేనేతప్ప అణువుల్లో సమఛందోబద్ధమయిన

చలనం జరగదు. ఒక అణువు పరిభ్రమించేటప్పుడు ప్రక్క అణువుకు చోటిచ్చి పరిభ్రమిస్తుంది. అప్పుడే సమత నిలుస్తుంది – ఈ విషయం పదార్థ విజ్ఞానశాస్త్ర విద్యార్థులకు తెలిసినదే.

ఇప్పుడు హిందూదేశ పదార్థ రాసి ఎలావుంది? హిందూదేశ పదార్థరాసిలో అణువును ఒకదానికొకటి కొట్టుకోకుండా సమత్వ ఛందోబద్ధ పరిభ్రమణం చేస్తున్నావా? ఒకటి తింటే పదింటి కడుపు మాడాలి. జాతియొక్క సమతాస్థాపనకు వెంటనే ప్రయత్నించాలి. ఈ ప్రయత్నం చెయ్యకపోతే మళ్ళీ యిండియా పతనమే. విజృంభిత ప్రకృతిలో అణగారి పోవాలసిందే! మహర్షులైన వశిష్ఠులవారన్నట్లు, దేశం అంటువ్యాధుల్లో, కరువుల్లో, వినాశకరయుద్ధాల్లో, భూకంపాల్లో కాలిపోవాల్సిందే. పాపం శాంతించుగాక! నివృత్తి ఏమిటి? బహు ముఖాలగా ఉంది.

1. హిందూదేశాన్ని దాటిపోవడం స్వర్గచ్యుతుల్ని చేస్తుందన్న మూఢ అంధకారాభిప్రాయం తొలిగిపోవాలి. చాలామంది భారతీయులు పరదేశాలకు పోయి నివాసాలు ఏర్పరచుకోవాలి. కూపస్థ మండూకంలా యిక్కడనే పడివుంటే ఏమి సుఖం? మీరు సుందరమైన హిందూదేశాన్ని ఊపిరాడని చీకటికొట్టుగా చేస్తున్నారు.

2. పూర్వం ఆర్యులు సంతానాన్ని ఒక దివ్యప్రసాదంగా చూచుకొనేవారు. ఆ రోజులు పోయినాయి. జనాభ ఎక్కువైన ఈ రోజుల్లో యీ పెద్ద పెద్ద కుటుంబాలు శాపాలు. పుత్రులమీద స్వర్గప్రాప్తి ఆధారపడి ఉంది- అనే మూఢాభిప్రాయం కలిగిన కించిజ్ఞులు కండ్లు తెరవాలి. చావకముందే గృహాన్ని నరకప్రాయం చేస్తున్నామన్న జ్ఞానం కలిగించుకోవాలి. భగవద్గీత రెండో అధ్యాయంలో 42, 45 శ్లోకాల్లో యింద్రియభోగాత్మకమైన స్వర్గసౌఖ్యాన్ని ఆశించేవారిని ఖండిస్తూ' శ్రీకృష్ణుడు అర్జునునితో పుత్రులవల్ల మోక్షంవస్తుంది అన్న సిద్ధాంతాన్ని ఖండిస్తూ చెపుతాడు. ఆ శ్లోకాలను బఠించి, వాటిని స్వాతంత్ర్యాత్మను అర్థంచేసుకోవడం అవసరం. మనలను చాలా కాలాన్నుంచి క్షోభపెడుతున్న కల్మషసూత్రాలను ఊడ్చివెయ్యండి! 'పెండ్లి చేసుకో;

అజ్ఞానాంధుడవై పిల్లలను కను, బంధాలలో చావు' అన్న కల్మష సూత్రాన్ని పరిహరించండి, మనము వెనకబడి ఉన్నదానికి మహమ్మదీయులను తిడతాం - బ్రిటిష్ ప్రభుత్వాన్ని తిడతాం, మన మతాన్ని దూషిస్తాము. విద్యావిధానమును నిందిస్తాము. కొంతవరకు యివన్నీ సత్యమే. కానీ అసలు దోషం ప్రపంచములోకల్లా అతిపవిత్రమైన వివాహసంబంధాన్ని కల్మషము చేయడంలో ఉంది. అన్ని సంస్థలోకి వివాహసంస్థ అతిముఖ్యమైంది. అతిపవిత్రమైంది. కానీ దాన్నే అతి నిర్లక్ష్యంగా, అతి అశాస్త్రీయంగా, అతి అవమానకరంగా కల్మషం చేస్తున్నాం, హిందూదేశంలో ఇన్ని జాతకాలతో, తిథులతో, లగ్నాలతో, వేదఋక్కులతో, కర్మకలాపాలతో కూడి యున్నప్పటికీ పెళ్ళిళ్ళు ఆకావికంగా అమంగళంగా, అపవిత్రంగా ఉన్నవి. బాల్యవివాహాలు చూచి గ్రహాలు ఓర్చుకోలేవు. పశుత్వంకంటే హీనమైన, అమానుషమైన, ఘోరమైన బాల్యవివాహదృశ్యముచూచి గ్రహాలు వణికి తమ శుభ స్థానములనుండి తొలగిపోతాయి. వాళ్ళను వాళ్ళు సంరక్షించుకోలేని పసిపిల్లల పెండ్లిండ్లు చూచి వేదఋక్కులు పావిత్ర్యాన్ని ప్రభావాన్ని కోల్పోతాయి. దరిద్రులను, శక్తిలేని దోమలను, పుట్టించడానికి చేస్తున్న యీ పెండ్లిండ్ల అధార్మిక తుచ్ఛవాసనల్లో పువ్వులు తమ సువాసనలు కోలుపోతాయి.

యువకుల్లారా! ఆపండి! ఆపండి! భావిభారత భాగ్యవిధాతల్లారా! ఆపండి! నీతిపేరట, హిందూదేశంపేరట, మీకోసం, మీ భవిష్యత్ప్రపంచంకోసం జరుగూతూవున్న యీ అకాల మూఢాంధ వివాహాల నాపండి. దీనివల్ల ప్రజల్లో పావిత్ర్యం ప్రవహిస్తుంది. అధిక ప్రజాసమస్యకొంత పరిష్కృత మవుతుంది.

ఈ సలహాలు అసహజమైన వనుకోకండి! ఈ సలహాలను అనుసరిస్తే దుర్భిక్షం నశిస్తుంది. మరణము అస్తమిస్తుంది. అతిశయోక్తి లేదు. సత్యమైన విషయాలు, శుద్ధ సత్యం, యీ మాటల్లో వుంది. ప్రపంచంలో కన్యలుగా ఉన్నప్పుడే విధవలు కావడముకంటే శిశువివాహాలకంటే అన్యాయము, ఘోరం, అసహజం యింకేముంటుంది? సూర్యకిరణాలు తగులుతున్న ఏజాతినైనా అడగండి. మీలో మాను

షత్వం చచ్చిపోయిందా? మీలో రాక్షసత్వము విజృంభించిందా? మీ కంటియెదుట అసహజమైన, ఘోరమైన, అమానుషమైన, దుర్భరమైన యీ మూఢాచారాలు జరుగుతూవుంటే మాన్పరేం? మాన్పకుండా ఎలా విశ్రాంతి తీసుకోగలరు? దీనులైన బాలవిధవల పరిశుష్కిత సుకుమారబాహువులు, సహాయంకోసం చాచబడినవి. మీ కట్టెదుట మీ మూఢాచార కాష్ఠజ్వాలల్లో సజీవ సతీమతల్లులు ఘోరంగా కాలిపోతున్నారు! కన్నీరొలుకుతున్నవాండ్ల అమాయక దీననేత్రాలగుండా భవానీదేవి మీ సహాయంకొరకు చూస్తున్నది. ఆ కోశిస్తున్న భవానీదేవిని, మానవుడా! ఎంతకాలం నిరశిస్తావు? నిరశిస్తావా? భవానీదేవి, రుద్రకాళికయై రక్తదాహంతో ప్రళయ తాండవం చేస్తుంది! ఆ ప్రళయతాండవ కాళిని చూచి, యీ చరాచర జగద్భాండం వణికి పోతుంది. శాంతి, శాంతి అని జనులు మొత్తుకుంటారు. మన అంతట మన మాహ్వానించిన ఆ ప్రళయకాళిక తాండవిస్తున్నంతవరకు శాంతి ఎక్కడ? యూరపులో తక్కువ జాతిప్రజలు బాల్యంలో పెండ్లి చేసికొంటారు. కానీ హిందూస్థానీయు లంత త్వరగా ఎవరూ పెండ్లిచేసుకోరు. ఉత్తమ కుటుంబాలవారు చాలమంది ముప్పది ఏళ్ళకు ముందుగా పెండ్లిచేసికోరు. కన్నసంతానం కొద్దయినా శక్తియుక్తసంతానం కావా లని దీని అభిప్రాయం.

జీవశాస్త్రసిద్ధాంతాల్లో 'హెర్బర్టు స్పెన్సర్' బ్రహ్మాండమైన మానసికాభివృద్ధి ఉన్నప్పుడు దేహబలం తగ్గుతుందంటారు. ఈ పశుబలంకోసం పాశవికశక్తి మనస్సును ఎంతకాలమని అథఃపాతాళానికి త్రొక్కి ఉంచగలం? మన శాస్త్రాల ప్రకారం పావిత్ర్యమే ముఖ్యం. మనశాస్త్రాల్లో బ్రహ్మచర్యం అఖండంగా కీర్తించబడింది. బ్రహ్మచర్యంలో ఆధ్యాత్మిక, ఆధిభౌతిక బలసంపత్తి ఉంది. స్త్రీ పురుష సంబంధమైన కామశక్తి నిగ్రహించబడినప్పుడు అది ఓజస్సుగా అఖండ ఆధ్యాత్మిక బలంగా మారుతుంది.

కామవిజయం అవసరం. ఈ పశువాంఛను నిగ్రహించక కామలోలుడైన బుద్ధిహీనుడు తన రక్తమునే తన ప్రాణశక్తినే మడకటుతున్నానని తెలుసుకోవడంలేదు. ఈ దివ్యశక్తిని దుర్వినియోగం చేయ

డమే సమస్తపాపకారణం. ఈ దుర్వినియోగము బొగ్గులకోసం కల్ప వృక్షమును నరకడంవంటిది. కామమునకు పశువిశేషణం వాడడంలో దాని నైచ్యత గోచరిస్తున్నది. పశువులు నిజంగా నీచమైనవి. కానీ అవి తెలియక తప్పుచేస్తాయి. మానవుడు బుద్ధిశాలికదామరి? ఉచితా నుచితత్వాలు తెలుసుకదా! అతడుకూడా తప్పులుచేస్తే ఇంకేమున్నది? మరీ మరీ నీచుడుకాడా?

పావిత్ర్యం! పావిత్ర్యం! అసిధారావ్రతంబూని పవిత్రతను ఆర్జించు! పరిణామసంగ్రామకర్కశరథచక్రాలక్రిందపడి నలిగిపోతావు- పవిత్రుడివి కా! పావిత్ర్యమే ఆశ. అనాగరికుల్లో పరిణామంవల్ల పావిత్ర్యం అభివృద్ధి అయింది. ఈనాడు ప్రపంచస్థితి మిమ్ములను పావిత్ర్యాన్ని పొంద గోరుతున్నది. హిందూదేశ ప్రజలారా! పావిత్ర్యంలేనిదే మీరు బ్రతకలేరు. కష్టమైనాసరే, సులభమైనాసరే పావిత్ర్యమును పొందవలసిందే! హిందూదేశంకోసం మీ దేశాలకోసం, మీ శరీరాలకోసం, మీ మనస్సులకోసం మతంకోసం, యిహపర ప్రపంచాలకోసం, పరిపూర్ణ పవిత్రులుకాండి! పావిత్ర్యంలేనిది వీరత్వంలేదు. పావిత్ర్యంలేనిది ఐక్యం లేదు. పావిత్ర్యంలేనిది శాంతిలేదు.

విద్య- అమెరికాలోగానీ, ఇంగ్లాండులోగానీ పాఠశాలలకు పోని సాధారణప్రజలు సహితం మన దేశంలోని విద్యావంతులకంటె ఎక్కువ జ్ఞానవంతులుగా వున్నారు. ఎందువల్ల? వాండ్ల విద్యకు ముఖ్యాధారం చౌకఖరీదుకువచ్చే దినపత్రికలు. ఇంగ్లండులో, అమెరికాలో, జపానులో విద్యాలయాలకంటే వార్తాపత్రికలే విజ్ఞానాన్ని వ్యాపింప చేస్తవి. మనదేశంలో ఒకస్థితి (Degree) వరకూ విద్యావాపనం చేస్తున్నందుకు మన ప్రభుత్వానికీ యితరసంస్థలకూ మనం నమస్కరిస్తాము. కానీ వాటివల్ల క్రియారూపకంగా ఏమీ జరగడంలేదు. మన ప్రజాసామాన్య అజ్ఞానానికి స్త్రీలయొక్క అంధకార భయంకరస్థితికి ఎవరినీ నిందించ నవసరంలేదు. మనమే బాధ్యులం. అంతఃకలహాలలో, దుష్కార్యాలలో యిపుడు వృథాగా వ్యయపరుస్తున్న జీవశక్తిని స్త్రీసముద్ధరణా ప్రయత్నానికి ప్రజాసామాన్యానికి విద్యగరపడానికి, మిమ్ములను మీరు సముద్ధరించుకోవడానికి, జాతిని ప్రబుద్ధం చెయ్యడానికి వినియో

గించండి! ఈ కార్యానికి సులభమైన దగ్గరమార్గం భారతీయ పత్రికా పరిస్థితిని అభివృద్ధిచేయడం. నిజంగా ఉపయోగకరమైన పత్రికలు స్థాపించండి. స్త్రీలకూ జనసామాన్యానికి తగిన మాతృభాషల్లో వాటిని అభివృద్ధిపరచండి. బహుశః ఇదివరకే ఒకటి రెండుసార్లు యీ విధంగా చేసిన కొందరి ప్రయత్నాలు భగ్నమైనవి. ఎందుకంటే సామాన్యంగా పెద్ద తరగతి విద్యార్థులు మాతృ (దేశీయ) భాషను స్వీకరించడానికి అలక్ష్యం చేస్తారు. మీ మాతృభాషను గౌరవించడం మీరు నేర్చుకోవాలి! భారతీయ యువజన సంఘము త్వరలో ఒకపత్రికను సులభమైన హిందీ లేక పంజాబీ వాడుక భాషల్లో ప్రారంభిస్తారుగాక! సాధ్యమైనంత వరకూ పారశీక సంస్కృత పదాలు అవిలేకుండా వాడుకభాషలో ఉండాలి. సహజంగా ఉండండి. మీకు తోచినట్లు వ్రాయండి. ఎవరినీ అనుకరించవద్దు. కాలేజీ విద్యార్థులు చిన్న వ్యాసాలు యివ్వవచ్చు. మీరు పఠించేటప్పుడు వచ్చే ఉత్తమభావాలు మీ మాతృభాషలో వ్రాయడానికి తరచుగా ప్రయత్నించడం మీకంటే పాఠకులకు ఎక్కువ లాభప్రదమని ఇతర్లనుకున్నా, పాఠకులకంటె మీకేఎక్కువలాభప్రదం. ఈ కార్యానికి నిన్ను బలవంతపెట్టే విశేషాలతో పనిలేదు. మొదటిసంచికను హిందీభాషలో ప్రథమంలో అక్షరాలు, తరువాత మాటలు, తరువాత వాక్యాలు, కథలు, చివరకు వ్యాసాలు వాండ్లంతవాండ్లు చదివి అర్థం చేసికొనేలాగ స్త్రీలనిమిత్తం తక్కువజాతులనిమిత్తం క్రమవికాసప్రదంగా నడపాలి. చదువురాని అక్కచెల్లెండ్లకు, తల్లులకు, భార్యలకు, కుమార్తెలకు, యింకా యితర స్త్రీబాంధవులకూ చదువడం వ్రాయడం నేర్పండి. ప్రభుత్వపాఠశాలావిధానాలకోసం వేచియుండ వద్దు. ఈ పవిత్రయాజమాన్యం మీ భుజాలమీద ఉన్నది. భారతదేశం జీవించాలంటే, స్త్రీవిద్యతప్పక బహుళంగా వ్యాప్తం కావాలె. అలాంటి సమయంలో యీ కార్యం మీ రెందుకు పూనకూడదు? దేశంలో ఒక్క స్త్రీ కూడా, దరిద్రుడుకూడా బీరుపోకుండా విద్యావిహీనంగా ఉండకుండా చూడండి. దేశముఖంమీద ఉన్న యీ అజ్ఞానపు మచ్చను తుడిచివెయ్యండి. నీ పొరుగునఉన్న కడజాతి స్త్రీకి ప్రబోధించడానికి నీవు సిగ్గుపడుతున్నావా? భయపడుతున్నావా? అయితే నీ నీతులూ నియమాలూ సిగ్గుచేటు. పేదవాండ్ల దగ్గరికీ,

అజ్ఞాన ప్రజాసమూహాల చెంతకూ మాతృకారుణ్యంతో ప్రేమతో పోయి వాండ్లకు విద్యనేర్పండి. ఎంత దివ్యకార్యం! క్రమంగా ప్రాథమికపదార్థ విజ్ఞానశాస్త్రం (Elementry Physics) జంతుశాస్త్రం (Physiology), జ్యోతిశ్శాస్త్రము (Astronomy), దేశచరిత్ర (History), ఆర్థికశాస్త్రము (Political Economy), మనస్తత్వశాస్త్రము (Psychology), మొదలైన వాటిమీద నీవు వాండ్లకు ఏ విధంగా చెబుతే బాగుంటుందో ఆ విధంగా సులభంగా పాఠాలు చెప్పు. క్రమక్రమంగా శైలి అభివృద్ధి పరచవచ్చు. రాముడు పత్రికకు హిందీ అక్షరాలనే ఉపయోగించం డంటాడు. ఎందుకంటే, అచిర కాలంలోనే భారత జాతీయభాషల్లో హిందీ సుందరస్థానం వహిస్తుంది. స్త్రీలకు, దరిద్రులకు విద్యనేర్పడం మీ॥ ప్రధానవిధి. ఆ కార్యంలో మీరు నిమగ్నులు కావాలె, మునిగిపోవాలె. అయితే మరచిపోకండి. ఇంకోముఖ్యమైన ఆవశ్యమైన పనివున్నది. బాగా అభివృద్ధిలో ఉన్న పరదేశాల్లో వ్యవసాయకళలు, పారిశ్రామికకళలు నేర్చుకొని, ఆ ఉపయోగకరమైన విజ్ఞానాన్ని భారతదేశంలో వ్యాపింపచేయాలి. వెదజల్లాలి.

మతం – ఈ రచన మీ ఓర్పును పరీక్షచేస్తున్నదా? మీకు వింటానికి విసుగుపుడుతున్నదా? కానీ రాముడు మీకు చెప్పవలసిన దంతా చెప్పిగానీ ఊరుకోడు. ఓ వివాహోత్సవాగత బాంధవులారా! మీరు మీ విధులు నిర్వర్తించుకోను వెళ్లాల్నా? వెళ్లాలసి వుండవచ్చు; కానీ యీ ప్రాచీన నావికుడు తను ఎందుకైతే పుట్టాడో అది చెప్పకుండా వదలిపెట్టడు. రామసందేశాన్ని వింటముతప్ప ప్రధాన ధర్మమేమీ లేదు.

గృహ సాంఘిక జాతీయవిధు లన్నీ మీ కర్మకాండ. అంధకారంలో తేజోమయమైన కార్యాలు జరుగవు. అంధకారంలో అజ్ఞాన విధులేచేస్తారు. భక్తిజ్యోతిలేకుండా, హృదయంలో జ్ఞానజ్యోతిని ప్రజ్వలింపజేసికోకుండా, ఒక్క అడుగైనా ముందరకు వెళ్ళలేరు. ప్రతిరోజూ చెవులకు వినిపించే అనేక ప్రాపంచకవిషయాలు దేహంవంటివి. ఆత్మ లేకుండా దేహంనిలువదు. విజయోద్యమముయొక్క ప్రాణంజీవద్విశ్వాసం!

ఉజ్జ్వలజ్ఞానం. భౌతికవాదం, సంశయవాదం, విశ్వాసవాదం, నాస్తికవాదం- మొదలైనవాటిని ప్రతిపాదించిన వాండ్ల గెలుపుకు కారణం- వాండ్లకు తెలియకుండానే వాండ్లలో ఉన్న మతచైతన్యమే! కొన్ని కొన్ని విషయాల్లో వాండ్లు మతాచార్యులకంటే ఎక్కువ మతాన్నే జీవించారు. చూడండి! రబ్బరు ఫ్యాక్టరీ వేనవేలమందికి నిరుద్యోగులకు ఉద్యోగమిస్తుంది. జాతీయవ్యాపారము అభివృద్ధిచేస్తుంది. జాతిధనాన్ని ఎక్కువచేస్తుంది. దరిద్రశ్రామికులను పైకి తీసుకవస్తుంది. స్టీమరు కంపెనీలకు లాభంకలుగుతుంది. రైల్వేఉద్యోగులకు, పోస్టాఫీసులకు పని యిస్తుంది. అయినా యిదంతా ఎలా జరుగుతుంది? ఒక రసాయనిక సమీకరణంలేకుండా, ఒక అదృశ్యాంతర ప్రతిచలనం లేకుండా, ఇదంతా ఎలా జరుగుతుంది? అలాగే, మీ గృహసాంఘిక రాజకీయ యత్నాలుకూడా అంతఃప్రతిచలనంమీద, హృదయ పరివర్తనంమీద, మానసికసంస్కరణంమీద, ఆధ్యాత్మిక సమీకరణం మీద, మీ అంతరాత్మలోని భగవద్విప్లవంమీద ఆధారపడివుంటాయి. "విశ్వాసం గొప్పది. శక్తినిస్తుంది"- అంటాడు కార్లాయిల్. నమ్మకంచేతనే శ్రద్ధచేతనే జాతిచరిత్ర ఫలిస్తుంది. జాతిచరిత్ర ఉన్నత మవుతుంది. ఆ అరబ్బులు, ఆ మహమ్మదు, ఆకాలమూ, చూస్తే విరామయమైన అంధకారంలో, అజ్ఞాతమైన ఎడారిలో ఒక్క వెలుగుచుక్కరాలినట్లు లేదా? కానీ ఆ యెడారి యిసుక రేణువులే అగ్నిగోళములై రేగి మిన్నంటి గ్రెనేడ్ నుండి ఢిల్లీవరకు మిణుమిట్లు గొల్పాయి. "అల్లాహో అక్బర్" భగవంతుడొక్కడే ఘనుడు!

నిజమైన ప్రతి మహద్విషయమూ అంతరాంతరాల్లోనుంచే జన్మిస్తుంది. బ్రహ్మభావ నిమగ్న జీవితమే నిజమైన జీవితం. ఇతర్లది ఎంత లౌకిక భోగభాగ్యాల్లో తులతూగుతున్నా అది జీవితం కాదు; చావే!

స్పెన్సర్ ఒక పుస్తకం వ్రాశాడు. అది అతని చివరి రచన. అది 'హంసయొక్క అంత్యగీతం' వంటిది. ఆ పుస్తకంలో హాక్స్లేయొక్క ఒక ప్రయోగాన్ని గురించి చెబుతూ ఇలా అన్నాడు— "మన భావనా శక్తిలో (Thought consciousness) అనుభూతి ఆత్మగా, బుద్ధి

శరీరంగా ఉంటుంది. మనస్సునుగురించి మాట్లాడుతూ మనం సామాన్యంగా మరచిపోయేది దాని ప్రముఖభాగమైన అనుభూతిని.అనుభూతి (feeling) యజమాని. బుద్ధి సేవకుడు." సామాన్యభాషలో అనుభూతిని హృదయము మని పిలుస్తారు. హృదయమే విశ్వాసమునకూ మతానికి స్థానం. హృదయమే కర్మలను ప్రోత్సహించి కర్మలను నిర్వర్తించేశక్తిని పురికొల్పుతుంది. స్పెన్సర్ యింకా యిలా అన్నాడు. "సేవకుడైన మనస్సును అభివృద్ధిపరచడంవల్ల యజమానియైన హృదయమును పెంచకపోవడంవల్ల పని ఎక్కువ జరుగదు." ఈ యుగంలో మహామన స్తత్వవేత్తఅయిన ప్రొఫెసర్ జేమ్సు యిలా అంటాడు : "ఇంద్రియసాధ్యమైన అనుభూతుల మాదిరే మతానుభూతికూడా సత్యమైంది. తర్కఫలితాలకంటే మతానుభూతి ఎక్కువ విశ్వసనీయంగా ఉంటుంది." శుష్కవాగ్జాలసంరంభం వదలి నీ అగాధ అంతః ప్రకృతిలో జీవించు. నీలో, ప్రకృతిలో, సమానంగా స్వతస్సిద్ధమై ప్రకాశిస్తున్న పరమసత్యమును సందర్శించు; సంభావించు! 'తత్త్వమసి' అన్న మహా సత్యవచనముయొక్క సజీవరూపమై ప్రకాశించు !

ఇదె జీవితముసుమా, ఇదె జీవితంబు!
ఇదెసుమా, ఇదెసుమా అమరజీవనము!
మూర్తీభవించిన శక్తి తా నగుచు
వెలుగొందు పథ మిదే వినుడి వినండి.
ఇట్టి మహాజ్ఞానదృష్టి మాత్రమున
అజ్ఞాన స్తంభము బ్రద్దలై ప్రీలు!
ఆ ధీరు లిట్లు వచింపగాగలరు,

1

(1) నాకు తావీయ ప్రక్కకుమళ్ళు జగము!
జాజ్వల్యమాన మహాతేజ మేను!
వచ్చుచున్నాడ నే వచ్చుచున్నాడ
భయపడి చీకటుల్ పారిపోవలయు

(2) వచ్చుచున్నాడ నే నో సముద్రంబ!
నడుమకు చీలియు వ్రయ్యలై పొమ్ము,
కాదేని మిమ్ముల మలమల మాడ్చి
నిర్జలం బొనరింతు చీలిపొ మ్మిపుడె.
జాగ్రత్త! ఓ పర్వతశ్రేణులార!
నా మార్గమున కడ్డు వచ్చిరా మీరు
పొడిపొడి యౌను మీ యెముక లీ నాడు.

(3) ఓ రాజులారా! సేనాపతులార!
నా ఆటబొమ్మలారా! చూచినార –
ఇట నొక జాజ్వల్యచండాగ్ని కలదు,
దారిలో తొలగండి పసిపిల్లలార!

(4) మంత్రాంగ విదులార! హితవాదులార!
జీవితం బేల వృథాచేసికొనుట?
నా ఆజ్ఞలను శిరసావహింపనిచో
నీ గుండె ఓ మృత్యు దేవతా! చీల్తు.

(5) మొరగండి మొరగండి ఓ గాడ్పులార!
స్వేచ్ఛగా మొఱగండి నా కుక్కలార!
గాలివర్షములార చెలరేగిపొండు!
స్వేచ్ఛగా మ్రోయండి నా ఈలలార!

(6) నే తుఫానులమీద స్వారిచేసెదను,
అంగవైచెదను ఝంఝామారుతమున;
మెఱుపు నాదుశతఘ్ని – పేల్చితినేని
నా దెబ్బ యెన్నడు గురితప్పిపోదు.

(7) వ్యాధుని విధమున వేటాడ దేను
పర్వతహృదయముల్ భూసాగరముల;
కనవచ్చు వాటిని కనవచ్చినట్లు
నా యిష్టవిధమున భుజియింతు నేను.

(8) విధులను, దేవతాసముదయంబులను
నా రథంబునకు బంధించివై చెదను
పిడుగు ఫిరంగీల నినదాలతోడ
మ్రోగింతు విజయభేరిని దిగంతముల.

(9) మాయావనిక పటాపంచలుచేసి
లే లెమ్ము! లే లెమ్ము! ముక్తుడ వగుము!
స్వేచ్ఛ! మహాస్వేచ్ఛ! స్వేచ్ఛ! ఓం శాంతి!

జ్ఞానానికి అఖండ శక్తేకాక, అఖండ శాంతికూడా ఉన్నది—

**2**

వర్షబిందువు లౌచు అమృత ప్రశాంతి
రాలుచున్నది మనోహారలీల నహాహా!
అమృతము సంగీతవర్షమై కురియు
చినుకులు! చినుకులు! చినుకుల జల్లు!!!

నా ప్రతిభా మేఘములు దిగంతముల
విహరింపు చున్నవ త్యుల్లాసలీల!
ముత్యాలవలె ప్రపంచంబు లందుండి
రాలుచున్నవి మనోహారముగా నహాహా!
చినుకులు! చినుకులు!! చినుకుల జల్లు!!!

నా ధర్మవాయువుల్ సక్రమరీతి
వీచుచున్నవి వివిధదేశములు అవే
రాలుచున్నవి పుష్పదళములరీతి –
చినుకులు! చినుకులు!! చినుకులజల్లు!!!

నా సుగంధశ్వాస ధర్మమారుతము,
వీచుచున్నది మనోజ్ఞంబుగా నహాహా!
చిరుకొమ్మలట్టుల కొన్ని వస్తువులు
కదలాడుచున్నవి అటు నిటు నూగి;

మఱికొన్ని మంచుబిందువు లట్లు రాలు;
చినుకులు! చినుకులు!! చినుకులజల్లు!!!

నా ప్రతిభా తేజ మొకమహోవనధి –
ధవళకాంతుల జిమ్ము క్షీరసాగరము –
అలలతో మృదువుగా కులుకుచు, వెలికి
త్రోయుచున్నది జగజ్జల బిందుకోటి.
చుక్కల తుంపరల్ సొంపుగా నేను
విరజిమ్ముచున్నాడ వినువీధులందు
చినుకులు! చినుకులు!! చినుకులజల్లు!!!

ఓమ్! ఓమ్! ప్రశాంతి!! ఓమ్! ఓమ్! ఓమ్! ప్రశాంతి!

ఓమ్! ఓమ్! ఓమ్!

ఓమ్!

# భా వి భా ర త ము

( ఒకపుస్తకానికి ఉపోద్ఘాతంగా వ్రాయబడింది )

భారత దేశంయొక్క ఆశాకాంతిమయమైన భవిష్యత్తును గురించి రాముడు ఇప్పుడు కొన్నిమాటలు చెప్తాతాడు.

ప్రపంచంలో ప్రతివస్తువూ ఒక మహాఛందోబద్ధంగా నడుస్తుంటుంది. ఈ ప్రకృతి నంతా ఒక ఛందోధర్మం పరిపాలిస్తూవుంది. ఈ ఛందోధర్మానుసారంగా సౌభాగ్య సూర్య తారకలూ పరిభ్రమింపవలసిందే. ఒకనాడు భారతదేశ గగనమండలంలో విజ్ఞాన భాగ్య భానుడు ప్రచండంగా వెలిగిన రోజులున్నవి. చారిత్రకదృక్పథంతో చూస్తే ఈదివ్య తేజము, ఇతర స్వర్గీయ తేజోగోళాల మాదిరి పాశ్చాత్యదిశకు నడిచింది. పర్షియా వెళ్ళింది. అస్సీరియా దాటింది. మరీ పడమటకే వెళ్ళింది. ఈజిప్టులో వెలిగింది. తర్వాత గ్రీస్ లో వెలిగింది. ఈ మహావైభవ మధ్యాహ్న మార్తాండ తేజమును రోంనగరం అనుభవించింది. తరువాత ఈ వెలుగు జర్మనీని మేలుకొలిపింది. ఫ్రాన్సును నిద్రలేపింది. స్పెయిన్ను ఆవరించింది.

చివరకు ఆంగ్లేయ దేశంలో కండ్లు మిరుమిట్లు గొలిపే యీ వెలుగు వర్షించింది. ఓహో ఈ విజ్ఞాన భానుబింబం అమెరికాకు పయనించింది! అమెరికాను భాగ్య డోలికల్లో ఊపింది. చివరకు ఈ వెలుగు ప్రయాణంచేసి చేసి క్యాలిఫోర్నియా చేరింది. హిందూ దేశంలో పగలు ప్రకాశిస్తున్నప్పుడు అమెరికా అజ్ఞాతం. ఇప్పుడు అమెరికాలో పగలు, హిందూదేశంలో ఇప్పుడు దరిద్రబాధామయ రాత్రి వ్రేలాడుతూ వుంది; అంతతో ఆగక, అదిగో విజ్ఞాన భాను బింబం పసిఫిక్ సముద్రాని ఉత్తరిస్తున్నది. జపానుదేశం ప్రపంచంలో శక్తివంతమైన దేశాల్లో ఒకటి అవుతూవున్నది. ప్రకృతిధర్మానుబద్ధంగా విజ్ఞానభాగ్యసూర్యబింబం ప్రపంచ పరిభ్రమణం ముగించుకొని హిందూదేశాకాశంపైన మళ్ళీ ప్రచండమైన తేజస్సుతో వెలుగ బోతున్నది! శివం!

గతకాల చరిత్రను పరామర్శిస్తే ప్రస్తుతం హిందూ దేశాన్ని ఆవరించిన యీ మహా దరిద్రరాత్రికి కారణం ఒకటి కనుపిస్తుంది. ఆ కారణం స్వార్థం. హిందూదేశమందిరంలో నున్న విజ్ఞాన తేజః పుంజాలన్నీ నావేనన్న స్వార్థంతో మనం తెరలు వేసికొని తలుపులు మూసుకొని లోలోపల క్రుళ్ళిపోయాము. ఈ హిందూజ్యోతిని గుత్తకు తీసుకుందామనే దుష్టేచ్ఛ మనమీాద చీకట్లను క్రక్కింది. భగవంతుడు వ్యక్తులను గౌరవించడు. భాగ్యదేవత ఒక్కచోట బంధింపబడదు. మనం మన జీవితంలో తత్త్వమసి అనే సత్యాన్ని సుప్రతిష్ఠితం చెయ్యలేక పోయినాము, విభజింపబడి బలహీనులమైనాము. జాతియొక్క నాయకులు చేసిన మహాఘోర మేమిటంటే – వారు పోయిన తమ హక్కులకొరకు పోట్లాడారే కాని, హక్కులియ్యక తామణచిన తమ సంతానములైన నిమ్నజాతుల కోసమని పోట్లాడలేదు. నేడు ఆశాతార కనుపిస్తున్నది! సుఖనిద్ర పోయినవాండ్లు సుఖంగా లేస్తారు. హిందూదేశం మహాదీర్ఘ నిద్రపోయింది. ఇంక ఈనిద్రామైకం పగిలిపోతుంది. ఛాందసాచారాలు మెల్లమెల్లగా తప్పక మారేరోజులు వస్తున్నవి!

అభ్యుదయం సముచిత బాహ్యకర్మ విధాన విభజనంమీాదా, అఖండాత్మ దృష్టిమీాదా, ఆధారపడి ఉంటుంది. హిందూ వర్ణ విభజనం – జాతి అభ్యుదయానికి ఉద్దేశింపబడిన పరిశ్రమ, వృత్తి, ఆత్మైక్యము – అన్న విషయాలయొక్క నిర్మాణాత్మమైన సుందరమైన విభజనం మాత్రమే. కానీ కాలగమనంలో ఆత్మతత్త్వం విస్మరింపబడి, బాహ్యరూపాలకే ప్రాముఖ్య మేర్పడింది. సహజ సక్రమ విధానం తల్లక్రిందు చేయబడింది. వృత్తి విభజనతోపాటు, ప్రేమ విభజనకూడా చేయడం సాగించాము. ఒక వర్ణంలోవాడు, ఇంకొక వర్ణంలోవాని పనిచేస్తున్నప్పటికీ, యీ వర్ణకుల సంబంధభావాలు వదలుకోలేదు. దేహాభిమానం కులద్వేషరూపంలో అమితంగా పెరిగి, నామ రూప విభేదములనే దిబ్బలో, ఆత్మను పూడ్చి పెట్టింది. శ్రుతి (సత్యాత్మను గూర్చిన వేదజ్ఞానము) మృతాక్షరమైపోయింది. స్మృతి (పూర్వాచార వ్యవహారములగూర్చిన ధర్మశాస్త్రాలు) నిరంకుశ శాసకురాలయింది.

"వ్యాకరణం భాషకుగట్టిన గోరీ" అన్నారొకరు. అవును, వ్యాకరణము నే కాపాడడానికి పాటుపడితే, భాష చచ్చిపూరుకుంటుంది. మితి మించిన కర్కశాచార నియమాదులు, కర్మకాండలు, జాతియొక్క బలాన్ని నాశనం చేస్తాయి, కొన్నాళ్ళవరకు ఇవి జాతి అనే బీజమును కాపాడడానికి పైపొట్టులాగా సహాయపడతవి. కానీ - తరువాత కూడా మారనందువల్లయినే జాతియొక్క అభ్యుదయానికి బాధాకర కారాగారాలై, జాతి జీవనాన్ని నాశనం చేస్తాయి. ప్రియమైన మానవులారా! మీ మనస్సులో జ్ఞాపకం ఉంచుకోండి! ఈ ధర్మాలు, స్మృతులు మీ కొరకై నిర్మింపబడినవి. కానీ, మీరు వాటికొరకు నిర్మింపబడలేదు. నిత్యమైన శ్రుతి ప్రబోధాలను బ్రహ్మాండంలో వ్యాపింపచెయ్యండి! కానీ కాలాను సరణంగా స్మృతులను సమన్వయించుకోండి! స్మృతి సంప్రదాయము మీకు చెందనివ్వండి. మీరు స్మృతిసాంప్రదాయానికి బద్ధులు కావద్దు. భారతదేశములో, నదీశయ్యాలు మారిపోయినవి. పర్వతాలు పరివర్తనబొందాయి. అడవులు పొలాలుగా మారాయి. దేశమే నవ్యస్వరూపధారణ చేసింది! ప్రభుత్వం మారింది. భాష మారింది. అన్నీ మారిపోతున్నవి. కానీ నిరంతరం పరివర్తనాశీలమైన యీ ప్రపంచంలో గతించిన మృతాచారాలను నిలబెట్టడానికి మీరింకా ప్రయత్నిస్తున్నారు! ముందుకు పోదామనుకొని వెనక్కు చూస్తుండేవానిస్థితి ఎంతశోచనీయం! ఇలాంటివాడు ప్రతి అడుగులో పడిపోవలసిందే!

వారసత్వమూ, అన్వయమూ అన్న సూత్రాలమీద జీవితం తిరుగుతూవుంది. వారసత్వము అధోరాజ్యాలలో పరిపాలిస్తుంది. మానవునికీ, యితర జంతుజాలానికీ, భేదం విద్యాసూత్రం. ఒక పసిపాప ఒక చిన్నకుక్కపిల్లమాదిరే, జ్ఞానం లేకుండా ఉంటుంది. ఈ చిన్న కుక్కపిల్లకాని, లేక ఒక చిన్న పక్షిగాని, పుట్టినప్పుడే దాని జీవిత సంపూర్ణత్వానికి. కావలసినవన్నీ తల్లిదండ్రుల దగ్గరనుంచి తెచ్చుకుంది. పసిపాప (మానవుడు) విద్యద్వారా సకల ప్రపంచాన్ని తన వశంలోకి తెచ్చుకుంటాడు. ఇదీ జంతువుకూ మానవునకూ గలభేదం.

నా ప్రియమైన హిందువులారా! మీరు మార్పుకూ, సమన్వయానికీ యిష్టపడక, పురాతనాచార సంప్రదాయాలనే పట్టుకొని వ్రేలాడి, మనుష్యస్థితినుండి, అధమస్థితికి దిగజారకండి!

మీరు ఒక్క దేశంలోనే జీవించడంలేదు. కాలంలోకూడా జీవిస్తున్నారు. మీరు భారత పూర్వర్షుల సంతతికి చెందిన వారే. అయినా మీరిప్పుడు ఆ యుగంలో బ్రతుకుతున్నారా? లేదుకదా? రైలు, స్టీమరు, టెలిగ్రాఫ్, — మొదలైనవన్నీ మీ దగ్గరగా ఉన్నవి. ప్రస్తుత ప్రపంచంనుంచి విడిబడి మిమ్ములను మీరు గదుల్లో మూసుకొని కూర్చోలేరు. మీ రెదుర్కొన వలసిన దెవరినో తెలుసా? ఇరువదవ శతాబ్దపు శాస్త్రవేత్తలను! కళాకారులను! కార్మికులను! దీనిని మీరు తప్పించుకోలేరు. జాగ్రత్తగా చూచినట్లైతే, ఈనవయుగ మహా జీవితముతో మీజీవితాన్ని సమన్వయించుకుంటే తప్ప; బ్రతకలేమని మీరు గ్రహించగలుగుతారు. ఈ నవజ్యోతిని — మీ సనాతనజ్యోతియే ఐన ఈ నవజ్యోతిని — ఆలింగనం చేసికోను మీ కిష్టం లేకపోతే, వెళ్ళి మీపూర్వులతో కలసి పితృలోకంలో నివసించండి. ఆలస్యమెందుకు వెళ్ళండి!

మీరు జాతీయతనుంచి పతనంకావాలని, రాముని అభిప్రాయం కాదు. ఒక మొక్క చుట్టూ వాతావరణములో వున్న నీటినీ, గాలినీ, ఎరువునూ తీసికొన్నా ఆ మొక్క నీరూ, గాలీ, ఎరువూ కావడంలేదు. అ విధముగానే, మీరు నవప్రపంచాన్నంతా మీలో యిముడ్చుకొన్నప్పటికీ, మీ హృదయాంతర రక్తనాళాలలో అనంత శ్రుతిజీవితం స్పందిస్తునే వుంటుంది! మీరు అభ్యుదయోత్తేజంతో వెలుగొందుతారు.

దేశంలోని సాధన సంపత్తును ఉపయోగించుకొనేటట్లు చేసికోవడమే విద్యయొక్క అభిప్రాయం. నిజమైన విద్యవల్ల మానవుల్లో ఉత్తేజం కలిగినందున భూములు పుష్కలంగా ఫలిస్తవి. గనులు అపరిమితమైన భాగ్యాన్ని వర్షిస్తవి. వ్యాపారము ప్రఫుల్లమవుతుంది. దేహాలు ఉత్సాహ పూరితము లౌతవి. మనస్సులు వ్యక్తిత్వంతో

భావిస్తవి. హృదయాలు పవిత్రములౌతాయి. పరిశ్రమలు అనంతంగా అభివృద్ధిచెందుతాయి. జాతిలో ఐక్యత అచంచలమై వెలుగుతుంది. పూర్వ గ్రంథాల్లోని పెద్దపెద్ద శ్లోకాలను ఒప్పజెప్పడం, దంభపాండిత్య ప్రకటన చెయ్యడం, తెలివితేటలచేత పూర్వగ్రంథాలకు అపవ్యాఖ్యానం చెయ్యడం, జీవితానికి అనవసరాలైన విషయాలను గురించి తర్కించడం విద్యకాదు. జీవితంలో ప్రవహింపజేసికోలేని విజ్ఞానం మానసికమైన ఒక అజీర్ణవ్యాధి; అయితే, ఉపరిభాగంలో ఎన్నెన్ని నిరుత్సాహకర విషయాలున్నా చెడుగులున్నా, నేడు హైందవులు సక్రమమైన విద్యను సంపాదిస్తున్నారు. సమన్వయాత్మక దృష్టిపొందుతున్నారు. పురాతన సాంఘికాచార నిబంధనలు సడలుతున్నవి. కుల వర్ణ విభేదములు మారుతున్నాయి. పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రమును చూచి, బెదరడానికి బదులు, హైందవులు దానిని తమ బ్రహ్మవిద్యకు (శ్రుతికి) స్నేహితురాలుగా ఆహ్వానిస్తున్నారు. ఇది సంతోషకరమైన విషయం.

పరమ ప్రాచీన పరాయణులు, గొప్పగొప్ప పండితులు సైతం, హైందవ వివాహ విషయాలలో, వయః పరిమితిని పెంచడం జరుగుతున్నది. అక్కడక్కడ వర్ణాంతర వివాహాలుకూడా జరుగుతున్నవి.

భోజనభాజనాల విషయంలో అనవసరమైన ప్రాముఖ్యమివ్వబడింది మన మతంలో. అందుచేతనే మన మతాన్ని వంటయింటి మతమని పిల్చారు. అనవసర సంరంభాలెన్ని చేసినా మనం శాస్త్రీయంగా ఆహారాన్ని గురించి ఎన్నడూ విచారించలేదు. ఆహారం యొక్క ప్రభావం మనస్సుమీదకూడా కొంతవరకు ఉంటుంది. ఒక యంత్రం దానికి వేసే ఆహారాన్ని బట్టే నడుస్తుంది. మనం కాయగూరల్లో, పండ్లల్లో, గింజల్లో, దేహము యొక్క మనస్సుయొక్క చురుకుదనానికి కావలసిన నైట్రేట్సును ఫాస్ఫేట్సును ఏరుకోవచ్చు. మనము బలంలేని నెయ్యిని తింటాము. కాచి బలం కలిగిన బార్లీని తినము. కొన్ని ఆహార పదార్థాలు పెప్పర్ మొదలైనవి జబ్బును తెచ్చిపెడతవి. వెన్న పంచదార మొదలైన కార్బనేడ్సు స్థూపిరి

తిత్తులకు మాత్రం బలాన్ని యిస్తవి. కానీ మేధస్సుకు బలాన్ని యివ్వవు. జ్ఞానమే ఆహారనియమాలను శాశిస్తుందిగాక!

హిందూదేశ సాధువుల విషయం విశిష్టమైన విచిత్రమైన విషయం. ప్రవహించని నీటిమీద ఆకూ అలమూ పాచీ క్రమ్ముకున్నట్లు, దేశంలో, 52 లక్షల సాధువులున్నారు. అయితే యిందులో కొందరు నిజంగా సరస్సులో పద్మాలవంటి వారున్నారు. ఈ సత్య సాధువులు దేశసరోవరానికి అలంకారభూతులు. ఎక్కువమంది పాచివంటివారున్నారు. నీటిని ప్రవహింప నీయండి. ప్రజలలో ప్రగతిని కల్గించండి. పాచి కొట్టుకపోతుంది. భారతదేశచరిత్రలోని అజ్ఞానాంధకార పూర్వయుగాల సహజసృష్టి – సాధులోకం. ఇప్పటి సంస్కారం, గృహస్థులనేగాక సాధువులనుగూడా మారుస్తున్నది. ఇప్పుడిప్పుడవతరిస్తున్న నవీన సాధువులు జాతీయ మహావృక్షానికి వేరుపురుగులుగాక, ఎరువే అవుతున్నారు.

కోటానుకోట్ల గీతావిద్యార్థులచేత, నేటివరకు పైపైన పారాయణా చేయబడుతున్న – కృషిప్రాశస్త్యజ్ఞానము, నిష్కామ కర్మయోగతత్త్వము, ఈకృష్ణక్షేత్రమున ఆచరణాత్మకంగా ఇప్పుడిప్పుడే తెలుసుబడుకోతున్నది.

"యోగస్థః కురుకర్మాణి, సంగం త్యక్త్వాధనంజయ !
సిద్ధ్యసిద్ధ్యో స్సమోభూత్వా, సమత్వం యోగ ఉచ్యతే"

[ భగవద్గీత 2అ. 48 శ్లో. ]

అక్కడక్కడ సాధువులలో సాధారణ మానవులలో, ప్రగాఢభక్తి, సునిశిత వివేకం గోచరిస్తున్నది. హిందూదేశముయొక్క బహిర్గత అంతర్గత సనాతన అధునాతన జీవితాన్ని సమగ్రంగా తెలిసినవారెవరైనాసరే – విద్వద్భారత భవిష్యన్మతము – అనుష్ఠాన వేదాంతమని కరతలామలకంగా కనుగొనగలరు.

# అనుష్ఠాన వేదాంతం:

## కర్మలో - ప్రేమద్వారా - సర్వసంగ పరిత్యాగం

నిజమైన కర్మ నిజమైన ప్రేమకంటే, జ్ఞానకంటే వేరైనది కాదు. శ్రుతిమతం, (అనుష్ఠాన వేదాంతం) మన జీవితమందలి ప్రతి పనినీ, ప్రతి భావమునూ, ప్రతి తలంపునూ, ఒక యజ్ఞంగా - ఒక దేవతా సమర్పణంగా - చేస్తుంది.

వేదాంత పరిభాషలో, "దేవత" అన్న శబ్దానికి అర్థం - వివిధేంద్రియాలకు తేజశ్శక్తులను ప్రసాదించే శక్తి-అని. ఒక ఇంద్రియమునకు అధిదేవత అన్నప్పుడు సర్వజీవకోటికి సంబంధించిన ఆ రకమైన ఇంద్రియమునకు అధిదేవతయని అర్థం. (ఆధ్యాత్మికము, ఆధిదైవికము) చక్షురధిష్ఠాన దేవత - సర్వజీవనేత్రాంతర్గత శక్తి - ఆదిత్యనామంతో పిలువబడింది. ఈ ఆదిత్యునకు, జగచ్చక్షువైన స్థూల సూర్యుడు ప్రతీకంగా ఎంచబడ్డాడు. హస్తేంద్రియాధి దేవత - సమస్త హస్తాంతర్గతశక్తి - ఇంద్రుడని పిలువబడింది. పాదాధి దేవత- సమస్త పాదాంతర్గతశక్తి - విష్ణువని పేర్కొనబడింది. ఇట్లే ఆయా ఇంద్రియాధిదేవతలు - ఆయానామములతో వ్యవహరింప బడినవి. అందుచేత నిజమైన యజ్ఞమంటే - దేవతా సమర్పణమంటే - తన వ్యక్తిగత శక్తులను, ఇంద్రియాలను, ఆయా విశ్వాత్మక శక్తులకు సమర్పించడమే. ఇంద్రయజ్ఞమంటే లోకమందలి సర్వమానవ హస్తాల శ్రేయస్సుకొరకు, తన హస్తముల వినియోగించి పనిచేయడమే.ఆదిత్య యజ్ఞమంటే, సర్వనేత్రాలలో సర్వేశ్వరుని సందర్శించడమే. సర్వ నేత్రాలను గౌరవించడమే; దుష్టదృష్టితో ఏ నేత్రాలను చూడక పోవడమే; నిన్ను క్రోధంగా చూచిన నేత్రాలనుకూడా, సంతోషముతో, ప్రేమతో, దయతో, చూడడమే; నీ చక్షువులను ఆ సర్వసాక్షికి - ఆ సర్వనేత్రాంతర్గత పరంజ్యోతికి సమర్పించి,సర్వస్వార్థాహంకారముల లయింపజేసి, నిజలోచనాలయాలయంలో సర్వేశ్వరజ్యోతిని వెలిగే లాగు చేసికోవడమే. బృహస్పతి యజ్ఞమంటే-నీ బుద్ధిని (భావాలను) దేశమందలి సర్వమానవ బుద్ధులకు అంకితం చేయడమే, నీతోటి

ప్రజలు నీకు వేరుగారని, వారి ఆనందమే నీ ఆనందంగా ఎంచి దేశాభ్యుదయానికి నీ బుద్ధిని నివేదించడమే.

ఇంతకు యజ్ఞమంటే సారార్థం—"నా పొరుగువాడు నా ఆత్మే" అన్న సత్యమును నిత్యజీవితాచరణలో సాక్షాత్కరించుకోవడం; "మదాత్మా సర్వభూతాని" – అన్న అనుభూతిని పొందడం; క్షుద్రాహంకృతిని విశ్వాత్మ జ్యోతిలో ఆహుతిజేసి పరమాత్మస్వరూపుడై ప్రకాశించడం. స్వార్థమును శిలువ వెయ్యడం, మహాత్మను పునరుద్ధాన మొందించడం. ఈ మహాయజ్ఞంలో ఒకభాగం భక్తి అనీ వేరొక భాగం జ్ఞానమనీ పిలువబడుతుంది.

ఓ సర్వమయుడా! (ఓం)—

విసయంబుతోడ నా జీవితం బెల్ల
నీ కంకితము సేతు తీసికోవోయి!
నీ సేవ కీ చేతులను తీసికొమ్ము—
గ్రహియించి నా హృదయాబ్జంబు దేవ!
నీలో విలీనంబు చేసికొమ్మిదియె.
తీసికో నా నేత్రముల తీసికొమ్ము,
పరమేశ యవిభవ దున్మత్తవశత
అరుణంబులవుగాక! అనుదినం బీవు
వసియించు దివ్యాలయముఁ చేసికొమ్ము.
నా మానసంబును సర్వాంతరాత్మ!

ఈ విధంగా, తన సర్వస్వాన్ని సంపూర్ణంగా దైవాంకితం చేసినవాడే— 'తత్త్వమసీ' అంటే ఏమిటో తెలుసుకోగలడు.

నీవు దేశభక్తుడవు కావాలనుకొంటున్నావా? ప్రేమతో నీ హృదయాన్ని నీదేశంతో–ప్రజలతో–శ్రుతిగల్పు. వారితో ఏకత్వానుభూతిపొందు. నీకూ నీ ప్రజలకూ మధ్య ఒక సన్నని పొరకూడా అడ్డు లేకుండా చేసికో. దేశంకొరకు ప్రాణత్యాగంచేసే ఒక ఆధ్యాత్మిక యోధుడవుగా! ఈవిధంగా క్షుద్రాహంకృతిని పోద్రోలి దేశమంతటితో ఏకమై, నీవేదైనా తలువు. దేశమంతా నీ తలపులతో ఏకమవుతుంది.

ముందుకు నడువు. నీ దేశమంతా నీ వెను వెంట నడుస్తుంది. స్వస్థుడ వుగా! దేశమంతా స్వాస్థ్యం వహిస్తుంది. నీలోని శక్తి యావద్దేశ నాడీ మండలంలో ప్రవహించి తిరుగుతుంది,

నేను అఖండభారతాన్ని. ఈ భారతభూమి నాశరీరం. కామరెన్ నా పాదయుగళం. హిమాలయాలు నా శిరస్సు. నాజటల్లోనుంచి గంగ ప్రవహిస్తున్నది. సింధునది పొంగిపోతున్నది. వింధ్యాచలాలు నా కటిమండల మేఖల. కారమండల్ నా కుడికాలు. మలబారు నా ఎడమకాలు. నేను భారత సర్వస్వాన్ని. భారతదేశంయొక్క తూర్పు పడమర దిక్కులే నా చేతులు. సకల మానవప్రపంచాన్ని ఆలింగనం చేసికోడానికి దిక్కులనే యీ చేతులను నేను చాచాను. నాప్రేమ సర్వవిశ్వాన్ని ఆవరించింది. ఇది నా మహావిశ్వరూపం! అనంతమైన ఆకాశములో నిల్చొని నావిశ్వరూపం ప్రపంచాన్నంత చూస్తున్నది. నా ఆత్మ విశ్వాత్మ. నేను నడుస్తే సర్వభారతం నడిచినట్లుంటుంది! నేను మాట్లాడితే, అఖండ భారతం మాట్లాడినట్లుంటుంది! నేను గాలి పీలిస్తే మహాభారతం గాలిపీలుస్తుంది. నేను అఖండ హిందూస్థానాన్ని! నేను శంకరుణ్ణి! నేను పరమశివుణ్ణి! ఇదే దేశభక్తియొక్క సిద్ధసితి! ఇదే అనుష్ఠాన వేదాంతం!

వాహినినైయె శాంతి నాలోన బారు,
శాంతిసాగర షట్లు నాలోన పొంగు,
శాంతి గంగామహావాహిని యాచు
నా జటాజూటాగ్ర భాగమందుండి
నా పాదములనుండి ప్రవహించు సతము.
నా త్రినేత్రద్వార మందుండి సతము
జ్ఞానగంగాధుని దుముకుచునుండు,
హృదయ కైలాస శృంగంబుపై నేను
పద్మాసనస్థుండనై కూరుచుందు;
అచట నే ప్రతిభావి శేమంబు దనర
పాలింతు సర్వంబు మార్గదర్శిగను,
నన్నెవ్వరును వీడి వేరుగా లేరు.

భూమిపై గాని స్వర్గంబులోనైన
చక్కని పెండిలి ఐక్యత్వ మిద్ది.
నే సల్పు సర్వమానవలోక పూర్ణ
దివ్యానురాగ గాఢాలింగనముకు
అస్పష్టమగు భావి సూచనాచిహ్న
మస్మదాలింగన మతిగాఢతరము.
సూర్యుని బంగారు కిరణశూలమున
పూవుల గుండెలు పొడిచెదనేను,
పున్నమచంద్రుని వెన్నెల నగుచు
నాదు కౌగిళ్ళలోనికి గుంజుకొనెద.
ఓసి విద్యుల్లతా! ఓ ప్రకాశంబ!
అతివేగ భాసుర భావమా రమ్మ!
మన మిద్దరము పందె మాడుకొందాము.
పో పొమ్మ! పో పొమ్మ! ఎగురుమా ఎగురు!
కానీ నాతో నీవు సరిసమానముగ
నడువనైనను చేతగాదులే పొమ్మ.
ఓ భూములార! ఓ జలరాసులార!
నా తనూభవులార! నాసుతలార!
జీవజంతువులార! వృక్షంబులార!
జయజయ అని కంఠ మెత్తి పాడుచును
సర్వబంధనముల భేదభావముల
తుత్తుము రొనరింతు త్రుంచి వైచెదను!

ఓమ్! ఓమ్! ఓమ్!

# భారత ప్రాచీన ఆధ్యాత్మికత

( 1904 జులై 28 వ తేదీ యిచ్చిన ఉపన్యాసం )

సభికుల స్వరూపంలో వున్న ప్రియా! నేను మొట్ట మొదట అమెరికా వచ్చినప్పుడు 'సెరెర్'లో దిగాను. నాకు ఆధ్యాత్మిక వాదులు స్వాగత మిచ్చారు. పవిత్రమైన యీ భూమిలో దిగంగానే వారే నన్ను ఆహ్వానించింది. వీరిలో నాకు అతిప్రియులున్నారు; గాఢ స్నేహితు లున్నారు. పోర్టులాండులో ఆరిగన్‌లో వీరు నా ఉపన్యాసాలకు ఏర్పాటుచేశారు. దక్షిణ అమెరికాలో అనేకులను అతి ఉత్తమ ఆధ్యాత్మికవ్యక్తులను కలుసుకున్నాను. వారందరూ మధురాత్ములు. అమెరికాదేశ ఆధ్యాత్మిక వాదులు విశాల హృదయులు, కరుణాంతరంగులు, సత్యవంతులు, నిజమైన క్రైస్తవులు. మళ్ళీసమావేశమైన నా ప్రియులమధ్య ఉండడం నాకు ఎంతో ఆనందంగా ఉంది. నేను అమెరికా విడిచిపెట్టి పోతున్నాను. నన్ను ఈ దేశములో ఆహ్వానించిన ప్రియస్నేహితులతో మరల మాట్లాడడానికి యిప్పుడు అవకాశం చిక్కింది.

ఇక్కడ మనమందరమూ అన్నదమ్ములము; వన దేవతలము. మనమిప్పుడు పూబొదరిండ్లతో నిండిన అందమైన దేశంలో నివశిస్తున్నాము. ఆకాశము మనకు రాజచ్ఛత్రం. ఈ చెట్లూ, యీ మేఘాలు, మనకు ఛత్రాలు పడుతున్నవి. అందుచేత మనం వనదేవతలం. మీకు మొట్టమొదట హిందూదేశంయొక్క ప్రాచీన ఆధ్యాత్మిక తత్త్వాన్ని గురించి చెబుతాను.

హిందూదేశ ప్రాచీన ఆధ్యాత్మికతత్త్వం ఈ దేశంలోఉన్న ఆధ్యాత్మిక సంఘాలవంటిదికాదు. కానీ, ప్రాచీన వేదసాహిత్యంలో దివ్యదృష్టిని గురించి అనేకచోట్ల సంకీర్తింపబడిఉంది.

నేను వ్రాస్తున్నాను, చదువుతున్నాను, పనిచేస్తున్నాను, శ్వాశిస్తున్నాను. ఇవన్నీ దివ్యదృష్టితో చేస్తున్నాను. దివ్యదృష్టి అంటే జ్ఞానదృష్టి. మీరు భగవద్గీతను గురించి చాలా చదివారు. భగవద్గీతను

జెప్పినది సంజయు డనే మానవుడు. భగవద్గీత మొదటిలోనే యితని సంగతి ఉంటుంది. సంజయుడు అర్జునునికి గీతబోధింపబడిన యుద్ధరంగం లోని ఒక వ్యక్తి – యుద్ధరంగానికి 200 మైళ్ళదూరంలో ఉన్నాడు. అందుచేత అతని గురువతనికి దివ్యదృష్టి నిచ్చాడు. రెండు వందల మైళ్ళదూరంలోఉండి, సంజయుడు యుద్ధరంగాన్నంతా అవలో కించాడు. యుద్ధరంగంలో భగవద్గీత గానం చెయ్యబడింది. మీకు జ్ఞాపకం ఉండే వుంటుంది. ఈ దేశంలో కొన్ని రచనలనూ, సందేశా లనూ, 'మీడియంను' అని పిలుస్తారు. ప్రపంచంలోకల్లా మహత్తర గ్రంథాల్లో యోగవాశిష్ఠం ఒకటి. యోగవాశిష్ఠం చదువుతూ వుంటే భగవత్తన్మయత్వం కలుగుతుంది. సర్వైశ్వర్యం లభిస్తుంది. ఇది అలాగే వ్రాయబడింది. హిందూదేశములో మరొక మహాగ్రంథం వాల్మీకి రచిత మైన రామాయణం. రామాయణంకూడా, రామకథ జరగడానికి చాలా పూర్వమే వ్రాయబడింది. భారతవర్ష రచనలు కొన్ని ఈ విధంగా అవతరించినవి.

మహాభారతం ప్రపంచంలోకల్లా మహోత్తమగ్రంథం. మహా భారతంలో నాలుగువందలవేల శ్లోకాలు ఉన్నవి. కథలో ఒక రాజ్ఞి కలలో ఒక సుందర రాజకుమారుణ్ణి చూస్తుంది. అతణ్ణి ప్రేమిస్తుంది. ప్రేమానుతాపంలో ఆ రాజకన్యకు జ్వరం వస్తుంది. రాజకన్యతండ్రి అనేక వైద్యులను పిలిపిస్తాడు. కానీ ఎవ్వరూ జబ్బేమిటో చెప్పలేక పోతారు. చివరకు ఎవరో ఒకరు ప్రేమ అని కనుక్కుంటారు. ప్రధాని ఆమెదగ్గరకు వస్తాడు. ఆమె నాడి చూస్తాడు. ఒక చిత్రకారిణిని పిలిపించి, భారత దేశములోనున్న సుందరమైన రాజులందరి చిత్రాలనూ గీయమంటాడు. ఆమె చిత్రకారిణి. పూర్వము భారత దేశము లో స్త్రీల స్థితి మాహాత్మ్యాన్ని యిది తెలుపుతుంది. చిత్రకారిణి వస్తుంది. ఫలకము మీద బొమ్మ గీస్తుంది. అనేకమంది సుందరమైన రాజులబొమ్మలు గీస్తుంది. ప్రధాని రాజకన్య నాడిచూస్తూ ఉన్నాడు. చిత్రకారిణి శ్రీకృష్ణుని బొమ్మగీస్తుంది. ప్రధాని నాడి చూస్తాడు. నాడి ఎక్కువగా కొట్టుకుంటుంది. ప్రధాని రాజకన్యక కలలో కనుపించిన పురుషు డితడే నను కొంటాడు. కాని నాడి మళ్ళీ వేగం తగ్గుతుంది. చిత్రకారిణిని

మళ్ళీ బొమ్మలు గీయమంటాడు. కృష్ణుని చివరకొడుకు బొమ్మ గీస్తుంది. ఆబొమ్మ గియ్యగానే రాజకన్య నాడేకాదు, హృదయం కూడా కొట్టుకుంటుంది. ప్రధాని నిర్ణయించుకుంటాడు. రాజకన్య దుఃఖాన్ని తీసివేసే మనిషి యితడేనని. ఇది వట్టి కథకాదు. చారిత్రక మైంది.

ఈ చిత్రకారిణి విషయం ఏమిటి? దేశంలోవున్న రాజ కుమారుల నందరినీ చూచిందా? లేదు. దివ్యదృష్టిచేత సర్వైక్యతచేత ప్రకృతిగ్రంథం తెరచుకున్నది. దాన్ని చిత్రకారిణి చదివింది. ఈ రకంవి అనేకఉపమానా లున్నవి. ఒక దివ్యదృష్టి ఉన్నది. ఈ అంతర్జ్యోతి వల్లనే సకల ప్రపంచమహా విజ్ఞానం పొందగలుగుతాము.

వేదాంత దర్శనం, మనోజ్ఞమైన ఉపమానాలతో జన సామా న్యానికి అవగత మవుతుంది. ఈ ఆంతరంగికమైన పరమజ్ఞానదృష్టికీ, మీరు గ్రంధాలద్వారా, విశ్వవిద్యాలయాధ్యాపకులద్వారా పొందే జ్ఞానదృష్టికీ తేడా ఒక ఉదాహరణతో తెలియజేస్తాను.

ఒక రాజకుమారు డున్నాడు. అతడు తన నూతన సౌధంలో అద్భుతంగా చిత్రరచనచేయించా లనుకొన్నాడు. అందుకై రాజ కుమారుని దగ్గరికి చాలామంది చిత్రకారులు వచ్చారు. రాజకుమారుడు వారికి పరీక్షపెట్టాడు. ఎదురెదురుగా రెండుగోడలున్నవి. ఇద్దరు చిత్రకారుల్ని పిలిచి, వాటిమీద బొమ్మలు వేయమన్నాడు. ఒకరి నొకరు చూడకుండా ఉండటంకోసమని రెండుగోడలమధ్య తెరలు గట్టబడ్డవి. బొమ్మలు రెండు వారాల్లోపల గీయాలి. ఒక చిత్రకారుడు తనగోడమీద మహాభారతచిత్రాలను అద్భుతంగా గీశాడు. రెండో చిత్రకారుడు ఏంచేస్తున్నాడో తెలియదు. రెండువారాలు గడిచినవి. రాజకుమారుడు వచ్చాడు. ఒకగోడ తెర ఎత్తబడింది. దానిమీద మహాభారతచిత్రాలు మహాద్భుతంగా వున్నవి. అతనికే బహుమానం యివ్వమన్నారు ప్రజలందరు. రాజకుమారుడు రెండవగోడ తెరయెత్త మన్నాడు. తెర ఎత్తబడింది. ప్రజలు ఆశ్చర్యచకితులైనారు. కను రెప్పలువాల్చలేదు. గాలిపీల్చలేదు. ఈ ఆశ్చర్యం ఎందుకు? ప్రజ లను

కొన్నారు. "ఇందులోకూడా మహాభారతచిత్రా లున్నవి. ఇవి మొదటి గోడమీదకంటె ఎక్కువ అందంగా ఉన్నవి. మృదువుగా నున్నవి." ఎందుచేత జనులాశ్చర్యపడ్డారు? మూడడుగుల్లోనే ఎదుటిగోడమీది బొమ్మలన్నీ గీయబడ్డాయి. ఈ రహస్య మేమిటి? ఈగోడను రెండవ చిత్రకారుడు అద్దంలా ప్రతిబింబించేంతవరకు సానపెట్టాడు. అందుచే మొదటి చిత్రకారుని చిత్రాలు ఈ ఎదురుగాఉన్న గోడమీద ప్రతిఫలించాయి. అద్దంలో ప్రతిబింబించిన వస్తువులు అతి స్నిగ్ధంగా కనుపిస్తాయికదా! చిన్న అద్దంలో ఎంత వస్తువైనా ప్రతిబింబిస్తుందికదా!

అలాగే విజ్ఞాన సంపాదనకు రెండు మార్గా లున్నవి. ఒకటి బైటిదంతా లోపలికి కుక్కుకోవడం, బైట ఏవోగీతలు గీయడం, బొమ్మలు గీయడం. భూగర్భశాస్త్రం, గ్రహశాస్త్రం, తత్త్వశాస్త్రం, భాషాశాస్త్రం యీ అనుష్ఠానవిహీనములైన గాలిమేడలవంటి శాస్త్రాలన్నీ నేర్చుకోవడం — ఇది ఒకరకమైన విజ్ఞానసంపాదన. మరొక మార్గం — ఇది శుద్ధమైన మార్గం. ఇది లోపలికి కుక్కుకోవటం కాదు. ఇది అంతస్సును పరిశుద్ధి చేసికోవడం. హృదయాన్ని సర్వేశ్వరునితో శ్రుతిగల్పడం. ఎమర్సన్, "ప్రకృతి హృదయంతో నీ హృదయాన్ని శ్రుతికలుపు, దిగంతాలు స్వచ్ఛమై పోతాయి" అన్నాడు. ఆత్మే అంతా అని తెలుసుకొనే పద్ధతియిది. "నీవుసర్వముతో సానుభూతిపొందినప్పుడే, సర్వమునూ తెలుసుకోగలవు" – అని "వాల్టువిట్‌మాన్" నిర్వచించాడు.

ఈ విధానం విశ్వైక్యానుభూతి; సర్వములో ఏకంగావడం.

ప్రతిభాశాలురు వారి విజ్ఞానాన్ని ఎక్కడనుంచి తెచ్చుకొన్నారు? తత్త్వశాస్త్రాచార్యు లున్నారు. మహాపండితులున్నారు. మతప్రవక్త లున్నారు. మతాధిపతు లున్నారు. గ్రంథాలయాలకు జీవితం అర్పణచేసినవా రున్నారు. కాని వీరి వాక్యాలు అమృతమయుడైన క్రీస్తు 'మధురాధరాల్లో'నుంచి వెలువడిన తియ్యని బోధలమాదిరి వుండవు. అనేకులు రచయిత లున్నారు. వక్తలున్నారు. కాని ప్రియులారా! అమెరికాలో నిచ్చిన అన్ని ఉపన్యాసాల

లోకి ఏడుమాటల ఉపన్యాసం గొప్పది. ఆ ఏడుమాటల ఉపన్యాసం ఏమిటో తెలుసా? "నాకు స్వాతంత్ర్య (విముక్తి) మివ్వు, లేదా మరణం నాకు ప్రసాదించు" (Give me liberty or give me death). గణితశాస్త్రంలో, తత్త్వశాస్త్రంలో మహావేత్తలున్నారు. కానీ ఒక్కరైనా న్యూటన్‌లాగ సిద్ధాంతాన్ని కనిపెట్టగలిగారా? ఈ విజ్ఞానం అతనికి ఎక్కడనించి వచ్చింది. అతను పుస్తకాల్లో నేర్చుకొన్న విజ్ఞానంకంటే, ప్రపంచానికిచ్చిన విజ్ఞానం గొప్పది. ఈ విజ్ఞానానికి మూలం ఏదో ఉన్నతమైనది. యూనివర్సిటీలో షేక్స్పియర్ పుస్తకాలు చదువుతారు. యం. ఏ. చదివేవాండ్లు చదువుతారు. షేక్స్పియర్ ఏ యూనివర్సిటీలో చదువలేదు. పట్టభద్రుడుకాడు. కానీ పట్టభద్రులు అతని పుస్తకాలు చదవాలి. నేటి మహావిజ్ఞానశాస్త్రవేత్తఅయిన హెర్బర్టు స్పెన్సర్ పట్టభద్రుడుకాడు. ఇతణ్ణెవరో అడిగారట—"మీరు ఎక్కువగా చదువుతారా?" అని. అప్పుడు స్పెన్సర్ యిలా అన్నాడు. "నేను చదవను. నే నెక్కువగా చదివితే, వాండ్లమాదిరే ఎక్కువ మొద్దు నయ్యేవాడినే." ఈ ప్రతిభాశాలురు, విజ్ఞానశాస్త్రాన్ని అధిగమించినవాండ్లు – వాండ్ల భావాలను, పూర్వగ్రంథాల్లో నుంచి అప్పు తెచ్చుకోలేదు. ఆలా చేసినట్లయితే, వీండ్ల భావాలు స్వంతము ఎలా అవుతాయి? అయితే అసలు విజ్ఞానం ఎక్కడనుంచి వస్తుందీ అని ప్రశ్న?

ఆనందమయులారా! ప్రియులారా! వినండి. ఈ విజ్ఞానానికి మూలం ఒకచోటఉంది. అది అంతస్స్వర్గంతో శ్రుతిగల్పడం. అంతశ్చైతన్యంతో శ్రుతిగల్పడం. అంతర్దృష్టితో శ్రుతిగల్పడం. అక్కడవుంది అసలుమూలం. నీ సత్యాత్మే సర్వజ్ఞానమూలం. నీ సత్యాత్మే సర్వశక్తిమూలం, నీ సత్యాత్మే స్వర్గస్వర్గం! సర్వజ్ఞానం, సర్వశక్తి మనలోనే ఉన్నది—అనే దివ్యభావనాసమాధిలో ఒక్కక్షణకాలము మనం నిశ్శబ్దశాంతి వహిస్తాంగాక!

ఆర్యఋషులు ఈబ్రహ్మదర్శనం ఎలాకన్నారో చెప్తాను. వేదాలు అపౌరుషేయములనీ భగవంతుడు వ్రాసినవనీ ఋషులు వ్రాసిన వనీ అంటారు. దీనికి అర్థం యిది. వేదాలు వ్రాసినవారికి వ్రాసేటప్పుడు పూర్ణ

దేహవిస్మృతి కలిగింది. అహంకార పంజరవిముక్తి కలిగింది. అందుచే వేదాలు పాడిన వారిని ఋషులు అంటారు. ఋషులు వేదాలకు కర్తలు కారు. ఋషి అంటే దివ్యజ్యోతిని దర్శించినవాడని అర్థం. సత్యద్రష్ట అనిఅర్థం. హిందూప్రమాణ గ్రంథాల్లో మరొకచోట యిలా ఉంది. "వేదం ఓంకార మనే బీజంలోనుంచి పెరిగిన వృక్షం." "ఓంకార మనే బీజంలోనుంచి వేదాలనే చెట్టు పెరిగింది. అయితే దీనికీ, వ్రాయుని వారిలోనుంచి వేదాలు ఉదయించడానికీ, సమన్వయం ఎలా కుదురుతుంది? గులాబిపూవునుంచి వాసనలాగా, దీపంనుంచి, వెలుతురులాగా వేదాలు వచ్చాయి. ఓంకారము గానము చెయ్యడంచేత, ఋషులకు బ్రహ్మదర్శనం కలిగింది. అహంకారాన్ని అధిగమించారు. సంకుచితమైన స్వార్థాన్ని దాటిపోయారు. వెలుగు వెలిగింది. బ్రహ్మ తన్మయతలోనుంచి – ఓంకారమయతలోనుంచి – వేదాలు ఉద్గమించాయి.

ఓంకారం జపించడమంటే నాలుకతో మాత్రమే అనడం కాదు. పెదవులూ, కంఠమూ, శారీరకంగా స్మరిస్తున్నప్పుడు, మనస్సు బౌద్ధికంగా స్మరిస్తుంది. హృదయం ఉన్నతభావపారవశ్యంతో స్మరిస్తుంది. ఈవిధంగా మనస్సూ దేహమూ, హృదయం ఓంకారాన్ని జపిస్తాయి. ఈ విధంగా త్రికరణశుద్ధిగా ఓంకారస్మరణంచేస్తే సర్వైక్య సిద్ధి కలుగుతుంది. దివ్యజ్యోతి సాక్షాత్కరిస్తుంది. ఇదీ ఋషులపద్ధతి. ఓంకార మంత్రమంటే, ఏమిటో మరొకనా డెప్పుడైనా చెబుతాను. ఓంకారమంత్రాన్ని గురించి చెప్పబొయ్యేముందు యీ చిన్న మంత్రములో ఇట్టి దివ్యతన్మయత ఎందువల్ల కలుగుతున్నదో నిర్వచిస్తాను.

భగవంతుడు మాటలను గౌరవిస్తాడా? ఇది ప్రతివారికీ గలిగే శంకేహము.

ఓంకారము అతి సహజమైంది. ఇది సర్వాంతర్యామియైన, పరమపావనుడైన భగవంతుని నిజమైన పేరు. ఇది ఒక భాషకు చెందిన శబ్దంకాదు. హిందువులు తీసికొన్నారని సంస్కృతశబ్దం కాదు. ప్రకృతిపేరు. ప్రకృతిమాట, ప్రకృతియొక్క వాక్కు! ప్రకృతి

మంత్రము! కొంతమంది సంస్కృతమని యీ మంత్రాన్ని నిరసిస్తారు. ప్రతివాడూ తను నమ్మేతత్త్వాన్నే సత్యం అనుకుంటాడు. ఇతర్లది విరుద్ధ మనుకుంటాడు. పూర్వాచారపరాయణులు వాళ్ళముద్రతో వస్తేకాని దేన్నీ ఒప్పుకోరు. సంస్కృతము ఆర్యప్రజలకు సంబంధించిందని మీరు దీన్ని తిరస్కరించవాకండి. సంస్కృతంలో ఓంకారం శబ్దశాస్త్రానికి అతీతమైనది. ఇతర సంస్కృతశబ్దాలను బంధించినట్లు వ్యాకరణము ఈ శబ్దాన్ని బంధించదు. అందుచేత ఓంకారం సంస్కృత పదం కాదు. అది స్వతస్సిద్ధమైన ప్రకృతిపదం. హిందువులు దాన్ని తీసికున్నారు, అంతే; ప్రతి పసిబిడ్డ పుట్టంగానే మొట్టమొదట ఉచ్ఛరించే శబ్దమేమిటి? 'అం' అంటాడు. 'ఉం' అంటాడు. 'ఓం' అంటాడు. లేక 'మా' అంటాడు. ఓ, అ, ఊమ్ ఈ మూడు ధ్వనులూ ఓంకారంలో ఉన్నవి. ఫ్రెంచి భాషలో ఓ, ఆ అన్నశబ్దాలు కలిసినపుడు 'ఆ' అవుతుంది. ఆవిధంగానే సంస్కృతంలోకూడా. ప్రపంచంలో ప్రతి పసిబిడ్డ ఈ శబ్దాలను స్వర్గీయమైన లోకాలనుంచి ఈలోకంలోకి తెస్తాడు. జబ్బుతో బాధపడుతున్న మనిషి ఏ శబ్దములో ఉపశాంతి పొందుతాడు? 'ఊఁ-ఊఁ-ఊఁ' అని మూల్గడము చేత ఉపశాంతి పొందుతాడు. జ్వరముతో బాధపడుతున్న మనిషికి యీ మూలుగే ఓంకారము. చూడండి. పసిపిల్లలు ఎక్కడైనాసరే ఆనందంతో పొంగిపోయినప్పుడు 'ఓం' అనే శబ్దమును అవ్యక్తంగా చేస్తారు. ఆనందస్వరూపం ఓంకారము. ఈ క్షుద్రాహంకృతిని అతిక్రమించి శారీరక భారమును దాటిన ఆ బ్రహ్మస్థితికి ప్రత్యామ్నాయమే ఓంకారము. నీవు శారీరక భావాన్ని అధిగమించి అహంకార పంజరవిముక్తుడవైనప్పుడు సహజంగా ఓంకారం నీలోనుంచి నినదిస్తుంది. ప్రపంచ భాషల్లోకల్లా ఓంకారము ప్రప్రథమస్థానమలంకరిస్తుంది. Ominiscient (సర్వజ్ఞత్వం) అనే పదము ఓంకారముతో ప్రారంభ మవుతుంది. Omnipresent (సర్వవ్యాపకుడు) Omnipotent (సర్వశక్తి మయుడు) అనే ఈ అనునాసికధ్వని యుక్తమైన పదాలు సర్వజ్ఞుడైన, సర్వశక్తిమయుడైన, సర్వవ్యాపకుడైన భగవంతునియొక్క మహాగంభీరములైన, అత్యంత మధురమైన నామాలు. ఓం నిషియంట్, ఓం నిపొటెంటు, ఓం నిప్రెజెంటు అనే ఈ పదాలు భగవంతుని సహజనామమైన ఓంకారంతో

ప్రారంభమవుతున్నవి. ప్రార్థనలలో మీరు వాక్కుకు అతీతమైన స్థితిలోకి అధిగమించినప్పుడు, ఆమెన్ అన్న శబ్దమును ఉచ్చరిస్తారు. పర్షియన్ భాషలో హిందూస్థానీలో అరబిక్ భాషలో ఇంగ్లీషులో 'ఏమిన్' అంటారు. నాగరికతగల ప్రజల ప్రధానభాష లన్నింటిలో ప్రార్థనలందు - వాక్కుకు అందని దివ్యమైన శాంతిస్థితిలోకి పోయినప్పుడు - అంతరాంతరాల్లో ఈదివ్యశబ్దం నినదిస్తుంది. ఆ మహాస్థితిని హైందవులు ఈ విధముగా నిర్వచించారు :

"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ"-దీనికి అర్థమిది: ఒక గోడకు బంతి కొట్టినప్పుడు తిరిగి వచ్చినట్లు ఆ మహాస్థితి దగ్గరకు వాక్కు వెళ్ళి పైకి వెళ్ళలేక తిరిగి వస్తుంది. ఈ స్థితిలో 'ఏమెన్' అనే శబ్దమే మీకూ, ప్రపంచానికీ అభేదత్వమును కల్పిస్తుంది. ఏమెన్ అన్నశబ్దము ఓంకారముయొక్క ఛాయ. ఓంకారమే పరమ పావనమైన భగవంతుని సహజ నామం.

మీరు ఉచ్ఛ్వాస నిశ్వాసాలను విడుస్తున్నప్పుడు కలిగే శబ్దాన్ని ఎప్పుడైనా విన్నారా? 'సోఽహం-సోఽహం' అని వినిపిస్తుంది. ఒంటరిగా గాలిపీల్చండి; 'సోఽహం' అని వినిపిస్తుంది. సంస్కృతభాషలో 'సోఽహం' అన్న శబ్దానికి ఒక అర్థం ఉన్నది. మరచిపోకండి. సంస్కృతభాషలో దానికి అర్థంఉంటే, ఇంగ్లీషు భాషలోకూడా దాన్ని మీరు పరిగ్రహించాలి. భాషాశాస్త్రం-ఇంగ్లీషు, ఫ్రెంచి, స్కాండినేవియా, రష్యన్, గ్రీకు, పర్షియన్ భాషలు సంస్కృతభాషకు కూతుళ్ళని ఋజువు చేస్తుంది. ఆనందమయులారా! సంస్కృతభాష మీ ఇంగ్లీషుభాషకు తల్లి. తల్లికి చెందిందాన్ని కూతురుకూడా పరిగ్రహించాలిసిందే! 'సోఽహం' అన్న దానికి అర్థమిది. 'సః' అంటే అది-(పరబ్రహ్మ) 'అహం' అంటే నేనై ఉన్నాను. అదినేను. దీనితో సంబంధించింది గాలి పీల్చడంకూడా. గాలి పీల్చడంలో ధ్వనిస్తున్న (So-aham) 'సోఽహం'లో రెండుహల్లు లున్నవి. మిగతా రెండు స్వతంత్రశబ్దా లున్నవి. మొదట హల్లయిన 'S' సకారము రెండో హల్లయిన 'H' హకారం తీసివెయ్యండి. అప్పుడు 'om' (ఓం) జీవశబ్దం మిగులుతుంది. మానవుని ఉచ్ఛ్వాస నిశ్వాసలు, ప్రాణం, ప్రపంచజీవనమూ-ఓం అన్న స్వతంత్రధ్వనిమీద ఆధారపడి

ఉంది. నీ ప్రాణగతమైన జీవశక్తి ఓంకారం. నీ ప్రాణమూలశబ్దం ఓంకారం. నీలోని స్వర్గమునకు, భగవంతునికి, సమస్త జీవప్రపంచాన్ని ఉద్దీప్తంచేసే పరమచిచ్ఛక్తికి, సహజమైన నామం ఓంకారం. సమస్త చరాచర జగచ్చైతన్యం ఓంకారం.

ఓంకార సంస్మరణంచేత ఆత్మతిన్మయదివ్యస్థితి ఎందుకు కలుగుతుందో సశాస్త్రీయంగా మీకు చెప్తాను.

ధ్వనులు రెండురకాలు. మీకు తెలుసు. వ్యాకరణంలో వ్యక్త ధ్వనులు, అవ్యక్తధ్వనులు అని వున్నవి. సంస్కృతంలో వ్యక్త ధ్వనిసాక్షరంగా పలికేది. అవ్యక్తధ్వని, అక్షరవిహీనమైంది. సాక్షరమైన శబ్దం ఒక ధ్వని. సాక్షరంకాని శబ్దం ఒకధ్వని. సాక్షరమైన వ్యక్తధ్వని మేధస్సుకు సంబంధించింది. అవ్యక్తధ్వని హృదయానికి సంబంధించింది. ఇది మన తత్వశాస్త్రవేత్తలు చెప్పింది. వ్యక్తధ్వనికి అర్థం ఉన్నది. కానీ కొందఱకే తెలుస్తుంది. నేను మీతో ఇప్పుడు ఇంగ్లీషుతో మాట్లాడుతున్నాను. ఇంగ్లీషు రానివాండ్లకు ఈ ఉపన్యాసం అర్థంకాదు కదా! కాబట్టి ఏభాషవచ్చిన వాండ్లకు ఆభాషలో ఉపన్యాసమే అర్థమవుతుంది. ఎవరైనా ఇప్పుడు మీతో పర్షియన్ భాషలోగాని, సంస్కృతంలోగాని, రష్యాభాషలోగాని మాట్లాడితే అర్థంకాదు. అతను ఇంగ్లీషురాకపోయినా, పెద్దగా ఏడుస్తాడనుకోండి. మీకు తెలుస్తుంది. అతను దుఃఖంలో ఉన్నాడనీ, సహాయార్థి అనీ తెలుస్తుంది. ఒకడువచ్చి సంస్కృతంలో, పర్షియన్‌లో జపానుభాషలో మాట్లాడుతా డనుకోండి. మీకు తెలియదు. నవ్వితేమీకు అర్థమవుతుంది. ఈనవ్వు సాక్షరమైన భాష కాదు: అవ్యక్తమైన ధ్వని. ఒక పసిబిడ్డ మాట్లాడలేదు. కానీ అవ్యక్తమైన ప్రేమభాష, అర్థంకాని చోటులేదు. ఇక్కడికొక పిల్లివస్తుంది. దాన్ని తోలాలనుకొంటావు. దానితోటి సంస్కృతంలో మాట్లాడు. అరబిక్‌లో, యింగ్లీషులో మాట్లాడు. అర్థంకాదు. కానీ చప్పట్లు చరిస్తే అర్థమై వెళ్ళిపోతుంది. ఇది అవ్యక్తధ్వని. వ్యక్తధ్వనికాదు. అవ్యక్తధ్వని, వ్యక్తధ్వనికంటె సద్యఃఫలమిస్తుంది. అందుచేతనే, అవ్యక్తధ్వని సకల బ్రహ్మాండభాష. మేధస్సుకంటె సూక్ష్మమైన హృదయానికి సంబంధించిన మధురభాష

యీ అవ్యక్తధ్వని, 17, 19 శతాబ్దాల తత్వవేత్తలు మానవుణ్ణి పరిపాలించేది మేధస్సంటారు. ఈనాడు దీనిలోపం కనుక్కోబడింది. ఇప్పుడు వైదాంతిక జగత్తు మానవుణ్ణి పరిపాలిస్తున్న ప్రకృతియొక్క స్థానం హృదయమని గ్రహించింది. మానవుణ్ణి పరిపాలిస్తున్న ప్రకృతి యొక్క సింహపీఠం హృదయం. అవ్యక్త మధురధ్వని - సహజభావ- యీ హృదయాంతరంలో నుంచే వస్తుంది. ఒక స్త్రీ యీ విధంగా అంటుండగా నేను విన్నాను. "మీరు నాకు చర్చిల్లో బోధించి నన్ను కరగించలేరు. చర్చిల్లో గానామృతం చేత మీరు నన్ను కరగించ గలరు." చర్చిల్లో బోధలకంటే, గానం అద్భుతమైంది. ఎందుచేత ? మీరు దుఃఖంగా ఉన్నారనుకోండి. ఒకరెవరో 'పియానో' మీద గానతరంగాలను మధురంగా ప్రవహింపచేస్తే, అప్పుడు మీ మనస్సు శాంతిపడుతుంది. నాకు ప్రాచ్యఅరోరాలో ఒక స్నేహితు డున్నాడు. అతడు పనివాండ్లకు విసుగుపుట్టినప్పుడు పని ఆపెయ్యమనిచెప్పి, పియానోమీద పాడించేవాడు. అప్పుడు మళ్ళీ అంతా చక్కబడేది. సంగీతం మహామధురమైంది. ఫ్రాంకో, పర్షియన్ యుద్ధంలో సంగీతం వినడంచేత కొంతమంది ఫ్రెంచివారికి యింటిమీద గాలిమళ్ళింది. శెలవు పెట్టారు. యుద్ధం చెయ్యలేకపోయారు. యుద్ధరంగంలో ప్రజలను సంగీతం మహా ఉద్రిక్తులను చేస్తుంది. మీరు 'అపాలో' సంగీతంవల్ల 'రాయి' అనేపట్టణ స్థాపననుగురించి వినే వున్నారు. సంగీతమువల్లనే ఆ పట్టణం వచ్చింది. ఒకద్వీపం ఉండేది. ఆద్వీపంలో కొంతమంది మోహినులుండేవాండ్లు. వాండ్లు క్రూరులు. సంగీతంపాడి, బాటసారులను ఆకర్షిస్తారు. ద్వీపంలోకి రప్పించి మూడురోజులు వారితో ఆనందించి, చంపి తినేవాండ్లు. సంగీతం అంత మహత్తర మైంది.

ప్రపంచంయొక్క ఆకర్షణలను గురించి యిది చెబుతూ వున్నది. ఆకర్షణలు ఎంత క్రూరమైనవి. మూడు రోజులు సుఖమిచ్చినట్లే యిచ్చి చంపుకొనితింటాయి. అయినా ఆకర్షణలోకే పోతారు జనులు. 'ఆర్ఫియస్, అనే అతను పాడినప్పుడు అతని గానామృతాన్ని వింటానికి సెలయేళ్ళు నిశ్చలమై ప్రవహించకుండా ఆగిపోయేవి. జంతువులు చెవులు నిక్కపొడుచుకొనేవి. ఒకవైపు సింహాము వినేది.

ఒకవైపు గోవు వినేది. ఒకవైపు మేక వినేది. ఒకవైపు తోడేలు వినేది. కానీ సర్వజంతువులూ ఆ గానమాధుర్యంలో ఒళ్ళు మరచి పోయేవి. 'సెయింటు శెశీలా' ఒక దేవతను సంగీతంవల్ల భూతలానికి తెచ్చింది. అలగ్జాండరును దివ్యస్థితిలోకి తీసికోపోయిన ఒక గానాన్ని గురించి 'అలెగ్జాండర్సు ఫీస్టు' అనే గ్రంథంలో మీరు వినేఉంటారు.

"అతడు మర్త్యుని స్వర్గంలోకి తీసుకవెళ్ళాడు. ఆమె (సెయింట్ శెశీల) దేవతను మర్త్యలోకంలోకి దించింది".

అందుచేత ఈగాయకుడు సెయింటు శెశీలాకంటే ఘనుడని పేర్కొనబడ్డాడు. సంగీతం భాషకతీతమైన ఒక అవ్యక్త మధురధ్వని. ఎంత మధురమైంది సంగీతం! విజ్ఞానశాస్త్రం ఒక్కొక్క ధ్వనికి ఒక్కొక ప్రభావం ఉంటుందని ఋజువు చేస్తుంది. చేయలేకపోయినా, ఇది సత్యమే. మీ అనుభవంచేత దీన్ని గ్రహించగలరు.

ఓంకారం యీఅవ్యక్తమధురధ్వని. ఈ అవ్యక్తమధురధ్వనివల్ల, సర్వవిశ్వాత్మతో అనుసంధానం కలుగుతుంది. ఇప్పుడు దీన్ని ఋజువు చేయలేకపోయినా, ఇంకా కొంచెము అభివృద్ధిపొందితే విజ్ఞానశాస్త్రం కూడా యీ ప్రభావాన్ని ఋజువు చేయగలుగుతుంది. అనేక యుగ యుగాల మహానుభావులను స్వానుభూతులను నిర్మథించి మీ ముందీ వైదికతత్త్వ భాగ్యరాశిని పెట్టాను. ఈ మార్గం వల్లనే హిందువులు దివ్యదార్శనికులైనారు. ఆత్మజ్యోతిని కన్నారు!

నదివోలె ప్రవహించు నాలోన శాంతి
శాంతి నాలో సముద్రంబుగా పొరలు.
నా జటామండలభాగ మందుండి
నా పాదపంకజయుగ్మ మందుండి
శాంతి గంగాధునిగా బ్రవహించు.
కల్యాణమధుపర్కములు నాకు తెండు;
ఉదయ సూర్యోద్దీప్త కాంచనకిరణ
ధవళాంబరంబు లోహూ తెండి వేగ;
తొలగిపోయిన దోహూ! తెర ఒక్కసారి.

పరిశుద్ధ మౌక్తిక మాలికలట్లు
ఆనందబాష్ప ప్రవాహంబులార !
ప్రవహించుడీ ప్రవహించుడీ స్వేచ్ఛ !
ప్రవహించుడీ బాష్ప మాలికలార !
ఎంత దివ్యత్ప్రభ ! అద్భుతకాంతి !
దేహ మనోరంధ్ర రంధ్రంబులందు
ఓ జీవితామృతమా ! చిత్ర మధువ !
నిండిపో నిండిపో పారలి పొంగుచును.
ఓ చేపలార ! ఓహో చుక్కలార !
రారండి మీ రెల్ల రా నెంచువారు !
పశుపక్షులార ! ప్రాకృతశక్తులార !
రారండి, త్రాగండి నా శోణితంబు.
నా మాంస మిదె రండి భక్షించి పొందు !
వచ్చి ఓహో పెండ్లి విందును గొనుడు !
నే తాండవించెద నే తాండవింతు
చుక్కలలో సూర్యసాగరంబులను
చంద్రులలో, మేఘవాయుపుంజముల.
పరమ స్వేచ్ఛానందముగ తాండవింతు;
సంకల్ప, భావ, మనంబులం దేను
తాండవించెదను నే తాండవించెదను.
నే గానమధువుల ప్రవహింపచేతు
నే గాన మొనరింతు; నే సమశ్రుతిని.
నే నపారం బయి విలసిల్లుచున్న
ఏకత్వ మను మహాగాధవార్నిధిని.
గ్రహియించు జ్ఞాతయు, గ్రహియింపబడెడు
జ్ఞేయంబు, తరగల చందంబుగాను
నాయందు రెండుగా నుద్భవం బొందు.
నాలోన జగ మొక్క జలబుద్బుదంబు !

ఓమ్! ఓమ్! ఓమ్

# భారతదేశానికి ప్రపంచం ఉన్న ఆధ్యాత్మిక ఋణము

( 1904, జులై 29 తేదీ యిచ్చిన ఉపన్యాసం )

ఈ ఉదయం విద్యార్థుల్తో ప్రసంగిస్తూ రాముడు యిలా అన్నాడు. "నేను పుట్టినట్లే నాకు స్మృతి యుండదు. నిజంగా నేను పుట్టలేను. ప్రపంచములో యేశక్తిగూడా నేను మరణిస్తానని నన్ను ఒప్పించలేదు." ఇండియాలో ఒక మహాసభలో ఉపన్యసిస్తూ రాజకీయ దృక్పథంతో మాట్లాడాను. ప్రేక్షకుల్లో జడ్జీలు, లాయర్లూ, యింకా పెద్దపెద్దగవర్న మెంటు ఉద్యోగులూ ఉన్నారు. ఉపన్యాసానంతరము వారందరూ వచ్చి అభ్యంతరంగా యిలా అన్నారు. స్వామీ, యిక ముందు యీలాంటి ఉపన్యాసా లివ్వకండి. మీరు జైల్లో పడటమో, ఉరి స్తంభానికి పోవడమో జరిగే అవకాశం ఉంది". రాముడు చెప్పిన జవాబు యిది. దివ్యులారా! నేను ఎవ్వడూ జూడస్ యిస్కారియట్ పాత్రను ధరించి సత్యక్రీస్తును ముప్ఫై నాణ్యాలకు అమ్మలేను. నా ఆత్మచ్ఛేదముచేయగలంత పదునుగలశక్తి ఈలోకంలో ఉందని నన్నెవరూ నమ్మించలేరు. అనంతస్వరూపుణ్ణి, జననమరణ రహితుణ్ణి అయిన నన్ను గాయపరచగల ఆయుధం లేదు. భూతభవిష్యత్తుల్లో మార్పుల్లేని నేను ఎందుకు రాజీపడాలి మీతో ?"

నా సంభాషణలు మీరు తరచుగా వినడానికి అలవాటుపడి ఉండకపోవడంవల్ల, క్రొత్తగా ఉండవచ్చు. అయినా సత్యపథాన్ని వివరించడం నావిధి.

ఈ దేశంలో హిందూదేశాన్ని గురించి అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి. నిన్నటిరోజున 'మినియ పోలిస్'లో ఉపన్యాసమిచ్చిన తర్వాత, ఒక స్త్రీ వచ్చి రామునితో యిలా అంది : "స్వామీ, గంగానదిలోని మొసళ్ళకు (హిందూ దేశములో) స్త్రీలు యింకా తమ పసిపాపల్ని పారవేయడం లేదా ?" నేను ఆమెతో చెప్పాను. "దివ్యురాలా ! నేనుకూడా గంగానదిలో పారవేయబడ్డాను. కాని మీ కథల్లోని జోనాలాగా యీది వచ్చాను". నిజానికి నేను గంగోత్పత్తి స్థానంనుంచీ మైదాన ప్రదేశం చేరిందాకా

ప్రయాణం చేశాను. మీలో నాతో ప్రయాణం చేసిన అనుభవం కలవారికి ఈ శరీరం రోజుకు 40 మైళ్ళు నడుస్తుందని తెలిసిఉంటుంది. ఒక చివరినుంచీ యింకో చివరిదాకా గంగాతీరం వెంబడే నడుస్తుంటే, ఆ దివ్యనది, నిర్మలంగానూ, స్వచ్ఛంగానూ, వేగవంతంగానూ కన పడుతుంది. మొసళ్ళు దానిలో జీవించలేవు. మొసళ్ళు చిన్న బురద ప్రదేశాల్లో నివసిస్తాయి. కానీ ఆ నదిలో అవిలేవు. కథాకల్పనా చతురుల మధుర హృదయాలను దీవించండి ! ఇలా వుంటవి – యీ దేశంలో హిందూ దేశాన్ని గురించి ప్రచారంలో వున్న కథలు !!!

ఒకరోజున వాషింగ్‌టన్ నుంచి ఒక హిందూ విద్యార్థి ఒక క్రొత్త విషయాన్ని గురించి ఉత్తరం వ్రాశాడు. ఒకనాడు రాత్రి, అతడు బస్సుమీద ఒక ఆధ్యాత్మిక సంఘం నుండి యింటికి వెళు తున్నాడట. ఒక పిల్లకూడా ఆ కారులోనే యెక్కింది, ఇద్దరూ కలసి వెళ్ళుతూ, ఆపిల్ల దిగిపోగానే అతడు కూడా దిగాడు. అతని యిల్లు కూడా ఆ సమీపంలోనే. ఒక గంట తర్వాత పోలీసువచ్చి ఆ విద్యార్థిని అరెస్టుచేసి ఆరు గంటలసేపు జైల్లో ఉంచాడు. ఉదయం అతణ్ణి విచారించారు. ఆపిల్ల చేసిన నేరారోపణ "అతడు నన్ను తన తీక్ష్ణమైన నల్లని ఆధ్యాత్మికాకర్షణ దృష్టులతో చూచాడు. నాకు మత్తు చల్లినట్లయింది. భయపడ్డాను" అని. భగవంతుడా ! అమెరికా వచ్చేముందు హిందువులు తమ కళ్ళని యెక్కడ దాచిపెట్టుకోని రావాలి ? ఈ దేశంలో కొన్నిచోట్ల హిందువుల్ని గురించి యిలాంటి భావాలు ప్రచారంలో వున్నాయి.

ఇంక మంచిని గురించి చూద్దాం ! సనాతన హిందూదేశవు అనంతమైన సంపదను గురించి ఒకదానివెంట ఒకటి సత్యాలను ప్రతి పాదిస్తాను. హిందూదేశంలో బంగారపు యిండ్లూ, వెండిబజార్లూ ఉన్నాయనీ, యూరోపులో అనుకొనే వాళ్ళు. అందుకని వాళ్ళకు ఆశబలిసి, హిందూదేశ సంపదను వేటాడాలని బుద్ధిపుట్టింది. యూర పులో మూలమూలల్నించీ హిందూదేశాన్ని జయించడానికి దండెత్తి వచ్చారు. కొందరు పశ్చిమోత్తర మార్గంద్వారా వచ్చారు. మీ కొలంబసు మొదట్లో ఇండియాకు క్రొత్తమార్గం అన్వేషించడంతోనే

బైలుదేరి అమెరికా చేరుకొన్నాడు దైవవశాత్తు. అంటే ఒక రోజున ఇండియా భౌతిక సంపదతో ప్రపంచాన్ని భ్రాంతి పెట్టింది. పారశీక గ్రీకురచయితలు హిందూదేశ దేవాలయాలను గురించి వ్రాసిన వ్రాతలు మీకు సూచించవలసి ఉంది. ఒక దేవాలయములో పదివేల భృత్యు లున్నారు. దాని కప్పు లోపలి భాగము రత్నాలతో, మణులతో చెక్కబడింది. హిందూదేశ భౌతిక సంపదను గురించిన యీ విషయాల వాస్తవత్వం ఋజువు కావడానికి మీకు చారిత్రాత్మకమైన ఆధారాలు కావలసి ఉంటే వారన్ హేస్టింగ్సు, లార్డుక్లైవులను గురించిన యెడ్మండ్ బర్కు ఉపన్యాసాలను చూడండి.

ఇండియా వైజ్ఞానిక సంపదను గురించి చాలా చెప్పవలసిఉంది. ఇండియాలో మహా ఆశ్చర్యకరమైన జ్ఞాపక శక్తిని ప్రదర్శించిన మనిషిని నేను చూచాను. దాదాపు యాభై, అరవైమంది అతని చుట్టూ అర్ధచంద్రాకారములో కూర్చున్నారు. అక్కడనున్న ప్రతివాని దగ్గరా అతని యిష్టమైన గ్రంథమునుంచి తీసికొన్న భాగాలు ఉన్నాయి. అందులో కొందరు యింగ్లీషు, అరబ్బీ, హిందూస్థానీ మొదలైన గ్రంథాల్లోనుంచీ భాగాలను ఏరుకొన్నారు. అయితే యీ మనిషి అంధుడు. ప్రతివాడూ తను ఎన్నుకొన్న భాగరచనా భాగములోని పంక్తుల సంఖ్యను చెప్పారు. తరువాత వరుసగా ప్రతి పృచ్ఛకుడూ ఒకొక్క పంక్తిని చదివారు. మొదట పృచ్ఛకుడు యిరవై పంక్తులు కలిగిన తన రచనాభాగము నుంచి మొదటిపంక్తి చదివా డనుకొందాము. ఇంకొకడు తన పదమూడు పంక్తుల్లోనుంచీ, ఒకపంక్తి చదివాడు. ఇలాగే వరుసగా అందరునూ. మళ్ళీ రెండవమారు అందరూ ఒక్కొక్క పంక్తి చదివారు. ఈ విధముగా క్రమము లేకుండా మిశ్రమముగా పంక్తులన్నీ యీ అంధప్రవక్తకు చదివి వినిపించబడ్డాయి. పదమూడవసారి, 13 పంక్తుల రచనాభాగము గల మనిషి దగ్గరికి వచ్చేటప్పటికి అతడు "ఓ ఫలానిమనిషీ! నీ పంక్తులు అయిపోయినవి" అని తన మనస్సులోని ఆ పంక్తులనన్నీ ఒక క్రమములో సమర్చుకొని ఒక్కతప్పుకూడా లేకుండా ఆ రచనాభాగము యావత్తు

అతడు వర్ణించాడు. అలాగే మిగతా పృచ్ఛకుల భాగాన్నికూడా ఆ యా సమయాల్లో పఠించాడు.

కొన్ని మన తత్త్వపరిశోధనలను గురించి చెప్పుతాను. ఒక స్వాములవారు హిందూదేశాన్ని దర్శించాడు. ఆయన అయిదు నిముషాలపాటు దేహవిస్మృతిని పొందగలడు. అయితే హిమాలయాల్లో ఆరు నెలలు మరణముతో సమానమైన అవస్థను పొందగల స్వాములను చాలామందిని చూచాను. ఆరు నెలలతర్వాత పునర్జీవం పొందిన ఒక ఉదాహరణ ఉంది. ఒక స్వాములవారిని పెట్టెలోపెట్టి భూమిలో పూడ్చిపెట్టారు. ఆరు నెలలతర్వాత త్రవ్విబైటికితీసి, ఆయన యిదివరకే చెప్పిన కొన్నిపద్ధతులను వా రవలంబించడముచేత, ఆయన బ్రతికాడు. దివ్యులారా, యీవిషయాన్ని కొంచెము ఆలోచించండి! మూడురోజులు మిథ్యామరణావస్థనుపొంది ఒకమనిషి జీవించాడు. యూరపు దేశమంతా అతనివ్యక్తిత్వగౌరవానికి దాసోహమన్నది. అలాంటప్పుడు ఇండియాలో ఆరు నెలల తర్వాత పునర్జీవిస్తారు. అయితే మేము దీనికి ఎంత విలువ యివ్వాలో అంతే యిస్తాము. ఇది అధ్యాత్మికత కాదు. ఒక వైజ్ఞానికశాస్త్ర సంబంధమైన, ఒక శారీరకమైన మానసికమైన ప్రక్రియ. నేటికాలపు డాక్టర్లకు అది తెలియకపోతే, వాళ్ళు శాస్త్రజ్ఞానంలో ఇంకా నేర్చుకోవలసింది ఉందన్నమాట. ఈలౌకిక విషయాలకు మేము తగుమాత్రంగానే విలువ నిస్తాం.

అనుకూలపక్షానికి వచ్చేముందు వ్యతిరేకపక్షాన్ని గూర్చి రెండు ముక్కలు చెప్పాల్సిఉంది. ఒకరోజున ఒక పెద్ద మనిషివచ్చి యిలా అన్నాడు, "స్వామీ మీ వేదాంతంతో – మీమతంతో – మమ్మి విసిగించకండి! అదిచాలా పాతదికాదా?" సత్యానికి పాతక్రొత్తలు ఉంటాయనే దృష్టితో, సత్యం చంచలమనీ, మారుతుంటుందనీ అనుకొన్నాడేమో! నేనుచెప్పాను : "సోదరా! మీయొక్క అభివృద్ధికి అమెరికా యూరపుదేశాల పురోగమనానికి – కారణం యేమిటో తెలుసుకొన్నావా?" "మీ మతం పాతపడిందని"–అతడు అనడంచేత నే నీ సమాధానం యివ్వవలసి వచ్చింది. మా మతం జీవిస్తూనేఉంది. ఇంకా ముందు అలాగే ఉంటుంది. నిత్యనూతనమైంది మామతం.

అనుకూలపక్షంలో నొక్కి చెప్తుంది. మీాది వ్యతిరేకంగా శాసిస్తుంది: "ఇది నీవు చేయ్యకూడదు" అంటుంది. నేను యింకా యిలా అన్నాను. "ఓ దివ్యుడా! అమెరికా అభివృద్ధి కారణం విచారిద్దాం. ఆమెరికా మతం ఏమిటోగూడా చూద్దాం". అతని మతం మెడకుచుట్టిన తాయెత్తు లాగా అరిగిపోయిందని చెప్పాను. ఒక బాలుడు మెళ్ళో తాయెత్తును ధరించి తన విజయాలకు కారణంగా తాయెత్తుయొక్క మాహాత్మ్యం అనుకొంటాడు. అయితే తన అపజయాలకు మాత్రం తన కృషి లోపమే కారణంగా ఎంచుతాడు. దివ్యులారా! మీా అభివృద్ధికీ, గర్వకారణమైనమీా నాగరికతకూ, నిజమైన కారణం యింకొకటివుంది. దానికారణం క్రైస్తవమతం కాదు; చర్చిమతమాహాత్మ్యం కాదు. చారిత్రకంగా ఆలోచిద్దాం. మనం చరిత్రచదువుకొని, యీా క్రైస్తవ మతము లేక చర్చి మతము యూారపులో ప్రవేశించకముందుకూడా, యీా నాటి యూారపు అమెరికాలకు సమానంగానో, లేక అంతకంటే అధికంగానో, నాగరికత అభివృద్ధిపొందిన జాతులు, దేశాలు, ఉన్నాయని తెలుసుకొంటాము. ఈజిప్టు, చైనా దేశాలు, తమ తమ ప్రత్యేక నాగరికతలను కల్గిఉన్నాయి. కొన్ని విషయాల్లో యూారపు కళ పురాతన యీాజిప్టు, చైనాలతో తులతూగలేదు. పర్షియా, గ్రీసు, రోందేశాలు తమ ప్రత్యేక నాగరికతలను కల్గి ఉాన్నాయి. ఇండియా సంగతి అలా ఉంచండి. ఈ దేశాలన్నిటికీ, యీాజాతులన్నిటికీ, నాగరికత ఉంది. అయితే యివన్నీ క్రైస్తవ మత దేశాలుకావే! నాగరికతా భౌతికాభ్యుదయాలు ఎల్లప్పుడూ క్రైస్తవమత సహచరులే అయితే, ఆ మతం జన్మించకపూర్వమే ఉన్న యీా దేశాలకు నాగరికతాభ్యున్నతులు ఎలాకల్గినవో వివరించవలసిం దని కోరుతున్నాను. అంతదూరమెందుకు? ఒక కాలం ప్రపంచంలో అధికోన్నతి పొందిన గొప్పదేశం రోంను చూస్తున్నాముగదా! రోం పతనమయితే, రో మను సామ్రాజ్యపతనానికి దారితీసిందేమిటి? రోం పతనానికి మార్గదర్శి—క్రైస్తవమత ప్రవేశమే. ఈ విషయంలో, గిబ్బన్ మహాశయుని రచనలు చదవండి. లేదా యింకా యేదైనా విశ్వసనీయమైన చరిత్ర గ్రంథాన్నైనా చూడండి. క్రైస్తవమతం రాక ముందు, గ్రీసు దేశం అభ్యున్నతితో, సౌఖ్యంతో నిండివుంది. క్రైస్తవ

మత పరివ్యాప్తమైన నేటి గ్రీసు దేశం పౌరాణికయుగంలోని అక్రైస్తవ మైన గ్రీసుతో పోలిస్తే యేమాత్రం నిలుస్తుంది? మేము, "రాండి! చరిత్ర చదువుకోండి" అంటున్నాము. అమెరికా దేశ వర్తమాన భాగ్యోదయాన్ని క్రైస్తవమతానికి–చర్చిమతానికి – అంటగట్టడానికి యెవ్వరికీ కించిత్తు అధికారంకూడా లేదు. యూరపులో క్రైస్తవమత ప్రవేశానంతరం వేయిసంవత్సరాలకంటే యెక్కువకాలం, యూరపు దేశమంతా 'అంధకారయుగం' అని పిలువబడి అంధకారచ్ఛాయల్లో వుంది. ప్రపంచంలో యెన్నడెరుగని అంధకారం, వర్ణనాతీతమైన మూఢ విశ్వాసాలు అజ్ఞానమూ గడ్డకట్టిన యుగమది!! యూరపులో క్రైస్తవ మతప్రవేశంవల్ల కల్గిన ఫలిత మిదే !!!

కొందరు అంటారు "యిటుచూడండి. క్రైస్తవమతం యేం చెయ్యలేదు? క్రైస్తవమతమే ప్రపంచనాగరకతాభివృద్ధికి ప్రథమ కారణ"మని! దుర్విమర్శలూ, మంత్రవేత్తలనే నెపంతో మానవుల్ని నిలువున కాల్చడం, శాస్త్రీయజ్ఞానుల్ని హింసించి వేధించడం, – యిలాంటి నాగరకతను అభివృద్ధిచేసింది క్రైస్తవమతం! ఎక్కడ శాస్త్రజ్ఞానం అభివృద్ధిని పొందదలచిందో, అక్కడికి క్రైస్తవమతం తత్క్షణం దాన్ని చంపడానికీ నశింపజేయడానికి వచ్చింది! బ్రూనో తన శాస్త్రీయమైన సత్యదృక్పథమే కారణంగా కాల్చి చంపబడ్డాడు! బెక్ జాన్సన్, కార్లైలు వీళ్ళను క్రైస్తవమతం ఎట్లా ఆదరించిందో మీకు తెలిసే వుంటుంది. (ఈ పరిస్థితుల్లో) అమెరికా దేశ సౌభాగ్యానికి ఏది దోహద మిచ్చిందో ఆలోచించిచూద్దాము.

దివ్యులారా! చర్చిలలోని బోధనావేదికలనుండి వెలువడ్డ, ఉప దేశించబడ్డ నరకాగ్ని కాదు మిమ్మల్ని ఉద్ధరించింది. ఆవిరియంత్రంనుండి వచ్చే అగ్ని, విద్యుచ్ఛక్తి, ముద్రణ యంత్రాలు, రైలుస్టేషన్లూ, పొగమోడలూ–యివీ మీ భౌతికోన్నతికి దోహదకారులు. డాక్టరు జాన్సన్ ఇలా అన్నాడు. "ఒక కుర్రవాడు ఒక కిటికీనుంచి చూచి యింకో కిటికీనుంచి చూచానని చెపితే కొరడాతో ఒక వ్రేటువేయండి" అందుకనే ఒక కారణంవల్ల జరిగిందాన్ని వేరొకకారణానికి అంటకట్టితే మీరు దేనికి అర్హులవుతారు? మీ భౌతికోన్నతికి నిజమైన కారణాలు–

నేను పేర్కొన్న శాస్త్రీయ కల్పనాశక్తులూ, కనిపెట్టబడిన క్రొత్త విషయాలూ. ఈ కనిపెట్టబడిన, కల్పించబడిన వాటిలో యేదీగూడా మతాధ్యాపకులను చర్చి పూజారులచేత జరిగియుండలేదు. జేమ్సు వాట్, జార్జిస్టీవన్ సన్, బెంజిమన్, ఫ్రాంక్లిన్, థామస్ యెడిసన్, వీరిలో ఎవరుకూడా మత ప్రధానులు కారు. ఈ మహాశయుల్లో యే యొక్కరైనా మతబోధకులైనట్లయితే మీ భౌతికాభ్యున్నతికి క్రైస్తవ మతమే కారణమని అప్పుడు చెప్పవచ్చు. అయితే చర్చి ప్రధానిచేత కనిపెట్టబడింది–ఒక తుపాకుమందు మాత్రమే! మతబోధకుల దివ్యహస్తాలనుండి దివ్యమేధస్సునుండి వచ్చిన ఒకే ఒక క్రొత్త విషయం– తుపాకిమందు మాత్రమే!!

మీ భౌతికాభ్యుదయానికి కారణం చర్చిమతంకాదు, క్రైస్తవ మూఢత్వం కాదు. యూరపు, అమెరికాల భౌతికోన్నతికి వాటి మతం యెలా కారణంకాదో, అలాగే హిందూదేశ భౌతికపతనానికి కారణం హిందూమతం కాదు. మీ అభ్యున్నతికి నిజమైన కారణం – లేక యే దేశాభ్యున్నతి కైనాసరే నిజమైన కారణం – సత్యమైన ఆధ్యాత్మికత. అయితే బాహ్యరూపాలు, మూఢవిశ్వాసాలూ, మతభేదాలు, వివిధ వేషాలూ మొదలైన వాటినుండి భిన్నంగా సత్యమైన ఆధ్యాత్మికతను నేను చూస్తాను. అందువల్ల అమెరికాసౌభాగ్యానికి కారణం–నిజమైన హృదయపూర్వకమైన ఆధ్యాత్మికత. చర్చిలలోని బోధనావేదికనుండి వచ్చే ప్రబోధాలూ, ఆచారాలూ ఉన్నప్పటికీ, వేరొకమార్గంలో యీ సత్యమైన ఆధ్యాత్మికత ప్రచారం చేయబడింది. "నీవు చెయ్యి, నీవు చెయ్యవద్దు" – యిలాంటి శాసనాలన్నీ మీ ఆధ్యాత్మికాభివృద్ధిని నిరోధించినవే కాని అభివృద్ధి పరచలేదు. కాంట్ వాటిని వర్గసంబంధమైన ఆజ్ఞలు అన్నాడు. అంటే మధ్యమపురుష ఆజ్ఞార్థకాలు. అటువంటివాక్యాలన్నీ మీ స్వాతంత్ర్యాన్ని అరికట్టుతాయి. స్వేచ్ఛను నశింపజేస్తాయి.

అయితే సత్యమైన ఆధ్యాత్మికత యెక్కణ్ణించి పుడుతుంది? ప్రపంచచరిత్రలో ఇది యెక్కణ్ణించి ఉద్భవించింది? ఇదే నేను మీకు చెప్పవలసిన ముఖ్య విషయం. సత్యఆధ్యాత్మికతనే మేము వేదాంతం

అంటాం. ప్రపంచంలోని అన్ని మతాలూ ఒక వ్యక్తిత్వాన్ని ఆశ్రయించుకొని ఉన్నాయి. క్రైస్తవమతం క్రీస్తునూ, కన్ఫ్యూషనిజం కన్ఫ్యూషియస్‌నూ, బౌద్ధమతం బుద్ధుణ్ణీ, జొరాష్ట్రమతం జొరాష్ట్రర్‌నూ, మహమ్మదీయమతం మహమ్మదునూ ఆశ్రయించుకొని ఉంటవి. వేదాంతము అంటే శాస్త్రాంతం-ఆత్మశాస్త్రం-అన్నమాట. రసాయనశాస్త్రాన్ని యే దృష్టితో చదువుతావో, అదే దృష్టితో వేదాంతాన్ని చదవాలి. లావసీర్ బాయిల్, రెనాల్డ్సుడేలీ మొదలైన రసాయన శాస్త్రజ్ఞుల మీాది ప్రామాణిక దృష్టితో మీారు రసాయన శాస్త్రాన్ని చదువరు. దాన్ని తీసికొని మీారు స్వయం పరిశీలనతో వివరించుకోను ప్రయత్నిస్తారు. నీళ్ళలో ఉదజని ప్రాణవాయువులు వున్నవని నా అనుభవాల అధికారంతోనే, నమ్ముతానుకాని, నేను ఇతరుల అభిప్రాయంమీాద ఆధారపడను. నీళ్ళ విద్యున్మయీకరణమే నాకా విషయాన్ని తెల్పుతుంది. అలాగే, ఒకరి అధికారంమీాద ఆధారపడిన మతం మతముకాదు. నీ అధికారంమీాద నీ స్వానుభవం మీాద ఆధారపడినదే సత్యము. ఈ దృష్టితో నేను మీాకు ఒక రసాయనిక విషయాన్ని చదవను, అర్థంచేసికోను, జీర్ణించుకోను, ఆత్మగతం జేసికోను గ్రంథాలమీాద గ్రంథాలు సూచించవచ్చును. ఇదే దృష్టితోటే వేదాంతాన్ని విచారించవలసిందని నేను మిమ్మల్ని కోరుతున్నాను. వేదాంతాన్ని గ్రుడ్డిగా నమ్మమసి నా ఉద్దేశ్యం కాదు. ఎవర్నీ అన్యమతమార్గాలకు పట్టించటం నా ఉద్దేశ్యంకాదు. వేదాంత శబ్దార్థం స్పష్టీకరింపబడింది. అయితే ఈ వేదాంతము, ఈ సత్యమైన ఆధ్యాత్మికత, ప్రపంచములో అత్యున్నతపర్వతాల నుండి హిమాలయాలనుండి - ప్రవహిస్తున్నదని నేనంటున్నాను. మనోహరమైన ప్రవాహాలు, మనోజ్ఞమైన నదులు, మాన్సూను వాయువులు ఉన్నత ప్రదేశాలనుంచి ప్రవహించినట్లే హృదయపూర్వకమైన సత్యమైన ఆధ్యాత్మికత హిందూదేశంనుండి ప్రవహిస్తుంది. మీా యూరపు దేశములోని ప్రాచ్యవాదులు ఈ విషయముమీాది గ్రంథాలు క్రీ. పూ. నాలుగువేల సంవత్సరాల క్రితము వ్రాయబడినవని అంటారు. ఈలాంటి వారందరూ యీా గ్రంథాల జన్మకాలాన్ని నిర్ణయించే తమప్రయత్నాల్లో ప్రపంచము క్రీస్తుపూ. 4 వేల సంవత్సరాల క్రితము సృష్టించ

బడిందనే మూఢ విశ్వాసాన్ని కల్గి పనిచేస్తున్నారు. అయితే వేద విద్యార్థిగా వీరు తేల్చిన సంగతులు తప్పు లని వేదప్రమాణాలను చూపి ఋజువు చెయ్యగలను. ఒక విశ్వవిద్యాలయములో గణిత శాస్త్రాధ్యాపకుణ్ణిగా నేను ఉండేవాణ్ణి. డైనమిక్సు, జలశాస్త్రమూ ఖగోళశాస్త్రమూ, త్రికోణశాస్త్రమూ, మొదలైన విషయాలమీద ఉపన్యసిస్తుండేవాణ్ణి. ఆ రోజుల్లోనే వేదాధ్యయనం చేస్తుంటే వాటిల్లో తరచుగా ఖగోళములో తారల తారాగణాల స్థలనిర్దేశాన్ని గురించి సంబంధాలు కన్పడుతుండేవి. మృగశిరా మొదలైన తారాగణాల స్థలనిర్దేశము వేదాల్లో చెయ్యబడింది. గణితమువేసి శాస్త్రీయంగా వేదప్రమాణాలతో, వేదాలు – కనీసము కొన్ని వేదాలైనా—క్రీ.పూ. 8 వేల సం॥ క్రితము రచింపబడినవని చెప్పగలను. చరిత్రకారులు పరామర్శించే శాసనపు ముక్కలు నమ్ముదామా? లేక గణిత సూత్రాలు తారాక్షరాలుద్వారా భగవంతు డిచ్చిన సత్యమైన సాక్ష్యాన్ని నమ్ముదామా? ఇది చాలా విశాలమైన విషయం. అయినప్పటికీ నేను యీ కొద్ది కాలములోనే వేదాల్లోని ముఖ్యమైన విషయాలను మీకు నివేదించగలను.

పురాతన గ్రీకు చరిత్రకారులు హిందూదేశాన్ని గురించివ్రాసిన వ్రాతల్ని మీలో యెవరైనా చదివారా? క్రీ. పూ. 4 వేల సంవత్సరాల క్రితము గ్రీకులు యిండియాను దర్శించారు. ఈ విషయాన్ని చరిత్రే చెపుతుంది. గ్రీకులు తమ పర్యటనాన్ని గురించి వ్రాశారు. వాటిలో కొన్నింటిని నేను చదివాను కూడా. వారి వ్రాతల్లోని భారతీయులు ఆదర్శజీవు లని పిలువబడినవారనే విషయాన్ని మీరు చూడగలరు. హిందువు లెప్పుడుకూడా అసత్యము పలికేవాళ్లుకాదని గ్రీకు రచయితలు వ్రాశారు. స్త్రీలు పురుషులతోపాటు సంపూర్ణ స్వాతంత్ర్యము ననుభవించేవాళ్ళు. పురుషులతో సమానులుగా స్త్రీలు జీవించేవాళ్ళు. పర్వతారణ్య ప్రాంతల్లో అద్భుత విశ్వవిద్యాలయాలు దేశమునిండా ఉండేవని వాళ్ళు వ్రాశారు. ఇండియా భౌతికసంపదను గురించి యెక్కువగా వర్ణించి, అవిశ్వాసత, అపవిత్రత, ఆ దేశములో లేనేలేవని గ్రీకులు వ్రాశారు. ప్రజల తాత్త్వికదర్శన శ్రీని, వారు

వర్ణించి మహానందాన్ని పొందారు. పురాతన భారతీయ ఉద్గ్రంథాల్లో స్త్రీలచే వ్రాయబడినవి ఈ నాటికి కొన్ని కనబడుతున్నై. ఇండియాలో జరిగిన సర్వమత పరిషత్తుల్లో ఒకదానిలో ప్రపంచ తాత్త్వికులలో గొప్పవాడైన ఒక వేదాంతి ఉపన్యసించిన సమయంలో–ఆ పరిషత్తుకు ఒక స్త్రీ అధ్యక్షత వహించింది. మనోహరమైన, మహదాశ్చర్యకర మైన గొప్పగొప్ప వేదస్తోత్రాలలో కొన్ని స్త్రీల దివ్యమైన మధుర హృదయాలనుండి ప్రవహించాయి. "ఆదిలో సత్యం స్త్రీలచేతనే రక్షింపబడింది" అన్నప్పుడు నేను'వాల్టు విట్' మన్‌తో యేకీభవిస్తాను.

ఏది భారతదేశంలో అన్ని సంస్థల పతనమునూ కలిగించింది! ఏది భారత దేశంలో విగ్రహారాధనను ప్రవేశపెట్టింది? * విగ్రహారాధన హిందూదేశీయమైంది కాదు. ఈ రోజున క్రైస్తవులు, భారత ప్రజలంతా విగ్రహారాధకులని మీతో చెపుతారు. కానీ అగణితమైన వేదరచనల్లోగానీ, భారతీయ కావ్య వ్యాకరణ గణిత శిల్ప సంగీత శాస్త్రాల్లోగానీ – దేనిలోకూడా – విగ్రహారాధన విషయమే కన పడదు. అయితే ఎక్కడనుంచి విగ్రహారాధన హిందూదేశంలోకి దిగుమతి అయింది? హిందూమతంలో విగ్రహారాధన ఒక భాగం కానేకాదు. హిందూదేశంలోని విగ్రహారాధన క్రైస్తవుల ద్వారానే

---

* విగ్రహారాధన ఎప్పుడు ఎక్కడనుంచి, ఏవిధంగా ఉదయించేదో - ఈ విషయం అస్పష్టమైన చరిత్ర గర్భితవిషయం. స్వామిజీ అభిప్రాయం విగ్రహారాధన దేశీయమైందికాదని. స్వామి ఇక్కడ చెపుతున్నది విగ్రహారాధన నింద్యమనికాదు. దీన్ని నిందించేవారే దీనికి ప్రధానకారకులని స్వామీజీ వాదన. విగ్రహారాధన యొక్క సక్రమరూపాన్ని స్వామీజీ అనేకచోట్ల నిర్వచించియున్నారు. విగ్రహారాధన ఎక్కడినుంచి, ఎవరిచేత ప్రవేశించినా హిందుమతం దీన్ని సరియైన మార్గంలో ఉపయోగించి, పరమగమ్యమైన అద్వైతశిఖరానికి ఒక మనోహరసోపానంగా చేసి కొన్నది. సత్యదృష్టికి దోహదపడే విగ్రహారాధన దైవారాధనే - సత్యదృష్టిని స్తంభితంచేసే విగ్రహారాధన నిజంగా విగ్రహారాధనే అని స్వామి తమ సందేశము లందు ధ్వనింపజేసియున్నారు. భారతీయ విగ్రహారాధన వైదేశిక విగ్రహారాధన వంటిది కాదు. అది సత్యలక్షితమైనది.

—అనువాదకులు.

వచ్చింది. ఈ విషయానికి సంబంధించిన చరిత్రపుటలు ప్రజలు యింకా చదవలేదు. నా యీ పరిశోధన ముద్రితరూపంలో గూడా వస్తుంది.

క్రీస్తు తర్వాత నాలుగు, ఐదుశతాబ్దాల మధ్యకాలంలో కొంత మంది రోమను కాథలిక్కులు ఇండియాకు వచ్చారు. వారు యీ నాడుకూడా దేశంలో ఉన్నారు. ఈ విషయం బహిరంతఃప్రమాణా లతో నేను ఋజువు చెయ్యగలను. దక్షిణ హిందూస్థానంలో నివ సిస్తుండే వీరు సైంట్ థామస్ క్రైస్తవులని పిలువబడుతున్నారు. వీరే విగ్రహారాధనను ప్రవేశపెట్టింది. అంతఃప్రమాణంతో – ప్రముఖ విగ్రహారాధన వాదియైన రామానుజునకు మార్గదర్శి – ఒకానొక సెంటుథామస్ క్రైస్తవుడని నేను ఋజువుచేస్తాను. వీరు నమ్ముతై పూజించిన మొదటి విగ్రహానికి ప్రాచ్యకళ లేదని నాకు తెలుసు! దివ్యులారా! విగ్రహారాధన జన్మకారణం క్రైస్తవమతమే నని దీని వల్ల తెలుస్తుంది. ఈ రోజున మీ మిషనరీలు విగ్రహారాధనను దూషిస్తూ ఇండియాకు వస్తారు. ఒక వైపున దాన్ని నిందిస్తూనే యింకొకవైపున ఆ విగ్రహాలను జేసి డబ్బు సంపాదనకోసం అమ్ము తుంటారు. ఈ విధంగా మీరు ప్రజల్ని అన్యమతంలోకి మార్చాలని ప్రయత్నిస్తారు. మీరుచేసి అమ్మే మీ విగ్రహాలు సత్యానికంటే, శక్తివంతంగా ఉంటవా? ఈ విషయం నిర్ణయించుకోవడం మీవంతు.

ఇంకా ఆ దేశంలోని స్త్రీల బానిసత్వాన్ని గురించి–ఘోషా పద్ధతిని గురించి మీకు చెపుతుంటారు. ఘోషాను గురించికూడా ఒక ముక్క చెపుతాను. ఒకనాడు ఇండియాను పాలించిన మహమ్మ దీయులు చాలా అవినీతికరంగా ప్రవర్తించేవాళ్లు. హిందూకన్యను చూచినంతనే వాళ్ళు ఆమెను, ఆమె గౌరవాన్ని అపహరింప ప్రయ త్నించేవాళ్ళు. స్త్రీలు అసహ్యమైన పాశవికోద్రేకాలకు గురియయ్యే వాళ్ళు.హిందువులు యీఘోరంనుండి తప్పించుకోతలచి, యేస్త్రీయైనా సరే – బాల్యంలో తప్ప, పెండ్లిచేసికోకూడదనే ఆచారాన్ని యేర్ప రచుకొన్నారు. ఇంకా స్త్రీలు నగ్నముఖాలతో బజార్ల వెంబడి నడవ కూడదు. ఎందుకంటె మహ్మదీయ రాజులు స్త్రీల ముఖాలనుచూస్తే, వాళ్లని అపహరించేవాండ్లు. ఈరీతిగా ఘోషాపద్ధతి ప్రవేశపెట్టబడింది.

మహమ్మదీయ పరిపాలితమైన అన్ని దేశాల్లోనూ యీ ఆచారం ఉండనే ఉన్నది. హిందూరాజుల పరిపాలనాకాలంలో ఈపద్ధతి లేదు.

ప్రేమపాత్రులారా! హిందువులుకూడా మీ వంటి రక్తమాంసములు కలవారే. వారి భాష మీభాషకు తల్లి. వారి ముఖము ప్రాచ్యం. అయినా ఆంతరంగికంగా మీరంతా ఒకటే. నా రంగు నలుపు; అంటే పై చర్మమునకు మాత్రమే నలుపు రంగు. శరీరం లోపల అందరివీ రక్తమాంసాస్థులేకదా!

యూరప్ ఆధ్యాత్మికంగా నాగరికంగా గ్రీసుకు ఋణపడిందంటే యే పవిత్రహృదయుడుగూడా ప్రతిఘటించడు. అయితే దివ్యులారా! గ్రీకుల సంగతి యేమిటి! గ్రీకుల తత్త్వదర్శనమేమిటి? మీ రెప్పుడైనా ప్లాటో, సోక్రటీస్, పైథాగరస్ రచనల్ని హిందూవేదాంతంతో జత చేసి చదివారా? మీరు చదివి ఉన్నట్లయితే, ఆత్మయొక్క అమరత్వమూ, పునర్జన్మ మొదలైన సిద్ధాంతాలన్నీ హిందూవేదాంతసంతతే నన్న సంగతిని మీరు ప్రతిఘటించలేరు. అయితే గ్రీకులు సంపూర్ణ సత్యమును హిందువులనుండి గ్రహించలేదు. ఇదే భేదం. అరిస్టాటిలు తర్కము హిందూ తర్కశాస్త్రంతో పోలిస్తే లోపభూయిష్ఠమని యీనాడు తేలుతుంది. గ్రీకులు వాదాన్ని న్యాయాన్ని, విభజించే పద్ధతిని, హిందూపద్ధతితో పోల్చిచూస్తే, అరిస్టాటెలు పద్ధతి తప్పని తెలుస్తుంది. హిందూ గ్రంథాలలో తర్కంలో అనుమానిక ప్రేరేపక ప్రమాణాలు (Deductive & Inductive) రెండూ చర్చించబడినై. గ్రీకులు, ఐరోపీయులు అనుమానిక ప్రమాణాన్ని మాత్రమే సూత్రించారు. ఈ విషయాన్ని విలియం జోన్సు మహాశయుడు ఋజువుచేస్తాడు. "గ్రీకు రచనల్ని హిందూదేశీయుల సమగ్ర వేదాంత పద్ధతితో మనం పోల్చినప్పుడు హైందవ వేదాంతం అనే జనులనుంచే గ్రీకులు తమ విజ్ఞానాన్ని సంపాదించుకొన్నారని భావించకుండా ఉండలేము" అని అంటాడు విలియం జోన్సు.

బైబిలు క్రొత్తనిబంధనను పాతనిబంధనతో ఏది వేరు పరుస్తుంది? "నేనూ, నాతండ్రీ ఒకటే," "నేను భగవంతునిలో జీవిస్తాను, సంచ

రిస్తాను, నివసిస్తాను". "ఆదిలో శబ్దంఉంది. శబ్దం భగవంతునితో కూడి ఉంది. శబ్దమే భగవంతుడు". "కుమారుణ్ణి (క్రీస్తును) చూచినవాడు తండ్రిని (భగవంతుణ్ణి) చూచినట్లే" — "స్వర్గరాజ్యం నీలోనే ఉంది"—"నీ ప్రక్కవాణ్ణి నీలాగా, ప్రేమించు"—ఈలాంటి మహా వాక్యాలే ఆ రెండింటిని వేరుపరుస్తున్నై. "మీరు నా మాంసాన్ని తినండి. నా రక్తాన్ని త్రాగండి. అలా కాకపోతే మీరు రక్షింపబడరు" అని క్రీస్తు అంటే జను లీ మహావాక్యాన్ని యెలా దుర్వ్యాఖ్యానం చేశారో చూడండి. దాన్ని విందుగా పండుగగా చేశారు. తత్త్వశాస్త్రము, తర్కం, అనేపేర్లతో యీ విషయాలు చదువుకోవచ్చు.

వేదాల మీాది గ్రంథాలు చదవండి. ఈ సిద్ధాంతాలన్నీ వేలకు వేలు సంవత్సరాలకు పూర్వమే హిందువుల వేదగ్రంథాల్లో బోధితమై ఉన్నా యని తెలుస్తుంది. క్రీస్తు పునరుత్థానం, ఆయన బోధలూ – హిందూమత వేదాంతం సంబంధాలే. 'నికోలస్ నొటొవిచ్' అనే రష్యన్ రచయితచేత ఫ్రెంచిభాషలో వ్రాయబడి యింగ్లీషులోకి తర్జుమాచేయబడిన, "ది అన్ నోన్ లైఫ్ ఆఫ్ జీసస్" (క్రీస్తు అజ్ఞాత జీవితము) అనే గ్రంథాన్ని యీ సందర్భంలో మీాకు గుర్తుచేస్తున్నాను.

ఈ గ్రంథం టిబెట్టు దేశంలోని ఒక మఠంలో దొరికిన వ్రాత ప్రతులను ఆధారంచేసికొని వ్రాయబడింది. ఆ ప్రదేశాన్ని గ్రంథకర్త స్వయంగా సందర్శించాడు. పుస్తకాన్ని చదివినతరువాత దానిలో ప్రతిపాదింపబడిన విషయాలు సత్యమని నమ్మకుండా ఉండలేము. క్రీస్తు తన 8వ యేడునుండి 18వ యేటివరకు హిందూదేశంలో నివసించిన – బైబిలు యేమీా చెప్పని యీ కాలాన్ని గురించి – గ్రంథము చెప్తుంది. ఈ విషయాలు అలాగే జరిగి ఉండవచ్చు; జరిగియుండక పోవచ్చు. విజ్ఞానం యితరమార్గాలవల్ల జెరూసెలం చేరి ఉండవచ్చు. ఎలాగైనా క్రీస్తు చేతలూ, ప్రబోధాలూ హిందూదేశ వేదాంతానికి ఒక సన్నప్రతిధ్వని అన్న విషయము ఉండనే ఉంటుంది. మీా బైబిల్లో "నీ ప్రక్కవాణ్ణి నీలాగే ప్రేమించు" అని ఉంటుంది. కాని దానికి కారణం చెప్పబడలేదు. దివ్యుడైన హెర్బర్ట్ స్పెన్సరు చెప్పినట్లుగా,

ఒక శిశువును 'యిది చెయ్యి' మని మనం చెప్పితే, కారణజీవి (Rational animal) లోని ఉత్తమ ప్రకృతిని బానిసగా చేస్తున్నా మన్నమాట. తర్క-శాస్త్రవేత్తలు మనుష్యుణ్ణి కారణజీవి అంటారు. అధికారపూర్వకంగా ఒక శిశువుకు ఒక పనిచెయ్యమని ఆజ్ఞాపించడం అతని మనస్సును బానిసచేయడం. శిశువు తన స్వంత అధికారం మీదనే నీ కిష్టమైన పనిచేస్తాడు. ఇది 'చెయ్యి, చెయ్యవద్దు' అని ఆజ్ఞాపించిన తత్క్షణమే వాని మనస్సును బానిసచేస్తున్నా నన్నమాట. ఒకసారి ఒక శిశువును నీ పేరేమని అడిగితే "నాకు తెలీదుకాని, మా అమ్మ నన్ను 'వద్దు' అంటుంటుంది అని చెప్పినదట. "నీ ప్రక్క-వాణ్ణి నీలాగ ప్రేమించు" అని మీరు చెప్పినపుడు నేను దీన్ని ఏవిధంగా ఎందుకుగా ఆచరించవలెనో మీరు తెలియజెప్పాలి. దైవప్రధానులూ, మతపండితులూ, హిందువులను తమ హృదయపూర్వకంగా ద్వేషిస్తుంటే, నా ప్రక్క-వాణ్ణి నాలాగే యెలా ప్రేమించేది నేను ? ఈ పరిస్థితుల్లో మన ప్రక్క-వాళ్ళను మనలాగా యెలా ప్రేమిస్తాం ? ఎన్నో ఆజ్ఞారకాలు లోకానికి బోధచేయబడినై. అయినా, లోకం యథాస్థితిలోనే ఉంది. కన్ఫ్యూషియస్, జోరాష్టర్, శ్రీకృష్ణుడు – వీరు జగత్తును ప్రబోధించారు. అయినప్పటికీ జగత్తు పాపభూయిష్ఠంగానే ఉంది. వెనుకటికంటే ప్రపంచం సుంతైనా సుఖవంతమైందా ? ఎవరో చెప్పినట్లు జ్ఞాపకం – జగత్తు కుక్క-తోకలాగా ఉందని – కుక్క-తోకను వెదురుగొట్టంలో 12 సంవత్సరాల కాలం ఉంచండి. బైటికి తీసింతర్వాత దానివంకర ఉండనే ఉంటుంది. అలాగే జగత్తుకూడా. దాన్ని మంచి మార్గంవైపు త్రిప్పను ప్రయత్నించి వదలితే, మళ్ళీ దానిదారి దానిదే. ఒక కథ జ్ఞాపకానికి వస్తున్నది : స్త్రీని వశీకరణం చేసికోవడం యెలాగో తెలుసుకొందామని ఒకడు ఒక కపట యోగి వద్దకు పోయాడు. ఆ యోగి యిలా చెప్పాడు. "నేనొక మంత్రం చెపుతాను. దాన్ని పఠించు. నిశ్చలంగా స్త్రీ వశమౌతుంది. అయితే మంత్రాన్ని ధ్యానించే టప్పుడు మాత్రం నీ మనస్సులోకి కోతినిగూర్చిన భావం రానీయకూడదు." ఆమనిషి మంత్రధ్యానం మొదలెట్టాడు. దురదృష్టవశాత్తూ కోతిరూపం అతని మనస్సులో ఎప్పుడూ మెదల్తూనే ఉండేది. మళ్ళీ వాడు ఆ కపట స్వామి వద్దకు వచ్చి యిలా అన్నాడు:

"మీరు కోతి విషయం చెప్పలేకపోతే అస లాస్ఫురణే నామనస్సులోకి వచ్చేది కాదు". దివ్యులారా! యీ "చెయ్యి, వద్దు" లాంటి ఆజ్ఞలు భగవదాజ్ఞలు కావు. అందుకనే జంతువులు, గోవులు, గేదెలు, చివరకు సింహాలూ, పులులూగూడా మనుష్యుల కంటే ఎక్కువ శుద్ధంగా ఉన్నవి. ఇంద్రియ వాంఛలను నిగ్రహించడానికి, వాటికే విధమైన నిషేధాజ్ఞలు లేవు. (నిషేధాజ్ఞల ఒత్తిడి నీచ ప్రకృతినే రేపుతుంది.) "నీ ప్రక్కవాణ్ణి నీలాగా ప్రేమించు" అనే ఆజ్ఞలో లోపం ఉంది. యితర్ల అధికారంమీద దేన్నీ మనుష్యుడు ఒప్పుకోడు. నాలాగా నాప్రక్కవాణ్ణి యెందుకు ప్రేమించాలి? వేదాంతంలో ఈ సత్యకారణం తొమ్మిది మార్గాల్లో బ్రహ్మాండంగా ఋజువు చేయబడింది. సనాతన వేదాంతాధ్యయన పరాయణులకు నీ సత్యమైన ఆత్మయే సర్వుల ఆత్మ – అందుకని 'నీ ప్రక్కవాడు నీ ఆత్మ' అని చెప్పబడింది. నా ప్రక్కవాడు నేనే నని తెలిసినపుడు, సహజంగా అతణ్ణి నాలాగే ప్రేమిస్తాను. ఈ విషయం బైబిల్లోకంటే యిక్కడ యెక్కువ విశ్వసనీయంగా చెప్పబడింది. మానవుల మన తత్వ సూత్రాలను మనం గ్రహించాలి. ఒక శిశువుతో అగ్నిని అంటుకోవద్దని చెప్పండి. అంటుకొంటాడు. అగ్నిని అంటుకొంటే చెయి కాలుతుందని చెప్పండి. తన స్వంతబాధ్యతమీద అంటుకోడు. కాబట్టి "అగ్నిని ముట్టవద్దు" అనిమాత్రమే చెప్పకండి. నా ప్రక్కవాణ్ణి నాలాగే ప్రేమించమని మాత్రమే చెపితే నేను ప్రేమించను. నా ప్రక్కవాడూ నేను ఒకటేనని చెప్పితే, నేనతన్ని నాలాగా ప్రేమించకుండా ఉండలేను.

ఇప్పుడు నేను ఘనమైన ఐరోపీయ ఆధ్యాత్మికతకు జన్మస్థానాన్ని గూర్చి వివరించాను. ఇంక కొంచెం ముందుకు పోవలసిఉంది.

క్రీస్తు చరిత్రనుంచి వచ్చిన దివ్యబోధలు యూరపునందు 'అంధకార' యుగాలలో కలసిపోయినవి. ప్రపంచానికి ఒక కొత్త ప్రేరేపణ కావలసి వచ్చింది. అంధకార యుగాలనూ, తర్వాత మధ్యయుగాలనూ, త్రోసివేసిన యీ ప్రేరేపణ యెక్కణ్ణుంచి వచ్చింది?

క్రైస్తవమతం ఉన్నప్పటికీ అంధకారయుగం ఉంది. మీరు చరిత్ర చదివినట్లయితే యీ అంధకార యుగం మధ్యయుగాలు "నవోదయం"తో తుడిచిపెట్టబడినవని నాతో యేకీభవిస్తారు. విజ్ఞానానికి పునర్జన్మ కలిగింది. ఈ పునరుజ్జీవనం అక్రైస్తవమైన గ్రీసు రోమను సాహిత్యంవల్లనే కలిగింది. ఈ అక్రైస్తవమైన సాహిత్యానికి జన్మస్థానము హిందూదేశమే. అందుకనే జగత్తును పవిత్రం చెయ్యడానికి నూత్న ప్రేరేపణ యిండియానుంచి వచ్చిందంటున్నాను. ఈనాటి విషయానికి వస్తాను.

మధురహృదయులారా ! అమెరికాలో నేటి నూతనోద్దేశాలేమిటి ? అమెరికాయొక్క శాస్త్రజ్ఞాన దివ్యజ్ఞాన ఆధ్యాత్మికవాదాలేమిటి? హైందవాచార్యుల ద్వారాగానీ వారి రచనల ద్వారాగానీ, లేక స్కోపెన్ హాగర్ రచనల ద్వారాగానీ లేక నేరుగా అమెరికా దేశపునవ్యభావధారల ద్వారాగానీ అన్నీ హిందూదేశంనుండి వచ్చినవే. ప్రపంచరాజకీయ చరిత్రలోని నవ్యదర్శనమైన - అతివాద ప్రజాస్వామ్యం లేక సామ్యవాద సిద్ధాంతంగూడ-వేదాంతసంబంధమైనదేనని నేను ఋజువు చెయ్యగలను' 'సామ్యవాదం - వేదాంతం' అనే వ్యాసం ఒకటి వ్రాశాను, జాతుల పతనోన్నతులు అనే గ్రంథంకూడా వ్రాశాను. ఈ రచనలలో నేను సిద్ధాంతీకరిస్తున్న యీ విషయాలు, వాటికి తగిన ఆధారాలు, వివరించాను.

అమెరికాలో నవ్యభావనా ప్రవక్త యెమర్సన్ సత్యాన్ని ఆధ్యాత్మికతను ప్రచారం చేశాడు. కాని వాటిని వ్యాపారదృష్ట్యా ఉపయోగించుకోలేదు. అతని ద్వారానే సత్యం ప్రజాసామాన్యానికి అందజేయబడింది. అయితే యెమర్సన్‌కు ఆధ్యాత్మిక పితృతుల్యుడు హెన్రీ డి. థోరే. యెమర్సన్ కంటే ఆయన యెక్కువ స్వీయం వ్యక్తిత్వం కలవాడు. ఎమర్సన్‌కు యింకో మార్గదర్శి కార్లైలు. అయితే యీ కార్లైలు, యెమర్సన్, థోరే, వాల్టు విట్‌మన్ లు - యెక్కణ్ణించి ఆవేశితులైనారు ? వారి విజ్ఞాన ప్రేరణ అనేకచోట్ల నుండి వచ్చింది. కాంట్, స్కోపెన్ హెగర్, లాంటి వారి రచనలు

యెక్కణ్ణించి వచ్చినై? ఇవ్వన్నీ వేదాంతసారస్వతాన్ని పఠించడం వల్లనే వచ్చినై కాని యితరంకాదు.

కార్లైలు, రస్కిన్ మహాశయులచేత ప్రపంచమునకు ఈయబడిన నూతనోద్వేగం - కాంట్, స్కోపెన్ హోగర్, ఫిచీ, మహాశయుల తాత్త్విక రచనలనుండి కలిగిందనీ, - వారి రచనలూ, ఇంచుమించు స్వీడెన్ బర్గ్ రచనలూ, హిందూ వేదాంత పఠనంవల్లనే కల్గియుండడంచేత మీ దేశపు నవ్యభావోదయానికి మా దేశమే కారణమనీ-నేను ఋజువు చెయ్యగలను. 'ది వరల్డు ఈజ్ విల్ అండ్ ఐడియా' అనే గ్రంథంలో స్కోపెన్ హోగరు ఈలా చెప్పాడు: "వేదాంత (ఉపనిషత్తులు) మంత ఉన్నతమైన మతంగానీ తత్త్వంగానీ ప్రపంచంలో లేదు. ఈ వేదాంతం నాజీవితమునకు శాంతి కలిగించింది. నా మరణ సమయమందు కూడా ఇది శాంతినిస్తుంది." ఇంతకంటే యెక్కువ గౌరవం కావలెనా, హిందూవేదాంతానికి? ఆ మహాశయుని రచనల్లో గూడా వేదాంతిక వాఙ్మయోదాహరణములు కనబడతాయి. ఫ్రాన్సు తాత్త్విక చరిత్రకారుడు విక్టర్ కసిన్ యిలా వ్రాశాడు: "పురాతన హిందువులు సత్యమైన భగవద్విజ్ఞానం కల్గి ఉన్నారనడానికి అభ్యంతరంలేదు. వారి వేదాంతం వారిభావన చాల సక్రమమైనదీ, సముత్తేజకరమైనది, సత్యమైనదీ, ఉన్నతమైనదీను. వారి రచనలను యూరపు రచనల్తో పోల్చడం మధ్యాహ్న సూర్యునిముందు నక్షత్ర కాంతివలె ఉంటుంది." ఇంకోచోట ఆయన యిలా వ్రాశాడు. "ప్రాచ్యదేశాల్లో ముఖ్యంగా ఇండియాలోని కవిత్వ వేదాంత గ్రంథాలను జాగ్రత్తగా పరిశీలించినట్లయితే మహా సత్యాలు గోచరిస్తై. యూరపుతో పోలిస్తే అవి చాలాగొప్పవి. ప్రాచ్యవిజ్ఞానం ముందర మనం తలలు వంచాల్సివస్తుంది. ఆ మహోన్నత వేదాంతజన్మభూమి సర్వప్రపంచాన్ని తన యొడిలో లాలిస్తుంది." హిందూభావనల ముందర యూరపు వేదాంతం దీర్ఘకాయుడైన రాక్షసునిముందర మరుగుజ్జు వానిలాఉంటైఅన్నాడు ష్లెగేల్. భారత వర్షంలోని భాష, సారస్వతం, వేదాంతంమీద అతను వ్రాసిన గ్రంథంలో ఇలా అంటాడు :- "పూర్వ హిందువులు సత్యమైన భగవ

దివ్యజ్ఞానం కలిగిఉన్నారనడానికి సందేహంలేదు. భగవత్ప్రసక్తిగల యే మానవ భాషలోగాని వర్ణింపబడనంత మహోన్నతమైన భావాలతో వారి రచనలు నిండి ఉంటాయి''. ముఖ్యంగా వేదాంతాన్ని గురించి యిలా అంటాడు : ''మానవుని స్వస్వరూపమైన దివ్యత్వమును గూర్చి, ఆతడు దైవత్వముతో పునరైక్యతకొరకు పునస్సంధానము కొరకు తహతహలాడేటంత గాఢంగా బోధింపబడింది. ఇదే ప్రతి కార్యంయొక్క పరమావధిగా నిర్ణయింపబడింది.'' మాక్స్‌ముల్లర్ యిలా అంటాడు ! ''స్కోపెన్ హాగర్ వంటి మహాతాత్త్వికుని అభిప్రాయానికి, నిర్ణయానికి బలంకావలసివస్తే సర్వమత తత్త్వదర్శనములను చదవడానికి వినియోగించిన నా దీర్ఘ జీవితంలో, ఆయన్ని బలపరుస్తున్నాను''. ఆయన యింకా యిలా అన్నాడు : ''మతంగాని, తత్త్వంగాని పరమశాంతికి చేసే ప్రయత్నమైతే, హిందూవేదాంతానికంటే సత్ప్రయత్నం నాకు కనపడలేదు''. ఇంకా యిలా అన్నాడు : ''స్కోపెన్ హాగర్ వేదాంతోత్సాహానికి నేను ఋణపడ్డాను. జీవయాత్రలో నా కది తోడ్పడిందని చెప్పడానికి నేను శంకించడంలేదు'' సర్ యెడ్విన్ యెర్నాల్డు యొక్క 'ఇండియా రివిజిటెడ్' (హిందూదేశం పునర్దర్శించబడింది), 'సాంగ్ సెలెస్టియల్' 'లైట్ ఆఫ్ ఏషియా' 'సాంగ్ ఆఫ్ సాంగ్స్' అనే రచనల్లో నేను సూచిస్తున్న యీ విషయం వ్యక్తమౌతుంది. థోరే తన 'వాల్డెన్ పాండు అండు లెటర్సు' అనే రచనలో తరచుగా వేదాంతరచనల్ని పేర్కొంటాడు. అతని 'యెక్స్కర్షన్' అనేదానిలో హిందూరచనల్ని గురించి వ్రాశాడు. అమెరికా నూతన భావన థోరేనుండి వచ్చింది. థోరే తనజ్ఞానం హిందూదేశం నుంచి తెచ్చుకొన్నానని ఒప్పుకొన్నాడు. ఇంగ్లాండు ప్రయాణం ముగించి ఎమర్సన్ అమెరికాకు వస్తూన్నప్పుడు, కార్లైలు స్టీమరుదాకా సాగనంపుతూ, ఎడ్విన్ జోన్సు తర్జుమాచేసిన భగద్గీతను బహుమతిగా యిచ్చాడు. భగద్గీత లాటిన్ ఫ్రెంచి జర్మను భాషలల్లోకి కాంటుకు పూర్వమే తర్జుమాచేయబడింది. కాంట్ యూరపు వేదాంత దృక్పథాన్ని పునరుజ్జీవింపజేశాడు. 'తన ప్రియోరో' సిద్ధాంత (కాలము; ప్రదేశము; కారణత్వమును గురించి) విషయంలో ఇండియాకు ఋణపడ్డాడు.

మిసెస్ యెడ్డీ గ్రంథ ప్రథమముద్రణలో భగవద్గీతనుండి పాఠములు ఉదహరించబడినై. కాని తర్వాత ముద్రణల్లో తీసివేయబడినై. భగవద్వాణే అయితే, అది స్వచ్ఛంగా సరళంగా, సదమల జ్ఞానమయంగా ఉండాలి.

అయితే యిక్కడివాళ్ళు గ్రంథచోరులనిగాని, అనుకరణవాదులనికాని నే ననడంలేదు. అమెరికా దేశీయులు, స్వంతముగా ఈ మహాసత్యాలను కనుక్కోవడము ఎంత న్యాయమో, యిండియా నుండి గ్రహించడంకూడా అంత న్యాయమే అని అంటున్నాను. ప్రపంచములో క్రొత్త అనేదే లేదు. అయితే ఈ జ్ఞానతేజము యిండియానుండి వచ్చిందని చరిత్ర చెపుతున్నది.

హిమాలయాల్లో నివసిస్తున్న సన్న్యాసుల్లో ఈ రోజున నిజమైన సామ్యవాదము ఉన్నది. ఎడ్వర్డు కార్పెంటరు (యింగ్లండు) తన సామ్యవాద దృక్పథాన్ని హిందువులనుండి నేర్చుకొన్నాడు. కాబట్టి మీ క్రొత్త మార్గాలన్నీ పూర్వ హిందువులు నడచిన పాతమార్గాలే. దివ్యులారా! మహాసత్యాన్ని తెలుసుకోవడానికి యింకా కొంచెము నిదానించి హిందూదేశమునుండి విజ్ఞానము ఆర్జించుకోండి. ఎందుకంటే ఆ భారతీయ మహా గ్రంథాల్లో చాలాభాగం యింకా మీ భాషలోకి తర్జుమాకాలేదు.

అమెరికాదేశ నవ్య దృక్పథమునంతా చర్చించిన యోగవాసిష్ఠంలాంటి గ్రంథాలు ఉన్నై. ఈ గ్రంథము స్వచ్ఛమై సమగ్రమై తార్కికమై కావ్యరూపంలో వెలుగొందు తున్నది. అలాగే మా గణిత శాస్త్ర గ్రంథాలుకూడా. అందుకనే చాలామంది విద్యార్థులను కొనే మాదిరి ఒకభూతంవంటిది గాక మాకు గణితం ఆనందదాయకమవుతున్నది.

ప్రపంచములో మీ కర్మ, ఆనందంతో నిర్వర్తితం కావలె. కష్టజీవులైన కూలివాండ్రు, మార్గంలోని రాళ్ళు పగుల గొడుతూన్న ఒకతోట జ్ఞాపకానికి వస్తున్నది. వారి హృదయాలు కందిపోతూ పగలల్లా శ్రమిస్తున్నారు. తోటలోని మైదానంలో రాకుమారులు 'టెన్నిస్

ఆడుకొంటున్నారు. వారి ఆట సంతోషకరం. వారు కూలీలకంటె యెక్కువ శ్రమ పడుతున్నారు. కానీ సంతోషంలో ఆ శ్రమను వాండ్లు అనుభవించడంలేదు. మీావిధం ఆ రాకుమారుల్లా ఉండనీయండి. అంటేమీారు శ్రమను, కార్యాచరణను వదలమని కాదు. క్రియలోని భావన పూర్తిగా మారాలి. అప్పుడు క్రియలో ఎల్లప్పుడూ సంతోషం ఉంటుంది. మీారు దైవత్వంలో కేంద్రీకృతులైనప్పుడు మహానందముతో నిండిపోతారు. మీా దైవప్రకృతి అనే దేవదారు వృక్షాగ్రాల్లో మీారు ఉన్నప్పుడు ఈ మనోహరమైన ఆధ్యాత్మికభావన పొందినపుడు, మీా ఆత్మనుండి దైవసంగీతము మహాద్భుతకర్మ ప్రవహిస్తుంటుంది. బలవంతము చేయబడిందాట్లో బలం ఉండదు. సూర్యునినుండి కాంతీ, రోజా పుష్పము నుండి పరిమళమూ, హిమాచలాగ్ర నదీప్రవాహాలనుండి శీతలత్వమూ వచ్చినట్లుగా, మీానుండి శాంతిని, ఆనందమును, ప్రేమను, జ్ఞానతేజమును రానివ్వండి. ఓ తేజస్తేజమా! ఓం!! నీవు శాంతిస్వరూపుడవై వెలుగొందుతావు గాక!

ఓం! ఓం!! ఓం!!!

# భారతదేశపక్షమున అమెరికాదేశీయుల కొకవిజ్ఞప్తి:

[శాన్‌ఫ్రాన్సిస్కో - గోల్డెన్‌గేట్‌హాల్లో 1903 సం. జనవరినెల 28వ తేదీనచెప్పిన ఉపన్యాసం.]

ఈరాత్రి ప్రసంగవిషయం, "భారతదేశపక్షమున అమెరికాదేశీయుల కొకవిజ్ఞప్తి." కారణమేమిటో ఈనాటి సభకు కొద్దిమంది అమెరికనులే వచ్చారు. ఐనా సంతోషమే. ఈవచ్చినకొద్దిమందీ, అమెరికాకేకాక, యూరప్‌కూ, యావత్ప్రపంచానికీ ప్రాతినిధ్యం వహిస్తున్నారు. నేటిరాత్రి చెప్పబోయేమాటలు ఈ కొద్దిమందిసభ్యుల హృదయములకైనా తాకితే, కనీసం మీలో ఏ ఒక్కరిఇంటికైనా చేరితే, మీలో ఏ ఐదారుగురైనా ఈ సందేశమును విని కార్యనిర్వహణానికి పూనుకొంటే, రాముడీ వాక్యాలు జయంపొందినట్లు భావిస్తాడు.

రాముడు మీలోని దైవతేజమునకు విన్నవిస్తున్నాడు. మీలోని అనంతశక్తికి విన్నవిస్తున్నాడు. అంతర్గతమైన ఆ అనంతశక్తి ఒక్క శరీరంద్వారానైనాసరే మహాద్భుతకార్యాలు చేయగలదని రాముని నిశ్చయం. మీరు సత్యాత్ముందు అనంతాత్ముందు — ఏ విధమైన జాతిమతదురభిమానముల తెర నుంచకండి! కనీస మొక గంటసేపైనా, అపరిచయునిమాటలు విననీయని కులజాతిమతవిభేదాల తెరలన్నిటినీ ఆవలకు నెట్టివేయండి; మనస్సుకు తట్టనీయకండి.

## భారతదేశము పూర్వ మొనర్చినకృషి

రాముడు రెండుమాసాలనుండి మీకు భారతవిజ్ఞానశిఖామణు లనదగిన మహావిషయములను తెలుపుతున్నాడు. ఆతడు మీకు భారత వేదశాస్త్రకామధేనువుల దివ్యశక్తిప్రదమైన దుగ్ధము నందిస్తున్నాడు. ఆత్మబలప్రదాయకమైనసత్యామృతము నందిస్తున్నాడు. ఈ నాడు రాముడు, ఆ మహావిజ్ఞానమణులకు నిధానమైన గనిని గూర్చి, ఆ దివ్యామృతధారలవర్షించిన గోమాతనుగూర్చి కొన్నివిషయాలు మీతో ముచ్చటించ దలచాడు. సత్యమును మొట్టమొదట యావత్ప్రపంచము

నకు ప్రకటించిన తపోభూమినిగూర్చి, వివిధదర్శనములను విశ్వమున కందించిన జ్ఞానభూమినిగూర్చి కొన్నివిషయాలు మీతో ప్రసంగించ దలచాడు. నిజానికి సర్వమతాలు వ్యక్తంగాగానీ, అవ్యక్తంగాగానీ, భారతవర్షమునుండి ప్రపంచానికి ప్రసరింపబడినవే. ప్రతి దినము యూరపులో అమెరికాలో పుట్టుతున్న మీ నూతనమతదృక్పథాలన్నీ— నేటికీ భారత దేశమే ప్రసాదిస్తున్నది. నేడు మీరు వేటిని చూచుకొని గర్వపడుతున్నారో— ఆ మీ నవ్యభావాలన్నీ, దివ్యజ్ఞానము, ఆధ్యాత్మికత, క్రైస్తవవిజ్ఞానము, మానసికవైద్యమూ- మొదలైనవన్నీ, ఒక్కటికూడా బీరుబోకుండా— వ్యక్తంగానో అవ్యక్తంగానో తమ మూలమును భారత దేశమునుండి గ్రహించినవే. పూర్వమునుండి ఇప్పటివరకు తన సమస్తతాత్త్వికదర్శనశ్రీలను ప్రపంచమునకు పంచి పెడుతున్న భారత దేశమునుగూర్చి కొన్నివిషయాలు రాముడు మీతో నిర్వచిస్తాడు. ప్లేటో, సోక్రటీసు, పైథాగరస్, ప్లాటినస్ వంటి మీ గ్రీకుతత్త్వవేత్తలందరూ తమవిజ్ఞానప్రేరణమును ప్రాగ్భారత దేశమునుండే పొందారు. తత్త్వశాస్త్రచరిత్ర మీకు దీన్ని చూపుతుంది. స్కోపెన్‌హార్, ష్లెగల్, షెల్లింగు, యం. కజిన్ మొదలైన వారందరూ, తమవిజ్ఞానప్రేరణవిషయంలో, ప్రతీచీహిందూదేశానికి- వేదాంతానికి, సాంఖ్యానికి, బౌద్ధానికి, ఉపనిషత్తులకు, గీతకు, ఋణపడ్డామని ఒప్పుకొంటారు. అమెరికాయొక్కగానీ ఇంగ్లాండుయొక్కగానీ, జర్మనీయొక్కగానీ మీ నవీన ఏకసత్తావాదము (Modern Monism) తన ప్రకాశమును ప్రాగ్భారతమునుండే పొందుతున్నది. శంకరకృష్ణాదు లుదయించినభూమినిగూర్చి, మీపూజ్యులైన ఎమర్సన్, వాల్టువిట్‌మాన్, సర్ ఎడ్విన్ ఎర్నాల్డు, మాక్సుముల్లర్ మహాశయులను ఆవేశపరచి, ఉత్సాహోత్తేజితులజేసిన ఉదాత్తాశయాలకు నిలయమైన దేశమునుగూర్చి. ఉదాత్తాశయాలకేకాక, తత్త్వకవిత్వవైదుష్యాలకేకాక, బలశౌర్యప్రతాపాలకుకూడా ఏమాత్రం తీసిపోని భారత దేశమునుగూర్చి రాముడు మీతో ప్రసంగిస్తున్నాడు. బలశౌర్యప్రతాపాలకు నిలయమైన దేశము—అన్నమాటలు మీ కాశ్చర్యం కలిగించవచ్చు. ఈ కాలంలోకూడా బ్రిటిష్‌ప్రభుత్వానికి గొప్పరక్షణగా, అండగా నిలుచున్నప్రజ లెవ్వరు? భారతీయులైన

శిక్కులు, ఘూర్ఖాలు, మహారాష్ట్రులు, రాజపుత్రులూ మొదలైన
వాండ్లే! బ్రిటిషువారు ప్రబలశత్రువుల నెదుర్కొనవలసిన సర్వసమ
యాలలో యుద్ధతీవ్రతను భరించవలసినవారు భారతసైనికులే. ఒక
నాడు లోకోన్నతశ్రీమంతమై వెలసిన భారత దేశాన్నిగూర్చి రాముడు
మీతో ప్రసంగిస్తున్నాడు. హిందూదేశమునాశ్రయించి పొట్టబోసి
కొనే, జాతితరువాతజాతి అభివృద్ధి పొందాయి. ఆత్యాశను కల్పించిన
హిందూదేశాన్వేషణతోనే "కొలంబస్" వల్ల అమెరికా కనిపెట్టబడింది.
అమెరికాకు మొదట ఇండియా అనే పేరుపెట్టారు. ఒకప్పుడు ప్రపం
చాగ్రస్థానమలంకరించి వెలుగొందిన దేశములనుగూర్చి రాముడు
మీతో మాట్లాడుతున్నాడు. మనోహరమహారణ్యాలతో, సశ్యశ్యా
మల భూములతో, మహోన్నతహిమాలయాలతో ప్రకాశిస్తూ యావ
త్ప్రపంచమందు మహోన్నతమై ప్రతిభావంతమై యుండిన దేశం భారత
దేశమే. కానీ రాముని అభిప్రాయ మిది కాదు. భౌతికంగానేకాక,
మానసికంగా, నైతికంగా, ఆధ్యాత్మికంగాసైతం భారతదేశరి ప్రపం
చాగ్రస్థాన మలంకరించింది. ఈనాడు అట్టి ప్రపంచశిరోస్థానముగా
వెలుగొందిన దేశం, ప్రపంచపాదస్థానంగా మారిపోయింది. ఓఅమెరికా
దేశీయులారా! నేడు శిరోస్థానం మీది. భారతదేశం నేడు మీ
పాదంగా ఉన్నది. రాము డొకవిజ్ఞప్తి చేస్తున్నాడు: ఓ శిరస్సా!
ఓ అగ్రస్థానమా! నీవు బలంగా, ఆరోగ్యంగా, సుఖంగాఉండాలంటే—
నీవు పాదములవిషయంలో శ్రద్ధవహించాలి. పాదములు దెబ్బతింటే,
అపాయానికిగురైతే, శిరస్సుకూడా బాధపడవలసివస్తుంది. పాదాలకు
బాధకలిగితే, పాదాలకునొప్పిపుడితే, పైనున్నతలకుమాత్రం ఆ బాధ
తప్పుతుందా ? ఓశిరస్సా! నీకు క్రిందఉన్న పాదాలతరఫున రాము
డొక విజ్ఞప్తి చేస్తున్నాడు. తన తత్త్వజ్ఞానకవిత్వాలతో, తన ఉన్నత
మతభావాలతో సర్వప్రపంచమును పోషించినతల్లి, ఆ ప్రపంచమాత,
ఆ విశ్వకుటుంబిని, భారతమాత నేడు వ్యాధిపీడితురాలైంది. మీతల్లి
నేడు రోగగ్రస్తురాలైంది. ఆర్యకుటుంబసోదరీమణి, భారతమాత నేడు
జబ్బుపడింది. ఆమెకు మీరు ఉపచరించరా? భారతగోమాత రోగ
ముతో బాధపడుతున్నది. కాని ప్రాణాలతో ఉన్నది. మీరామెకు
సహాయం చేయవచ్చు. మీరామె రోగనివృత్తికి తోడ్పడవచ్చు.

భారతకామధేనువు యావత్ప్రపంచమునకు బలశక్తులను ప్రసాదించే దివ్యక్షీరాహారములను, ఆత్మోత్తేజకరవిజ్ఞానమును ప్రసాదిస్తున్నది. ఆ గోవును నేడు పరిరక్షించడం అవసరమైయున్నది. ఈ దివ్యధేనువు ఎత్తుబడింది. ఆకలిదప్పులతో మలమల మాడిపోతున్నది. మీరు చేయ వలసినపని ఆ గోవుకు కొంచెం మేతవేసి రక్షించడమే. ప్రపంచమంతా ఆ గోక్షీరములతోనే గదా పోషింపబడుతున్నది?—ఆ గోవుకు మీరు ప్రాణరక్షణార్థం ఏదో ఇంత చౌకైన మేత పెట్టండి. ఇంత ఆహారం పెట్టి పోషించండి. పశుమాంసభక్షణచేసే ఇంగ్లాండు మాంసాహారమును స్వీకరించే యూరపియన్ దేశాలు, మేము గోవును పోషించము ; చంపు కొని తింటాము అని చెప్పవచ్చు. మంచిది. మీ ఇష్టంవచ్చినట్లు చేయండి. కానీ మీరు ఆ గోవును చంపి తినదలచుకొన్నా, దాని ఆరోగ్యమును గూర్చి మీరు ముందు జాగ్రత్తపుచ్చుకోవాలన్న విషయం మరచి పోవాకండి. జబ్బుపడిన ఆవుయొక్క మాంసం మీ ఆరోగ్యాన్ని పాడు చేస్తుంది. మీ కషాయాన్ని కలిగిస్తుంది.

ఓ ఇంగ్లాండ్, యూరప్ శక్తుల్లారా ! కనీసం స్వార్థంకోసమైనా మీరు ఆ గోవుయొక్క ఆరోగ్యమునుగూర్చి శ్రద్ధతీసికోవాలె.

## అమెరికాదేశంనుండి ఆశలు

నేటి వీరులైన అమెరికనులముందు, త్యాగపురుషులైనఅమెరి కనులముందు, సత్యముకొరకు తమజీవితాలను సమర్పింపగలధర్మవీరు లను సృష్టించు ఉదారహృదయులైన అమెరికనులముందు, రాముడు భారతదేశపక్షమున ఈ విజ్ఞాపన ముంచుతున్నాడు. క్రిందటిదినమే, సత్యార్థ మొక అమెరికను తనజీవితము నాహుతిచేశాడు. అమెరి కనులకు, విజ్ఞానశాస్త్రమునకు జీవితముల బలిదానమిచ్చినవీరులైన అమెరికనులకు, రాముడు విన్నవిస్తున్నాడు. అమెరికాదేశీయులారా! ఈవిజ్ఞప్తిని మీరు వినరా? ఓ అమెరికన్ పత్రికాధిపతులారా ! మీ రీ విజ్ఞప్తికి సమాధానమీయరా ? రామునిశరీరాన్ని మీరు సన్మానించ వలసినపని లేదు. అతని శరీరమును మీరు వదలివేయండి ; అణగ ద్రొక్కండి ; ముక్కలుముక్కలు చేయండి. నలుసులునలుసులు

చేయండి. ఈ శరీరమును మీ రేమైనా చేసికోండి. కానీ, మీరు భారత దేశసమస్యను స్వీకరించండి! సత్యకార్యమును చేపట్టండి!

దాస్యమును పారద్రోలినఅమెరికనులకు, ఈదేశమందలి కుల భేదాలను కూలద్రోస్తున్న అమెరికనులకు, ధన్యులైన అమెరికనులకు, తనవిషయమునుగూర్చి శ్రద్ధవహించం డని భారతదేశం మొఱపెట్టు కొంటున్నది.

హిందూదేశం చాలా చెడ్డదే అనుకోండి. ప్రపంచానికి హిందూ దేశం ఏమేలూ చేయలేదనుకోండి. ఈనాడు, హిందువులు ప్రపం చంలోకల్లా చెప్పరానంతచెడ్డవాం డ్లనుకోండి. మరి దానికైనా భారత దేశవిషయంలో మీరు శ్రద్ధవహించాలి. ఇందుకే భారతదేశమును తప్పక మీరు స్వీకరించాలి.

రోగి, తనకుతాను అపకారంచేసికోవడమేగాక, ఆవ్యాధిని ప్రపంచమంతా వ్యాపింపజేస్తాడు. ఒకడు చలిజ్వరంతో బాధపడు తున్నాడనుకోండి. ఇతర్లకుకూడా ఆ అంటురోగ మంటుకుంటుంది. భారతదేశం చలిజ్వరంతో బాధపడుతున్నది. ఉష్ణదేశమును చలిజ్వర మెట్లు పీడిస్తుందని మీ రడగవచ్చు. ఆదేశమును పీడిస్తున్నది—చలి కాలపుచలిజ్వరంకాదు—కటికిపేదరిక మనే చలిజ్వరం. ఈ దరిద్ర మనే చలిజ్వరంతో భారతదేశం బాధపడుతున్నది. గడగడ వణికిపోతున్నది. శైత్యజ్వరపీడితునిరోగం ప్రక్కవాండ్ల కంటుకొంటుం దన్నవిషయం మీకు తెలుసు. ఎవనికైనా కలరా తగిలితే వానిరోగం ఇతర్లకు కూడా వ్యాపిస్తుంది, ఎవనికైనా స్ఫోటకంపోస్తే, ఆ అంటురోగం ఇత ర్లకుకూడా వ్యాపిస్తుంది. వానికొరకు కాకపోయినా ప్రపంచక్షేమంకొర కైనా, రోగపీడితునకు సహాయపడడం ప్రతివానివిధ్యుక్తధర్మం. రోగి యొక్కరోగనివృత్తికి శ్రద్ధపుచ్చుకోకపోతే, ఆ రోగమును దేశమంతా వ్యాపించడానికి నీ వవకాశమును కల్పిస్తున్నట్లే. సర్వప్రపంచకల్యా ణార్థం భారతదేశసమస్యను పరిష్కరించం డని రాముడు మిమ్మడుగు తున్నాడు. సత్యధర్మములపేరట, భారతసమస్యను సక్రమశ్రద్ధతో గ్రహించం డని రాముడు మిమ్మడుగుతున్నాడు.

భారతదేశమందుకలిగిన చెడేమిటి? భారతదేశానికివచ్చిన కష్ట మేమిటి?—అని మీరా రడుగుతారు. భారతదేశాన్ని పీడిస్తున్న వ్యాధి—రాజకీయ, సాంఘిక, మతవిషయకమైంది.

## భారతదేశ రాజకీయ పరిస్థితి

అంధకారావృత మైన భారతదేశముయొక్క రాజకీయ దుస్థితిని గూర్చి విస్తరించడానికి రాము డెక్కువకాలం వినియోగించడు. కరువుకాటకాలవల్ల లక్షలాదిజనులు మరణిస్తున్న దేశంలో, పస్తులు, ఆకలిమంటలు నవనవలాడేబాలబాలికలను నమిలి మ్రింగుతున్న దేశంలో, పేదరికము ప్లేగూ పురోభివృద్ధికిరాదగిన యువకులను పురిటిలోనే త్రుంచివేస్తున్న దేశంలో, ఉపవాసాలతో కుమిలిపోతున్న తల్లులవద్ద పాలులేనందున కండ్లుతెరువనిపసిపాపలు నోళ్ళెండి పెదవులార్చుకొనిపోయి రోదిస్తుండే దేశంలో, పొట్టకుబట్టకు సంపాదించే మనిషే అరుదైన దేశంలో, తిండిజరగడమే దేవేంద్రపదవిగా యెంచబడుతున్న దేశంలో, రాజులు రాజకుమారులు యెప్పుడూ విచారకరమైన ఆర్థికబాధలలో చిక్కుకొనివుండే దేశంలో, తనదుఃఖాలు బాధలు లెక్కచేయకుండా రాజభక్తిని, ఓర్పును, విశ్వాసమునూ కల్గియున్న దేశంలో, భయానక దరిద్రబాధామయమైన దేశంలో, దయగల ప్రభుత్వం ఇంకా దారిద్ర్యాన్ని అభివృద్ధిపరచేపనులకు తోడుగా ఎగరొప్పుతున్న శ్రామికుల కరుడుగట్టినరక్తమునుండి, కాలి కమిలిపోయిన తనువులనుండి, లక్షలకొద్ది ధనాన్ని పిండుకొని ఘల్లున ప్రయోగించడం అనివార్యంగా భావిస్తున్నది....

ఈ చిత్రహింసకుతోడుగా వృధావ్యయకరము లైన అనేక అవివేకకార్యకలాపాలు దేశాన్ని పీల్చి పిప్పిచేస్తున్నవి. గొప్పగొప్ప లాభసాటి వుద్యోగాలన్నీ బ్రిటిషు వారి స్వాధీనములో నున్నవి. ముప్పదికోట్లభారతప్రజలకు ఒక్కడైనా పార్లమెంటుసభలో ప్రతినిధిగా లేడు. స్వదేశోద్యమాలన్నీ బ్రిటిషువారిచే అణచివేయబడినవి.

దేశీయకళలు పరిశ్రమలు వుత్పత్తులన్నీ క్షీణించిపోయినవి. ఇంక ప్రజ లనుభవించగల్గినస్వాతంత్ర్యం, ధనమానప్రాణాలను హరించే

మిథ్యాస్వాతంత్ర్యం ఒక్కటే. అది అతిమత్తుగల్గించే ఇంగ్లీషువారి సారాయినుండీ సర్వనాశనంచేసే బ్రిటిషువారి త్రాగుడుపదార్థాల నుండీ మెరుపుతెచ్చుకొన్న పైశాచికమిథ్యాస్వాతంత్ర్యం. ఈ త్రాగుడు సహజంగా మద్యపాన మెరుగని భారతీయులలో ఇంగ్లీషువారిచే ప్రోత్సహింపబడినది. ఈ విషయం భారతరాజకీయదురవస్థనుగూర్చిన ఒక అభిప్రాయాన్ని మీ కిస్తుంది. ఈవిషయం భారతీయులబాహ్య పరిస్థితినిగూర్చి కొంత మీకు తెల్పుతుంది.

ఇప్పుడు భారతీయులు ఏ ఆంతరంగికదోషాలచేత బాధపడు తున్నారో రాముడు మీ కెరుకపరుస్తాడు. వారి పతనమునకు నిజమైన కారణమునుగూర్చి వారి బాధానిరాశలముఖ్యకారణాన్నిగూర్చి కొంత మీకు నిర్వచింపబడుతుంది. ఈవిషయాన్నిగురించి యెంతో చెప్ప వచ్చు. కానీ ప్రజలు ఆసాంతం ఒకేసారి వినడానికి ఓపికపట్టలేరు గనుక రాముడు ప్రతివిషయమును క్లుప్తీకరించవలసియున్నది.

భారతదేశమునుగూర్చి భారతదేశదుర్దశనుగూర్చి వేదాంత దర్శనమిట్లు వ్యాఖ్యానిస్తున్నది. భారతపతనకారణం కర్మవిశేషమే. కర్మ అంటే మనం స్వయంగా చేసుకున్నపనులఫలితమే. కర్మనే మాటకు అర్థం— పని యని; మనం స్వయంగా చేసినదే యని. ఇప్పుడు ఫలి తానికివచ్చింది—వాండ్లొకప్పుడు స్వయంగా నాటుకొన్నదే. ఒక ప్పుడు భారతదేశపుఆదిమనివాసులను హిందువులు నిరాదరణచేశారు గనుక ఆ కర్మఫలమునే నేడు హిందువులు విజేతజాతులచేత పొందు తున్నారు. అజ్ఞానంచేతనో, మితిమీరినతిండివల్లనో ఆరోగ్యసూత్రాల నుల్లంఘించడంవల్ల రోగంవస్తుంది. అందుచేత రోగి తనరోగానికి తానే బాధ్యుడు. అట్లే భారతీయులు తమకర్మచేతనే తమ అజ్ఞానముచేతనే రోగగ్రస్తులైనారు.

రోగం ఎలావస్తేనేమి వచ్చింది. వైద్యుడు చేయవలసింది రోగిని తిట్టడంగాదు. వైద్యుడు జబ్బుపడ్డవాణ్ణి ఉత్సాహపరచాలి. అతనికి సహాయంచెయ్యాలి. రోగిని చీవాట్లుపెట్టడంవల్ల నీవు రోగాన్ని తీవ్రంచేస్తావు. వాండ్లలోనిదోషాలను వాండ్లలోని లోపాలను ఎన్న

వలసినసమయ మిది కాదు. మనధర్మం, మీధర్మం—కష్టాలలోనుంచి బయటపడడానికి వాండ్లకు తోడ్పడడమే.

## భారతీయ వర్ణవ్యవస్థయొక్క పుట్టుక

రాజ్యతంత్రశాస్త్రము మనకు కర్మవిభాగాన్నిగురించి చెప్తుంది. ఒక కర్మాగారంలో లేక ఒక యంత్రాగారములో కార్యక్రమమంతా అభివృద్ధికరంగా సాగడానికి, పనిని విభజించవలసి ఉంటుంది. మానవశరీరంలోకూడా కర్మవిభాగ మున్నది. కండ్లు చూడగలవేగాని వినలేవు. చెవులు వినగలవేగాని కనులుచేసేపని చేయలేవు. చేతులు, కాళ్లు చేసేపని చేయలేవు. కాళ్లు తమపని తాము చేయాలె. చేతులు తమపని తాము నిర్వహించాలె. అట్లుకాక కండ్లతో వినాలనీ, ముక్కుతో నడవాలనీ, చేతులతో వాసన చూడాలనీ, చెవులతో ఆహారం తినాలనీ కోరుకోవచ్చా? అట్లు కోరుకోకూడదు. ఆ వాంఛ మనలను వెనుకకు తీసికొనిపోయి ఆదిమమైన అవికాస జీవనదశలో పడవేస్తుంది. అన్నిఅవయవాలకు బదులు ఒక్కపొట్టే కలిగి ఆ పొట్టతోటే అన్నిపనులు నెరవేర్చుకొనే సూక్ష్మక్రిములనుగా మనలను తయారుచేస్తుంది. ఈదుర్దశను మనము కోరము. కర్మవిభాగము న్యాయమైందీ, అవసరమైందీ. ఈకర్మవిభాగసూత్రంపైననే ఒకప్పుడు భారతదేశంలో వర్ణవ్యవస్థ సంస్థాపించబడింది. వర్ణవ్యవస్థ కేవలం కర్మవిభజనమాత్రమే; మరేమీ కాదు. ఒకడు పురోహితకర్మను స్వీకరిస్తాడు. మరొకమానవుడు యోధకర్మను స్వీకరిస్తాడు. రెండవవాడు మొదటివానివలె పురోహితకర్మను స్వీకరించకుండా, యోధకర్మను స్వీకరించడానికి కారణం—ఆతనిలో అధిక బలపరాక్రమాలుండడమే. ఆయుధప్రయోగాలకూ, శత్రువుల నెదురించి పోరాడి తరమడానికి తగినసామర్థ్యం అతనిలో ఉన్నందున, పురోహితుని సాత్విక కర్మ నతడు స్వీకరించలేడు. అందుచేతనే కర్మవిభాగం కలిగింది. మరికొందరుప్రజ లున్నారు. వ్యాపారవిషయాలలో వాళ్లకు సామర్థ్యం ఎక్కువఉంటుంది. పౌరోహితుని కర్మలో వాళ్ళ కభినివేశ ముండదు. మరికొందరు ప్రజలు పౌరోహితకర్మకుగానీ, యోధకర్మకుగానీ, వ్యాపారకర్మకుగానీ అర్హులుగాక, విద్యావిజ్ఞానశూన్యులై, చిన్నతనంలో సోమ

రులుగా తిరిగి కాయకష్టానికి మాత్రమే పనికివచ్చేవారు. ఈ ప్రజలు ముఖ్యంగా ఆదిమనివాసులు. ఈ మానవులు ఊడవడమో, రాళ్ళు పగులకొట్టడమో, వ్యవసాయకృత్యాలు చేయడమో—ఎక్కువ అభిలషించేవాండ్లు. ఈ రకంగా హిందూదేశంలో సక్రమకార్య నిర్వహణానికి వర్ణవ్యవస్థ యేర్పడింది. పురోహితులు బ్రాహ్మణు లని పిలువబడ్డారు. యోధకర్మ నిర్వాహకులు క్షత్రియు లని పిలువబడ్డారు. వర్తకులు వైశ్యులని పిలువబడ్డారు. సర్వసామాన్య కాయకష్టమును అవలంబించిన జనులు శూద్రులనబడ్డారు. ఎవరికిష్టమైనపనిని వారు స్వీకరించడానికి ఎట్టినిరోధాలుకానీ, నిర్బంధాలుకానీ లేవు. ఈ కర్మవిభజనం అన్నిచోట్లా ఉన్నదికదా? ఈ కర్మవిభజనం అమెరికాలో మాత్రం లేదా? అమెరికాలో ఈ కులాలున్నవి. ఇంగ్లాండులో ఇవి ఉన్నవి. ఎక్కడబట్టినా ఇవి ఉన్నవి. అమెరికాలో వర్ణవిభజన లేదా? అమెరికనులలో ఉన్నతవంశీకులనీ (Upper Ten), సామాన్య జనులనీ (Common Plebians) కులవిభజన మున్నదికదా? ఎక్కడబట్టినా ఈ విభజనం, ఈ సమాజవిభజనం ఉన్నది. అయితే హిందూవర్ణ వ్యవస్థలో ఉన్నతప్పేమిటి? భారతదేశంలో మనుస్మృతి అనే పేరుతో హిందూన్యాయశాస్త్రగ్రంథ మొకటి వ్రాయబడింది. ఆ రోజుల్లో సర్వవర్ణమానవులకు ఆ గ్రంథం సహాయకారిగా ఉండేది. ఆయావర్ణ మానవులకు వారివారికార్యనిర్వహణాలకు కావలసినవివిధహితోపదేశాలను, నియమనిబంధనలను, ధర్మాలను ఆ మనుస్మృతి ప్రసాదించింది. బ్రాహ్మణులకు కావలసిన ధర్మాలను బ్రాహ్మణులకు, క్షత్రియులకు కావలసినధర్మాలను క్షత్రియులకు అది ఉద్బోధించింది. అది చాతుర్వర్ణ మానవులకు సముచితధర్మ నియమాలను నిర్వచించింది. క్రమేణా కాలగమనంలో ఈ మనస్మృతి అపార్థవశమైంది. ఏదో విధంగా దానిలోని విషయాలన్నీ విపర్యయావస్థ పొందినవి. తలక్రిందులు చేయబడ్డవి. ఈవర్ణవ్యవస్థఅంతా, కర్మవిభజనమంతా, మాధ్యంగా చేయిబడింది. కఠినశల్యంగా మార్చబడింది. సుగంధద్రవ్యాలంకృత శవంగా మార్చబడింది. పాషాణసదృశంగా చేయబడింది. కుపండితులు దానిని నిరంకుశహింసాస్వరూపిణిగా, వజ్రకఠోరంగా మార్చివేశారు. జాతిజీవం నశించింది. ప్రతి విషయమూ యాంత్రికంగా, కృత్రిమంగా

మారిపోయింది. మనుస్మృతి ప్రజలకు సేవజేయటానికిబదులు, నిరంకుశ నియంతగా తయారైంది.

## హైందవ వర్ణ వ్యవస్థయొక్క పతనావస్థ;

విశ్వవిద్యాలయంలో సర్వసాధారణంగా ఫ్రెష్మాన్ ( Fresh man ), సాఫొమోర్ ( Sophomore ), జూనియర్ (Junior), సీనియర్ (Senior) అని నాలుగు తరగతు లుంటాయి. ఈ తరగతు లుండడంలో తప్పులేదు. ఈ తరగతు లుండడం మంచిదే. అయితే విద్యా బోధకులు ఏ తరగతిలోని విద్యార్థులు ఆ తరగతిలోనే ఉండి పోవా లని కాంక్షించరు; మొదటితరగతిలో విద్యార్థులు రెండవతరగతికి, రెండవతరగతి విద్యార్థులు మూడవతరగతికి, మూడవతరగతి విద్యార్థులు నాలుగవ తరగతికి, అభివృద్ధిపొందకూడ దని తలంచరు. వర్ణ విభజన మనేది బాగానే ఉన్నది. అందులో తప్పేమీ లేదు. కానీ—భారత దేశంలో చేయబడిన పెద్దతప్పు—నేటి హిందూదేశపతనకారణమైన ఘోరాపరాధం—ఈ వర్ణవిభజనాన్ని మాఢ్యీకరించడమే; స్తంభింపజేయడమే; పాషాణకర్కశంచేయడమే. ఈ విధంగా భారత దేశ మహాఘోరపతనానికి కారణమైన ప్రస్తుత వర్ణవ్యవస్థ బయలు దేరింది.

తాత్కాలిక విషయాలకుమాత్రమే సంబంధించిన ఆ కాలపు వ్యావహారిక విషయాలకుమాత్రమే సంబంధించిన మనుస్మృతియొక్క చంచల నియమనిబంధనలు—క్రమక్రమేణ శ్రుతియొక్క—ఉపనిషత్తులయొక్క—వేదాంతప్రబోధితమైన నిత్యసత్యముయొక్క గౌరవాన్ని అపహరించి, స్వాధీనంచేసికొన్నవి. ఈ చట్టములూ విధులన్నీ తమ కోసమేనని తెలిసికోడానికి బదులు, ప్రజలు ఈ చట్టాలకోసం, విధుల కోసం బ్రతకడం మొదలుపెట్టారు. తమలో చైతన్యమూర్తియై వెలుగొందుచున్న ఆత్మదేవుని ఆజ్ఞలకంటే, ఎప్పుడో గతించిన మృతుల అధికారానికి ఎక్కువ విలువ ఇవ్వబడింది. మానవుడంటే, రక్త మాంసాస్థిమయ దేహమే అన్న దృష్టి ప్రబలిపోయింది. సమస్త విషయాలలో సత్యాత్మ—నిత్యసత్యము—సంపూర్ణంగా విస్మరింపబడింది.

కులాచారాల భయం భయంకరభూతమై, ఒక వ్యక్తిని, తానూ ఇతర జాతిమానవులూ ఒకటే నని ఒక్కనిమిషమైనా అనుకోనీయవు. నేను బ్రాహ్మణుణ్ణి, క్షత్రియుణ్ణి, అనే దురభిమానం, హృదయంలో మానవత్వం నివసించడానికి వీలులేనంతగా పెచ్చుపెరిగిపోయింది.

మనువుకాలంనుండీ భూస్వరూపం అనేకసార్లు మారిపోయింది. నదులు తమమార్గాలను మార్చుకొన్నవి. కీకారణ్యాలు నరికివేయబడ్డవి. తగులపెట్టబడ్డవి. పుష్పజాతులూ వనస్వరూపాలూ మారిపోయినవి. క్షత్రియజీవనం లేక యోధవృత్తి, ఒకవిధంగా భారత దేశంనుండి మొదలంట తుడిచివేయబడింది. దేశ భాష దేశమునుండి కొట్టుకపోయింది. నవీనహైందవ ప్రజలకు తమ భాష గ్రీకు, లాటిన్ల వలె అపరిచయ భాషగా మారిపోయింది. అయినా భారతీయ ఆధ్యాత్మిక ఆత్మవంచకులు ఎప్పుడో మనువు తన సమకాలికులకోసం విధించిన కులాచారాలకు, కర్మలకు, కట్టుబొట్లకూ నేటికి కూడా బానిసలై యున్నారు. స్వతంత్ర భావన అన్యమతావలంబనంగా—కాదు—ఘోరమైన నేరంగా పరిగణించబడుతున్నది. మృతభాషనుండి ఏది వచ్చినా అది పవిత్రమే! నీ హేతువాదం మృతులప్రవచనాలను, వారి విపరీత విభ్రాంతులను చచ్చినట్లు లొంగి స్తుతించకున్నట్లయితే నీవు మహాపాపివే! ప్రతివాడూ నీకు ఎదురుతిరుగుతాడు. పాతసీసాలలో నీకు కొత్తమధువు నింపాలి. సర్వకర్మలూ మంచివే. ప్రతిపనీ పవిత్రమైనదే కానీ కులతత్వ విపర్యయదృష్టిచేత బాహ్యావృత్తులకు ఉచ్చనీచత్వాలు ఆపాదింపబడ్డవి. తమ బాల్యాన్ని విద్యాభ్యాసంలో వినియోగించని జనులు తమ వెనుకటి సోమరితనాన్ని యవ్వనంలో కాయకష్టంచేసి విమోచనంచేసికొంటారు. తమ పూర్వపు సోమరితనానికి వాండ్లు చెమటోడ్చి నేడు పనిచేస్తారు. వారి కాయకష్టాన్ని నీచమనడానికి లేక శూద్రకర్మను తృణీకరించడానికి, నీ వెవరు? బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యకర్మలవలె కాయకష్టం అవసరం కాదా? అగ్రవర్ణస్థులు—బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు—నడిచేవీధుల్లో నిమ్నజాతి మానవులు నడవకూడదు. పరిస్థితులు నేడు ఇంత అధమాధమ స్థితికి దిగజారినవి! పాప మీ నిమ్నజాతి మానవులు గొప్పకులాలువారు నివ

సించే గ్రామాలకు దూరంగా పూరిగుడిసెల్లో నివసించాలి. తక్కువ కులస్థునినీడ ఎక్కువకులస్థుడిమీద సోకితే ఆ అగ్రవర్ణస్థుడు ఆ అంటు పోవడానికి వెంటనే సచేలస్నానంచేయాలి. ఏ వస్తువైనా హీనవర్ణ మానవునిచే తాకబడిందా అది అపవిత్రమైనదన్నమాటే. దాని నింక అగ్రవర్ణ మానవుడు తాకనే తాకకూడదు. ఈ నిమ్నజాతి ప్రజలు తాముచేసే వెట్టిచాకిరికి, రక్తమోడ్చిచేసేపనికి, ప్రతిఫలంగా అగ్రవర్ణ ప్రజ లిచ్చే గంజో గటకో త్రాగి జీవించాలి. సత్యవిషయాలను మీ ముందుంచడానికి మీరు వినడాని కలవాటుపడని మాటలు మాట్లాడడానికి తప్పనందున రాముణ్ణి మన్నించండి. ఈ నిమ్నజాతి మానవులు, ఈ పేదశూద్రులు, ఈ పంచములు వీధులూడవాలి. మురికి కాలువలు చేతులతో శుభ్రం చేయాలి. మరుగుదొడ్లు బాగు చేయాలి. ఈ చాకిరికి వాండ్లకు లభించేది పట్టెడు పాచిన కూడు. ఈ నిమ్నజాతి మానవులు భాగ్యవంతులు కాలేరు. కటికి పేదరికంలో కాలం గడపవలసిందే. వాళ్ళస్థితినిగూర్చి ఆలోచించినపుడల్లా రాముని హృదయం బాధాకులిత మౌతుంది. గొప్పకులాల పిల్లలు విద్యనేర్చే బడులలో హీనకులస్థులపిల్లలకు ప్రవేశం లేదు. వాండ్లక్కడకూర్చుంటే అగ్రవర్ణ బాలకులు అంటుపడతారు. ఇంక ఈ అణగద్రొక్కబడిన మానవులు ఏవిద్యయినా గడించడ మెట్లు? ఈ ప్రజలు రెక్కలమ్ముకొని ఎంత పనిచేసినా కూటికి జరగడమే కనాకష్టం. ఆకలిమంటల కశువులర్పిస్తున్నారు. ప్లేగుకు, అన్నిరకాల వ్యాధులకూ ఇండియా వీరవిహారస్థలం. అనారోగ్యకరములైన ఇండ్లల్లో నివసించే ఈ పేద శూద్రులు రకరకాలరోగాలకు అంటువ్యాధులకు నిత్యం ఆతిథ్య మిస్తుంటారు. కలరా, ప్లేగు కామ పిశాచాలను తమ దేహాలను తృప్తిదీర భుజించడానికి వాండ్లు ఔదార్యంతో ఆహ్వానిస్తుంటారు. ఈ పేదలు, ఈ నిమ్నజాతిమానవులు, సమాజమంతటికీ పాదములై సర్వదా ఆధారభూతులై యుంటారు. ఈ నిమ్నజాతి మానవుల అభ్యుదయాల్ని నిరోధించే దుర్భరభారవంతమైన సమాజం, ఈ నిరుపేదలైన అమాయక పామరప్రజలయొక్క విద్యాభివృద్ధులను నిరోధించేసమాజం తన పాదాలను తానే నరుక్కుంటున్నది. ఆ సమాజం పడిపోతుంది.

ఈ నిమ్నజాతిమానవులలో ఎక్కువమంది హిందూదేశ ఆదిమ నివాసులే. నేడు మీరు హిందువు లని పిలిచే ఆర్యులు, హిందూదేశపు ఆదిమనివాసులను జయించి, ఈ దీనహీనదాస్య దశలో పడవేశారు. ఈ దుఃఖదశకు గురిచేశారు. ఈ పాపఫలాన్ని నే డనుభవిస్తున్నారు. హిందువులు—లేక—ఆర్యులు, ఆదిమనివాసుల నాదరించిన విధానంలో—తా మొకప్పుడు నాటినదాని ఫలాన్నే—మహమ్మదీయుల హస్తాలలో అనుభవించారు. నేడు హిందూదేశాన్ని పరిపాలిస్తున్న ఇంగ్లీషువారి హస్తాలలో అనుభవిస్తున్నారు. ఇదే కర్మఫలం! ఇదే ప్రతిఫల న్యాయం!

రాము డొక హిందువుడుగా గానీ, భారతీయుఁడుగా గానీ ప్రత్యేకజాతికి చెందినవాడుగాగానీ మాట్లాడడం లేదు. రామునిస్థానం సత్యమే—సంపూర్ణసత్యమే. రామునిశరీరం భారతదేశమందలి అత్యుత్తమవర్ణానికి సంబంధించింది. రాముడు ప్రపంచంలోకల్లా అధమాధమ స్థితికి అణగద్రొక్కబడిన హీనవర్ణమానవులపక్షాన మీ కీ విజ్ఞప్తి చేస్తున్నాడు. సత్యధర్మములపేర, భారతీయ పంచములయందుసైత మాత్మరూపమున ప్రకాశిస్తున్న సత్యాత్మపేర, సర్వాకులమత విభేదము లనే తెరలను చింపివేయండి; ముసుగులను తీసివేయండి. పీడితభారత ప్రజల సమస్యను పరిష్కరించండి!

అఖలజాతి పతనానికి ఈ వర్ణవిభజనం ఏ విధంగా త్రోవతీస్తున్నది? మొట్టమొదట ఈ వర్ణవిభజనాశయం—కర్మవిభజనమూ, పరస్పరప్రేమ సంరక్షణమూ—మాత్రమే. కానీ భారతవర్ణవ్యవహారాలు తలక్రిందులు చేయబడ్డవి. గుఱ్ఱమునకుముందు, బండి కట్టబడింది; ఈనాడు కర్మవిభజనానికి బదులు—ప్రేమవిభజనం, సామరస్యవిభజనం; ప్రేమరక్షణకు బదులు—పురాతనాచారాలయొక్క వివిధ విభేదాలయొక్క పరిరక్షణం,—మనకు కనబడుతుంది. ఉండవలసిన విధానమిది కాదు. ఎన్నాళ్ళక్రితమో కుట్టింపబడిన దుస్తులనొకడు ఇరుకైనా, ఇబ్బందైనా ఇప్పుడుకూడా తొడుక్కోనితీరాలని బలవంతం చేయబడుతున్నది. ఆ ఇరుకుదుస్తులు బాలుని అవయవాభివృద్ధికి భగం కలిగిస్తున్నవి. ఇరుకైనబూట్లతో పెరుగనీయబడని చీనాదేశ స్త్రీలపాదాల

మాదిరి, హైందవుని బుద్ధి సంకుచిత ప్రాచీనాచారాల ఒత్తిడిలో వికసించడానికి వీలులేకుండా చేయబడుతున్నది. హైందవుని శాస్త్ర వైదుష్యం రెండు గోడలమధ్య పరుగెత్తడంవంటిది.

ఒకవ్యక్తి రెండురోగాలచేత బాధపడుతున్నాడు. ఒకటి కడుపునొప్పి ; రెండవది కండ్లమసక. వాడు తన రోగవిషయం వైద్యునితో విన్నవించుకున్నాడు. వైద్యుడతనికి రెండు మందు లిచ్చాడు—ఒకటి కడుపునొప్పికి, మరొకటి కండ్ల జబ్బుకు. కానీ ఆ రోగి ఆ రెండు మందులను కలిపివేశాడు. గర్భరోగనివృత్తి కిచ్చిన ఔషధంలో మిరియాలు, లవణమూ మొదలైన ఉష్ణపదార్థా లున్నవి. నేత్రరోగ నివృత్తి కిచ్చిన ఔషధంలో—సౌవీరము, తుత్తునాగమూ మొదలైన వస్తువు లున్నవి. సౌవీరము లోపలికి పుచ్చుకుంటే విష మని మనకు తెలుసు. మిరియాలు, లవణం లోనికి తీసికోవచ్చు ; కానీ కండ్లకు వాడకూడదు. ఈ రోగి రెండు మందులను తారుమారు చేశాడు. కడుపుమందును కండ్లకు వాడాడు. కండ్ల మందును కడుపుకు వాడాడు. కడుపూ చెడ్డది ; కండ్లూ చెడిపోయినవి. భారత దేశంలోని సంఘటన మిలాంటిదే. పనిలో విభజన ముండాలి. అయితే ఆత్మలో ఐక్యసామరస్యా లుండాలి. కానీ దురదృష్టవశాత్తు, అజ్ఞానవశాత్తు, ప్రేమసూత్రము, సమతాదృష్టి విభజింపబడి, బాహ్యవిధులకు భద్రత చేకూరింది.

ఆచారమనే లోకసమ్మతమనే పెనురాక్షసి జాతియొక్క జీవశక్తిని, సహజప్రతిభను, స్తంభింపజేసింది. గడ్డ కట్టించింది. శాస్త్రాచారపరాయణత్వమంటే — సోదరమానవబహిష్కరణగా, అంధాచారపరిరక్షణగా మారిపోయింది.

అగ్రవర్ణమానవుడు ఆచరణలో స్వస్వరూపమైన సత్యాత్మయొక్క మహాత్వ ప్రతిభాపావనత్వములను విస్మరించి, ఆ ఆత్మనే, వేదాంతమునే కాలిక్రింద త్రొక్కుతూ తన ప్రాపంచిక పదవీ గౌరవ సంపద్విశేషాదులను చూచుకొని, బుద్ధిమాలి, గర్వపడసాగాడు. అప్పుడతనిలో తనపదవిని, తనహోదాను నిలబెట్టుకోవాలనే ఆకాంక్ష; వ్యక్తిగత విభేదమును, స్వార్థాధిక్యతను కాపాడుకోవాలనే దురభి

మానం; బయలు దేరింది. జీవిత ప్రాముఖ్య విషయాలను కాళ్ళక్రింద త్రొక్కి, అప్రాముఖ్యవిషయాలను నెత్తిమీద పెట్టుకొనజేసే అగ్రవర్ణ మానవుని ఈ అజ్ఞానదృష్టే, వానిపతనానికీ, వాణ్ణి ఇంద్రుడవ్వా చంద్రుడ వని పొగడుతూ, వాని అజ్ఞానదంభదౌష్ట్యాలకు ప్రోత్సాహ మొసగిన నిమ్నకులస్థులైన పామరజనులపతనానికీ—దారితీసింది.

ఈ చెడు నే విధంగా మనం నివారించడం? ఇప్పు డీ హిందువు లను, ఆర్యులను, శూద్రులయెడ క్రూరంగా వర్తించినందుకు చితుక ద్రొక్కి వేద్దామంటారా? దీనివల్ల విషయాలు చక్కబడతవా? పడవు! పడవు!! గాయకునకు నీవు వేయవలసిన పెద్దశిక్ష—అతని తప్పు సవ రించి సక్రమపథంలో పెట్టడమే. నేరస్థునకు, పాపికి, విధింపగల పెద్ద శిక్ష—వానికి విజ్ఞానముగరపి, వానిలోని అజ్ఞానమును సంహరించడమే. వానిలోని పాపిని చంపాలంటే, నీ వా మనిషిని చంపనవసరం లేదు. వాని లోని పాపి అజ్ఞానం. వానికి విజ్ఞానంగరిపి వాని అజ్ఞానమును పోగొట్టు. అప్పుడు విషయాలు చక్కబడతాయి. ఇదే విషయాలను చక్కబరచ డానికి—అజ్ఞానరోగక్రిమిని సంహరించడానికి—సక్రమమార్గం.

ఆర్యులు, హిందువులు ఇప్పటికే అనుభవింపవలన బాధలన్నీ అనుభవించారు. ఆదిమనివాసులయెడ వారు చూపిన క్రూరత్వానికి తిరిగి వారిపై కసితీర్చుకోడానికి మీ రమెరికానుండిగానీ యూరప్ నుండిగాని బయలుదేరపని లేదు. వాండ్లు తమ కర్మఫలాన్ని తాము సంపూర్తిగా అనుభవించారు. అనేక శతాబ్దాలనుండి వాండ్లు పరపరి పాలనంలో, దాస్యంలో బ్రతుకుచున్నారు. ఆఫ్ఘనిస్థానమునుండి జనులు వచ్చి, దేశముపై దండయాత్రచేసి, వాండ్లను జయించారు. గ్రీసునుండి జనులు వచ్చి, వాండ్లపై ఏలుబడి సాగించారు. పర్షియా నుండి జనులు వచ్చి, వాండ్లపై ప్రభుత్వం చెలాయించారు. ప్రపంచపు నాలుగు మూలలనుంచి జనులు వచ్చి, వాండ్ల నదరించి బెదరించారు. వాండ్లదోషాలకు తగినఫలాన్ని వాండ్లు అనుభవించారు. ఇప్పుడు, మీరు వెళ్ళి వాండ్లను ఓదార్చవలసిన సమయం; ఉత్సాహపరచవల సిన సమయం; అద్వైతాంతికమైన, కులదురభిమానరూపకమైన వాండ్ల అజ్ఞానమును పారద్రోలవలసిన సమయం.

ఈ కుల విభేదభావాలచేత విచ్ఛిన్నములై భారతీయుల శక్తి సామర్థ్యాలు ఎంత చెడుమార్గంలో, ఎంత విచారకరమార్గంలో వ్యయం చేయబడ్డవి! భారతీయ కుల వ్యవస్థద్వారా పుట్టిన పాక్షిక విద్వేషాల వల్ల, జాతిపై షమ్యాలవల్ల, నైతిక ఆధ్యాత్మిక అసూయాభావాన్ని, విరోధగుణాన్ని కలుగజేసి మనస్సమతను పోగొడుతుంది. మొదట చాతుర్వర్ణ వ్యవస్థ ఏర్పడింది. ఆ చాతుర్వర్ణములు శాఖోపశాఖలుగా చీలి వందలకొద్ది కులాలు ఏర్పడ్డవి. ఇవి ఇంకా ఇంకా పెరిగిపోతున్నవి. ఈ కులాలకుతోడు, మహమ్మదీయమతం, ఒకకులం. క్రైస్తవమతం, వేరొక కులం. దివ్యజ్ఞాన సమాజం, మరొక కులం. ఆర్యసమాజం, ఇంకొక కులం. ఇవిగాక—చిత్రవిచిత్రపు పేర్లతో, బయలుదేరిన పుట్ట కొక్కుసంఘా లెన్నెన్నో! ఇవన్నీ క్రొత్త క్రొత్త కులాలే! మహమ్మదీయుడు కనబడ్డాడా, హిందూ విద్యార్థి మనస్సు మనస్సులో ఉండదు. క్రైస్తవుడు దృష్టిలో పడతాడనుకోండి, హిందువుని మనస్సు సమతను కోలుపోతుంది. హిందువులలోనే వేరొక కులానికి చెందిన హిందువును చూచినప్పుడు, పూర్వాచారపరాయణుడైన హిందూ విద్యార్థి ముఖం ముడుచుకుంటాడు.

భారత దేశంలో, విపరీతరూపము ధరించిన ఈ కులవ్యవస్థ, ఈ విభేదము, వాండ్లమానసికశక్తులను సక్రమాభివృద్ధి పొందకుండా చేస్తున్న విషయం మీకు కనబడడంలేదా ? ఈ కులవిభేదము వాండ్ల విద్యాభ్యాసమును సాంగోపాంగంగా సాగనీయడం లేదు. అందుచేత భారత దేశంలో మన విద్యాకృషి అభివృద్ధిపొందడానికి, ప్రజలు మనస్సులను సమస్థితిలో ఉంచగల పరిస్థితులను మనం కల్పించాలి. ఈ అసహజమైన విభేదం, ఈ కులతత్వం రూపుమాసినప్పుడే ప్రజలకు మనస్సమత కలుగుతుంది.

అయితే మీ అమెరికా దేశీయులు సంపూర్ణంగా కులతత్వ విముక్తులని రాముడు చెప్పడంలేదు. మీరు సంపూర్ణకులతత్వ విముక్తులుకారు. నీవు క్రైస్తవుడవైతే, హిందువునుగానీ, బౌద్ధునిగానీ చూడటాని కిష్టపడవు. ఇదేమిటి ? కులతత్వమే! నీవు అమెరికన్ వైన ట్లయితే ఆంగ్లేయుని చూచి ఓర్చుకోలేవు. నీవు రాజకీయ కులతత్వం

చేత పీడింపబడుతున్నావు. నీవు తెల్లమనిషివైతే, నీగ్రోతో కలిసి ఒక చోట పనిచేయలేవు. నీవు సాంఘిక కులభూతగ్రహస్తుడవై యున్నావు. మీ పొరుగువారిమీద మీకు అసూయ ఉన్నప్పుడు మీరు సంపూర్ణంగా కులతత్వమునుండి విముక్తులు కాలేదన్నమాటే!

అసూయ కలగడానికి కారణ మేమిటి? అసూయకు కారణం కులతత్వమే. కులభేదదృష్టే. వేరే కారణము లేదు. నీ సహోద్యోగి నీ సముఖంలో ప్రశంసింపబడడం నీ కిష్టంలేకపోతే నీవు కులభావంచేత పీడింపబడుతున్నట్లే. అమెరికాలో ఎవనికి ఎక్కువ డబ్బుంటే వాడే ఎక్కువకులస్థుడు. అమెరికాలో వర్ణవ్యవస్థ, ధనప్రధానమైంది. అమెరికాలో ఎన్నో సాంఘిక దురాచారాలున్నవి. అమెరికా తన కంట్లో ఉన్న దూలమును తాను తీసివేసికోవాలె. అమెరికా సంస్కరింపబడాలె. అమెరికా సాంఘిక వ్యవస్థ సంతృప్తికరంగా లేదు. వేదాంత జ్ఞానము అమెరికా కత్యవసరమైయున్నది. కానీ భారతదేశస్థితి అమెరికా దేశస్థితికంటే మరీ అధ్వాన్నంగా ఉన్నది. అమెరికా కులతత్వం, లోకసామాన్యరూపంలో వంగుబాటుగా, మెత్తగా ఉన్నది. కానీ భారతీయ సమాజం యంత్రప్రాయమై, స్తబ్ధమై గడ్డకట్టి నిర్జీవమై యున్నది.

జీవితం, పరంపరాఽన్వయ సూత్రాలమీద వికసిస్తుంది. పరంపరాధర్మం అధోరాజ్యాలను పరిపాలిస్తూంటుంది. మానవుడుకూడా తన శారీరకశక్తులను, అవయవాలను, పరంపరాన్వాయమునుండే గ్రహిస్తాడు. కానీ ముఖ్యంగా మానవుడు, అన్వయంవల్లనే—విద్యవల్లనే— పరిపూర్ణ వికాసదశకు, పరిపక్వ స్థితికి ప్రబుద్ధస్థితికి అధిగమిస్తాడు. కోడిపిల్లలు, గుడ్లల్లోనుంచి వెలువడగానే, తమ తలిదండ్రుల తెలివితేటలన్నీ కలిగియుండడం కనబడుతుంది. కొన్ని పక్షులు, పుట్టగానే తమ పూర్వీకుల్లాగే ఈగలను పొడిచి తినడానికి ప్రారంభిస్తాయి. అవి తమ సర్వశక్తులనూ తల్లిదండ్రులద్వారా పొందుతాయి. ఆ పరంపరాగతశక్తితోటే వానిప్రగతి అంత్యమవుతుంది. కానీ మానవుడు, ముఖ్యంగా విద్యద్వారా అన్వయంద్వారా అభ్యున్నతిని పొందడం మనం చూడగలం. పసిపాప, కుక్కపిల్లలాగే తెలివితేటలు లేకుండా అల్లరిగా

ఉంటుంది. కొన్నివిషయాలలో పసిపాపకంటే కుక్కపిల్లే తెలివిగల దనిపిస్తుంది. కానీ, మానవులకూ జంతువులకూ మధ్యనున్న పెద్దతేడా ఏమిటంటే—కుక్కపిల్లతన పరిపక్వదశకు కావలసినదంతా వంశపరంపరాన్వాయమునుండి పొందుచున్నది. శిశువు—విద్యవల్లా, అన్వాయం వల్లా, సమస్తప్రపంచమును తన వశంలోకి తెచ్చుకొనేటంతగా అభివృద్ధిపొంది, తన పారంపర్యశక్తులను వికసింపజేస్తున్నది. హిందువులు చేసిన పెద్ద తప్పు—విద్యాన్వయ సూత్ర ప్రయోజనముల త్రోసిపుచ్చి, మానవులను పశుపక్షివృక్షాదుల హీనదశకు గురిచేసేటంతగా—వంశపరంపరాసూత్రములను సమాజముపై బలవంతంగా ప్రయోగించడమే. ఆత్మయొక్క అనంతావకాశముల గూర్చిన విశ్వాసం వాండ్లకు ఆచరణలో లేదు. శూద్రుడు విద్యాసంస్కృతిచేత బ్రాహ్మణత్వమును పొందగలడని వాండ్లు నమ్మరు. అత్తిచెట్టుకు అత్తిపండ్లే కాస్తాయి కనుక, కుక్కకు కుక్కపిల్లలే పుడతాయిగనుక, శూద్రునకు శూద్రుడే, వైశ్యునకు వైశ్యుడే జన్మిస్తాడని, జన్మతః వచ్చిన కులం మారదని వాండ్లవాదం, ఈ అసత్యమైన, అల్పమైనసిద్ధాంతాన్ని తీసికొని వాండ్లు నిత్యజీవితరంగంలో నడుస్తుంటారు. ఒకప్పుడు, మహావిజ్ఞానభావులు, పూజనీయులు,అద్భుతతత్వవేత్తలు, తపస్సంపన్నులైన మహర్షుల గర్భవాసమున పుట్టిన ఎందరో బ్రాహ్మణులు — విద్యాసంస్కృతులు లోపించినందున మౌఢ్యదశకు, అవివేకస్థితికి దిగజారి పతితులుకాలేదా? మరి, అనాగరిక, ఆటవిక విద్యాసంస్కారవిహీన ప్రజలకు జనించిన వ్యక్తులెందరో— నేటి ఆంగ్లేయులు, యూరోపియన్లమాదిరి, విద్యవల్ల, కఠినమైన స్వయంకృషిచేత, శారీరక, మానసిక, రాజకీయశక్తుల మహోన్నతస్థాయి నందుకోలేదా? భగవంతుడు, వ్యక్తులనూ, కుల గౌరవాలనూ అభిమానించేవాడు కాదు. కృషిచేసేవాడు కుశలంగా జీవిస్తాడు. ఎవడు తనకు విద్యగరపుకొని విజ్ఞానవంతుడౌతాడో వానికే నిలవడానికి స్థానముంటుంది.

మీరు కులతత్వమునుండి సంపూర్ణంగా విముక్తులై యున్నారని రాము డనడం లేదు. భారతీయులు మీకంటే ఎక్కువగా కులతత్వపీడితులై యున్నా రని మాత్రమే రాముడు చెబుతున్నాడు. భార

తీయులకంటే ఎక్కువ సులభంగా మీరు కులతత్వబంధాలను వదలించుకోగలరు. కొన్ని విషయాల్లో, మీరు భారతీయులకంటే రామునకు దగ్గరగా ఉన్నారు. మీలోని స్వాతంత్ర్యశక్తిని, బలపరచి, ఉత్తేజపరచి, అభివృద్ధిపరచి, జాజ్వల్యమానంగా ప్రకాశింపజేసి, దానితో భారతీయులయందుసైతం స్వాతంత్ర్యశక్తిని ప్రదీపింపజేసి, మీ సంతోషసౌఖ్యాలను వారికికూడా పంచిపెట్టగలరని రాముని అభిలాష. ఈ విధంగా మనం, చెడును కూకటివ్రేళ్ళతో పెకలించి కూలద్రోయగలం. వేదాంతమునకు వ్యతిరేకమైన, వేదాంతమునకు పరమవిరుద్ధమైన ఈ ద్వైతదృష్టిచేతనే—ఈ భేదదృష్టిచేతనే—మానవులు, శారీరకంగా, మానసికంగా, ఆధ్యాత్మికంగా ఆత్మహత్యచేసికొంటున్నారు.

ఈ రోగాన్నిగూర్చి మరికొన్ని మాటలు : అగ్రవర్ణస్థులైన బ్రాహ్మణులు, ఏ కాయకృషి చేయడానికైనా, తమ గౌరవానికి లోపంగా తలుస్తారు. అగ్రవర్ణ ప్రజలు, తమ కులాచారసమ్మతముగాని ఏ పనికూడా ముట్టుకోరు. ఉదాహరణ :— బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు—ఈ మూడు అగ్రవర్ణాలకుచెందిన జనులు—చెప్పులుకుట్టేవానిపని, మంగలివానిపని, నావికునిపని, చిత్రకారునిపని, కమ్మరివానిపని, రంగులద్దువానిపని, దర్జీవానిపని, వడ్రంగిపని, నేతవానిపని, కుమ్మరివానిపని లేదా సాధారణశ్రామికునిపని—ఏ పనినైనా సరే ముట్టనే ముట్టరు. ఇంక వీధులూడ్చేవానిపని విషయంలో—చెప్పవలసిన పనే లేదు. ఈ అగ్రవర్ణమానవులు చావనన్నా చస్తారుగాని, ఇలాంటిపనులు ముట్టనేముట్టరు. చర్మసంబంధమైన వ్యాపారం వాండ్లు చెయ్యనే చెయ్యరు. కాస్త పెట్టుబడి పెట్టగలిగిన ఈ అగ్రవర్ణస్థులే ఈ పనులు చెయ్యక, చేతుల్లో దమ్మిడీలేని తక్కువజాతిప్రజలమీద నెట్టితే, భారత పరిశ్రమలు, కర్మాగారాలు, ఏ విధంగా అభివృద్ధి పొందడం? ఉపయోగకరమైన కళల్లో ఏ విధంగా వాండ్లభివృద్ధి తేగలరు? అమెరికా నేడు పరిశ్రమలవల్లనే శ్రీమంతంగా ఉన్నది. ఇంగ్లాండు, తదితర యూరప్ దేశాలు, పెట్టుబడి పెట్టగలిగిన ప్రజలచేత స్థాపింపబడిన పరిశ్రమలచేతనే ఈ నాడు భాగ్యవంతములై యున్నవి. 3/4 వంతుకు

మించి ప్రజలు, పరిశ్రమలను నిరసించి, మంచిపనులను ఏవగించి, దాన్ని మతమని పిలుస్తూ, మృతాచారాలకూ, పూర్వకాలపు వృత్తులకూ పురుగుల్లాగా పట్టుకొని వ్రేళ్ళాడుతుంటే, ప్రజలకు ఏ ఆశ ఉంటుంది ?

గతించిన పూర్వవిషయాలను నెత్తిన పెట్టుకొనే బానిసతనంచేత, మృతులదృష్టితో దప్ప తమ దృష్టితో చూడలేని అంధత్వంచేత, ఇప్పుడు వర్ణించడానికి వీలులేని ఇంకా ఎన్నెన్నో సాంఘిక దురాచారాలు భారతదేశంలో నిరంకుశంగా పరిపాలన సాగిస్తున్నాయి. పూర్వాచార పర్వతభారాలక్రింద నలిగి చస్తున్న ప్రజలనుండి మన మాశించగలిగిన దేమున్నది ? ఓ అమెరికా దేశీయులారా ! తమ తాతముత్తాతలమడిమలక్రింద—కాదుకాదు—వాండ్లపేర్లక్రింద—పడి నలిగిపోతున్న భారతీయులను లేవదీసి, వాండ్ల తాత-ముత్తాల భుజాలపై ఎక్కి నిలుచోడానికి సహాయపడండి ! తమ సమున్నత పిత్రార్జిత సంపదకు దాసులుకావడానికి బదులు, దాని కధిపతులై జీవించడానికి భారతీయులకు తోడ్పడండి ! వాండ్ల పిత్రార్జితం వాండ్ల వంశంలో ఉండాలెగాని, వాండ్లు పిత్రార్జితానికి వశులై యుండకూడదు. భారతీయుల సాంఘికాచారాలు, లౌకికవిధానాలు శ్లాఘ్యమైన ప్రయోజనకరములైన సుగుణాలుకూడా కలిగిఉన్నవనడంలో సందేహం లేదు. కానీ ఆ ఆచార, వ్యవహారాలకు మూఢంగా, గ్రుడ్డిగా చేస్తున్న దాస్యమే వాండ్లను నిర్వీర్యులనుగా నిర్జీవులనుగా చేస్తున్నది.

సంయుక్తరాష్ట్రమందలి ( United States ) మొత్తం జనాభాకు రెట్టింపుగావున్న భారతదేశమందలి 1500 లక్షల (150 మిలియన్లు) స్త్రీలకుగాను, నూటికి ఒకరుకూడా సంతకంపెట్టడం వరకైనా, నేర్చినవాండ్లు లేరు. పరిస్థితులిట్లున్నప్పుడు, వారికి కలిగే సంతానానికి ఘోరమైన మూఢవిశ్వాసం, పిరికితనం ఎందుకు సంక్రమించదు ?

ఉత్కృష్టములైన ఉపనిషద్బోధనల స్థానమును, ఉజ్జ్వల వేదాంత స్థానమును—తిండితీర్థాల విషయమైన విపరీతదురభిమాన మనే వంటియింటిమతం—ఆక్రమించింది. పూర్వాచారపరాయణులైన గొప్ప

గొప్ప పండితుల వైదుష్యవిశేషము — వాడుకలోలేని పురాతన సంస్కృత వ్యాకరణ సూత్రాల యాత్రికాధికార వలయాన్ని దాటి ముందుకు పోదు. పురాతనగ్రంథాలను బట్టీపెట్టి, ఉదాహరణలను ఏకరువుపెట్టడంవల్ల స్వతంత్ర విచారకర్తలైన, స్వతంత్రవాదులైన మహామునీషులందరికంటే నీవు ఘనుడవుగా గౌరవింపబడతావు. నీకోటి ప్రజల అజ్ఞానవినోదమునకు చక్కిలిగింత పెట్టడానికి, వేద శాస్త్రాలను మెలిబెట్టి చిత్రవధచేయగలిగితే—నీవు మహాపండితుడవే! స్నానంచేసేటప్పుడు ఎన్నిసార్లు నీళ్ళలో మునిగిలేవాలె ? ?—ఇలాంటి మూఢప్రశ్నలను గూర్చిన తర్కవితర్కాలలో ఎంతోమందియువకుల మనశ్శక్తులు వ్యయమై పోతున్నవి.

కులమతభేద సంకుచిత వలయ నిర్బంధత, మితిమించిన శాస్త్ర ప్రమాణవిశ్వాసం, వాండ్లను — అతి స్వల్పవిషయాలు, అర్థరహిత చిహ్నాలుకూడా ప్రగాఢోద్రేకమును పుట్టించేటంతగా—అజ్ఞానరూపక మైన దురభిమాన సముద్రంలో ముంచివేసినవి. ఈనాడు, హిందూ దేశముయొక్క సర్వసామాన్యమతమందలి అతిపవిత్రమైన అత్యంత ప్రాముఖ్యమైన విషయం — మితిమించిన గోభక్తి. హిందూమత మందలి కొన్నికొన్ని శాఖలు, తదితర విషయాల్లో ఉత్తరదక్షిణ ధృవాల్లాగా పరస్పరవిరుద్ధంగా ఉన్నా, మితిమించిన గోభక్తి విష యంలో మాత్రం అన్నీ ఏకీభవిస్తాయి. సర్వసామాన్యంగా హైందవు నకు ప్రియమైన వింతవిషయం, పరమప్రియమైన విషయం—గోశరీర పావిత్ర్యం. గోవిషయం మాటమాత్ర మెత్తండి. వెంటనే హైందవు నిలో ప్రగాఢభావోద్రేకము, తీవ్రమైన ఆవేశం, ప్రకటితమవుతుంది. అసంఖ్యాకములైన కక్షలూ, కలహాలు, అనుదిన మీ ముక్కోపము కలిగించే సమస్యపైనే బయలుదేరుతున్నవి. 1857 లోని సిపాయీల పితూరీ, గోవుపేరతే వచ్చింది. హిందువుల కతిప్రియమైన ఈ మూఢ విశ్వాసంవల్లనే, మహమ్మదీయులు భారతదేశమును ప్రప్రథమమున జయించడం జరిగిందని చెపుతారు. ఘోరీమహమ్మద్ తొలిసారి భారతదేశమును ముట్టడించినప్పుడు, ధీరులైన హిందూరాజపుత్రుల చేత తరుమగొట్టబడ్డాడు. కానీ అతడు, హైందవహృదయానికి అత్యంత

సన్నిహితములైన పిచ్చినమ్మకాలనూ, అభిరుచులనూ బాగా తెలిసి కొని, తిరిగి హిందూదేశంపై దండయాత్ర చేశాడు. తన సైన్యము చుట్టూ అతడు గోవులను వ్యూహంగా నిలబెట్టాడట. ఎంత విచిత్రమైన దుర్గమును సృష్టించుకొన్నాడో చూడండి! ఇంక హిందువులతణ్ణి ఎదుర్కొనలేకపోయారు. పూజనీయమైన గోవుపై వాండ్లేవిధంగా ఆయుధ ప్రయోగం చేయగలరు? కారుణ్యహృదయుడైన హైందవుడు అమాయకమైన పవిత్రమైన గోసమూహమును చూడగనే, వెనుకంజ వేశాడు. వానిపై ఆయుధ ప్రయోగమును విరమించుకొన్నాడు. దేశాన్ని పోగొట్టుకొన్నాడు—శతాబ్దాలనుండి ఈ నాటి వరకు, కోటానుకోట్ల గోవులు పీడింపబడినవి; పీడింపబడుతున్నవి. కర్కశహృదయులైన శత్రుపాలకులవల్ల ముక్కలుముక్కలుచేయబడి మెక్కబడుతున్నవి. ఈ కథ నిజంకాకపోవచ్చు; కాకపోయినా, ఇట్టి సంఘటనలకు నేటికీ అవకాశమున్నది. ఇలాంటి అజ్ఞానం సనాతన మతము పేరిట చెలామణి అవుతున్నది. వైపరీత్యమును గుర్తించండి. పరమపవిత్రములైన శ్రుతులు, భవ్యములైన వేదములు, గోమాంసమును నిషేధించడానికిబదులు, కొన్ని సందర్భాలలో గోయజ్ఞం చేయమని ఆదేశిస్తున్నవి. ఉదాహరణానికి: యజుర్వేదశతపథబ్రాహ్మణము—బృహదారణ్యకోపనిషత్తు 6వ అధ్యాయం 4వ బ్రాహ్మణము—18వ మంత్రమును పఠించండి:

"విద్వాంసుడైన కుమారుడు కలగాలంటే — యశస్వి, సుప్రసిద్ధుడు, సర్వజనానురంజకవచస్వి, సర్వవేదజ్ఞుడు, దీర్ఘాయుష్మంతుడూ అయిన కుమారుడు కలగాలంటే—మాంసనవనీతసంయుక్తముగ వండబడిన అన్నమును భార్యాభర్తలిద్దరూ భుజించాలి. అప్పుడా దంపతులు సంతానమును కనడానికి యోగ్యులౌతారు. ఆ మాంసము, కోడెదూడదిగానీ, పెద్దఎద్దుదుగానీ (ఉక్షము లేక వృషభముది) అయియుండాలె"

ఓహో! గోశరీరాలమీద, చీమలమీద, అత్తిచెట్లమీద ప్రసరింపజేసి మన భక్తిభావాలను వ్యయంచేయడానికి బదులు, సమస్తమైన పిరికితనమునుండి మనం విముక్తిపొందేలాగుచేసే ;—"నాసాంత"

మని మనమనుకొనే క్షుద్రశరీరంమీది వ్యామోహంతోపాటు తండ్రులు తాతల, మేనమామల, సర్వబాంధవుల శరీరాలమీంది వ్యామోహా న్నంతా, దౌర్బల్యమును కలిగించే విభ్రాంతినంతా, పటాపంచలుచేసి, మనకు పరమస్వేచ్ఛను ప్రసాదించే—(శ్రీ) కృష్ణ ప్రబోధితమైన—ఆ వీరవేదాంతం, ఆ అభయవేదాంతం ఎక్కడున్నది! ద్వాదశాదిత్యులు నశించినా అగణితజగద్గోళాలు ఒక్కసారిగా రాలి శూన్యంలో కలిసి పోయినా మానవుని చలింపనీయని—నిత్యసత్యజ్ఞానమును—సత్యాత్మ జ్ఞానమును—కలిగించగల ఆనందవేదాంతం నేడు కావాలి!

భారతీయులకు మానసిక బల మున్నది; శారీరకబల మున్నది; ఆధ్యాత్మిక బల మున్నది. అయినా—జలశాస్త్రంలో మీరు ఫలిత శక్తినిగూర్చి (Resultant of Pressure) మొత్తపు శక్తిని (Total Pressure) గూర్చి చదివేవుంటారు. ఒక శరీరంమీద మొత్తపు శక్తి, అపరిమితంగా, అత్యధికంగా, అద్భుతంగా ఉండవచ్చు. కానీ ఫలిత శక్తి శూన్యంగావచ్చు. భారతదేశంలో లక్షలకొలది బ్రహ్మాండమైన శక్తు లున్నా, కలసి పనిచెయ్యవు. ఒక శక్తి మరొక శక్తిని అణచి వేస్తుంది. ఇంకొక శక్తి వేరొకశక్తిని సమానబలంతో ఎదుర్కొం టుంది. అందుచేత ఫలితరూపకమైన జాతీయశక్తి శూన్యమైపోయింది. బాహ్యాచారవ్యవహారాలలో మూఢంగా ప్రేమను కేంద్రీకరించడం, కర్మకలాపాలమీద, బాహ్యరూపాలమీద అంధంగా అభిమానమును ప్రసరింపజేయడం, దృశ్యముల యథార్థతలో అంధ విశ్వాసమును కలిగి యుండడం, పరిస్థితులకాఠిన్యత,—ఇవన్నీ జాతిద్వేషమును, కుల, మత వైషమ్యమును, పాక్షికదృష్టిని, వర్ణాభిమానమునూ—తెచ్చిపెట్టాయి. అందువల్ల ప్రజలు, తమ మనస్సులు కలుపలేకపోతున్నారు. ఈ వైవిధ్య దృశ్య ప్రపంచ మూలమున గల ఏకత్వమును సాక్షాత్కరించుకొని అనుభవంలో పెట్టుకోవడంవల్ల జాతికి కలిగే అమోఘ చైతన్యశక్తిని ప్రభవింపజేయ లేకపోతున్నారు. ప్రజానీకమందలి ఈ అనుష్ఠాన వేదాంత రాహిత్యమే—భారత దేశమును విభజింపబడి వికృత రూప మొందిన గృహంగా చేసివేసింది. అసంఖ్యాకసంఘాల మధ్యగల పరస్పర బాంధ వ్యాలు త్రెంపివేయబడినవి.

ఇదే హిందూదేశ మందున్న చెడు. ఈ భేదదృష్టి — బ్రిటిష్ ప్రభుత్వంచేత ప్రోత్సహింప బడినదన్న విషయాన్ని రాముడు రహస్యంగా ఉంచడు. "విభజించి, విజయం పొందు"—అన్న పాలకుల రాజ్యతంత్రము, హిందూ-మహమ్మదీయుల మధ్యగల హిందువులలోనే వివిధశాఖల మధ్యగల అఖాతమును వెడల్పు చేస్తున్నది. ఆధ్యాత్మికంగాగాని, రాజకీయంగాగానీ, సాంఘికంగాగానీ, మరి ఏ విధంగానైన గానీ—భారత దేశం రక్షింపబడాలంటే—విభేదమును, అనైకమత్యమును తొలగించగల, కుల,మత,జాతి,భేద,భావ శిరస్సుపై దెబ్బకొట్టగల, అసూయను సోమరితనాన్ని చావగొట్టగల సంస్కృతివల్లనే — రక్షింపబడుతుంది. భారత దేశం లేచి నిలబడా లనుకొంటే, తిరిగి జీవించాలనుకొంటే, తోటిజాతుల మధ్య తన స్థానమును తాను నిలబెట్టుకోవాలంటే, ఇంగ్లాండుకూ అమెరికాకూ, సమస్త ప్రపంచానికీ — అది ఆనందప్రదానస్థానంగా వర్థిల్లాలంటే, భారత దేశమునుండి ఈ దుర్గుణాలను మొదలంట పెరికివెయ్యాలె. ఎవడైనా రోగగ్రస్తుడైనప్పుడు అంతఃప్రకృతికి దోహదమ్మై, తోడ్పడగల ఔషధాల నిచ్చి, వానిరోగం నయంచేయగలం. అంతఃప్రకృతియే మన రోగమును నివారిస్తుంది ; మందులు కేవలం బాహ్యోపకరణాలు మాత్రమే. ఔషధాలు ప్రకృతికి సహాయపడతాయి. ప్రకృతి, రోగమును నివారిస్తుంది. అదే మాదిరి, భారత దేశం తిరిగి బాగుపడడానికి, మీ రామె అంతర్జీవనసూత్రమును బలపరచగల - ఆమె అంతఃపురప్రకృతిని పుష్టీకరించి ప్రోత్సాహపరచగల - ఆలంబన మామెకు సమకూర్చాలె.

భారత దేశమును పీడిస్తున్నవ్యాధి బాధ లేమిటో మీకు విశదీకరింపబడ్డవి. ఇంక ఆ వ్యాధి బాధా నివారణోపాయముల గూర్చి ఆలోచిద్దాం.

నీతులూ, నిబంధనలూ, విషయాలను చక్కపరుస్తా యని ప్రపంచమనుకుంటుంది ; బహుళమతాలు విశ్వసిస్తాయి ; నీతిశాస్త్రవేత్తలు నిర్వచిస్తారు. కానీ నీతులూ నిబంధనాలవల్ల విషయాలు చక్కబడవు! పడవు !! పడవు !!! నీతులు, నిబంధనలు, ప్రవర్తన విషయమైన కృత్రిమ శాసనాలు, అసహజమైన నైతికత - ఇలాంటి

వెప్పుడూ విషయాలను చక్కబరచలేవు. దీనిని గుర్తుంచుకోండి! "ఇది నీవు చేయకూడదు", "అది నీవు చెయ్యాలె" - ఇలాంటి శాసనా లెప్పుడూ ఏ సంస్కరణాన్ని కల్గించలేవు. ఈ నీతులూ, నిబంధనలే విషయాలను చక్కబెట్ట గలిగినట్లయితే వాగ్దత్తమైన భగవద్రాజ్యం ఏనాడో స్థాపింపబడి యుండేది. ప్రపంచం స్వర్గంగా మారి యుండేది. ప్రపంచం ఈ నాడున్నట్లుండేది కాదు. ఈ నీతులూ, నియమనిబంధనలు విషయాలను సరిచేయలేవు. మీ శిక్షలూ, చెఱసాలలూ విషయాలను చక్కబరచలేవు. జైళ్ళవల్లా నిర్బంధాలవల్ల మంచి జరుగుతుందనుకోవడం పెద్ద పొరపాటని ఇవ్వాళ కాకపోతే రేపైనా ప్రపంచం తెలుసుకోక తప్పదు. కేవల శిక్షాదండనలవల్ల పాప మెప్పుడూ నివారింపబడలేదు. ప్రయోజనకర విధానంలో విషయాలను చక్కపరచడానికి, విజ్ఞానమును సంస్కృతిని సజీవజ్ఞానమును మీరు కలిగించాలె! ఇదే అత్యావసరంగా చేయవలసిన పని. చమత్కార సిద్ధాంతాలతో, రమ్యములైన ఊహాగానాలతో, మమ్మల్ని బాధపెట్టవద్దు; మాకీ శుష్కభావాలతో పని లేదు - అని జను లంటారు.

ఓ మానవులారా! మిమ్ము పరిపాలిస్తున్న దేమిటి? ప్రపంచాన్ని పరిపాలిస్తున్న దేమిటి? భావనే! భావనే!! భావనే!!! మీ అంతర్జ్యోతే, మీ ఆంతర్యజ్ఞానమే మిమ్ము నిజంగా నడుపుతున్నది. జైళ్ళలో చెఱసాలలో బంధించడానికి బదులు, మీరు నేరగాండ్రకు ప్రబోధించాలె; ప్రపంచమును పరిపాలిస్తున్న దైవ ధర్మములను తెలియజెయ్యాలె. "జ్ఞానమే సౌశీల్యము" -- అని చెప్పబడింది. ఇది ఎంత నిజమైన విషయం! ఇక్కడొక శిశు వున్నదనుకోండి. నిప్పుముట్టుకొని కాల్చుకుంటుంది. ఎందువల్ల? నిప్పు కాలుస్తుందని శిశువుకు తెలియనందువల్ల. నిప్పును ముట్టుకుంటే, కాలుతుందనే సత్యమును శిశువుకు చక్కగా తెలియజెయ్యండి. ఆ శిశు వింక నిప్పు ముట్టుకోదు. ఆధ్యాత్మిక ధర్మాలు ప్రజలకు గ్రాహ్యామయ్యేలాగు చేయండి! మానవజాతికి వెలుగు చూపండి! ఇదే చెడును మొదలంట పోద్రోలే సదుపాయం. ఈ పని తొందరగా సాగకపోవచ్చు.

నత్తగుల్ల నడకతో సాగవచ్చు. కానీ ఆలస్యంగా పని నెరవేరినా,
విజయంమాత్రం తథ్యం. ఇదే సక్రమ సంస్కరణోపాయం! ఇదే
సంపూర్ణప్రయోజనమును కలిగించే విధానం!

ఇంకొక మార్గం లేదు. క్రైస్తవపురాణాలవల్ల, శిక్షాదండనల
వల్ల, నియమనిబంధనలవల్లా, చట్టాలవల్లా, భారత దేశం పునరుద్ధరింప
బడదు. సజీవ సత్యజ్ఞానమే — జాతిని పునర్జీవింపజేయు గల ఏకైక
సంజీవని.

అమెరికాదేశీయులకు, ఇంగ్లీషువారికి, ఇంద్రభవనాలవంటిగృహా
లున్నవి. భారతీయులో, కుచేలకుటీరాలవంటి గృహాల్లో నివసిస్తున్నా
రన్నమాట నిజమే. భారతదేశంలోకూడా బ్రహ్మాండమైన భవనాలు
కట్టి, యూరోపియన్ల మాదిరి భారతీయులను ఉష్ణగృహపు మొక్కలుగా
( Hot-house plants ) తయారుచేసినందువల్ల ప్రయోజనం కలగదు.
చాలాచోట్ల, పెద్ద పెద్ద రాజసౌధాల్లో, భవనాల్లో నివసిస్తున్న మను
ష్యులు, సుఖశాంతుల ననుభవించడంలేదు. పెద్ద పెద్ద అందమైన గోరీ
లలో, తేళ్ళూ, పాములూ కాపురంచేస్తుంటాయి. బాహ్యసంపద్వైభవ
విశేషాలు ఆనందాన్ని చేకూర్చలేవని చూపడానికి అనేకసాక్ష్యా
లున్నవి. ఇది నిజం. ఈ విషయాన్ని ప్రపంచం తెలిసికోకపోతే, దానికి
ప్రపంచమే నిందార్హమైంది. భాగ్యం, విషయాలను చక్కపెట్టలేదు.
రాముని వైదాంతిక భాషణలు, లోకాభిరుచి ననుసరించవు. సంపదలూ,
శాంతిసౌఖ్యాలను ప్రసాదించలేవన్నమాట సత్యం. యూరప్ అమె
రికాలు సంపదలే శాంతి సౌఖ్యాలకు మూలమని తలచి, వాని వెంటబడు
తున్నట్లయితే, యూరప్ అమెరికాలు గొప్ప తప్పు చేస్తున్నట్లు
గ్రహించవలసియున్నది. యూరప్ అమెరికాలు చేస్తున్న తప్పులను
అనుకరించడంద్వారా, భారతీయులు అభివృద్ధి పొందాలని రాముడు
చెప్పడంలేదు. అర్థమే పరమార్థమన్న దృష్టితో, ఎవరు తనను వెంటా
డినా, వారికి భౌతికసంపద, చేజిక్కడం జరగలేదు. ఈ యావద్బా
భాగ్యమంతా మూటగట్టుకోవాలని ఏ జాతి — లేక — ఏ మానవుడు,
ఆశించడంలేదు? ఐనా, ఈ పర్యవసానమును తెలిసికోగలవారే కొద్ది
మందో! కృషీ, ప్రేమా ఉన్నప్పుడే — లేక — ప్రేమమయకృషి ఉన్న

ప్పుడే—సంపద సమాశ్రయిస్తుంది. తెలిసికానీయండి, తెలియక కానీయండి, ఈ విజయ రహస్య సూత్రాన్ని — ఈ అనుష్ఠాన వేదాంత తత్త్వాన్ని—ఏ జాతులు ఎక్కువగా గ్రహించినవో ఆ జాతులు ఎక్కువగా అభివృద్ధి పొందుతాయి. విజ్ఞానశూన్యులైన మూఢులు చెట్టును పోషించరు; కానీ పండ్లు దినాలని నోరు తెఱచుకొని కూర్చుంటారు. మిథ్యా రాజకీయవేత్తలు, చైతన్యకీలకమును — స్వాతంత్ర్యప్రేమ తత్త్వమును—గుర్తించకుండానే జాతీయోన్నతి కల్గించడానికి ఆశిస్తారు. నేడు అవ్యక్తంగా ప్రతిజాతియొక్క వ్యక్తంగా భారతదేశముయొక్క జీవనసూత్రం—అనుష్ఠానవేదాంతమై యున్నది; స్వేచ్ఛా, న్యాయ, ప్రేమోద్దీప్తతత్త్వమైయున్నది. భారతదేశపు ఈ అంతఃప్రకృతి దృఢీకృతం కావాలి! ప్రతి దేశముయొక్క గృహ, సాంఘిక, రాజకీయ, మత విషయక విముక్తి—వేదాంత ప్రవర్తనమందే ఆధారపడి ఉన్నది.

భారతదేశంలో ఒక విశిష్ట విశేష మున్నది. హిందువులు, మతపిచ్చిమనుష్యులు కాకపోయినా, మత విషయకంగా వాండ్లకున్న శ్రద్ధాభినివేశాలు అత్యధికమైనవి. ఒక సాంఘిక విషయం కానీయండి, రాజకీయవిషయం కానీయండి, మరే విషయమైనా కానీయండి—మతం పేరుతో కాకుండా దేన్నీ మీరు వాండ్లలో వ్యాప్తం చేయలేరు. భారతజాతీయ కాంగ్రెస్‌గానీ, లేక సాంఘిక రాజకీయ సంస్కరణమున కుద్దేశించిన ఏ వ్యవస్థయేగానీ, ప్రజాసామాన్యాన్ని ఆకర్షించ లేదు. వాండ్ల హృదయాలను ఉత్తేజపరచలేదు. కారణం - ఆ ఉద్యమాలు మతదృక్పథంతో బయలుదేరకపోవడమే. అందువల్ల, భారత దేశంలో, సర్వవిధ సంస్కరణాలను ప్రవేశపెట్టడానికి అనుష్ఠాన వేదాంతముకన్నా మించిన విజయంకర విధానం లేదు. అనుష్ఠానవేదాంతం, రాజకీయ, గృహవిషయక, మానసిక, నైతిక - స్వాతంత్ర్యప్రేమలను సమాలింగనం చేసికొంటుంది; స్వేచ్ఛాశాంతులను, శక్తిసమత్వాములను, ధైర్యప్రేమలను; అమోఘరీతి సమైక్య పరుస్తుంది. ఇదంతా మతము పేరిట, ప్రతిహిందూహృదయమునకు పరమాభిమానపాత్రమైన శ్రుతుల (శ్రుతి, ఉపనిషత్తులు) పేరిట, ప్రతి హిందువునకు పరమ పూజనీయములై, ప్రాణాధికములైన వేదాల పేరట, జరుపబడుతుంది.

అయితే స్వాతంత్ర్య శక్తి, ప్రేమ, హైందవవేదాలను - ఉపనిషత్తులను - మెలద్రిప్పి, పిండి, పీడించడంవల్ల లభించదు. స్వాతంత్ర్య ప్రేమ శక్తి ప్రదాయకమైన వేదాంతం హైందవవేదశాస్త్రాలలో సుస్పష్టంగా ప్రకటింపబడింది. తమ వేదశాస్త్రాలు ప్రబోధిస్తున్నందున - ప్రజాసామాన్యానికి వేదాంతం నచ్చుతుంది. ఈ యావత్పృథ్వీమండలమున, వైదాంతికమైన ఏకత్వవాదమును (Vedantic Monism) ప్రతిపాదించని తత్త్వదర్శనంలేదు గనుక, సత్యతత్త్వమైన వేదాంతమునకు దోహదం కాని విజ్ఞాన శాస్త్రం ( Science ) లేదు గనుక, విద్యావంతుడైన హైందవునకు వేదాంతం నచ్చుతుంది.

తమవేదశాస్త్రాలలో శాశ్వతవేదాంతామృతస్రవంతులు కలిగియున్న హిందువులు, టాంటలస్ (Tantalus) మాదిరి బాధపడుతున్నారని చెప్పడం ఆశ్చర్యకరమైనవిషయం. అమృతస్రవంతు లున్న మాట నిజమే. కానీ వాండ్లాదివ్యామృతాన్ని త్రాగడంలేదు. యావత్ప్రపంచంలో తమ కతిప్రియమైన బైబిల్ దగ్గరఉంచుకొనికూడా, దానినిగూర్చిన భయంకరమైన అజ్ఞానముచేత ఎంతోకాలం రోమన్ కాథలిక్కులు బాధపడ్డారు. అదేరీతి, భారతదేశంలో కూలంకషమైన వేదాంతవైదుష్యమున్నపండితులు కొలదిమంది ఉన్నా, వాండ్లు అనుభవజ్ఞానశూన్యులైయున్నారు. వాండ్లజ్ఞానం సిద్ధాంతరూపకమైనది మాత్రమే. గుణకారభాగహారసంబంధసూత్రాలు వల్లెవేసి, ఆ సూత్రాలను ఒకలెక్కలోనైనా ప్రయోగించని విద్యార్థులవంటి వాండ్లా పండితులు. ఒక్కప్రయోగమైనా చేసి చూడని రాసాయనిక శాస్త్రవిద్యార్థిలాగే చాలామందిపండితులు వేదాంతమును పఠించారుమాత్రమే. సన్న్యాసుల్లోసైతం అధికసంఖ్యాకులు, నిజమైనస్వాములు-అధినేతలు-కావడానికిబదులు కులదాసులైయున్నారు-భారతదేశంలో కావలసినంతమందిపండితులు మీకు కనబడతారు. అయితే, వాండ్లల్లో ఎక్కువమంది, కళాశాలల్లో పొగగుమ్మటా లెక్కడం, నావలునడపడం, ఈతనుగూర్చినసూత్రాలు మొదలైనవిషయాలను బోధించే జలశాస్త్రాధ్యాపకులవలె ఉంటారు. ఆ అధ్యాపకులు ఊరక పాఠాలు చెప్పడమేగాని, నీళ్లపైన పయనించి ఎరుగరు. అమెరికాదేశీయులైన

మీరు, జలశాస్త్రపండితులు కాకపోవచ్చు. జలశాస్త్రసూత్రాలు చదువుకొనకపోయినా, తెలియకుండానే వాటిని అనుభవంలో పెట్టే నావికులవంటివాండ్లు మీరు. ఓ అమెరికా దేశీయులారా! మీ క్రియాత్మకశక్తులను వైదాంతికమైన ఆధ్యాత్మికశక్తితో మేళవింపజేసి, ఈ సంపూర్ణసంస్కృతిని భారతవర్షమున కందించి, భారతదేశసమస్యనూ, తద్వారా యావత్ప్రపంచసమస్యను మీరుపరిష్కరించగలరా? భారత దేశమున నేడు, స్వాములూ, పండితులూ, తమజాతియొక్క సోమరి నిద్రను సుదీర్ఘంచేయడానికి, జోలపాటలు పాడుతున్నారు.

పారిశ్రామికసంస్థలనూ, కళాశాలలను సంస్థాపించడంవల్ల విషయాలు చక్కబడతవని కొందరనవచ్చు. కానీ చక్కబడతవా? చక్కబడవు. ఆవిధమైనసంస్థలు ఏదోకొంత తాత్కాలికోపశాంతి కలిగించవచ్చు. కానీ అసలుకష్టం, ముఖ్యమైనయిబ్బంది, ఉన్నపెద్దబాధ, భారతదేశంలో పారిశ్రామికకళాశాలలు పెట్టినంతమాత్రంచేత తొలగిపోదు. నేడు భారతదేశంలో శ్రామికులు పనిచేసి ఎంతసంపాదిస్తున్నారు? ఉదాహరణానికి – కుమ్మరిని తీసికోండి. అత డొక ఇరవై కుండలో మూకుళ్లో చేస్తాడు. వానిని తయారుచేయడానికి అత డెంతో కాలం వినియోగిస్తాడు. ఆ ఇరవై కుండలకు నాలుగుదమ్మిడీలు వస్తాయి! ఇరవై కుండలకు – నాలుగుదమ్మిడీలు !! (one cent) తదితరశ్రామికులు కొందరు, దినమల్లా పనిచేస్తే, ఇరవైదమ్మిడీలు (5 cents) సంపాదించగలుగుతారు. ఇక, కళాశాలల్లో, విశ్వవిద్యాలయాలల్లో చదువుకొని, డిగ్రీలుపొంది, పట్టభద్రులైన అగ్రకులస్థు లుంటారు. ఆయూనివర్సిటీల్లోనుంచి ఎం. ఏ. పట్టాతో వెలువడినవ్యక్తికి వచ్చే నెలజీత మెంత? మామూలుగా అరవై రూపాయలకు మించదు. అంటే నెలకు ఇరవై డాలర్లన్నమాట. రోజుకు షుమారు 264 దమ్మిడీలసంపాదన (66 cents) ఇదైనా మామూలు ఎం. ఏ. పదవిపొందినవాడు పొందలేడు. మామూలు ఎం. ఏ. వాడు దినానికి 180 దమ్మిడీలు (45 cents) పొందుతాడు. ఇవీ భారతదేశంలోని పరిస్థితులు. అమెరికాలో, మీసామాన్యశ్రామికుడు ఎంతసంపాదిస్తాడు? దినానికి రెండుడాలర్లు సంపాదిస్తాడు. అయితే భారతీయులరాబడి అంతతక్కువగావడానికి కారణ మేమిటి?

వాండ్లుకట్టేగుడ్డ చాలాచౌకైనది. వాండ్లు తినేతిండి చాల తక్కువ రకముది. వాండ్లుండేయిండ్లు అతిసామాన్యమైనవి. వాండ్లవసతులన్నీ అతిన్యూనమైనవి. కారణ మేమిటి? దేశంలో మూలధనం చాల తక్కువ. మీరు చూడ్డంలేదా? మూలధనం నానాటికి క్షీణించిపోతు న్నది. ఈదేశంలోని-అమెరికన్ ఇండియన్సుకు కార్లైజల్ ఇన్‌స్టిట్యూట్ (Carlisle Institute), నీగ్రోలకు టుస్కీజీఇన్‌స్టిట్యూట్ (Tuskegee Institute) లమాదిరి, పారిశ్రామికకళాశాలలు భారతదేశంలో స్థాపిస్తే నిస్సందేహంగా, దానివల్ల కొంతమేలు కలుగుతుంది. ప్రజల కది పరిశ్రమించడం, పనిచేయడం నేర్పుతుంది. కానీ, ఎవరిఅభివృద్ధికోసం, ఎవరిలాభంకోసం మన మీపనిచేయడం? చెప్పండి. ముఖ్యంగా ఇంగ్లాండుపెట్టుబడిదార్లను కుబేరులను చేయడానికే మనపని పనికి వస్తుంది. భారతదేశపు పెద్దపెద్దవ్యాపారాలన్నీ ఇంగ్లీషువర్తకుల చేతుల్లో ఉన్నవి. భారతీయవర్తకులు నామకార్థమే పెట్టుబడిదారులు. యూరప్ అమెరికా పెట్టుబడిదారులు వాండ్లను తమస్వప్రయోజనానికి ఉపయోగించుకుంటారు. పారిశ్రామిక కళాశాలలవల్లా - శిక్షణవల్లా భారతీయులు పొందేదేమిటి? ప్రజలు లాభంపొందుతారా? వాండ్ల బాధలు వాండ్లకు తప్పవు. వాండ్లకరువులూ కడుపుమంటలు ఇందువల్ల పోవు. పారిశ్రామిక కళాశాలలవల్ల పూర్ణోపశమనమార్గం దొరకదు. అయితే మన మేమిచెయ్యాలె? మనం చెయ్యవలసినపనులు చాలా ఉన్నవి. కానీ, ప్రస్తుతం అత్యవసరంగా చేయవలసినపని - ఎక్కువ కులస్థులకూ, వాండ్లతోపాటు తక్కువకులస్థులకూ విద్యగరపి, సముచిత శిక్షణనిచ్చి, వాండ్లలోనికి స్వాతంత్ర్యశక్తిని జొనిపి, వాండ్లను నిస్వార్థ సత్యశక్తిసంపూరితుల చేయడమే. ఇదే అవశ్యకర్తవ్యం. ఈసంపూర్ణ సంస్కృతి సాంకేతికవిద్యనుగూడ సమాదరిస్తుంది. అంతేగాని, ఒక్క పరిశ్రమలవల్ల పని జరగదు. పరిశ్రమలు రెండవతరగతివి. అంతకంటే ప్రధానమైన విషయమేదో ముందది అవసరం.

భారతదేశంలో కొద్దో గొప్పో కావలసినమార్గాల్లో ఇంతకు ముందే పనిచేస్తున్నశక్తు లున్నవి. వాటిపనినిగూర్చి విచారిద్దాం. క్రైస్తవమతప్రచారకులు అమెరికానుండి వెళ్లి, శక్తినంతా వినియో

గించి పనిచేస్తారు. కులతత్వమును పోగొట్టడానికి యత్నిస్తారు. తమ యోగ్యతను ప్రకటిస్తారు. వాండ్లు ప్రజలకు విద్యగరపడానికి యత్నిస్తున్నారు; పంచములకు, నిమ్నజాతులకు సహాయపడడానికి యత్నిస్తున్నారు. అయితే వాండ్ల యోగ్యతలు ఎంతవరకు సక్రమమైనవో పరీక్షిద్దాం. నిమ్నజాతులకు ఏదోకొంత మేలుచేస్తున్నందుకు భారతదేశం వాండ్లకు కృతజ్ఞురాలు. ఎట్టిఇతరపరిస్థితుల్లోకూడా చదవడం వ్రాయడం నేర్పబడని అంత్యజాతులకు కొంతవరకు వాండ్లు విద్యనేర్పుతున్నారు. ఇది నిజంగా మంచిపనే, మిషన్ కాలేజీలు, పాఠశాలలూ, అగ్రవర్ణప్రజలకుకూడా ఉన్నతవిద్య గరపుతున్నవి. భారతీయులకు విద్యగరపేవిషయంలో ఇంతకుముందే గొప్పకృషిచేసినందుకు అమెరికన్ మిషన్ల అభినందించవలసియున్నది. అయితే ఈవిషయంలో చెడుగువైపుకూడా మనంచూడాలి. భారతదేశానికివెళ్లే ఈక్రైస్తవమత ప్రచారకులు, నెలకు 300 రూపాయల వేతనం తీసికొంటారు. దర్జాగా నవాబుల్లాగా జీవిస్తారు. ప్రజలపై అధికారం చెలాయిస్తారు. హిందూ కుటుంబాల్లో, కలతలూ కలహాలు రేపుతారు. భారతదేశంలో అంతకుముందే వున్నఅసంఖ్యాకకులాలతోపాటు, ఇంకొకకులాన్ని తెచ్చిపెడుతున్నారు. క్రైస్తవమతంలో కలపబడిన భారతీయులు సాధారణంగా, హిందువులయెడ ప్రేమజూపరు. వాండ్లు హిందువులతో కలియరు. హిందువులు వాండ్లతో కలియరు. సంబంధాలు తెగిపోయి, మధ్యగల అఖాతం అంతకంతకు పెద్దదైపోతున్నది. రోజురోజుకు అంతఃకలహాలు ముదిరిపోతున్నవి. బాలికలు తమతల్లిదండ్రులనుంచి వేరుచేయబడ్డారు. భార్యలు, తమ భర్తలనుండి విడదీయబడ్డారు. క్రైస్తవులు, విద్యావిహీనహైందవప్రజాసామాన్యమందలి మూఢ్యమును, అంతకంటే హీనమైన తమచర్చిమూఢ్యంతో పోగొట్టాలని ఆకాంక్షిస్తుంటారు. క్రైస్తవ ధార్మికత్వం, తీవ్రపరవిమర్శగా రూపొందుతున్నది; లంచమిచ్చి, తల్లిదండ్రులనుండి చిన్నపిల్లలను విడదీసి, వాండ్లమెత్తనిమెదడలపైన చర్చిమూఢ్యమనేకాడిని మోపుతున్నది. ఇట్టిపరిస్థితుల్లో, మీామహాశయవంతమైన క్రైస్తవమతం, హిందూహృదయములోని దురంతకులమతపాక్షికభావజ్వాలల్లో నశించిక ఏమూలనైనా దాగియుండే ఆకాస్త సహోదరభావసహృదయతా ప్రేమబిందులేశాలనుకూడా రూపుమాప

శానికి, శ్రద్ధవహిస్తున్నది. ఇదీ చీకటివైపువిషయం. విషయాలిట్లు చక్కబడవని మనం కనుగొన్నాము. మొత్తంమీద, ఉన్నతాశయాలతో లక్షోపలక్షలడాలర్లధనం వ్యయంచేస్తున్నందుకు అమెరికనులు అభివందనీయులు. హృదయసంస్కృతికి దారితీయని పైపైఉపశమన మార్గాలవల్ల విషయాలుమరికొంత విషమిస్తాయేగాని చక్కబడవని మీరు గ్రహిస్తారుగాక!

అనేక కారణాలవల్ల ఇంగ్లీషుప్రభుత్వం అభివందనీయమే. భారతదేశంలో అసలు కులతత్వమును పోగొట్టడానికి బ్రిటిష్ప్రభుత్వం చాలకృషిచేసింది. బ్రిటిష్ప్రభుత్వం భారతదేశంలో విద్యను ప్రోత్సాహపరిచింది; విశ్వవిద్యాలయాలు, కళాశాలలు స్థాపించింది. బ్రిటిష్ పాలనవల్లనే, హిందువులు తమ సనాతనవేదశాస్త్రాలను సక్రమంగా పఠించుకోగలిగారు. ఇదంతా మంచివైపు విషయం. ఇంక చెడుగువైపు తీసుకొందాము. బ్రిటిష్ప్రభుత్వం, భారతవర్షమును సర్వవిధాలా శూన్యంజేసింది. బ్రిటిష్ ప్రభుత్వం భారతీయులకు ఏదో పైపై విద్య గరపి, అల్పజ్ఞానమును ప్రసాదించినప్పటికీ అది అన్ని విధాలా భారతదేశమును దారిద్ర్యంలో ముంచివేసింది. త్వరలో ప్రభుత్వ కార్యక్రమం మారకపోతే, హిందువులు దరిద్రసంక్షోభితులై ప్రాణాలు విడిచేటంతపరిస్థితి కలుగుతుంది. హిందూరాజకుమారులు, ప్రభువులు, తమ అమూల్యసంపదనూ శక్తినీ కోల్పోయి, ఊరక గలగలలాడే బిరుదులతో వట్టిపేర్లతో, కీలుబొమ్మలై యున్నారు. భారతదేశమున ప్రవేశపెట్టబడిన విద్యావిధానమునుగూర్చి మరికొన్ని విషయాలు: ఈరోజుల్లో, బ్రిటిష్ప్రభుత్వం ప్రజలమానసిక వికాసమును ఏవగించడం మొదలుపెట్టింది. రాముడు భారతదేశంలో ఉన్నప్పుడు, ప్రజాసామాన్యంలో, ఉన్నతవిద్య నాపడానికి ఎత్తుగడలు జరిగినవి. ఇప్పుడు యూనివర్సిటీల్లో చెప్పేదేమిటి ? మృతభాషలు, ఊహాత్మక తత్త్వశాస్త్రము, గణితశాస్త్రము, గతచరిత్ర, ప్రయోగరహితమైన రసాయనశాస్త్రమూ — మొదలైన విషయాలే. ఏయూనివర్సిటీలో, ఏ కాలేజీలో, ఒక్క ఇంగ్లీషుతప్ప ఇంకొక ఉపయోగకరమైన జీవభాష నేర్పబడటంలేదు. ప్రజలకు ఇంగ్లీషు నేర్ప

బడుతున్నది. ఎందుకంటే – వాండ్లు ఆంగ్లోద్యోగులక్రింద పనిచేయాలి కదా! ఇంగ్లీషువారు, ప్రజాభాషను బోధించడానికి శ్రమతీసికోరు; తమకొలువు చేయడానికి, ప్రజలను తమ ఇంగ్లీషుభాష నేర్చుకోమంటారు. గణితం నేర్పబడుతుంది. ఈ యూనివర్సిటీల్లోని గణిత పరిమాణం అమెరికాలోకంటే ఎక్కువే.అతిభౌతికశాస్త్రం (Metaphysics), ఊహాత్మకతత్త్వ శాస్త్రం (Speculative Philosophy), సంగ్రహప్రాయములైన తదితరశాస్త్రాలూ, చెప్పబడతవేకాని, ఆర్ట్సుకా లేజీల్లో కూడా, ఏ వ్యావహారికశాస్త్రంగానీ,ఉపయోగకరమైన కళగానీ నేర్పబడడం లేదు. విశ్వవిద్యాలయాల్లో ప్రయోగాత్మకమైన రసాయనశాస్త్రం చెప్పబడడంలేదు; నేత, గనుల త్రవ్వకం నేర్పబడడంలేదు. చిత్రలేఖనం, కుమ్మరిపని, యంత్ర నిర్మాణ శాస్త్రాదులు నేర్పబడడం లేదు. ఈ ఉపయోగకరమైన కళలకు గూడా ప్రజలు దూరమైనారు. ఇంక ఆయుధనిర్మాణ విషయమై చెప్పవలసిన పనే లేదు. ప్రజలు తమ గృహాలలో ఏ ఆయుధాలనూ ఉంచుకోవడానికి వీలులేదు. తన యింట్లోనైనా కొంచెము పెద్దరకపుకత్తిని ఎవడుకూడా ఉంచుకోవడానికి అధికారంలేదు. కొంచెము పెద్దకత్తి ఎవనిదగ్గరైనా ఉంటుందా, వాడు జైల్లో వేయబడతాడు. ఆయుధ నిర్మాణంగానీ, కవాతుగానీ పనికిరాదు. దీనివల్ల, భారతీయకళాశాలల్లో, ఆ అత్యధికమైన జీతాలు కట్టగలిగిన ధనికులైన ఏ కొద్దిమంది హిందువులో, మహమ్మదీయులో పొందుతున్న విద్యావిధానమందలి నిస్సారతను మీరు గ్రహించవచ్చు. భారతదేశంలో కొన్ని ఉత్తమమత సంఘాలు క్రొత్తగా బయలుదేరి, అద్భుత సంస్కరణాకార్యాన్ని చేస్తున్నవి. కానీ, నరనరాలలో జీరించిన, వీరారాధనాపరాయణత్వం, ప్రమాణదాస్యమూ, వాండ్ల సంప్రదాయ మూలపురుషుల పేరుతో రాని ప్రతివిషయంమీద వాండ్లకు విముఖత కలిగిస్తుంది—ప్రతి సంఘమూ, ప్రతి ఉద్యమము, పేర్లతో వ్యక్తిత్వాలతో తమచుట్టూ ఒక కంచె నల్లుకుంటుంది; తమ మృత నాయకుల పలుకులనూ, పనులనూ, భావి అభివృద్ధికి ప్రారంభస్థానాలుగా చేసికోవడానికి బదులు, చుట్టూ హద్దులుగా, ఆటంకాలుగా, కంచెలుగా చేసికొంటుంది. ఈ విధంగా భారతదేశంలో దేశీయసంస్కరణోద్యమాలన్నీ స్తంభించిపోతున్నవి.

భారతదేశమునకు కలిగిన వ్యాధి ఏమిటో, ఆ వ్యాధి నివారణమున కుపాయా లేమిటో రాముడు మీకు విశదీకరించాడు. ఇప్పుడు ప్రగాఢమైన హృత్పూర్వకమైనసానుభూతిని రాముఁడాకాంక్షిస్తున్నాడు. ఈసానుభూతి - ఈహృత్పూర్వక ప్రేమే - ముందు ముఖ్యంగా కావలసింది. మీరు భారతదేశమును ప్రేమించి, సక్రమశ్రద్ధతో పనికిపూనుకున్నట్లయితే సర్వమూ సమకూరుతుంది. "ఎక్కడ సంకల్పమున్నదో అక్కడ మార్గ మేర్పడుతుంది." భారతదేశమునకు శక్తివంచన లేకుండా తోడ్పడాలని సంకల్పించండి. మానవకల్యాణార్థం, భారతదేశాని కేదైనా సేవచేయాలనే సంకల్పం మీ కున్నదా? మీరు హృత్పూర్వకంగా భారతదేశాన్ని ప్రేమిస్తున్నారా? ఒకానొక అణగద్రొక్కబడిన జాతికోసం మీజీవితమును త్యాగంచేయాలనే అభిలాష మీకున్నదా? భారతదేశ సేవానిమిత్తం మీకాలమునూ, మీజీవితమునూ వినియోగించాలని మీరు వాంఛిస్తున్నారా? ముప్పైకోట్ల ప్రజానీకమున్నది! యావత్ప్రపంచ జనాభాలో ఎక్కువభాగాన్ని ఈ సంఖ్య ఆక్రమిస్తుంది. ముప్పైకోట్ల ప్రజలు? మనం వాండ్లకు క్రమశిక్షణ నీయగలం. విద్యగరపగలం వాండ్ల శక్తులను సద్వినియోగంలో పెట్టగలం. ఈముప్పైకోట్ల ప్రజానీకం మీతో కలసి పనిచేయడానికి ప్రారంభిస్తే, మీ మనస్సుతో మనస్సుకలిపి ఏకాశయములు కాగలిగితే దానివల్ల మీకుకూడా మేలుండదా? భారతీయుల శక్తులూ, మేధస్సులూ, క్షుద్ర విద్వేషవిచారాలలో వ్యర్థంగాక, ఉన్నతాశయాలలో ఉదారభావాలలో వినియోగింపబడితే, భారతదేశ మహాప్రజానీకము నుండి-అమెరికాలోకంటే ఎక్కువమంది ఫ్రాన్క్లిన్లు, (Franklins) ఎడిసన్లు (Edisons) ప్రభవిస్తారు. భారతశక్తుల నీవిధంగా ఉపయోగపరచడంవల్ల ప్రపంచం సౌభాగ్యవంతంకాదా? ప్రపంచకల్యాణార్థం, సోదరమానవకల్యాణార్థం, ఆత్మకల్యాణార్థం, భారతదేశమును ప్రేమించండి! భారతీయులను మీతోపాటు పైకిరావడానికి ప్రయత్నించండి! ఈ విధంగా మేలుజరుగుతుంది!

## భారతోద్ధరణానికి సలహాలు

ఇప్పుడు భారతోద్ధరణకార్య మేవిధంగా నిర్వహించడం? రాముడు రెండువిధానాలను సూచిస్తున్నాడు: మొదటిది - అమెరికన్లను - సత్క్రమశ్రద్ధాన్వితులైనఅమెరికన్లను - సత్యముకొరకు ప్రాణాలర్పించగల ధర్మవీరులైనఅమెరికన్లను - భారతదేశానికి పంపడం. అయితే అమెరికాచే తిరస్కరింపబడిన పనికిరాని వ్యక్తులను మాకడకు పంపకండి! అమెరికాలో ఏపనీదొరకక తిరుగుతున్న ప్రజలను ఇండియాపై త్రోయకండి. సమాజమునగల ఉత్తములను, అమెరికాదేశ శ్రేష్ఠులను ఇండియాకు పంపండి! ఇట్టివ్యక్తులే భారతదేశానికి అవసరం. చండాలురమధ్య -- కడజాతి మానవులమధ్య - కృతజ్ఞత చూపలేని శ్రామికజనులమధ్య నిలిచి, పనిచేయగల, సేవానిష్ఠులు భారతదేశానికి కావాలె. ఈ శూద్రులు మిమ్ము సత్కరించలేరు. కృతజ్ఞతగూడా ప్రకటించలేరు. ఎందుకంటే - వాండ్లు నిరుపేదలు, నిరక్షరాస్యులు, అమాయికులు, అజ్ఞానులు. మీ ఉపకృతికి ప్రతిఫలంగా మీకు వాండ్లు కూడు గుడ్డలైనా సమర్పించుకోలేరు. కారణం? వాండ్లకే తినడానికి తిండి, కట్టడానికి గుడ్డలు లేవు. ఈ ప్రజలమధ్య దుమికి, పనిచేయగల మానవులు - తాము పస్తులతో మాడైనాసరే, ఈ దరిద్రప్రజానీకమునకు సేవచేయగల మానవులు- కావాలె! అమెరికాదేశీయులు ఈ పనిని చేపట్టడానికి రారా? ఔదార్యవంతమైన అమెరికానుండే - త్యాగనిలయమైన అమెరికానుండే - అట్టి మానవులు తప్పక బయలుదేరవలసియున్నది. ఈ ఉద్యమనిర్వహణానికి ఉత్తమ కర్మవీరులనే రాముడాశిస్తున్నాడు. అమెరికానుంచి ఇండియాకుపోయి, పెద్దపెద్ద బంగళాలల్లో ప్రభువుల్లాగా వసిస్తూ, ప్రజలమీద అధికారంచెలాయిస్తూ, ఊరక ప్రాపంచకగౌరవభోగాల్లో పడి పొర్లాడే క్రైస్తవమతప్రచారకులవంటివాండ్లను రాముడు కోరడంలేదు. ఈ భోగలాలసులు భారతవిముక్తి కలిగించలేరు; భారతసముద్ధరణం చేయలేరు. సత్యముకొరకు ప్రాణా లర్పించగల ధర్మవీరులు, యథార్థకర్మయోగులు, కడజాతి జనులతో కలసి, వాండ్లతోపాటు కటికినేలపై పండుకోడానికి సిద్ధపడగల, వాండ్లతోపాటు చినిగినగుడ్డలు కట్టుకొని సంతృప్తిపడగల,

వాండ్లతోపాటు వస్తు లుండగల, వాండ్లతోపాటు గంజో గటకో త్రాగి సంతోషపడగల త్యాగమూర్తులు మాకు కావాలె! విషయ సుఖాలను విస్మరించి, స్వార్థభోగాలను సంత్యజించగల ప్రేమమూర్తులు మాకు కావాలె! "అయితే ఈపని చాలకష్టం. ఇది అసాధ్యమైనపని"– అని మీా రనవచ్చు. కానీ, యిది కష్టమైనపనిఅనీ, ఇందులో మనకు వచ్చే ప్రయోజన మేమున్నదనీ – మీా రనుకోవద్దు. మీాకు కావలసి నంత ప్రయోజనమున్నది! మన మొకణ్ణి బాగుచేయాలని ప్రయత్నించి నప్పుడు వాడు బాగుపడ్డా పడకపోయినా, మనంమాత్రం బాగుపడడం నిజం. ఇది స్వానుభవసిద్ధమైనవిషయం. పరకల్యాణ ప్రయత్నంలో ఆత్మకల్యాణసిద్ధి ఉన్నది. చలనమూ ప్రతిచలనమూ– రెండూ సమాన మైనవీ, వ్యతిరేకమైనవి. పరోపకార మనే దృష్టితో ఏదైనా మంచి పనిచేయడం– మిథ్యాభావం; తెలివితక్కువతనం. రాముని ఉపన్యాసం వల్ల అమెరికన్లు మేలుపొందినా పొందకపోయినా, రాముడుమాత్రం మేలుపొందాడు. అదే గొప్పప్రతిఫలం. ప్రతివాని అనుభవం—— దీనిని ఋజువుచేస్తుంది. ప్రతిఫలాపేక్ష లేకుండా పనిచేయండి! మీాపనే మీాకు ప్రతిఫలంగా ఆనందం గొలుపుతుంది. ప్రతిఫలాపేక్షారహిత మైన పనిచేత పరమేశ్వరుడు ఋణపడతాడు. భగవంతు డా ఋణాన్ని వడ్డీతోసహా తీర్చితీరాలె! అమెరికాదేశీయులారా! మీారు భారత దేశానికి వెళ్లి, ఆత్మజ్ఞానమును, ఆత్మవిశ్వాసమును, ఆత్మగౌరవమును వేదాంతమును – ప్రసారంచేయండి! క్రిందటిరాత్రి మీారు "విజయ రహస్యము"ను గూర్చిన రాముని ఉపన్యాసమును విన్నారు. విజయ రహస్యం– అనుష్ఠాన వేదాంతమే– ఈయావత్పృథ్వీముఖమందు వేరొ కటిలేదని అందు నిరూపింపబడింది. విజయకీలకం —— అనుష్ఠాన వేదాంతమే. ఈ వేదాంతమును గ్రహించండి! వేదాంతసాక్షాత్కారాను భూతి పొందండి! వేదాంతమును ఉజ్జీవించండి! తదుపరి భారతవర్షము నకు వెళ్ళండి! మీారు నోరువిప్ప పనిలేదు. మీా ప్రవర్తనమే, మీా వైఖరియే, మీా సౌశీల్యమే —— భారతీయులను సంస్కరిస్తుంది. భారతదేశానికి నిర్గమించే వాండ్లు ముఖ్యంగా చేయవలసినఘనకార్యం భారతీయులలో సాహసశక్తిని పురికొల్పడం. పాపం ఆ దురదృష్ట వంతులు, విశాలవిశ్వంలో జీవించరు. తమకుతాము సృష్టించుకొన్న

తమతమ దరిద్రసంకుచితప్రపంచాల్లో (జీవసృష్టి) జీవిస్తుంటారు. ప్రతిబంధకమైన కులవ్యవస్థ, భారతదేశమును దాటి, ఆవల అడుగుబెట్టకూడదని హైందవుని అనుశాసిస్తుంది. విదేశయాత్రచేయడంగానీ ఆఖరుకు నౌకలో అడుగుపెట్టడంగానీ – ఖచ్చితమైన శాస్త్రాచారమునకు (పూర్వాచారమునకు) విరుద్ధవిషయమే. ఇప్పుడు భాగ్యవంతులైన హిందువులుకొందరు, ఇతర దేశాలకు– ముఖ్యంగా – ఇంగ్లాండుకు విద్యాభ్యాసానికి వెళ్లుతారు. అక్కడ వేనకువేలుధనం ఖర్చుపెడతారు. తరువాత సర్వసాధారణంగా – ఆరితేరిన వకీళ్లుగా, న్యాయవాదులుగా తయారై ఇండియాకు తిరిగివస్తారు. బహిరంగంగానో, చాటుగానో, వ్యాజ్యాలు పెంచి, పల్లెటూరి పేదరైతులను పీడించి, ఆ రూపకంగా గడించినధనాన్ని, సున్నితమైనగాజుసామానులకూ, రకరకాల కత్తులూ మొదలైన వస్తువులకూ, జలతారుజాలర్లకూ, లేకపోతే ఇంగ్లీషు చిత్రపటాలకూ, నాశనహేతువులైన ఇంగ్లీషుపానీయాలకూ వ్యయం చేస్తారు. పేదరికమూ, ఆకలీ, పెరిగినకొద్దీ తగాదాలు, వ్యాజ్యాలూ పెంచుకొంటూ వస్తులతో పడరానిపాట్లు పడుతున్న ఆ నిరుపేద కష్టజీవులవద్ద దోచుకోబడినధనం, ఎంత దుర్వ్యయం చేయబడుతున్నది!

నిరుపేదలైన భారతీయులలో జపానీయుల సాహసశక్తిని ప్రబుద్ధంచేయడం ఒక అత్యవసరమైన విషయం. జపాన్ బాలురు ఒక్క నౌకాయాన ఖర్చుతో అమెరికాకు వస్తారు. అమెరికా దేశీయులైన పెద్దమనుష్యుల యిండ్లల్లో పనిచేస్తారు. ఒకప్రక్క, ఎట్లో అవకాశాలు కల్పించుకొని, వివిధ విద్యాలయాలకు వెళ్ళి విద్య గడిస్తారు. ఈ విధంగా కొలది సంవత్సరాలు అమెరికాలో గడపి, జేబులనిండా డబ్బుతో, తలకాయలనిండా విజ్ఞానంతో వాండ్లు జపాన్‌కు తిరిగివస్తారు.

అంధాచార విశ్వాసాలను, ఒక స్థలమునకు అంటిపెట్టుకొనియుండడమును, జాతీయదురభిమానముచేత తమ్ము తాము ఒక ప్రదేశమునకు కట్టుబడియుండేలాగు చేసికోవడమును, విడనాడవలసినదిగా భారతీయులకు ఉద్బోధ చెయ్యాలె. తమ తాత ముత్తాతలున్న భూమిని విడిచి వెళ్ళడం దైవవిద్రోహమని వాండ్ల తలంపు. అందుచేత వాండ్లు, ఒక స్థలానికి తమకు తామే బద్ధులై యున్నారు. వారిని కాలాను

సారంగా ప్రవర్తింప చేయడానికి, పర దేశయాత్రలయొక్క ప్రాముఖ్యమును మనం వాండ్లకు ప్రబోధించాలె. యూరప్‌నుండి వలసపోయిన ప్రజలు, అమెరికాకు వచ్చి, యూరప్‌ను మించేటంతగా అమెరికాను ఔన్నత్యానికి తెచ్చారు. భారతీయులుకూడా వలసపోయినట్లయితే, అమెరికాకు, తదితర దేశాలకు వచ్చినట్లయితే, భారత దేశంలో ఆహార సమస్య తగ్గుతుంది. దేశంలో నిలువయున్న జనులు సుఖిస్తారు. విదేశములకు వలసిపోయిన జనులూ సుఖిస్తారు. మన శరీరారోగ్యం సరిగా ఉండాలంటే, రక్తం నాడీమండలంలో సర్వదా ప్రవహిస్తుండాలె. అదే మాదిరిగా, ప్రపంచారోగ్యసంరక్షణకు, లేక ఏదేశసంరక్షణకైనా — ప్రజలు అటూయిటూ సంచరిస్తూ, తిరుగుతూ తరచు పరస్పరం కలుసుకుంటూ ఉండాలె. లేకపోతే జీవనప్రవాహం స్తంభిస్తుంది; మరణం సంప్రాప్తమవుతుంది. మనం ఇంగ్లాండునుంచి అమెరికానుంచి వెళ్ళి హిందువులను సంస్కరించడానికి ఎంతప్రయత్నించినా, సత్యస్వాతంత్ర్యశక్తిని మనం వాండ్లల్లో ప్రబుద్ధంచెయ్యలేము. కారణం ప్రజలచుట్టూ ఉన్న పరిస్థితులు, పరిసరవాతావరణం, వాండ్లను స్తంభింపజేస్తున్నవి. నలువైపులనుండి వచ్చేసూచనలు, వాండ్లను నిర్వీర్యులనుజేసి నిద్రబుచ్చుతున్నవి. మోహనిద్ర ప్రకంపించిపోవాలంటే వాండ్లు దేశాన్ని వదలిపెట్టాలె. వాండ్లు అమెరికాకు తదితర దేశాలకు వెళ్ళినప్పుడు, అక్కడ పుస్తకాలు చదవకపోయినా, ఏవ్యాపారం నేర్వకపోయినా, ఊరక విదేశనాగరికజనుల్లో కలసి మెలసి తిరగడంచేత, ఇష్టమున్నా లేకపోయినా, తమకు తెలియకుండానే, వాండ్లు స్వాతంత్ర్యశక్తిని పొందుతారు. వాండ్లవీరత్వం విజృంభిస్తుంది. వాండ్లస్థితి అతిశయిస్తుంది. వాండ్లభావాలు వికసిస్తాయి. ఇదే విజ్ఞానం. కేవలవిదేశసందర్శనమే విజ్ఞానంగా రూపొందుతుంది.

ఇండియాలో, హిందువుడుగానీ మహమ్మదీయుడుగానీ, సర్వసాధారణమానవుడు ఏ ఇంగ్లీషువ్యక్తిదగ్గరకుగానీ అమెరికన్‌వ్యక్తిదగ్గరకుగానీ, పోలేడు. తెల్లమనిషంటే భయపడతాడు. 20, 30 అడుగుల దూరంలో నిలబడతాడు. హ్యాటూబూటూచూచి హడలిపోతాడు. రైలుపెట్టెలో ఎవరైనా యూరోపియన్ కూర్చుంటే అతనిప్రక్కన

ఒక దేశీయుడు కూర్చోడానికి అనుమతింపబడడం అతిఅరుదైనవిషయం. రైల్వేస్టేషన్లలో ఆంగ్లేయులవల్ల దేశీయులు తన్నబడడం, తరుమబడడం రాముడు చూచాడు. ఎవరైనా దేశీయుడు తనయింటిపై పురావడం యూరోపియన్ చూచాడా సేవకుణ్ణి పోయి వాణ్ణి తన్ని మెడబట్టి నెట్టి వెళ్ళగొట్టి రమ్మంటాడు. ఈవిధంగా విదేశస్థులచేత భారతీయులు దౌర్బల్యనిద్రాసమ్మోహితులైనారు. నిర్వీర్యులైనారు. నిస్తేజులైనారు. దీనితోపాటు తమస్వజాతి మానవులచేతకూడా, స్వదేశీయులచేతకూడా వాడు వేరు, నేను వేరు, వాడు నావిరోధి, వీడు నాశత్రువు అన్న అసూయాకలహావిద్వేష రూపకమైన సమ్మోహనిద్రావస్థలోనికి త్రోయబడ్డారు. దీనికితోడు ప్రభుత్వం కులజాతివిచక్షణలతో ఉద్యోగప్రలోభమును చూపి, కులజాతితత్వమును రేపి, ప్రతివ్యక్తి తనసహోదరుని తనశత్రువుగా భావించేటంతదుస్థితిని కల్పించింది. ప్రస్తుత భారతరాజకీయసాంఘికపరిస్థితి, ప్రజల్లో స్వాతంత్ర్యశక్తిని మొలకెత్తనీయదు. విద్య అంటే ఏమిటి? విద్యయొక్క పరమావధి-స్వేచ్ఛ-మరేమీకాదు. విద్య నాకు స్వేచ్ఛను, స్వాతంత్ర్యమును (మోక్షమును) కలిగించలేకపోతే, ఛీఛీ-దానితో నాకు పనిలేదు. విద్య నన్ను బంధంలో ఉంచినట్లైతే - దానివల్ల నాకు ప్రయోజనంలేదు. నిజమైనవిద్యను - లేక స్వాతంత్ర్య తేజమును - వాండ్లలో జాగరితంచేయడానికి వాండ్ల పరిసరపరిస్థితులను మనం మార్పుచెయ్యాలె. ఎట్లు మార్పుచేయడం? భారతదేశానికి వెళ్ళి వాండ్లకు ఉద్బోధించడం - ఒకమార్గం.

## అత్యవసర విషయము—తత్క్షణ సహాయము

అంతకంటె తత్క్షణమే ఉపకరించగలమార్గమొక టున్నది. ఓ అమెరికాదేశీయులారా! సత్య న్యాయముల పేరట, మతతత్త్వముల పేరట, శాస్త్రకళల పేరట, హిందూదేశ విశ్వవిద్యాలయపట్టభద్రులను కొందరిని అమెరికాకకు రప్పించి, మీ పారిశ్రామిక, యాంత్రిక సంబంధములైన ఆయా ఉపయోగవంతములైన సంస్థలలో, ఆర్ట్సు కాలేజీలలో, ఆయుధనిర్మాణశాలల్లో తదితర కర్మాగారాలలో, విద్య గడింపజేయడానికి వలసినధనాన్ని సమకూర్చలేరా? ఆ భారతీయపట్టభద్రులకు మీరు విద్యనేర్పండి; నేత, గనుల త్రవ్వకమూ - మొదలగు

ఉపయోగకరములైన కళలను అభ్యసింపజేయండి. భారతదేశప్రగతికి అతిసూక్ష్మైన మార్గమిది. చందాలు ప్రోగుచేసి ఒక నిధి నేర్పాటు చేయండి, భారతీయుల నీదేశానికి తీసుకరండి. అమెరికాకువచ్చి విద్యాభ్యాసంచేసిన భారతీయులు ఇండియాకు తిరిగివచ్చి, పారిశ్రామిక విశ్వవిద్యాలయాలు సంస్థాపించగలుగుతారు. అచ్చటి నిరుపేదజనుల బ్రతుకు తెరువులు, వాండ్లకు బాగా తెలుసు. తమదేశీయులభాష, ఆచారవ్యవహారాలు, వాండ్లకు తెలుసుగనుక, మీ అమెరికన్లకంటె వాండ్లు భారతప్రజమధ్య అధ్యాపకులుగా ఎక్కువ పనిచేయగలుగుతారు. అమెరికన్ పండితులు ఉన్నతవంశీయులకు మాత్రమే బోధించగలుగుతారు. అంతకుముందే ఇంగ్లీషునేర్చియున్న భాగ్యవంతులకు మాత్రమే బోధించగలుగుతారు. నిరుపేద నిమ్నజాతులకు ఇంగ్లీషు తెలియదు. పేదజనులకు బోధించడానికి - వారి భాషా, వారి బ్రతుకు తెరువులూ తెలిసిన వ్యక్తులే కావాలె. భారతీయసముద్ధరణానికిదే అత్యంత ప్రయోజనకరమైన మార్గం.

భారతీయులు స్వతంత్రఅమెరికాతీరమున కాలుబెట్టగానే, తమతో అతిప్రేమతో కరస్పందనచేయడానికి వచ్చిన, సమానభావంతో స్వాగతమీయడానికి సిద్ధంగావున్న తెల్లదొరసానులను, తెల్లదొరలను చూడగానే, వాండ్లభయాలు పారిపోతాయి. ఇంక తెల్లవాళ్లంటే బూచులనేభావం పోతుంది. ఆత్మవిశ్వాసం సమకూరుతుంది. మాయాచ్ఛాదనం పటాపంచలవుతుంది. స్వాతంత్ర్యోత్తేజం జాగరితమవుతుంది. అమెరికాలో శిక్షణపొందిన భారతపట్టభద్రులు, తమమాతృదేశానికి కర్మనిష్ఠాస్వాతంత్ర్యతత్వప్రచారకులుగా (Missioneries of work and Freedom) తిరిగి వెళ్లనీయండి. వాండ్లద్వారా భారతదేశంలో, విజ్ఞాన, కర్మకౌశలశుభసందేశము (Gospel of Science and Art) ప్రసరించనీయండి! భారతప్రజలు, తమమాతృభూమిలో అనుష్ఠానవేదాంతమును పరివ్యాపింపచేసికోడానికి తోడ్పడండి! ఈవిధంగా గాయం మానిన వెంటనే పైపెచ్చు దానంతటదే ఊడి రాలిపోతుంది. ప్రజలు సక్రమ విజ్ఞానమును పొందినప్పుడు, తక్కినకష్టాలన్నీ వాటంతటవే, అదృశ్యమౌతాయి. మీరు భారతపట్టభద్రులనుకొందరి నిటకు రప్పించి, రెండు

మూడేండ్లు వాండ్లకు విద్యగరపి, తగుశిక్షణ నిచ్చి, సూచించినట్లైతే, ఈప్రజలు భారతదేశానికి తిరిగి వెళ్లి, వెంటనే అక్కడ పనిని ప్రారంభించగలుగుతారు; తమకూ, నిరుపేదప్రజలకూ ఉపయోగకర మైనపనిని లేక వ్యాపారమును సాగించగలుగుతారు.

అమెరికాదేశపు ఏ ఒక్క శ్రీమంతుడైనాసరే- ఈ ఉదాత్తకార్య మును చేపట్టవచ్చు; అమెరికాలోని భారతీయవిశ్వవిద్యాలయపట్టభ ద్రుల విద్యాశిక్షణకుగాను 1,000,000 డాలర్ల ధనమును సమర్పించగల నని లేచి చెప్పవచ్చు. మీలో ఎవరైనా ఈ మహాకార్యానికి పూను కొని, ముందు ఒక 100,0000 డాలర్లు సమర్పిస్తే, అమెరికాలో పేద భారతీయులు చదువుకోడానికి ఉపకారవేతనాలు (Scholar Ships) ఏర్పాటుచేయగలం. రాముడు అమెరికన్ పత్రికాధిపతులకు విజ్ఞప్తి చేస్తున్నాడు; రాముడు సమస్తఅమెరికాదేశీయులకు విజ్ఞప్తి చేస్తు న్నాడు. మీలో ఎవరైనాసరే ముందుకువచ్చి, ఈకార్యనిర్వాహణానికి పూనుకొన్నట్లయితే, సమస్తప్రపంచానికి మేలుచేకూర్చినవా రవుతు న్నారు. ఇక్కడ సమావేశమైనవారిలో ఒక్కరుకూడా అంతధనికులు కాకపోతే, మీ ధనికమిత్రులతో, ధనికులైన మీ పొరుగువారితో, మీ రీవిషయాన్ని చెప్పలేరా? రామునితో ఒక్కసారి వచ్చి సమాలో చించవలసినదిగా మీ ధనికమిత్రులకు మీరు చెప్పలేరా? మీరు వేలకు వేలు ఇయ్యలేకపోయినా, మీశక్తికొలది విరాళము లియ్యలేరా? ఇంతమాత్రం మీరు చేయగలరు. రాముడు తనకూడుగుడ్డలకు మిమ్ములనేమి అర్థించడు. స్వార్థప్రయోజనానికి, మిమ్మేదైనా అడిగినట్లయితే, ఈనాలుకను పెరికివేయండి. ఈపని రామునికెంతసంబంధించిందో మీకూ అంతసంబంధించిందే. రాము డెంతభారతీయుడో అంత అమె రికాదేశీయుడు. ఈవిశాలప్రపంచం నాయిల్లు; మంచిచేయడమే నా మతం. రామునిహృదయానికి కృష్ణు డెంతసన్నిహితుడో; ప్రేమపాత్రు డో క్రీస్తుకూడా అంతసన్నిహితుడూ, ప్రేమపాత్రుడు. రామునకు బుద్ధు డెంతేయిష్టుడో, శంకరు డంతయిష్టుడు. రాముడు ఈమతానికి గానీ ఆ మతానికిగానీ సంబంధించినవాడు కాదు. సత్యస్వరూపు డైన రాముడు మీవాడు. సత్యంపేరట, న్యాయంపేరట, మానవజాతి

పేరట, అమెరికాస్వాతంత్ర్యంపేరట, ఈమహాకార్యార్థం ముందుకు రండి! భారతముపై సానుభూతిచూపండి! మీరేపనిచేస్తారు? కొందరు తమలేఖినితో సేవచేయగలరు. కొందరు ఈవిషయమై తమసన్నిహితులకు చెప్పి, ఉపన్యాసాలిచ్చి, తమవాక్కుతో సేవ చేయగలరు. కొందరు కాయకష్టంతో, మరికొందరు ధనంతో సేవ చేయగలరు. ఓ అమెరికాదేశీయులారా! ఈమహాకార్యంలో మీరంతా ఎవరెవ రేవిధంగా తోడ్పడగలరో – ఇప్పుడు చెప్పండి! మీ రెట్లుసహాయపడతారు? ధనికులు ధనసహాయం చెయ్యాలె! వీరులు ప్రబోధకులుగా భారతదేశానికి వెళ్ళి, అక్కడప్రజల మధ్య – కడజాతిప్రజలమధ్య సైతం – నిలిచి పనిచేయడానికి ముందడుగు వెయ్యాలె! సమర్థులైనవక్తలు తమధనికమిత్రులతో ఈ విషయమై ప్రసంగించాలె! పత్రికాధిపతులు తమలేఖినితో ఈ విషయమై తోడ్పడాలె! సహాయంచేయదలచుకొన్నవాండ్లంతా, సత్యమునందు పరమశ్రద్ధగలవాండ్లంతా, తమ ఆత్మయందు ప్రేమగలవారంతా, రాముని వద్దకు వచ్చి, తమపేర్లనూ చిరునామాల నిస్తూ, తా మేవిధానంలో సేవచేయగలరో స్వయంగా కాగితాలపై వ్రాసి యివ్వప్రార్థితులు. ఎవరైనా కొంతధనాన్ని యివ్వదలిస్తే, ఆ ధనము, ధర్మకర్తలపరంగా ఉంచబడుతుంది. అమెరికనులే – మీఅమెరికనులే – ధర్మకర్తలుగా, ఆ ధనమును భద్రపరుస్తారు. వచ్చి ఇతరమార్గాల్లో సేవచేస్తామన్న వారికి, సక్రమంగా కార్యంనిర్వహించడానికికావలసిన నిర్ణీతమైనఏర్పాట్లు చేయబడతాయి. మీ రేపనిచేస్తారో తెలుపండి. భారతదేశపక్షమున, అమెరికాదేశీయులకు రామునివిజ్ఞప్తి ఇదే! వ్యక్తిగతదృష్టికతీతుడై రాము డీవిజ్ఞప్తిచేస్తున్నాడు. ఈ విషయంతో రాముని కెట్టిస్వార్థసంబంధం లేదు. రాము డెక్కడున్నా స్వతంత్రుడు! ఏవిధానంగానూ రాముడు బద్ధుడుకాడు. సమస్తప్రపంచములు రామునివే. రాముడు సర్వత్రా వసించగలడు. భారతదేశం మీపాదద్వయం. మీరు శిరస్సు. కానీ, మీరుపాదాలవిషయం నిర్లక్ష్యంచేయకూడదు. పాదాలకు దెబ్బతగిలి బాధకలిగితే, మీరు క్రిందపడిపోతారు. భారతీయులరూపంలో భగవంతుడు, అన్నార్తుడై మీకడకు వస్తాడు. అతనికి ఆతిథ్యమిచ్చి సేవించండి. భగవంతుడు హిందువులరూపంలో దిగంబ

రుడై మీకడకు వస్తాడు, అతనికి మీరు వస్త్రాలంకరణంచేయండి. భగవంతుడు, దరిద్రదుఃఖిత భారతప్రజారూపంతో మీముందు సాక్షాత్కరిస్తాడు. అతనికి మీరుసపర్యచేయండి. మీరు ఉన్నతగుణాలతో, ఉదారతతో, ఉజ్వలప్రేమతో దీపించి ధన్యతపొందడానికే, భారతీయులు అజ్ఞానార్తివశులైయున్నారు. మీరు ఉద్ధరింపబడడానికే వాండ్లు పతితులైనారు. మీ ఉన్నతాశయాలను, ఉదాత్తప్రయత్నాలను సార్థకంచేసికోవడానికి ఈసదవకాశం లభించినందుకు మీ అదృష్టాన్ని మీరు అభినుతించుకోండి! ఈదివ్యావకాశాన్ని ఉపయోగించుకోండి! సంతోషోత్సాహాలతో భారతీయులకు చేయూతనిచ్చి ధన్యులు కాండి!

అమెరికా చైనీయులకు, జపానీయులకు, ఎఱ్ఱఇండియన్లకు, నీగ్రోలకూ, విద్యనేర్పుతున్నది. అమెరికా, జంతువులయెడకూడా క్రూరత్వమును నివారించడానికి ప్రయత్నిస్తున్నది. ఓ అమెరికావాసులారా. హిందువులు, మీస్వరక్తబాంధవులు. ఆర్యులు అఖండకృతజ్ఞులు, అత్యంతప్రేమహృదయులు, అనుపమాన విశ్వాసపాత్రులు! వాండ్లను మీరు నిర్లక్ష్యించకండి!

సూచన : ఈ విషయములగూర్చి ఎక్కువగా తెలిసికోదలచినవారు, క్రింది చిరునామాకు సంప్రదించవచ్చు.

రామస్వామి,
C/O డి. ఆల్బర్టు హిల్లర్, ఎం. డి.,
10/11 సట్టర్ స్ట్రీట్, సాన్ ఫ్రాన్సిస్కో.
క్యాలిఫోర్నియా., యు. యస్. ఏ.

ఈ ఉపన్యాసం మొదట అమెరికాలో ముద్రింపబడింది. తరువాత 1903 వ సంవత్సరాంతంలో, "ఇండియన్ మిర్రర్" సంచికలో ప్రచురింపబడింది. తిరిగి, 1905 ఏప్రిల్‌లో, పక్కూర్, ఎడ్వర్డుద్వారా కరపత్రరూపంలో ప్రకటితమైంది. శ్రీ స్వామివారి మహాసంకల్ప మహోపదేశాల మూలకంగా, భారత పరిస్థితుల్లో అద్భుత పరివర్తనం జరిగింది; జరుగుతున్నది—యావత్ప్రపంచంలో మహాపరివర్తనం జరుగుతున్నది—అనువాదకులు.

# భారతదేశపు పరిస్థితులు - ఆర్థిక విశేషాలు

## Facts and Figures About India

భారతదేశపు ఉపరితలపై వైశాల్యం రమారమి రెండుమిలియన్ల చదరపుమైళ్లు. అంటే అమెరికా సంయుక్తరాజ్యాలనుండి అలస్కా, ఆర్ని, కాలిఫోర్నియాలను తీసివేస్తే మిగిలేదానితో సమానంగా వుంటుంది.

జనసంఖ్య ఇంచుమించుగా 300,000,000 ఉంటుంది. అనగా మనుష్యసంతతిలో షుమారు 1/5 భాగం ఉంటుంది. చదరపుమైలుకు 21.4 జనసంఖ్యగల అమెరికా సం. రా లకు పోటీగా యావత్తు రాజ్యమున కొండలు, అడవులు, ఎడారులు కలుపుకొని చ. మై. కు 167 జనాభా ఉన్నది. భారతదేశంలో కొన్ని భాగాల్లో ప్రపంచము లోని యే ఇతరభూములకైనా వలసపోవలసినంత జనాభా ఉన్నది.

హిందూదేశంలో అన్నిరకాలశీతోష్ణస్థితి వున్నది. మిగతా కొన్నివందల వేల చదరపుమైళ్ళప్రదేశంలో వానచినుకు పడడం అరుదు.

180 వివిధభాషలు భారతదేశంలో మాట్లాడబడుతున్నవి. వీటిలో 59 భాషలు ప్రతిదీ 1,00000 మందికి మించిన ప్రజలచే మాట్లాడబడుతున్నది. 2000000 (2 మిలియన్ల)కు పైగా క్రైస్తవు లున్నారు. వారిలో 10 లక్షలకుమించి రోమనుక్యాథలిక్కు లున్నారు. వీరిలో 453612మంది యింగ్లాండుమతానికి 322,586గురు పూర్వాచార గ్రీకుమతానికి సంబంధించినవా రున్నారు. 220863మంది బాప్తిజంను పొందిన వారున్నారు. 155,455 లూథరన్లు, 53829 ప్రెస్బిటేరియనులూ, 157847 నానారకాల క్రైస్తవులు ఉన్నారు. విదేశజనాభాను, బ్రిటిషుసైన్యాన్ని, విదేశమతప్రచారకులను కలుపుకొని కొంతమట్టుకు 2000000 పైగా క్రైస్తవు లున్నారు. ఈవిధంగా క్రైస్తవమతాన్ని పొందిన స్వదేశీయులు ఎక్కువసంఖ్యను చూపడంలేదు. భారత దేశంలో అన్యమతాలనుండి చేర్చుకోబడిన క్రైస్తవులు నిమ్నజాతుల

నుండి వచ్చినవారే. గొప్పకులాలు మొత్తంమీద ముట్టుకోబడలేదు. బ్రిటిష్ప్రభుత్వం క్రైస్తవమతంకొరకు సంవత్సరానికి 4,500,000రూపాయలు హిందూదేశధనాగారమునుండి ఖర్చుబెడుతున్నది.

జనాభాలో తలకు సగటున రెండుఎకరాలవంతున విశాల వైశాల్యముగల 546,224,964 ఎకరాలు గడచిన సంవత్సరపు ప్రభుత్వపు లెక్కలప్రకారము సాగుబడిక్రింద వున్నది. 22,000,000కంటె మించిన ఎకరాలు సంవత్సరానికిరెండుకార్లు పండుతవి. 175,735,000 మందికిపైగా జనులు తమకాలమంతా వ్యవసాయంలోనే గడుపుతారు. 25,468000మంది ఇంచుమించుగా కంపెనీలల్లో ఉద్యోగాలు పొంది వున్నారు. పశుపోషణయందు 3,646,000 నిమగ్నులైయున్నారు. ఆహారపానీయాదులు ఉత్పత్తిచేయడంలో 14,576,000మందికి పనిగల్గుతున్నది. 11220,000మంది గృహకృత్యాల్లో పాటుబడుతున్నారు. 12,611,000 మంది నేతపని చేయడంలో గాజుసామానులు, మట్టిసామానులూ, రాతివస్తువులూ తయారుచేయడంలో 3,285,000మంది చర్మకారవృత్తిలో (వీరందరూ మహమ్మదీయులే) 4,293000 మంది కత్తును, పేమును, చాపలను తయారుచేయడంలో (అందరూ మహమ్మదీయులు) జీవనం గడుపుకొంటున్నారు. లక్షోపలక్షల హిందువులు జనాభాలెక్కలపరిభాష ప్రకారము అవమానకరమైన జీవనం గడుపుతూ ఏ పనీలేకుండా ఊరకున్నారు. వాండ్లు తమపెద్దలుచేసిన వృత్తులు చేయలేకపోతే యింకేమీ" చేయలేరు.

140,496,135 మంది భారతదేశపు మొత్తపు స్త్రీలల్లో 543,495 మందికి మాత్రమే చదవడమూ వ్రాయడమూ వచ్చు. అంటే వెయ్యికి ఒక్కరుకూడా లేరన్నమాట. 300,000,000 మంది మొత్తము జనసంఖ్యలో 246,546,175 మంది అక్షరాస్యుల వెరసి సంఖ్యను సూచిస్తున్నారు.

క్రీ॥ శ॥ 1900 లో 54000,000 మంది ప్రజలు కరవుచే పీడింపబడ్డారు. దర్బారు జరిగిన సంవత్సరములో 5,000,000 మంది ఆకలి బాధచే మరణించారు. జీవితపు పెనుగులాట ఏటేటా వృద్ధి అవు

తున్నది. పరిశ్రమల అభివృద్ధి, రైలుమార్గాలవ్యాపనం, ఆయా ధనార్జనాసదుపాయాలయొక్క ఉద్యోగాలయొక్క పెరుగుదల—దేశంలో ఉన్నా, జీతాలు పెరగడానికిబదులు తగ్గిపోతున్నవి.

భారత భూమిలో 200,000,000 మందికన్న హెచ్చు ప్రజలు రోజుకు 2 అణాలకన్నా (5 cents) తక్కువపైనే జీవిస్తున్నారు. 100,000,000 కన్న హెచ్చుగా రోజుకు ఒక అణా (one cent) కన్న తక్కువ పైననే జీవిస్తున్నారు. 50,000,000 పైగా దినానికి 4 పైసల కన్న తక్కువ పైననే బ్రతుకుతున్నారు. కనీసము మొత్తము జనాభాలో 2/3 వంతు మానవ శరీరపోషణకు ఆవశ్యకమైన ఆహారాన్ని చాలినంత తమ జీవితకాలంలో ఎన్నడూ పొంది యెరుగరు. దేశంలో అనేక భాగాల్లో కుటుంబాలు సగటున 1/4 యెకరం భూమిపైన ఆధారపడడానికి ఒత్తిడి చేయబడినవి. అనేక లక్షలమంది 1/2 యెకరముపై ఆధారపడి యున్నారు.

ఇండియాదేశపు ప్రత్తి చేలల్లో పనిచేసే మగవాళ్ళు, ఆడవాళ్లు నెలకు డా. 1-50 కన్న ఎక్కువ సంపాదించలేక పోతున్నారు. ఒక్క క్షౌరానికి 4 దమ్మిడీలు మంగలి సంపాదిస్తాడు. ప్రభుత్వనియమితులైన తపాలాజవానూ, వార్తావాహకులూ నెలకు రు. 12ల కన్న అధికముగా పొందలేకున్నారు. అంటే షుమారు ౬ షిల్లింగులు. దేహదార్ఢ్యత గలిగి నేర్పరులైన యంత్రకార్యనిపుణులూ, తాపీపనివారు, వడ్రంగులు, కమ్మరులూ, నెలకు 2 లేక 3 షిల్లింగులకంటే ఎక్కువ సంపాదించలేకపోతున్నారు. అదిగాక చిట్టాగుమాస్తాలు, మామూలు గుమాస్తాలు నీడపట్టు ఉద్యోగం గల యితర్లూ నెలకు 4 మొదలు 5 షిల్లింగులవరకూ సంపాదిస్తున్నారు. హిందూదేశంలోని వేతనపరులందరినీ కలుపుకొంటే—వారి నెలజీతము—అమెరికాలోని సమాన తరగతి పనివాండ్లు ఒక్కరోజు సంపాదించిన దానికి బొటాబొటిగా సరిపోతుంది.

దగ్గరదగ్గర మొత్తము జనాభాలో 2/3 వంతు మంది శ్రేయస్సుకు వర్షపాతముమీద ఆధారపడివున్నారు. వాండ్ల ప్రాణాలుకూడా

ఆధారపడియున్నవని చెప్పవచ్చు. కాలము వరుసైతే-కరువన్నమాట. కరువుకాలంకోసం, ఆహారం కూడబెట్టడానికి చాలినంత సంపాదించ లేకున్నారు. కరువు ఆహారం లేకకాదు. ధనలోపంచేతనే కలుగు తున్నది. మామూలుగా ఇండియాలో ఒక ప్రాంతంలో కరువున్నప్పుడు కావలసినంత—ఒక్కొక్కప్పుడు కావలసినదానికంటే యెక్కువ—ఆహారపదార్థం దేశముయొక్క యితరప్రాంతాల్లో ఉత్పత్తి అవు తున్నది.

బ్రిటిషు ప్రభుత్వము రైల్వేశాఖలనుండి ఒక వారములో ఖర్చులుపోను పొందినలాభము 7,600000 (1904 మార్చి 24) ఇది నిలకడగా వృద్ధిపొందుతున్నది. ఇండియాలోని ప్రభుత్వోద్యోగులలో 95 శాతము (95%) స్వదేశస్థులు. ప్రభుత్వోద్యోగులకు చెల్లించే యావత్తు మొత్తములో 35 శాతము మాత్రమే వాండ్లు పొందు తున్నారు. 100కి 5 వంతులు ఉన్నటువంటి యింగ్లీషు ఉద్యోగులకు 65% జీతముగా పోతున్నది. విదేశ క్రైస్తవమతప్రచారక సంఘాల ఆదాయము 1903 సం॥ముకు $ 200,298,057. ఇది ఎక్కువభాగము భారతదేశంలో ఉపయోగింపబడింది.

1600 సం॥లో £ 70000 పౌనుల పెట్టుబడితో యిండియాలో తూర్పు యిండియా సంఘం స్థాపించిననాటినుండి భారత దేశంలో బ్రిటిషు పెట్టుబడిదారీతత్వపు అంకురార్పణ చేయబడింది. తూర్పు ఇండియా సంఘ వ్యాపారము 1833 సం॥ములో తుడిచివేయబడింది. ఆ రోజునుండి 1858 వరకు ఆ కంపెనీ ఇండియా పరిపాలకుడుగా మాత్రం వున్నది. 1858 లో భారతవిప్లవానంతరం అసలు కంపెనీయే యెత్తివేయబడింది, కాని, వారి పరిపాలనా విధానం మాత్రము నిల చింది. వారి పెట్టుబడి, భారతదేశము అప్పుగా తీసికొన్న ధనముపై వచ్చే వడ్డీవల్లా, ఇండియాలోని పన్నులవల్లా చెల్లిపోయింది.

రాజ్యము తూర్పుఇండియా సంఘమునుండి రాజుచేత కొన బడింది. కానీ ఇండియాప్రజలు కొన్నధనం యిచ్చివేశారు. 1857 సం॥ లో £ 51,000,000 పౌనులుగా వున్నఅప్పు 1862 సంవత్సరానికి

£ 97,000,000 పౌనులకుపెరిగింది. జయప్రదమైన 40 సంవత్సరాల శాంతికాలంలో ఇండియాఋణం క్రమేణావృద్ధిపొంది 1901 సం॥ లో £ 200,000,000 పౌనులవరకూ పెరిగింది. ఆ ఋణముమీాద భారత ప్రజలు చెల్లించవలసిన సాలుసరివడ్డీమానము 3 లేక 4 మిలియన్ పౌనుల మధ్యగానీ 15 మొదలు 20 మిలియన్ డాలర్ల వరకుగానీ ఉంటుంది. ఈమొత్తం సాలుసరివడ్డీ చెల్లించబడునట్టి వెయ్యిమిలియన్ డాలర్లఋణానికి సమానమవుతున్నది. ప్రపంచంలోనిఏ దేశం ఇట్టిపనికి తట్టుకొనగలుగుతుంది. స్వదేశఖర్చులకోసం భారతదేశపుశిస్తులనుండి బ్రిటనుకు సంవత్సరానికిపోయేధనం £ 16,000,000 వరకూ పెరిగిపో తున్నది. వాస్తవంగా గొప్పవుద్యోగులనందరినీ కలుపుకుంటే భారత దేశంలో యూరపియన్ఉద్యోగులజీతాలు £ 10,000,000 పౌనులవు తున్నవి. ($ 50,000,000) ఇండియాలో వసూలుఅయ్యేశిస్తులోసగము అంటే £ 44,000,000 పౌనులు ప్రతిసంవత్సరమూ ఇండియానుండి వెలుపలకి ప్రవహించిపోతున్నది.

(సర్ రమేశదత్తు సి. ఐ. ఇ. చే రచితమై యింగ్లండులో ప్రకటితమైన "ఇంగ్లీషుపాలితఇండియా ఆర్థికచరిత్ర" (The economic History of British India) అనేగ్రంథమునుండి అధికారంపొంది పై విషయములు తెలుపబడినవి).

1901 వ సం॥ లో ఇండియాలోని విధవలసంఖ్య 1,54,39,360. వంగరాష్ట్రంలో బాలవిధవలు 2,65,922 మంది వున్నారు.

## భారత స్త్రీత్వము

లండనులో ఒకానొకఆంగ్లయువతిచే నీయబడి భారతీయపత్రికలో ముద్రితమైన ఒకవుపన్యాసమునుండి రాము డిప్పుడు కొన్నివిషయాలు చదువుతాడు. భారతదేశములోని జీవనవిధానమునుగూర్చి ఈదేశంలో వ్యాప్తమైయున్న అపభావాలను, తప్పుడుతలంపులను మీాకు తెలియజేయడానికై రాము డీవుపన్యాసమునుండి కొన్నివిషయాలు వినిపిస్తాడు. భారతదేశానికివెళ్ళినవాండ్లు ఏపనికూడాచేయలేరనేతలంపు కొందరి కున్నది. ఇక్కడ వర్ణవ్యవస్థ ఏ అమెరికాదేశీయుడు

వాండ్లతో కలియడానికేవీలులేనంతగా తీవ్రపరిస్థితిలో వున్నదనే అభి ప్రాయం. కొందరిలో గాఢంగా వున్నది. భారతదేశంతో యేమాత్రం పరిచయంలేనివాండ్లే ఇలాంటిభావాలు వ్యాప్తంచేశారు.

మనం ప్రేమించినవాండ్లకొరకు మరణించడం యెంతఘనమైన విషయం! ఓహో! పరమసంతోషకరవిషయం!

తాను ప్రేమించినవిషయంకోసం తనజీవితమును సమర్పింప సంసిద్ధుడైనవాడే ప్రేమించగల్గినవాడు. అలాంటిప్రేమే మానవుని జీవింపజేసి, మహాసేవలుచేయిస్తుంది. అట్టిప్రేమనే భారతదేశం నేడు వాంఛిస్తున్నది. తనసేవకై అలాంటి స్త్రీపురుషుల ప్రేమనే భారతదేశం వాంఛిస్తున్నది.

భారతదేశమందలి జీవనవిధానమును చూడనటువంటి, అక్కడ నివసించనటువంటి జనులచేత ఈ అసత్యసమాచారాలు వ్యాపకంచేయబడినవి. మైనపుపట్టచుట్టినపుస్తకాన్ని మీరు నీళ్ళల్లో ముంచినప్పుడు ఆ పుస్తకానికి నీళ్ళంటవు. ఆవిధంగానే ఇక్కడిజనులు భారతదేశంలో వసిస్తారు. కానీ భారతప్రజలతో వాండ్లు కలియరు. ఏకీభవించరు. భారతీయపద్ధతిలో భారతదేశంలో నివసించినఒకస్త్రీ ఇక్కడ వున్నది. ఆమె డేనికోవాత్స్యం. ఈమహిళామణివలె అమెరికనులను భారతదేశాన్ని దర్శించడానికి రాముడు కోరుతున్నాడు. నిజమైన కర్మనిష్ఠులుగా మీరు వెళ్ళినట్లయితే మీజేబుల్లోడబ్బేమీ ఖర్చుపెట్టనవసరం లేదు. పక్షులాదిప్రజలను భారతీయులు పోషిస్తున్నారు. వాండ్లు నిరుపేదలైనా పరమోదారస్వభావులు. భారతీయసన్యాసులు తమచెంత ధనంకల్గియుండడం రాము డెప్పుడూ చూడలేదు. వాండ్లు వీధుల్లోకి రావాలంటే ఆకలితీర్చుకోటానికి భిక్షార్థము వచ్చినట్లుగా అర్థమౌతోంది. తమయింటిముందుగా పోతున్నఅన్నార్తులకు అన్నంపెట్టి సంతృప్తిపరచడం, భిక్షుకులకు దానధర్మాలుచేయడం భగవద్విధిగా ప్రతి భారతీయస్త్రీ యెంచుతుంది. ఒకగృహిణిఇంటిముందు యెవరైనా సన్యాసినిలపడ్డప్పుడు ఆతనికి సమర్పించడానికి ఇంట్లో యేమీ లేనప్పుడు యేమిజరుగుతుందో రామునకు తెలుసు. ఆ సన్యాసికి పెట్టడానికి

ఇంట్లో అన్నంలేనప్పుడు ఆగృహిణి నేత్రాంచలాల వెంట కరుణాశ్రువులు కాలువలై పారుతవి. భిక్షుకుని వేషంలో పోయేవరైనాసరే, ఆకలి గొన్నవాడెవరైనాసరే, ఆతడు సన్న్యాసిగా యెంచబడతాడు. సాధువన్నా సన్న్యాసియన్నా స్వామియనుకో సక్కరలేదు. అమెరికనువైన నీవు భారతదేశంలో వసించు; నీవు అన్నార్తుడవై కనపడ్డావా, సన్న్యాసిగా సాధువుగా సత్కరింపబడతావు. అన్నవస్త్రాలులేనివాడల్లా అక్కడ సన్న్యాసియే.

## భారత సతీత్వము

భారతదేశమున భార్య భర్తచే గౌరవింపబడదనీ ప్రేమింపబడదనీ, ఇంగ్లాండు అమెరికాదేశాలలో సర్వసాధారణంగా చెప్పుకొంటుంటారు. ఇది కేవలం అసత్యభావం. ఎందుకంటే - భారతదేశంలో గృహిణి (భార్య) తనభర్తచేత ఈదేశంలోకంటే ఎక్కువగా ప్రేమ గౌరవాలను పొందుతున్నది. ఈదేశంలో, భార్యను బహిరంగంగా, ప్రేమిస్తారు, ముద్దాడుతారు, గౌరవిస్తారు; కానీ రహస్యంగా, భార్యను నిరాకరిస్తారు. భారతదేశంలో, భర్త బహిరంగంగా, భార్యపై అంతగా గౌరవప్రేమలు ప్రకటించడు. కానీ తనఅంతరాంతరాల్లో ఆమెను తన హృదయాధిష్ఠానదేవతగా ఆరాధిస్తాడు.

ఈదేశంలో భార్యయెడ బాహ్యప్రేమప్రకటనమే ప్రాముఖ్యం. ఆత్మలోప్రేమ అప్రధానవిషయం. భారతదేశంలో ఇట్లు కాదు. భర్త భార్యపైన పైకి ప్రేమాభిమానములను ప్రకటించడు. కానీ అతడు తనమార్గంలో తాను భార్యయొక్క అభిమతార్థంకోసం తనసర్వస్వాన్ని త్యాగంచేస్తాడు. ఆమె సౌఖ్యంకోసం అతడు పడరానిపాట్లు పడతాడు. అయితే- తేడా ఎక్కడ ఉన్నదంటే- భారతదేశంలో పురుషులంతగా స్త్రీలు చదువుకోలేదు. మీదేశంలోమాత్రం పురుషులంతగా స్త్రీలు చదువుకొన్నారా? భారతదేశంలో పురుషులు ఈదేశంలోవారితో సమానంగా చదువుకోలేదు. స్త్రీలుకూడా అంతే.

నేను దోషమంతా, భారతదేశమున నడుస్తున్న దాంపత్య విధానంమీదే మోపబడింది. కానీ ఇది సరియైన వివేచన కాదు.

భారతదేశంలో, పురుషుడు తనభార్యను, "నాభార్య" అని పేర్కొనడానికి సాహసించలేడు. ఎవడుకూడా భార్యను, "నాభార్య" అని పేర్కొనడు. ఆ విధంగా పేర్కొనడం- అపవిత్రంగా, అనాగరికంగా, నింద్యంగా, లజ్జాకరంగా, ఎంచబడుతుంది. భారతీయుడు, "నా భార్య" అన్నపదాన్ని ఎప్పుడూ ఉపయోగించడు. భార్యనుగూర్చిన ప్రసక్తి వచ్చినప్పుడు, "మాపిల్లవానితల్లి, మాకృష్ణునితల్లి, మారాముని తల్లి" అని చెప్తాడు.

ప్లేగువ్యాధితగిలిన ఒక బాలుడు, ఊరివెలుపలగుడిసెలో ఉన్నాడు.

ప్లేగుతగిలిన వ్యక్తిదగ్గరకు అతనికుటుంబీకులైనాసరే వెళ్లడానికి భారతచట్టం ఒప్పుకోదు.

ఈ (అమెరికన్) పుణ్యస్త్రీ ఆప్లేగుతగిలినబాలుని గుడిసెదగ్గరకు చేరుకొని, ఎట్లో లోపలికి ప్రవేశించగలిగింది. మరణోన్ముఖుడైన ఆబాలునిచెంతనే యుండి, ఆమె వానిసేవచేయడానికి పూనుకొన్నది. చివరకు, ఆబాలుని కన్నతల్లికికూడా అచట ప్రవేశం దొరికింది. ఆ మరణోన్ముఖుడైన బాలుడు తనతల్లిపాదాలపై శిరస్సుపెట్టుకొని అసువులు విడిచాడు. హిందూధర్మప్రకారం, మాతృచరణసన్నిధిలో మరణించడం- మహాపుణ్యక్షేత్రంలో మరణించడంతో సమానం. క్రీస్తుచరణాలపై క్రైస్తవుడు చనిపోవడం ఎంతగొప్పో అంతగొప్పైన విషయం. మాతృచరణసన్నిధిలో మరణించడం, మహాపుణ్యవిశేషంగా హిందూబాలుడు తలుస్తాడు.

ఈ దేశంలో మీరు దేవునితండ్రిగా ఆరాధిస్తారు. "స్వర్గమందున్న మాతండ్రీ!" అని సంబోధిస్తారు. భారతదేశంలో తండ్రిగానే గాక, దేవుని, తల్లిగాకూడా ఆరాధిస్తారు. భారతీయవాఙ్మయంలో "మాత" అన్న పదం మహాప్రియాతిప్రియమైంది. "మాతృశ్రీ"- అన్నపదం భగవంతుని నామావళిలో దివ్యాతిదివ్యమైంది - ప్రియాతిప్రియమైంది.

హిందువుడెవడైనా రోగగ్రస్తుడైనప్పుడు, మంచంబట్టి, మహాబాధపడుతున్నప్పుడు, వానినోటినుండి వెలువడే పిలుపు- 'ఓ దేవుడా!'

అని కాదు. "అమ్మా అమ్మా!" అని. హైందవహృదయాంతరాళం లోనుండి- వెలువడే భగవంతునిగూర్చిన పిలుపు- అమ్మా!- అని. "అమ్మ" అనే మాట హైందవుని హృదయంలో ఉజ్వలభక్తి సముద్రాన్ని ఉప్పొంగజేస్తుంది.

— ఓం! ఓం!! ఓం!!! —

# శ్రీ రామతీర్థ వేదాంతభాష్యము

## శ్రీ రామతీర్థ సంపూర్ణ సారస్వతము



అష్టమ సంపుటము



శ్రీ రామతీర్థ సేవాశ్రమము
పిడుగురాళ (పోష్టు) గుంటూరు జిల్లా - ఆంధ్ర

# శ్రీ రామతీర్థస్వామి



"దేనికి నీవు భయపడడం? దేవుని గూర్చా? అది బుద్ధిహీనత. మానవుని జూచా? అది పిరికితనం. పంచభూతాలకా? ఎదిరించి నిలువు. నిన్ను నీవు చూచుకొనేనా? నిన్ను నీవు తెలిసికో! 'అహం బ్రహ్మోఽస్మి' అని గర్జించు."

SRI RAMA TIRTHA SEVASHRAM, PIDUGURALLA (P. O.) GUNTUR DT., A. P.

# శ్రీ రామతీర్థ లేఖావళి

అనువాదకులు

శ్రీ కేశవతీర్థస్వామి

ఓమ్

# సూర్యకిరణాలు

“ ఓహో ! ఈ అమూల్య లేఖావళిని పఠించడంవల్ల ఆనందం ఉప్పొంగుతున్నది. ఈ లేఖావళికి ప్రతులు వ్రాయడం సర్వోత్కృష్ట జ్ఞానమును, ఆనందమును, పావిత్ర్యమును, ఆత్మ తేజమును కలిగిస్తున్నది. ప్రియమైన పురాన్ ! ఈ లేఖావళి నీకూ నీ సహపాఠకులకూ ఆనందమును చేకూర్చగలదని నాకు తెలుసు. ఈ లేఖావళికి సమగ్ర ప్రతి వ్రాసి పంపడం అసాధ్యమైన విషయం. శ్రీ గురుదేవుని దివ్య తేజం, ప్రతి పత్రంలో — వారి లేఖినినుండి జారిన ప్రతి పంక్తిలో — పరివ్యాపించి ఉన్నది. ఈ లేఖావళిని నేను నా ప్రాణధనంగా భద్ర పరచుకుంటాను. బ్రహ్మవేశదాయకములైన అనుగ్రహప్రపూర్ణములైన ఈ లేఖాపత్రపంక్తులను నేను పఠిస్తున్నప్పుడు, రాముడు నా కట్టెదుట సాక్షాత్కరిస్తాడు. నిజంగా, నా మనోహృదయాలు వికసిస్తాయి. ఆత్మపరిశుద్ధత అనుభూతమవుతుంది. నా ఆత్మయే—సత్యాత్మ భగవానుడే—పరమసత్య మన్నదర్శనం కలుగుతుంది. ”

—సూర్యానంద

---

* శ్రీ సూర్యానంద శ్రీ రామతీర్థస్వామివారి పాశ్చాత్య దేశపు శిష్యురాలు. ఈమె ప్రథమనామం వెల్మన్‌సతి. సూర్యానంద అని ఈమెకు శ్రీ స్వామీజీ సన్న్యాసనామం ప్రసాదించారు. ఈమె రామబోధానంద పరవశమై సన్న్యసించి, రామాదేశానుసారం అమెరికావిడిచి భారతదేశానికి వచ్చి, మహోత్తమ సేవ చేసిన ధన్యురాలు.

—అనువాదకులు.

# హిమాలయ లేఖలు

## ( హిమాలయ దృశ్యాలు )

## 1. గంగోత్రి

సెప్టెంబరు, 1901

గంగాభవాని రామవియోగమును భరింపలేకపోయింది. ఒక నెల దినములుదాటిన పిదప ఎట్లాగైతేనేమి చివర కామె రాముని తన చెంతకు రప్పించుకోగలిగింది. ఆమెలోని అఖండజ్ఞానరసం ఉప్పొంగింది. రామ సంయోగానంద మధురామృతబాష్పధారలు ఆమె వర్షింప సాగింది. గంగోత్రిచెంత, ప్రియమైన గంగానదియొక్క అవతరణ సౌందర్యమును, చంచల క్రీడా విలాసములను, వర్ణింప నెవరి శక్యం ? ఆమె సఖీమణులైన హిమవత్పర్వతాలయొక్క, అమాయిక దేవదారు వృక్షాలయొక్క సమున్నత సౌశీల్యం అత్యంత ప్రశంసనీయం. ఈ సమున్నత వృక్షాలు పారశీక కవియొక్క సఖీప్రణయంతో పోటీచేస్తున్నవి. ఈ తరుతరుణీగణసుగంధశ్వాస, పరవశోత్సాహాలను కలిగిస్తున్నది ; తన్మయోత్తేజమును కలిగిస్తున్నది.

"భగవంతుడు రాతిలో నిద్రిస్తున్నాడు ; వృక్షంలో నిశ్వసిస్తున్నాడు ; జంతువులో సంచరిస్తున్నాడు. మానవునిలో ప్రబుద్ధుడైనాడు"—అన్న విషయ మిక్కడ ఎంత స్పష్టంగా కనబడుతుంది !

యాత్రికులు మామూలుగా, యమునోత్రినుంచి పది దినాలలో గంగోత్రి చేరుతారు. కానీ రాముడు యమునోత్రినుంచి మూడు రోజుల్లో గంగోత్రి చేరాడు. ఇంతవరకు మైదానాలలో ఉండే ఏవ్యక్తీ త్రొక్కి ఎరుగని దారిగుండా రాముడిక్కడికి చేరాడు. పర్వతవాసులీ దారిని ఛాయామార్గమని పిలుస్తారు. నిర్మానుష్యములైన ఏకాంతారణ్యగుహాగర్భాలలో వరుసగా మూడు రాత్రులు గడుపబడినవి. దారిలో మా కొక్క గ్రామంకానీ, కుటీరంగానీ తగులలేదు. మార్గంలో ఎక్కడా, మనిషిపొళుకువే కనబడలేదు.

దాదాపు సంవత్సరాంతం ఛాయాచ్ఛాదితమై యుండటంచేత ఛాయామార్గమని ఆ మార్గానికి పేరు వచ్చింది. నేను చెప్పేది—

చెట్లు నీ డనుకొన్నారా? కాదు కాదు. కండ్లు తిరిగే అంతటి ఉన్నతో న్నత ప్రదేశాలమీద అంతటి శీతల వాతావరణంలో చెట్లెందు కుంటవి? దాదాపు మార్గమంతా మేఘాచ్ఛాదితమై యుంటుంది. యమునోత్రి గంగోత్రి ప్రాంతపు పల్లెలలోని గొల్లవాండ్లు మందలు కాచుకుంటూ, ప్రతియేడూ రెండు మూడు మాసాలు అరణ్యాల్లో ఉంటారు. బందర్ పంచ్, హనుమాన్ ముఖ్ — అనే హిమాచ్ఛాదిత శిఖరాలదగ్గర, వాండ్లు కలిశారు. ఈ ప్రదేశమే జగత్ప్రసిద్ధిగల ఉభయనదీ సోదరీమణుల మూలములను కలుపుతున్నది. ఈ విధంగా దారి కనిపెట్టబడింది. దారిపొడుగునా బంగారువస్త్రం పరచినట్లు, అగణిత పుష్పజాతు లలముకొనియున్నవి. పీతనీలారుణవర్ణపుష్పాలు, దారినిండా ఎక్కడబట్టినా అవ్వే! కలువలు (Lilies) నీలాంబరాలు (Violets) చిన్న చిన్న సీమపూలు (Daisies), రకరకాల గంగరావి చెట్లు, గుగ్గిల, ధూప, సాలామిశ్రి మొదలైన రంగురంగుల అందమైన ఆకులతోగూడిన వనమూలికలూ అత్యద్భుత సువాసనల విరజిమ్ము తున్న కుంకుమపువ్వు మొదలైన మొక్కలు, భేర్ గడ్డ (Bher gadda), మంచుచుక్కల మంచి ముత్యాలతో శోభిస్తున్న బ్రహ్మకమలాలు (Brahma Kanwal), — మొదలైనవన్నీ ఈ పర్వతాలను, పరమేశ్వరుని ఉద్యానవనంగా చేస్తున్నవి.

ఓ మధురాకృతీ! ఓ రమ్యరూప!
ఓ ప్రేమలక్ష్మీసమంచితమూర్తి!
నీ విశ్వభావ నీ ప్రతిభారహస్య
ముల బ్రకటించుచున్నది విశ్వనాథ!
అప్రాకృతము త్వదాచార్యత్వసరళి.
నీ వినిర్మలమహానందతత్వమును
ఈ విశ్వవైచిత్ర్యభాషాముఖమున
ప్రకటించుచున్నావు పరమాత్మ! నీవు!

"గోకులచంద్రుని సౌందర్యతేజం సర్వత్రా ప్రకటితమవుతున్నది." మందమారుతాలు ఎదురైనప్రతివస్తువునూ ముద్దిడుకుంటూ, ముఖ్యంగా వికసించినమంచిమంచిపుష్పాలను ముద్దాడుతూ, స్వేచ్ఛగా విహరిస్తు

న్నవి. అక్కడక్కడ, వాయువాహినులపై తేలుతూ వచ్చిపోయే సుగంధశ్వాసలు రామునకు మధురసంగీతంలాగా వినిపిస్తున్నవి. ఇక్కడ మధురమంజులమారుతానికి కొదవలేదు. ఈమారుతం, సంయోగ వేళ ప్రేమికులముఖరంగంపై లాస్యంచేసే మందహాసంలాగా మధురమైంది. వియోగవేళ వారినేత్రాంచలాలవెంట మౌనంగా ప్రవహించే అశ్రుమాలికలవలె మంజులమైనది. ఈ ఎత్తైనకొండకొసలపైన పచ్చికబయళ్లు తివాసీలుపరిచినట్లున్నవి. ఈ తివాసీలపైన దేవతలు విందులారగిస్తారో? లేక నృత్యంచేస్తారో? ఈదివ్యప్రదేశంలో, మర్మరధ్వనులతో సెలయేళ్లు జారుతున్నవి. గర్జిస్తూ పర్వతవాహినులు దుముకుతున్నవి. కొన్నిశిఖరాలపైన దృష్టి పూర్ణస్వాతంత్ర్యాన్ని అనుభవిస్తూ అనంతదూరాల్లోకి ఎగిరిపోతున్నది. కొండలుగానీ, కృద్ధమేఘాలుగానీ, ఈపర్వతోపరిభాగస్వాతంత్ర్యదృష్టికి ఎటుచూచినా అడ్డుతగలడం లేదు. ఆకాశాన్నంటుకొన పైపైకి ఎగిరిపోతున్న కొండలకొసలు, మేఘలోకాన్ని ముద్దాడ ఎగిరిపోతున్నపర్వతశిఖరాలు, తమ్మంతాము మఱచిపోయి, మహోన్నతస్వర్గభూమికలలో కలిసిపోతున్నట్లు కనబడుతున్నవి. ఈ నిరంకుశపర్వతశ్రేణుల అద్భుతప్రతిభనుగూర్చిన ప్రసంగంలో, వజ్రాలలాగా మెరిసిపోతూ, మార్గశోభను ఇనుమడింపజేస్తున్న ప్రాతఃకాలతుషారబిందువుల తరళసౌందర్యమును మనం సందర్శించకుండా పోగూడదు. తామరాకుపైనున్న చంచలహిమబిందువుతో మానవుని మనస్సును పోల్చడం ఎంతసముచితంగా ఉన్నది. ఈ మంచుబిందువు ఎంతో చిన్నది. చంచలమైంది. ఐనా, ఎంతో పరిశుద్ధంగా, ప్రకాశవంతంగా, వెలుగొందుతూ, తనహృదయంలో సత్యసూర్యుని – అనంత తేజోమూలమును – ప్రతిఫలింపచేసికొంటున్నది. ఓ మానవుడా! నీవు చంచలమైన మంచుబిందువువా? లేక అనంతసూర్యుడవా? నిజంగా నీవు పరంజ్యోతివేగాని, మంచుచుక్కవు కాదు. ఈదివ్యసుందరదృశ్యాలన్నిటికీ – ఈ మనోహరప్రకృతికంతటికీ – ప్రాణప్రకాశముల ప్రదానంచేస్తున్నది – నీ దేదీప్యమానమైన మహాప్రతిభే నని సమస్తవేదములు, ఉద్ఘోషిస్తున్నవి. రాముడు ఘంటాపథంగా నిర్వచిస్తున్నాడు. క్రిందా పైనా, సర్వత్రా నీ మహాతేజమే ప్రకాశిస్తున్నది. ఆ అనంతశక్తివి నీవే! ఒక్కదానిలోగాక–అణువుమొదలు బ్రహ్మాండం

వరకు - సర్వత్రా సమానంగా ప్రకాశిస్తున్న ఆ మహాశక్తివి నీవే! ఉదయసూర్యుని మోముపైన లేనగవులసొగసు నిచ్చింది నీవే! గులాబీ కన్నె యెదలో సిగ్గును సింగారించింది నీవే!

నీరవనీలనిశీథప్రదీప్త
తారకలందు, ప్రభాతతుషార
తళతళత్కాంతుల ప్రతిఫలించునది -
నీదివ్యశోభయే - నీరజనాభ!
సర్వప్రపంచశోభకు మూల మీవె?
తారకావేష్టితచంద్రబింబంబు,
మసకచీకటిసందె, మానితోషస్సు,
అందమై వెలుగొందు నఖిలదృశ్యములు -
నీ వ్రేళ్లకొసల వ్రాసిన చిత్రసమితి!
సకలవిశ్వమున నీ సుందరచరణ
ముద్రలే శోభిల్లుచున్నవి స్వామి!
"భగవంతు డిచ్చటే యున్నా" - డటంచు
గుసగుసలాడుచున్నది యణువణువు.

బాలకృష్ణుడు (గోకులచంద్రుడు) గోపికల యిండ్లలో తానుతిన్నంత వెన్న తిని, మిగిలింది ఆవుదూడలమూతికి రాసేవాడు. పాపం! ఏమీ ఎరుగని ఆ అమాయికజంతువులను, అజ్ఞానగోపాంగనలు తిట్టి కొట్టే వాండ్లు. అసలుదొంగమీదికి ఏమీ వచ్చేదికాదు. ఆచిట్టిదొంగ మెల్లగా తప్పించుకొనిపోయి ఎవరికీ చిక్కేవాడుకాదు. తనస్వేచ్ఛా లీల, సర్వప్రపంచమును నడుపుతున్నది—ఆ పరమాత్మే! నిజానికి ఆ మహామాంత్రికుడైన రాముడే సమస్తమును నడుపుతున్నాడు! సర్వ కర్త రాముడే! కానీ, ఆతని అద్భుతమాయచేత, అహంకృతికి కర్తృ త్వాన్ని ఆపాదింపజేస్తున్నాడు. ఆ నవనీతభక్షకుడైన శ్రీకృష్ణుని అమాయికు డనండి, అల్లరివా డనండి, - అతడే నీ స్వస్వరూపం. మంత్రగాడైనా, మాయలగారడీ డైనా, - రాముడే - నీ సత్యాత్మ. సర్వం నీలోనే ఉన్నది. సమస్తాన్ని నిర్వహిస్తున్నది - నీవే. దేహ మనేసంకుచితద్వీపంలో నీవు బద్ధుడవు కాదు. కారాగారబద్ధమైన

అహంకృతి (మిథ్యాహంకారము) నీ ఆత్మ కాదు. నీవు ఖండమైన అల్పమైన హిమబిందులేశానివి కాదు. నీవు అఖండమైన మహాశక్తి సాగరానివి!

## 2. ప్రస్తుత నివాసం.

బాహ్యదృష్ట్యా, రాముని ప్రస్తుతనివాసం - ఒకపర్వతాగ్రమున గల సహజైకాంతవనమధ్యమందలి పచ్చికబయలులో నిర్మింపబడిన చిన్నకుటీరం. ఇక్కడనుంచి గంగానది మనోజ్ఞంగా కనబడుతూంటుంది. నారాయణతులారాములు వేరొకచోట ఉంటున్నారు. పిచ్చుకలు, రకరకాలపక్షులు, పగలంతా పాడుతూ ఆడుతూ స్వేచ్ఛగా విహరిస్తుంటవి. వాతావరణం సముత్తేజకరం. గంగాసంగీతం, పక్షులకలకలారవాలు, నిరంతరం స్వర్గానందమును చేకూరుస్తుంటాయి. ఇక్కడ గంగానదిలోయ అతివిశాలంగా ఉంటుంది. గంగి, ఒకపెద్దమైదానంలోనుంచి ప్రవహిస్తున్నది. ప్రవాహం అతివేగంగా ఉంటుంది. అయినా రాము డనేకసార్లు దానిని ఉత్తరించాడు. కేదారము, బదరీ, అనేకసార్లు రామునిపాదుకపాను పరమప్రేమతో ఆహ్వానించాయి. కానీ, ప్రియగంగి, రామవియోగభావనామాత్రముననే విచారాక్రాంతయై చిన్నబోతుంది. ఆమెకు విచారంకలిగించడం రామున కయిష్టం.

## 3. సుమేరు సందర్శనం.

యమునోత్రీగుహలో నివసించేటప్పుడు రాముడు, రోజుకు ఒక్కసారి మార్చా (Marcha) బంగాళాదుంపలు (ఉర్లగడ్డలు) ఆహారంగా తీసికొనేవాడు. దీనివల్ల అజీర్ణమేర్పడింది. మూడురోజులు వరుసగా రోజుకు ఏడుసార్లచొప్పున విరేచనాలైనవి. అనారోగ్యంగా ఉన్నా నాల్గోనాడు, ప్రొద్దున్నే పెందలకడ లేచి, వేడినీటిబుగ్గల్లో స్నానంచేసి, కౌపీనమాత్రపరిధానుడై, కాళ్లకు చెప్పులుగానీ, తలగుడ్డగానీ, గొడుగుగానీ- లేకుండా రాముడు, సుమేరుసందర్శనానికి బయలుదేరాడు. ఐదుగురు బలిష్ఠులైన పర్వతవాసులు ఉన్నిదుస్తులు వేసికొని అతనివెంట బయలుదేరారు. నారాయణతులారాములు ఘూర్నాలీకి పంపబడ్డారు.

మొట్టమొదట బాలయమునానదిని, మూడుసార్లో నాలుగుసార్లో మేము దాటవలసివచ్చింది. తరువాత ఒకపెద్ద బ్రహ్మాండమైన మంచుగడ్డచేత మూయబడిన యమునానదిలోయ వచ్చింది. ఆ మంచుగడ్డఎత్తు దాదాపు నలభైఐదు గజాలు, పొడవు ఫర్లాంగున్నర ఉంటుంది. ఇరుప్రక్కల, నిట్రనిలువు కొండలు రెండు ఎత్తైనగోడల మాదిరి గర్వంతో నిల్చున్నవి. అవి రామపాదుషాను ముందుకుపోకుండా అవరోధిస్తాయా? అవరోధించలేవు. ఒక వజ్రకఠోర సంకల్పముండు, అవరోధాలన్నీ అదృశ్యంకావలసిందే. మేము పడమటివైపున గల పర్వతమధ్యమును ఎక్కడానికి ప్రారంభించాము. అప్పుడప్పుడు కాలు నిలువడానికి రవ్వంతకూడా ఆస్కారం దొరికేదికాదు. సువాసనలు విరజిమ్ముతున్నా ముండ్లతోగూడిన గులాబీతీగెలు పట్టుకొని దేహాలు నిల్పుకొనేవాండ్లం. ఒక్కొకసారి "ఛా" అనే మెత్తటికొండగడ్డిలో మడిమలు గుచ్చి నిల్చునేవాండ్లం. కొన్నిసమయాల్లో మృత్యువుకు సరిగా ఒక్కఅంగుళంమేరలో ఉండేవాండ్లం. మంచుతో నింపబడిన అగాధమైన యమునానదిలోయ, కొంచెం కాలువణికినాసరే, ఆతనికి స్వాగతమిచ్చే, మృత్యుగహ్వరంలాగా ఉన్నది. క్రింద - లోయలో - నెమ్మదిగా, అస్పష్టంగా, వినిపిస్తున్న యమునానదియొక్క మర్మరధ్వని, మృత్యుదేవతప్రయోగించే మృదంగధ్వనిలాగా చూకు వినిపిస్తునేఉన్నది. ఈవిధంగా ముప్పావుగంటకాలం మృత్యువుయొక్క కోరలమధ్య మేము సాగిపోయాము. నిజంగా విచిత్రపరిస్థితి: ఒకవైపు మృత్యువు ముఖాముఖిగా నిల్చున్నది. మరొకవైపు, మలయమారుతం మనోహరసువాసనలతో సేదదీర్చి సముత్తేజాన్ని కలిగిస్తున్నది. అపాయకరమూ ఆనందకరమూ - అయిన ఈమార్గమున మేము, ఎలాగైతేనేమి చివరకు భయానక హిమఖండావరోధము నతిక్రమించాము. ఇంక యమునానది తగలదు. సంఘు మొక ఎత్తైన నిట్రనిలువుకొండ నెక్కింది. ఆ పర్వతంమీద దారిగానీ తెన్నుగానీ లేదు. చెట్లబోదెలుగూడా కనబడని దట్టమైన కీకారణ్యాన్ని దాటాము. రాముని శరీరానికి అనేక గాయాలు తగిలాయి. ఇంచుమించు ఒకగంట, సింధూరవృక్షాలతో గంగరావిచెట్లతో కూడిన ఆమహారణ్యంలో పరిశ్రమించి పరిశ్రమించి, చిట్టడవితో కూడిన విశాలప్రదేశంలోకి మేమందరం చేరుకొన్నాము.

వాతావరణమంతా సుగంధబంధురం. ఆ యెగుడుమిట్ట పర్వతవాసులందరికీ ఆయాసం కలిగించింది. రామునికికూడా అది మంచివ్యాయామంగా పనిచేసింది. ఆయెగుడుమిట్ట 80° ఎత్తుకు మించి ఉంటుంది. నేల సాంతం ఇంచుమించు జారుడుగానే ఉంటుంది. అయినా, నలువైపుల కానవచ్చే మహోన్నతవృక్షపంక్తులు, మనోహరపుష్పజాతులు వివిధలతాపత్రగుల్మములు, మా మార్గాయాసమును మరపించాయి. సాధారణంగా యూరోపియన్‌తోటమాలులు, ఇలాంటి ప్రదేశాల నుంచి పూలవిత్తనాలు తెచ్చి ఇండియన్‌కంపెనీ తోటలలో నాటుతారు. ఈ విషయం తెలియని ఇంగ్లీషునేర్చిన యువకులు, వీటిని ఇంగ్లీషు పుష్పాలని పిలుస్తారు. ఈ పుష్పజాతులలోఉన్న అత్యద్భుతమైన ప్రత్యేకత ఏమిటంటే, వీటిని ఇంకొకచోట నాటినప్పుడు, బాహ్యసౌందర్యం ఉన్నా, సహజసుగంధాన్ని కోల్పోతాయి.

పాశ్చాత్య విద్యాభ్యాసం చేసిన యువకులు, పాశ్చాత్య పండితులు వ్రాసిన భారత వేదాంత శాస్త్ర ప్రతిబింబాలను చూచి, అవే మెచ్చుకొని ఉబ్బిపోతారు. కానీ వాండ్లకీ రచనలు, తమ మాతృభూమినుంచి తేబడిన భావపుష్పాలే అని తెలియదు. పాశ్చాత్య పండితుల తాత్త్వికరచనా పుష్పాలలో వైరాగ్యసుగంధ ముండదు. ఔరోపీయులు చేసిన వేదాంత రచనల్లో తాత్త్విక వర్ణసౌందర్య ముంటుందే కాని, సాక్షాత్కార సువాసన శూన్యం.

"ఆక్సె గుల్ మెమ్ రంగ్‌హై గుల్‌కా, వలెకిన్ బూనహాన్"
"Aks-i-gul menrang hai gulka, Walekin bunahin"

రాము డనారోగ్యంతోనే బయలుదేరాడు కదా. రాముని ఆరోగ్య మెలా ఉన్నది? ఆ నాడు రామునికి సంపూర్ణారోగ్యం వచ్చింది. రోగంలేదు. అలసట లేదు. బలహీనత లేదు. ఏ రోగబాధా లేదు. అతణ్ణి ఏ పర్వతవాసికూడా నడకలో వెనుకబడవేసి ముందుకు పోలేకపోయాడు. అందరికి బాగా ఆకలయ్యేవరకు, మేము కొండ లెక్కి యెక్కి పైకి వెళ్ళిపోయాము. చివర కొక ప్రదేశానికి చేరుకొన్నాము. ఇక్కడ వర్ష మెప్పుడుకూడా కురియదు. కానీ ఇక్కడ మంచు గడ్డలు గడ్డలు వర్షిస్తుంది. ఆ అతిస్నిగ్ధ శీతలశిఖరాలపైన

చెట్టుచేమల పొళుకువే లేదు. మేము వచ్చేముందే ఒక స్వచ్ఛమైన హిమవర్షం కురిసిపోయింది.

ఒక విశాల శిలాఫలకంపైన రామునికి ఆసనంగా ఒక ఎఱ్ఱని కంబళి పరచబడింది. క్రిందటిరాత్రి వండబడిన ఉర్లగడ్డలు రామున కాహారంగా ఇయ్యబడినవి. అనుచరులు కూడా ఆ నిరాడంబరమైన ఆహారమును సంతోషంగా స్వీకరించారు.

ధగధగ మెరిసిపోతున్న మంచుగడ్డలు నీరుగా ఉపయోగింప బడినవి. భోజనం కాగానే, తిరిగి అందరం ప్రయాణం సాగించాము. సూటిగా మే మలాగే పైపైకి నడచివెళ్ళాము. ఒక యువకుడు అలసి పడిపోయాడు. అతని గుండె, అవయవాలు, ఇంక ముందు కతనిని పోనీయలేని స్థితికి వచ్చాయి. అతడు తల దిమ్ముగా ఉన్న దన్నాడు. అతని నక్కడ ఒంటరిగా వదలి బయలుదేరాం. ఇంక కొంచెం దూరం పోయేసరికి ఇంకొక అనుచరుడు, "నా తల గిరగిర తిరుగుతున్న" దని చెప్పి స్మృతితప్పి పడిపోయాడు. అతణ్ణికూడా అక్కడ వదలి, మిగతా వాండ్లం ముందుకు పయనించాము. మరికొంతసేపటికి, మూడవవ్యక్తి కూడా పడిపోయాడు. వానికి ముక్కువెంట నెత్తురురావడం మొదలు బెట్టింది. రాము డిప్పుడు ఇద్దరితోటే కలసి పైకి వెళ్ళుతున్నాడు.

మూడు అందమైనకొండదుప్పులు అత్యంత వేగంతో పరుగిడుతూ కనుపించాయి.

నాలుగవ అనుచరుడుసైతం వెనుకబడి, చివరకు మంచుగప్పిన రాళ్లపై పడిపోయాడు. చుట్టుప్రక్కల ఎక్కడచూచినా నీళ్లు కనపడ లేదు. కానీ ఆమనిషి పడిపోయినచోట రాళ్లక్రింద ఒకనిగూఢమైన మర్మరధ్వనివినిపిస్తున్నది. ఒక్కబ్రాహ్మణుడుమాత్రం రామునితో కలసి వస్తున్నాడు. ఒక్క ఎఱ్ఱనికంబళి, ఒకదుర్బిణీయంత్రం, ఒకఆకుపచ్చని కండ్లజోడు, ఒకచిన్నగొడ్డలి, అతనివెంట ఉన్నసామాను. ఊపిరిపీల్చ డానికి వీలులేనంతగా గాలి పలుచబడింది. విచిత్రంగా, మానెత్తిమీదిగా గరుడపక్షులురెండు ఎగిరిపోయాయి. ఒక అతిపురాతనమైన, కాటుక వలె నల్లగానున్న, మంచుకొండను మేము ఎక్కవలసివచ్చింది. నాతో ఉన్నసహచరుడు, మేము కాళ్లునిలుపుకోడానికి ఆజారుతూవున్న మంచు

గడ్డను గొడ్డలితో నరుకుతూ దారిచేస్తున్నాడు. కానీ ఆపురాతనహిమ శిఖరం కఠినకర్కశంగా ఉన్నందున, పాప మాతని గొడ్డలి విరిగిపోయింది. ఇంతలో అక్కడే అప్పుడే, ఒకమంచుతుఫాను బయలుదేరింది. విషణ్ణహృదయు డైనతోటిస్నేహితుని, – మంచుతుఫానుచేత ప్రకృతి మనకు కీడుచేయదు; మేలే చేస్తుందని – రాముడు సముత్సాహపరిచాడు. అంతే జరిగింది. ముందుకు విసురుతున్న మంచుతుఫానుచేత మేము సులభంగా ముందుకు నడువగలిగాము. సన్నని మొనగల (Alpine sticks) కఱ్ఱలసహాయంతో మే మీామిట్ట నెక్కాము. ఓహో! మాముందు మైళ్లకుమైళ్లు తళతళ మెరసిపోతున్న అతివిశాలమైన మంచుమైదానం కనబడుతున్నది. ఎటుచూచినా – వెండిరేకు పరచినట్లు మెరసిపోతున్న మంచుమైదానమే. ఆనందం! ఆనందం! దగద్ధగాయమానంగా వెలిగిపోతున్న క్షీరసాగరంకాదా అది? అద్భుతం! మహాద్భుతం! రాముని ఆనందానికి మేరలేదు. కాన్వాస్ చెప్పులు వేసికొని, భుజాన ఎఱ్ఱనిగొంగళి వేసికొని, ఆహిమశిఖరాలపైన రాముడు ఆనందోద్వేగంతో ముందుకు పరుగెత్తాడు.

ఇప్పుడు రాముని వెంట ఎవ్వరూ లేరు.

"ఆఖిర్ కె తైె హంస ఆకెలా హీ సి ధారా"

"Akhir ke tain hans akela hi si dhara"

దాదాపు మూడుమైళ్లు రాముడు మంచులో ముందుకు నడచిపోయాడు. కొన్నిసార్లు పాదాలు మంచులో దిగపడిపోయి, కొంతసేపు అవస్థపడితేగాని వెలికి వచ్చేవికావు. చిట్టచివరకు, ఒకమంచుదిబ్బమీాద ఎఱ్ఱనిగొంగళి పరచబడింది. రాముడు దానిపై కూర్చున్నాడు. సమస్త ప్రాపంచిక కోలాహలాలకు, లౌకికసంరంభాలకు అతీతుడై ఏకాంతంగా రాముడు కూర్చున్నాడు. ఇక్కడ పరమశాంతి రాజ్యమేలుతున్నది. ఆహా! ఏమిశాంతి! ఆనందఘనగర్జనతప్ప ఏఇతరశబ్దాలు వినబడడం లేదు. పరమాద్భుత నిర్వాణశాంతి!

మబ్బుతెర కొంచెం విచ్చిపోసాగింది. మబ్బులతెరలను చీల్చుకొని వస్తున్న సూర్యకిరణాలు, వెండికొండను క్షణంలో బంగారుకొండగా మార్చివేశాయి. సుమేరు పర్వతమన్న పేరు సార్థకమైంది.

ఓ ప్రాపంచక మానవులారా! ఇటుచూడండి! తరుణీమణుల చెక్కిళ్ళపై వెలుగొందు తరుణారుణరోచిస్సులలోగాని, అమూల్యాభరణకాంతులలోగాని, మహనీయమందిరాలలోగాని,- ఈసుమేరుపర్వత శోభా లేశమైనా లేదు. నీ స్వస్వరూప మైనసత్యాత్మయొక్క సాక్షాత్కార మొక్కసారి నీవు పొందినట్లైతే, ఇలాంటి సుమేరుపర్వతాలు అసంఖ్యాకంగా నీలోనే కనుగొనగలుగుతావు. సమస్తప్రకృతి నీకు సేవచేస్తుంది. చరాచరప్రపంచమంతా నిన్ను సమర్చిస్తుంది. సమస్త దేవతలు నీ ఆజ్ఞకు బద్ధులైతీరుతారు.

ఓఆకాశమా! వినిర్మలంగా! భారత దేశాకాశమండలంపై గ్రమ్మిన ఓ అజ్ఞాన మేఘాల్లారా! విచ్చిపోండి! ఈపవిత్రభూమిని మీ రింక ఆక్రమించడానికి వీలులేదు. ఓహిమాలయాల్లారా! మీపవిత్రతను పరిరక్షించుకోండని, మీసత్యవిశ్వాసమును (జ్ఞానమును) కాపాడుకోండని - మీవలిక మీ కాజ్ఞాపిస్తున్నాడు. ద్వైతభావ (భేదభావ) ప్రవాహాలను మీరు మైదానాల్లోకి పంపవద్దు.

మేఘాలు విచ్చిపోయినవి, హిమలోకమంతా కాషాయవర్ణరంజిత మైంది. ఈ పర్వతాలు సన్న్యసించినవా? తప్పక ఈపర్వతాలు రామవేషం వేసికొన్నవి. ఈహిమవత్పర్వతశ్రేణులు రామాజ్ఞా నిర్వాహణానికి వేచియున్నట్లు కనబడుతున్నవి.

ఓమ్!

ఆనంద మానంద మానంద మోహా!<br>
ఆవృత్త మగునీప్రపంచమదెల్ల!<br>
చూచుట కెంతయో సొంపుగానుండె.<br>
ఇది నవావరణావృతము, నిగూఢంబు:<br>
దీనిహృద్గతమగు పెనురహస్యమును<br>
గ్రహియింపలేరు కుయోగులెవ్వరును.<br>
ప్రకృతియెడందతో కాలంపు పెడద<br>
శ్రుతిగల్పి స్పందించుచుండు సంతతము.<br>
కరతలామలకమ ట్లంతయు దెలిసె!

"ప్రకృతి, భావముయొక్క రూపమే. తిరిగి అది, మంచుగడ్డ నీరుగా మారినట్లు భావంగా మారుతుంది. ప్రపంచం మనస్సుయొక్క ఘనీభూతరూపమే. తిరిగి యిది, స్వేచ్ఛాభావస్థితికి మారిపోతుంటుంది. అందుచేతనే మంచిచెడుగులయొక్క ప్రభావం జీవకోటియొక్క మనస్సు మీాద పనిచేయడం జరుగుతున్నది. మానవుడు, ఖనిజంగా, వృక్షంగా పశువుగా, మానవుడుగా కామరూపధారణం చేయగలుగుతున్నాడు"-- అని ఒక అమెరికన్ ఋషి చక్కగా చెప్పాడు.

ప్రశ్న : ప్రపంచం నాభావమే (మనస్సుయొక్క ఘనావస్థ) అయినట్లైతే, ఈబాహ్యావస్తువులన్నీ నాయిచ్ఛానుసార మెందుకు మారడంలేదు ?

ప్రత్యుత్తరం : గౌడపాదాచార్యు లిట్లు నిర్వచిస్తున్నారు : "స్వప్నంలో, ఒక్క భావమే - ఒకవైపు బాహ్యావస్తువులుగా, మరొక వైపు ఆంతరంగికఉద్రేకాలుగా, వాంఛలుగా, చీలుతున్నది. అదిగాక, ఆస్వప్నావస్థలో, ఆంతరంగిక భావన - తనవశంలోఉన్నదిగా, చంచలమైనదిగా, అసత్యమైనదిగా, కనబడుతున్నది. తదేకసందర్భంలో బాహ్యావస్తువులు (స్వాప్నిక బాహ్యావస్తువులు) తనవశంలో లేనివిగా, సుస్థిరసత్యములుగా, కనబడుతున్నవి.

కానీ, నిజానికి, జాగ్రదావస్థలో ఉన్న మానవుని దృష్ట్యా ఆ స్వప్నరంగంలోని సత్యాసత్యములు రెండూ—— బాహ్యాంతర్విషయములు రెండూ —— కేవలం భావమాత్రమే. తన భావం మాత్రమే. తన సొంత సృష్టి మాత్రమే. అదే మాదిరి, జాగ్రదవస్థలో, బాహ్యవస్తుప్రపంచమంతా—— స్థిరమైనదిగా, నిత్యమైనదిగా, సత్యమైనదిగా, ఆంతరంగిక భావము అసత్యమైనదిగా ఎంచబడుతున్నది. కానీ ఆత్మవిదుడైన మానవునకు, స్థూలవస్తుజాలం, చంచల (అస్థిర) భావజాలం,— ఈ రెండూ——స్వప్నంవలె వితథమే (అసత్యమే). దృశ్యమాన ప్రపంచము నతడు తనదిగా తన భావంగా దర్శిస్తాడు. దృశ్యమానవస్తువులు, ఇచ్ఛానుసారం మార్చబడజాలకపోయినా, అవి అతని సొంత భావాలే. నీ బుద్ధి నీ వెంట్రుకలు పెరుగుటకు కారణాన్ని నిర్వచింపలేకపోయినా, నీ ముఖసౌందర్య కారణమును వివరింపలేకపోయినా, నీ వెంట్రుకలు

నీవిగా, నీ ముఖ సౌందర్యం నీదిగా పరిగణిస్తున్నావు కదా! అదే మాదిరి, జీవన్ముక్తుడు, సమస్త వస్తువులయొక్క ఆత్మ తానే నని గ్రహించినందున ప్రతి వస్తువును తనదిగా, పరిగణిస్తాడు. ఆతడు ప్రేమ స్వరూపుడై వెలుగొందుతాడు. ఆతడు క్రమేణా కేవలాద్వైత జ్ఞాన నిష్ఠుడై నిర్వికల్పసమాధి కధిగమించినప్పుడు, భావప్రపంచదృశ్యంతో పాటు స్థూలప్రపంచదృశ్యంకూడా ఉపశమిస్తుంది.

## మాయ

భారత దేశంలో కొన్ని కొన్ని పర్వసమయాలలో దివిటీలు త్రిప్పడం చాలాచోట్ల అలవాటే. ఆ మండుచున్న దివిటీని (కొఱవిని) గిరగిర త్రిప్పేటప్పుడు, చూచేవాండ్ల కది ఒక అగ్నిచక్రంలాగా కనబడుతుంది. చిత్రవిచిత్రదృశ్యాలను గోచరింపజేస్తుంది. అయితే, దివిటీలో ఈ దృశ్యా లున్నవా? దివిటీలోనుంచి ఈ దృశ్యాలు పుట్టి వెలువడుతున్నవా? లేకపోతే, వెలుపలనుంచి ఈ దృశ్యాలు దివిటీలో ప్రవేశిస్తున్నవా? దివిటీ తిరగకుండా ఉన్నప్పుడు, ఈ దృశ్యాలు దివిటీలో ప్రవేశిస్తున్నవా? లేక వేఱొక తావుకు చేరుతున్నవా? ఈ ప్రశ్నలన్నిటికి సమాధానం— లేదు లేదనే చెప్పవలసి యుంటుంది. దివిటీ తిరుగుతున్నప్పుడు, సంచలనము — సమచక్రరేఖలను ప్రదర్శిస్తున్నది. సంచలనము ఆగినప్పుడు, దివిటీలో ఆ దృశ్యచ్ఛాయకూడా ఉండడం లేదు. దివిటీ తీవ్రసంచలనంలో ఉన్నప్పుడుకూడా చక్రదృశ్యాలు కనబడ్డా, ఆ దృశ్యాలు నిజంకావు.

అదేమాదిరి, శుద్ధచైతన్యము—నిశ్చలంగా ఉన్న దివిటీలాగా—నామరూపాత్మకములైన దృశ్య ప్రపంచాలయొక్క పొలుకువుకూడా లేక వెలుగుతున్నది. వివిధనామరూప దృశ్యాలు కనబడుతున్నా, ఆదృశ్యాలన్నీ దివిటీలో కనబడే చక్రదృశ్యాలమాదిరి మిథ్యే. చిజ్జ్యోతి సర్వదా నామరూపాది వికారముల కంటక, నిర్వికారమై నిరంజనమై వెలుగుతున్నది. ఏకైక జ్యోతి సర్వదృశ్యాలలో సర్వదా ప్రకాశిస్తున్నది. కానీ ఆ దృశ్యాలు జ్యోతిలో ఎప్పుడుకూడా పుట్టడమే లేదు. అదేప్రకారం, సమస్తనామరూపాలలో, రాముడు (పరబ్రహ్మ) ప్రకాశిస్తున్నాడు. కానీ రామునిలో ఈ నామరూపాలు

లేనేలేవు. దివిటీయందు చక్రదృశ్యం, సంచలనంవల్ల కల్పింపబడినట్లు, నామరూపప్రైవిధ్య ప్రపంచదృశ్యం, చైతన్యముయొక్క మాయాశక్తి వల్ల కల్పింపబడుతున్నది.

" ఇన్ద్రో మాయాభిః పురురూప ఈయతే "

శక్తికి ఎట్టి స్వయంసత్తా లేదు. అది వ్యక్తీకరింపబడవచ్చు - వ్యక్తీకరింపబడక పోవచ్చు. అది విడిగా ప్రకాశింప లేదు. వ్యక్తీకరింపబడినప్పుడు ఈ మాయాశక్తి—చైతన్యముయొక్క సంచలనం - లేక - మనస్సు- అని పేర్కొనబడుతున్నది. సంచలనములోనున్న మనస్సన్నా, దృశ్యప్రపంచమన్నా, ఒకటే. నిశ్చలత వహించిన మనస్సుకూ చైతన్యమునకూ భేదంలేదు. వాంఛావ్యామోహవిముక్తమైన మనస్సు తన వికల్పతను విడిచి, నిశ్చలత వహిస్తుంది. పూర్ణనిశ్చలతను పొందిన పిదప మనస్సు, బ్రహ్మతో ఏకమవుతున్నది. ఈ సాక్షాత్కారంచేత మాయ జయింపబడుతున్నది. సమస్త ప్రపంచం ఒక స్వర్గంగా మారి పోతున్నది. పోయిన స్వర్గానందం తక్షణం పొందబడుతున్నది. సర్వం సౌందర్యమై గోచరిస్తుంది. ద్వైతబుద్ధి నశించడంచేత, సమస్తచింతలు, సమస్తాందోళనలు, పరమాత్మలో—సచ్చిదానంద రూపపరబ్రహ్మలో- శాశ్వతంగా విలీనమై పోతాయి.

రాముని సన్నిధిలో ఒక యువకుడు, గులాబీపుష్ప మొకటి వాసన చూద్దామనే ఆశతో త్రెంపుకొన్నాడు. ముక్కుకంటించుకొనేసరికి వెంటనే ఒక తేనెటీగ వానిముక్కంతా తెగకుట్టింది. బాధపుట్టి ఆత డేడ్చాడు. పుష్ప మాతనిచేతినుండి క్రిందపడిపోయింది.

ప్రతి గులాబీపూవుయొక్క రేకులపై తేనెటీగ ఉంటుందా? బాధఅనే తేనెటీగతో కూడియుండని విషయసుఖ మనే గులాబీపూవు ఒక్కటికూడా లేదు. అసంయమితవాంఛలు (నిగ్రహింపబడని కోరికలు) అనివార్యవేదనచేత శిక్షింపబడక తప్పదు.

ఘోరమైన మాంద్యబుద్ధిచేత, మీఆత్మను విస్మరించకండి! ఈ విచిత్రదృశ్యము లనేగులాబీపుష్పములను మీరు కోసుకోపనిలేదు. వికసించిన ప్రతిరోజాపుష్పంలో నీవున్నావు. దానిసువాసన, దాని

సుగంధం, నీదే. రాజూ, రాజరికమూ, నీదే. అందమూ ఆకర్షణా, నీదే! వజ్రవైడూర్యాదులు, వానితళతళకాంతులు, నీవే! ఎందుకు వృథావాంఛలు? నీసర్వైక్యమును గుర్తించు! నీబ్రహ్మాభిన్నతను గ్రహించు! తానొక్కడే ఏకసమయంలో ప్రతి గోపికయొక్క కర పద్మాలుపట్టుకొని పదహారు వేలమంది గోపికలతో, రాసలీలానృత్యం చేసిన ఆశ్రీకృష్ణభగవానుడవు నీవే! సముద్రంలో సౌధంలో, మహో ద్యానవనంలో మరుభూమిలో, ఆహావరంగంలో ఏకాంతికమందిరంలో, సర్వత్రా సమంగా నీ వున్నావు!

మహోన్నతపర్వతశృంగాలపై నిలచి, రాముడు కంఠమెత్తి ఉద్ఘోషిస్తున్నాడు. :- దుర్బలులమని, దరిద్రులమని, విచారపడుతున్న మానవులారా! మీరు నిజంగా సర్వశక్తిమయ పరబ్రహ్మస్వరూపులు! మీరు సాక్షాద్రామస్వరూపులు. మీభావాలచేత మిమ్మి మీరు బంధించుకోవాకండి. లేవండి! నిద్రలేవండి! మీనిద్రాప్రమత్తతను ప్రకంపింపజేయండి! మీప్రపంచస్వప్నమును ప్రీలజేయండి! సర్వప్రపం చంలో మీఆత్మతప్ప వేరొకటి లేనప్పుడు, ఎందుకు మీరు విచారంలో కుమలడం? దీనుల మనిరోదించడం? ఓహో! ఆత్మచైతన్యస్థితి కధిగ మించండి. సమస్తదుఃఖాలు సమసిపోతాయి. సమస్తానందసారము నీవే. సమస్తానందమూలము నీవే. నీ కేదికూడా అపాయంచేయ లేదు. రామునికొరకు మీఆత్మను తెలుసుకోండి! ఎందుకు ఆలస్యం? ఆత్మను తెలుసుకోండి! తెలుసుకోవలసినదదే! రాత్రింబవళ్లు నిద్రాహారాలు లెక్కచేయకుండా మీశక్తిసామర్థ్యాలన్నీ ధారపోస్తూ, మీరు శాంతి కోసం ఆనందంకోసం వేటాడడంలేదా? అయినా అడుగడుగునా అప జయమేకదా మీరు పొందుతున్నది? మిమ్మి మీరు బుద్ధిహీనులనుగా చేసికోవాకండి. విషయవస్తువలలో ఆనందాన్ని అన్వేషించకండి. ఈ వస్తుజాలమంతా ఇంద్రియవిభ్రాంతి! నిష్ప్రయోజనకరమైన మీ బాహ్యాన్వేషణమంతా విడిచిపెట్టండి. అమృతసాగరం మీలోనే ఉన్నది. స్వర్గరాజ్యం మీలోనే ఉన్నది. మహామృతస్వరూపులు మీరు. మనోప్రపంచాలను రెంటినీ - బ్రహ్మచైతన్యంలో విలీనం చెయ్యండి. మీక్షుద్రాహ్మాకృతిని దివ్యోన్మాదమునకై పరిత్యజించండి. ప్రియులారా! అశాశ్వతభౌతిక దేహభద్రతకై ఎందు కంతజాగ్రత్త

పడుతున్నారు ? ఈ అనాత్మనుగూర్చి, 'ఇది ఏమవుతుందో' నన్న భావాన్ని రవ్వంతకూడా మీలోకి రానీయకండి. సమస్తసంబంధ మూఢవిశ్వాసాలను పారద్రోలండి. దైవదర్శనంచేయలేని నేత్రాలు నాశనమవుతాయిగాక! వాంఛావ్యాధిపీడితమైనహృదయం వ్రయ్యలగుగాక ! పశువికారములన్నిటినీ పటాపంచలుచేయండి ! మీసత్యస్థానమునుగట్టిగా పట్టుకోండి ! దూషణభూషణ లక్కడకు చేరలేవు. సుఖదుఃఖములప్పుడు చెనకలేవు. పడవలోకి పరమాత్మ నాహ్వానించండి. నౌకాయానంసాగించండి. తీరమును వదలండి. అహంకృతిని వదలండి, నావను నడవనీయండి ! ఓహో ! వైరాగ్యజంఝూనిలం (దివ్యప్రేమ) మానవశరీరమనే దూదినావను బ్రహ్మచైతన్యసాగరతరంగాలమీదికి నెట్టివేయనీయండి! బ్రహ్మానందపారవశ్యపారావారంలో మునిగిపోయినవాడే ధన్యుడు ! దివ్యానందమధువును తప్పద్రాగి, తనువుమరచినవాడే ధన్యుడు ! ఆత్మానందమున ప్రగాఢంగా నిమగ్నుడై, ప్రపంచాన్ని మఱచినవాడే పూజనీయుడు !—రాముడు.

ఓమ్ ! ఓమ్ ! ఓమ్ !

నీవె త్రికాలస్థవస్తుమూలంబు ! !
నీవె తండ్రివి మరి తల్లివి నీవె !
నీవె నరుండవు నారియు నీవె !
ఓహో ! నీవే జగన్మూలంబు కనగ.
ఓహో ! నీవే వస్తుకేంద్రంబు చూడ !
దివ్యసంఖ్యలసమీకరణంబు నీవె !
సృష్టికర్తవు నీవె, సృష్టివి నీవె !
వెలయజేయున దీవె, వెలయున దీవె !
దృశ్యంబు నీవె, అదృశ్యాత్మ వీవె !
నీదివ్యతేజమే నిఖిల మోహాహోహో !

ఓం ! ఓం ! ! ఓం ! ! !

## 4. వసిష్ఠాశ్రమం

ఈసాయంకాలం, వర్షంకురియడ మాగింది. మేఘాలు రకరకాల వింతవింతల ఆకృతులు ధరిస్తూ, ఒక్కొకచోట దట్టమవుతూ, ఒక్కొక చోట పలచబడుతూ, అనేకమార్గాలలో పోతున్నవి. ఆమేఘాలలో నుంచి కోణాలుకోణాలుగా ప్రతిఫలిస్తున్న సూర్యకాంతి, యావత్ప్రకృతిని ఒక తేజోగోళంగా చేస్తున్నది. క్రీడాలోలురైన మేఘశిశువులు, రకరకాల అందమైనరంగులు వేసికొంటున్నారు. అట్టి వర్ణరచన ఏచిత్రకారుడు చేయగలడు? నిముషనిముషానికి మారిపోతున్న ఆనీడలనూ, రంగులనూ, ఎవడు గుర్తుంచుకోగలడు? మీరెటువైపైనా చూడండి. కాషాయ, రక్త, నీల, పాటల వర్ణములు, వాని వర్ణనాతీత వివిధరక్తిమలు; – వాటిమధ్యనుండి అక్కడక్కడ ద్యోతకమవుతున్న వెనుకగల నిశ్చల నీలిమాకాశము – చూపులను సమ్మోహపరుస్తాయి. ఈ ఉజ్వలశోభ పరవశత్వమును కలిగిస్తున్నది. రాముని నేత్రాలు ఆనంద బాష్పపూరితాలైనవి. మేఘా లదృశ్యమాతున్నవి. కానీ ఒక శాశ్వత సందేశ మిచ్చి పోతున్నవి. అవి పరమేశ్వరసన్నిధానమునుండి ఒక అమృతపాత్రను తెచ్చి యిచ్చి, తిరిగి ఆతనిసన్నిధికి వెళ్ళుతున్నవి.

ఆకర్షణీయవస్తువులన్నీ నిజాని కిలాంటివే. అవికనబడి, ఒకక్షణం రామ ప్రతిభను ప్రతిఫలించి అదృశ్యమవుతాయి. ఈ తరళమేఘాలను చూచి, వ్యామోహంలోపడి, ఈ అశాశ్వత దృశ్యపదార్థాలను పట్టుకోవాలని ఆశిస్తూ, అవి జారిపోగానే శిశువుల్లాగా ఆక్రందించే మానవులు, నిజంగా పిచ్చివాండ్లు. ఓహో! ఎంతవిచిత్రం! నేను నవ్వాపుకోలేకపోతున్నాను.

మరికొందరు, ఈమేఘాల (దృశ్యముల) లోని క్షణిక పరివర్తనాలనుగూర్చిన అల్పతమవిషయాలను పరిశీలించడంలో, శ్రద్ధతో వానిని గ్రహించడంలో, తమకాలమంతా వినియోగిస్తారు. వీరితెలివి నేమని చెప్పాలె! తమచుట్టూ దైవప్రభావ మహాస్రవంతియున్నా, తమజ్ఞానతృష్ణను తీర్చుకోడానికి వాండ్లు శ్రద్ధవహించరు. వీండ్లే శాస్త్రవేత్తలని తత్త్వవేత్తలని పిలువబడేవాండ్లు. వెంట్రుకకొనను రెండుగా చీల్చడంలో రాత్రింబవళ్ళు విరగబడుతూ, ఆవెంట్రుక దేనికి సంబంధించినదో – ఆ పరమేశ్వరుని దివ్యశిరస్సునుగూర్చి వాండ్లు పట్టించుకోరు.

ఓహో! ఎంతవిచిత్రం! నేను నవ్వాపుకోలేకపోతున్నాను. ఎవరి దృష్టికి నామరూపా లనేమేఘాలు అడ్డురావో, ఎవడు మూలతేజమును - పరమసత్య మైనఆత్మను - నిరంతరం నిరాటంకంగా దర్శించగలడో, ఎవని ప్రేమానురాగాలు- సముద్రాన్ని చేరకముందే మార్గంలో ఎండి పోయే నదుల్లాగాకాక - పరమగమ్య మైనపరమేశ్వరుని చేరుకుంటాయో, ఆతడు సుఖిస్తాడు. మోహసంబంధాలు అదృశ్యంకావాలె. అవి తపాలామనుషులవంటివి మాత్రమే. అవి నీకడకు తెచ్చిన పరమేశ్వరుని ప్రేమలేఖను నీ వతిశ్రద్ధతో అందుకోవాలె. అగ్గిపుల్ల శీఘ్రమే కాలి పోతుంది; కానీ దానితో శాశ్వతంగా తనదీపాన్ని వెలిగించుకొన్న వాడు ధన్యుడు. ఆవిరీ, ఆహారమూ, నౌకలో ఖర్చయితీరుతుంది. కానీ అవి అయిపోకముందే, ఓడ రేవుచేరుకోవాలి. ప్రతివస్తువును దేవుని కడకు చేర్చేసోపానంగా, దేవునిదర్శించే అద్దంగా, ఎవడు చేసికొంటాడో - ఆతడు జీవిస్తాడు. నక్షత్రకోటితో, పర్వతాలతో, నదులతో, రాజులతో, శాస్త్రవేత్తలతో, వివిధవిషయాలతో కూడిన ఈప్రపంచం, ఈశ్వరుని సందర్శించడానికే సృష్టించబడింది. ఇదినిజం. నేను మీకు సత్యంచెపుతున్నాను.

నవోత్తేజకర శోభతో ప్రకాశించే పర్వతారణ్యకేదార సీమలకూ, రోగప్రదధూమావృతనగర వీధులకు- ఉన్న తేడా ఏమిటి? పర్వతారణ్యకేదారసీమలు, విమర్శలతో వినుతులతో, మానవుని యందు ఖండదృష్టి కల్గించి, వానిని దేహభ్రాంతి అనే చీకటిమూలకు తరిమివేయవు. వాటి సన్నిధిలో మానవుడు, సాక్షితేజస్థానాన్ని అధిష్ఠించగలడు. అంతరంగికంగా, వృక్షరాజ్యంలోకూడా నాగరిక సమాజాలలోకంటే అధికంగానే సమరసంరంభాలు, అశాంతి ఉన్నవి. అయినా వాటి పోరాటాలు సయితం మనోజ్ఞంగా ఉంటవి. వనమధ్యాలలో మానవుడు సులభంగా, తనను తాను నిస్సంగసాక్షి తేజంగా నిలుపుకోడానికి అవకాశమున్నది. అరణ్యాలలో ప్రతి వ్యక్తీ ఎట్లు మెలగగలుగుతాడో — అట్లు, జనసంకుల నగరవీధుల్లోకూడా, నిస్సంగ సాక్షి తేజముగా - ఆత్మదృష్టితో - దేహభావరహితుడై సంచరింపగలవానికి, ఈ విశ్వ మొక నందనోద్యానవన మౌతుంది. అట్టి దైవ జీవనులైన మానవులు ప్రపంచానికి వెలుగై యున్నారు. నిస్సంగ

సాక్షిగా యున్న ఆ జ్యోతే, సర్వదృశ్యాలకు ఆధారభూతమై యున్నది.

చైతన్య వాహిని ప్రవహిస్తున్నది. పరమాత్మ తప్ప వేఱొకటి లేదు. నేనెవరికి భయపడడం? నే నెవరిని జూచి సిగ్గుపడడం? సర్వ చైతన్యము దేవుని చైతన్యమే. వేఱొకటి కాదు. ఆతడూ నేనూ ఆతడే (పరమాత్మయే). సమస్త ప్రపంచం నా హిమాలయారణ్యమే. సూర్యోదయం కాగానే, పూవులు నవ్వసాగుతాయి. పక్షులు పాడ సాగుతాయి. నదులానందంతో నర్తిస్తాయి. ఓహో! ఆ పరంజ్యోతి! ఆ మహాతేజోసముద్రం! ఉప్పొంగి ప్రవహిస్తున్నది. ఆనందమారుతం వీస్తున్నది!

ఈ మనోహరారణ్యంలో నేను నవ్వుకుంటాను. కంఠమెత్తి పాడుకుంటాను. చప్పట్లు చరుస్తూ నృత్యం చేస్తాను.

ఈ వనప్రకృతి ఎగతాళి చేస్తున్నదా? లేదు. అది వాయు ప్రసారశబ్దం. ఈ వనప్రకృతి అపహాసిస్తున్నదా? లేదు. అది పత్రగుచ్ఛముల మర్మరధ్వని. ప్రవాహాల్లో, వనవృక్షాలలో, పక్షులలో, మలయ మారుతాల్లో స్పందిస్తున్న నా శక్తియే నన్ను అపహాసిస్తుందా?

నే తాండవించెద నే తాండవింతు–
పకపక నవ్వుచు నే తాండవింతు.
అస్మదానంద తాండవకేళియందు–
ధూళిగా నెగిరింతు తారకావితతి.
లేదు విద్వేషము; లేదు భయంబు;
పరమప్రియాత్మిప్రియుండను నేనె!
దోషలేశము లేదు; దుఃఖంబు లేదు.
గతము లే; దల భవిష్యత్తును లేదు.
వ్యతిరేకి లేదు; శాత్రవుడును లేదు.
మరి అపాయము లేదు; ఆర్తియు లేదు.
నాకు కీ డొనరించగల దేది లేదు;
నను భయపెట్టున దేదియు లేదు.

సర్వాంతరాత్మ, దివ్యామృతార్ణవము,
కేవలానందస్వరూపాత్మ నేనె!
జలజలబారెడి సెలయేటి గములు,
మలయానిలంబులు, తీయని కలలు,
సర్వంబు నేనె! ఈ సర్వంబు నేనె!
రామరావణు లేనె! సర్వాలు నేనె!
శుద్ధ బుద్ధ ప్రశాంత స్వరూపమున
రాము డున్నా డహో! రాము డున్నాడు!
స్వర్గాలు, తారలు, సకల లోకములు,
నా వేణుగానముతో శ్రుతి గల్పు.

## ౫. బానూను శిఖరము — వశిష్ఠాశ్రమం.

శాంతిమహార్ణవమును పొంగిస్తూ రజితకాంతుల విరజిమ్ముతూ, వెన్నెలకాస్తున్నది. చంద్రకాంతి రాముని దర్భశయ్యపై పడుతున్నది. కొండలమీాద స్వేచ్ఛగా విపరీతంగా పెరుగుతున్న తెల్లగులాబీపొదల నీడలు, చంద్రికాదీప్తమగుశయ్యపై పారాడుతున్నవి. రామసముఃఖమున హాయిగా నిద్రపోతున్న చలించని వెన్నెలబాల, ఏవోతీయని కలలుకంటున్నట్లు, ఈగులాబీనీడ లెంతో విలాసంగా, అటుఇటు కదలాడుతున్నవి.

మధురసుమస్వప్నముల నవ్వుకొనుచు
నిద్రపో! నిద్రపో! నాముద్దుబిడ్డ!

యమునోత్రి గంగోత్రి సుమేరు కేదార బదరీశిఖరాలు, ఎవరైనాసరే చేయిజాపితే అందుతవన్నంత సమీాపంలో ఉన్నవి. అర్ధవర్తులాకారంగల ఉజ్వలవజ్రసన్నిభ పర్వతశృగపంక్తి, ఈ వశిష్ఠాశ్రమాని కలంకరింపబడిన వజ్రకిరీటంలాగా ఉన్నది. వెన్నెలవెలుగులలో శితహిమశిఖరాలు, పాలకడలిలో జలకాలాడుతున్న ట్లున్నవి. వాటి ప్రగాఢ 'సోహం' నిశ్వాసలు, చల్లనిపిల్లగాడ్పుల రూపంలో ఇక్కడ కెప్పుడూ వినిపిస్తూంటాయి.

ఈ పర్వతశిఖరంమీద కప్పబడిన మంచంతా విరిసిపోయింది. పర్వతశృంగ సమీపమందలి విశాలమైదానమంతా, నీలి, పసుపు, ఎరుపు, తెలుపురంగులపూలతో పరచబడియున్నది. కొన్నిపుష్పాలు అమితసువాసన విరజిమ్ముతున్నవి. ఇది దేవతలఉద్యానవన మనే విశ్వాసంచేత, ప్రజ లీస్థలానికి రావడానికి భయపడతారు. ఈభావమే ప్రకృతిసౌందర్యాన్ని పాడుచేసే జనులనుంచి, ఈ దేవతావిహారభూమిని కాపాడుతున్నది. రాము డీపుష్పవనంలో, అతిజాగ్రత్తగా, అతిమృదువుగా, ఏ పుష్పహృదయానికీ నొప్పికలుగకుండా, విహరిస్తున్నాడు.

పికశుకకపోతాది అసంఖ్యాక విహంగగాయకగణం, ప్రాతఃకాలమందు రామునకు వైతాళికగీతాలతో ఆనందం గొల్పుతుంటుంది. ఒక్కొక్కనా డుదయం, రామగుహాపరిభాగ సమీపానికి వచ్చి ఒక పెద్ద కొండచిలువ, తన విశిష్టవిచిత్ర సంగీతంతో రాముని సంతోషపరుస్తుంటుంది. మధ్యాహ్నవేళ గరుడపక్షులు నింగిపై నీలమేఘాల తాకుతూ విహరిస్తున్నవి. అవి విష్ణువును వీపుపై మోస్తున్నట్లు కనపడుతున్నవి. ఒకరాత్రి రాముని ప్రక్కగా ఒకపెద్దపులి గంతువేసింది.

అలతిదూరంలోఉన్న పర్వతసరోవరంచుట్టూ ఆ విరియబూచిన మహావృక్షా లెంతమనోజ్ఞంగా సమీకరింపబడినవి! వాటన్నిటినీ సమైక్యపరుస్తున్న బాంధవ్య మేమిటి? వాటికి పరస్పర బాహిరసంబంధాలు, వ్యక్తిగతసంబంధాలు లేవు. తమతమ మూలములను సరోవరాభిముఖం చేయడంలో మాత్రం ఆ వృక్షాలన్నిటికీ ఒక సామాజిక వ్యవస్థ ఉన్నది. ఏకైకసరోవర జలప్రేమయే వాటన్నిటినీ ఏకంచేస్తున్న సూత్రం. ఏకైక సత్యాభక్తిలో – మనమంతా కలుస్తాముగాక! సర్వంలో – ఆత్మలో – రామునిలో – మనమంతా ఐక్యమవుతాముగాక!

## 6. జగదేవీ మైదానము

బాసూానుపర్వతశిఖరప్రాంతగుహాలన్నీ అహర్నిశలుకురిసేవర్షాల చేత జలమయమైనందున రాము డాశిఖరంపైనగల దేవతావనవాటికను వదలిపెట్టవలసివచ్చింది. అక్కడనుంచి రాము డొక అతిసుందరమైన అతివిశాలమైన మైదానభూమికి దిగివచ్చాడు. ఇక్కడ నిరంతరం

చల్లగాలులు వీస్తుంటాయి. తదితరపుష్పాలతో పాటుమల్లె, జాజి, చామంతి,ఇక్కడవిరివిగాపుష్పిస్తాయి. బెర్రీపండ్లిక్కడ Straw berries, Crison rose berries) కొల్లలుగాలభిస్తాయి. క్రొత్తగాకట్టినకుటీరాని కొకవైపున, కొంచెం ఏటవాలుగా విశాలశాద్వలప్రదేశ మున్నది. ఈమైదానాని కటూయిటూ రెండుసెలయేళ్లు జలజల పారుతున్నవి. కుటీరానికిముందుభాగంలో మనోహరమైనపచ్చికబయలు, సెలయేళ్లు, పచ్చనిచెట్లగుబుర్లతోనిండినకొండలు, దట్టమైనఅడవులూ, పొలాలూ, కనబడుతుంటాయి. ఇచ్చటగల పరిశుద్ధమైన – సుస్నిగ్ధమైన శిలాఫల కాలే, రాముని ఉన్నతాసనాలు. తరులతాగుల్మచ్ఛాయలే రామునికి హాయిగొల్పే చలువపందిళ్లు.

## 7. వర్షం

అడవిలోఉండే గొర్రెలకాపరులు మూడుగంటల్లో రామున కొకకుటీరం కట్టారు. తమశక్తికొద్దీ వాండ్లు చినుకుపడకుండా దట్టంగా కప్పిగప్పారు. రాత్రివేళ పెద్దతుఫాను చెలరేగింది. ప్రతిమూడునిమి షాల కొకసారి, మెఱుపులు మెఱసి ఉరుము లురుమినవి. ఉరు మురుమి నప్పుడల్లా పర్వతాలు ప్రకంపించినవి. మూడుగంటలకాలం ఇంద్రవజ్ర ప్రఘాతపరంపరలు వీరవిహారంచేశాయి. కుంభవృష్టి కురిసింది. ఆగాలి వానతాకిడికి కుటీరం కురియసాగింది. గుడిసెలో, పుస్తకాలు తడిసి పోకుండా, తెల్లవారేవరకు గొడుగొకటి అడ్డంపెట్టబడింది. గుడ్డలన్నీ తడిసి ముద్దైనవి. పచ్చికతో నిండియున్నందున నేలమాత్రం బురద కాలేదు. కానీ, పైనుంచి వెలువకుండాపడుతున్న చినుకులవల్ల పర్ణ శాలంతా జలమయమైంది. రాముడు మత్స్యకచ్ఛపజీవనానందము ననుభవిస్తున్నాడు. ఈ రాత్రిపొందిన జలచరజీవనానుభవం, ఒక విశిష్టా నందాన్ని చేకూర్చింది.

"Ze umar yak Shab Kam giro Zinhar makhusp".

అనవాదం : నీజీవితప్రమాణంలో ఒక రాత్రి గడచిపోయిం దని గుర్తించు. ఇం కెప్పుడూ నిద్రపోవాకు !

భగవత్సంయోగంలో మనల నుంచడానికి వీచేతుఫాను (కష్టం) ధన్యమైంది.

"శౌహ్ జాగే కాహనూం సోవాఁ" (గ్రంథసాహెబ్).

**అనువాదం:** ప్రియుడు (భగవంతుడు) మేల్కొనియున్నప్పుడు నేనెందుకు నిద్రపోవడం ?

ఋగ్వేదం (అష్టమమండలమ్)

"మహేచన త్వామద్రివః పరా శుల్కాయ దేయామ్।
ససహస్రాయ నాయుతాయ వజ్రివో నశతాయ శతామఘ॥"

అనువాదం : ఓవజ్రీ! ఎంతమూల్యమిచ్చినా నిన్ను నేను వదలుకోను. ఓయింద్రా! వెయ్యైనాసరే నిన్ను నేను వదలుకోను. వెయ్యేగాదు పదివేలైనాసరే, పదివందలవేలైనాసరే - అక్కరలేదు. ఓమహాదాతా! నిన్ను నేను వదలుకోను.

"యచ్ఛక్రాసి పరావతి య దర్వావతి వృత్రహాన్।
అతస్త్వా గీర్భిర్ద్యుగ దింద్ర కేశిభిః సుతావాగ్ం అవివా సతి॥"

రామునివ్యాఖ్య : ఓశక్రా! (సర్వశక్తిసంపన్నుడా) నీవు మాకు (గర్జిస్తున్న మేఘాలలో - లేక - ద్యులోకంలో) దూరంగాఉన్నా, లేక వృత్రాంతకా! (సంశయనాశకా) నీవు మాకు (వీచేవాయువులలో - అంటే-అంతరిక్షంలో) దగ్గరగాఉన్నా, స్వర్గంలోకి చొచ్చుకపోతున్న ప్రార్థనాగీతాలను నీకు పొడుగైన జూలుగలిగిన గుఱ్ఱములుగా (స్వారీచేయను) పంపుతున్నాను. తన (జీవిత) సారాన్ని నీకై పిండిన నావద్దకు నీవు త్వరగారా! వచ్చి నాహృదయపీఠ మలంకరించు! నా జీవితమధువును (సోమరసమును) ఆస్వాదించు!

"నే నెట్లు బ్రతుకుతాను? ముందు నాగ తేమిటి?" - అనే క్షుద్రసంశయాలతో, చింతాభయాలతో, మానవుడు తన జీవితమును వృథాచేయకూడదు. మానవునకు, కనీసం చేపలకు, పక్షులకూ వృక్షాలకు ఉండేఆత్మగౌరవమన్నా ఉండాలె. అవి తుఫానులకుగానీ, ఎండలకు

గానీ, భయపడి వణకిపోవు. అవి ప్రకృతితో ఏకమై జీవిస్తాయి. వర్షిస్తున్న వర్షం - నాఆత్మే - నేనే! నేను మెఱుస్తున్నాను! ఉఱుముతున్నాను. నే నెంత సౌందర్యంగా, గంభీరంగా బలిష్ఠంగా - ఉన్నాను! శివోహం-గానవాహినులు హృదయంలోనుంచి ఉప్పొంగి ఉద్ధృతంగా ప్రవహిస్తున్నవి!

"ఆమేఖలం సంచరతాం ఘనానాం
ఛాయా మధః సానుగతాం నిషేవ్య
ఉద్వేజితా వృష్టిభి రాశ్రయన్తే
శృంగాణి యస్యాతపవన్తి సిద్ధాః॥
భాగీరథీ నిర్ఝర శీకరాణాం
వోఢా ముహుః కమ్పిత దేవదారుః
యద్వాయు రన్విష్ట మృగైః కిరాతైః
ఆసేవ్యతే భిన్న శిఖండి బర్హైః॥"

రాత్రింబవళ్లు ఏకధారగా వర్షం కురుస్తున్నది. కాళిదాను పైన పేర్కొనబడిన ప్రథమశ్లోకంలో వర్ణించినట్లు, రాముడు కొండ లెక్కినప్పుడల్లా నిత్యం వర్ష కురుస్తున్నది. సమీపంలో గుహ లేమీ లేనందున రాముడు మేఘగణమునే ఛత్రంగా చేసికొని, వర్షాలను తనవిగా ఆనందిస్తున్నాడు.

రెండవశ్లోకంలో వర్ణించినవిధంగా, దేవదారువృక్షాలు, ప్రకంపిస్తూ ప్రచవిస్తూఉన్నప్పటికీ, తమశరీరాలను గంగాప్రవాహశీకరాలకు సమర్పిస్తూ సంతోషిస్తున్నవి.

విజృంభితశీతలత్వమును, వాయువర్షగాంభీర్యమును, మనహృదయం ఆనందంతో భరించగలగడం ఎంతఅదృష్టం!

## 8. సహస్రతరుతల సందర్శనం

(A Visit to Sahasrataru Tal) జూలై, 1906

స సప్తర్షి హస్తావచితావశేషా
ణ్యధో వివస్వాన్ పరివర్తమానః ।
పద్మాని యస్యాగ్ర సరోరుహాణి
ప్రబోధయ త్యంగముఖై ర్మయూఖైః ॥

చుక్కలంటేపర్వతశిఖరాలపైన మెల్లమెల్లగా పయనిస్తూ, క్రిందకు దూరదూరాలకు గంగారావి మొదలైన చెట్లతో కూడి దట్టంగా వ్యాపించియున్న – సంచలితవనప్రకృతిని వీక్షిస్తూ, కుడియెడమ వైపుల వ్యాపించియున్న పుష్పావృతపీఠభూములను వీక్షిస్తూ, మెత్తని పచ్చిక మైదానాలలో నడుస్తూ, అందు కాళ్ళవ్రేళ్లల్లో చిక్కుకొని, ముందుకు పోనీక నిలుపుతున్న కోమలకుసుమకోటుల అనురాగముల కానందిస్తూ, దూరకైలాసశిఖరాలపైనుండి క్రిందికి దుముకుతున్న జలపాతముల వెండిజాలుల సందర్శిస్తూ, మెరుపుతీగలమాదిరిపరుగెత్తే కస్తూరిమృగాల నవలోకిస్తూ, అప్పుడప్పుడు తమ రంగురంగుల పెద్దరెక్కల తటపడ లాడిస్తూ, బంగారువర్ణంతో సుగంధంవిరజిమ్మే కైలాసపద్మాలను (బ్రహ్మకమలాలను) తడవతడవకు త్రెంపుకొని, అటూయిటూ ఎగురుతున్నగరుడపక్షుల జూచి విస్మయపడుతూ, సుగంధవనమూలికల సమార్జించడానికి ఒకరినిమించి ఒకరు ఉబలాటపడే కూలీలవైఖరులకు వినోదిస్తూ, వేదమంత్రపఠనంతో, ఓంకారగానంతో మేము కాలంగడిపాము. ప్రాపంచికకోలాహలదూరదూరములైన ఈపర్వతసీమలందు, నీలమాణిక్యాలవంటి శుద్ధస్ఫటికజలాలతో నిండి, కైలాసశిఖరాలపైనుంచి వీచేనిర్మలస్వచ్ఛవాయువులచే తొణికిసలాడుతూ, ధవళసుందర హిమశైలపంక్తులతో చుట్టబడి, మనోహరంగాఉన్న అగాధమైన పెద్దపెద్దసరస్సులు, ఉదయారుణసూర్యభగవానునకు దర్పణాలవలె ప్రకాశిస్తున్నవి. ఈమహోన్నతేకాంతప్రదేశాలల్లో, సూర్యుడు, ఈసరోవర దివ్యదర్పణాలలో తనమనోజ్ఞసౌందర్యాన్ని చూచుకొని ఆనందిస్తాడు. ఇట్టిమహోన్నతప్రదేశాలలో ఒక్కపల్లెగానీ గుడిసెగానీ ఉండదు. మారుతములు నిద్రించేగుహాలలో, రాత్రుల్లు గడపబడినవి.

ఓహో! దుఃఖకర దేహవాసనారూప నిస్సారనిమ్న ప్రదేశాతి క్రమణసంజనిత మహానందం! ఓహో! వాయుసూర్యైక్య మహానందం! ఓహో! ఏకమేవాద్వితీయ – దివ్యాఖండ వనసంచార మహానందం!

ఓ కీర్తి విజేతలారా! విజ్ఞానవంతులారా! సంఘ సంస్కర్త లారా! ప్రియ శ్రామికులారా! మీ అందరికి శుభమవుగాక! భగవంతుడు (రాముడు) మిమ్ము దీవిస్తున్నాడు! వెళ్లండి! ప్రియులారా! వెళ్లండి! ఉత్సాహప్రపూర్ణులై మీమీ విధ్యుక్త ధర్మాలను శక్తిసామర్థ్యాలతో నిర్వహించండి. మీ ప్రయాణాలు అఖండవిజయాన్ని పొందుతవిగాక! మీమీ ప్రత్యేకగమ్యాలను మీరు సుఖంగా సురక్షితంగా చేరుతారుగాక! మీమీ గమ్యస్థానాల్లో మీకు సంతోషం స్వాగత మిస్తుందిగాక! అయితే రాముని విషయ మేమిటి? రాముని గమ్యం వేరు. పరమగమ్యానికి మధ్య, రాము డెక్కడా ప్రయాణ మాపడు. సెలవు! ప్రియులారా! సెలవు! ఓహో! పరమగమ్యం! పునరావృత్తిరహిత పరమగమ్యం!

1

ఎవ్వడు భూస్వర్గ పక్షివ్యాగాళి
సృష్టించి వానిలో ఆత్మగా వెలుగు –
ఎవ్వడు భక్తిచే జ్ఞానంబుచేత
తనుమనోకర్పరముల వీడి వెలుగు –
ఎవ్వ డీనామరూపాళి ధరించు –
ఆ యేకసత్యమా పరమాత్మ వీవె!

2

విషయవస్తువులపై నుండి భావముల –
దారిదప్పెడు అశ్వముల నొంచినట్లు –
జ్ఞానపాశంబులచే నిగ్రహించి,
సంయమీంద్రులు వాని స్వస్థానమైన
ఏ ఓంకృతిని జేర్తు, రా ఓంకృ తీవె!

3

స్వప్నసుషుప్తులు, జాగరణంబు,
బాల్య కౌమార యౌవ్వన వార్థకములు,
లాభనష్టములు, జయాపజయంబు –
లే నిర్వికల్ప నిత్యాఖండ నిర్మ
లాత్మ సూత్రంబున సుమములై వెలయు, –
ఆ సర్వగత పరిశుద్ధాత్మ వీవె!

4

నాలోన సూర్యునిలోన వెల్గునది
నా స్వస్వరూపమే ఆత్మయే ననుచు –
వేదంబు లేపరంజ్యోతిని గూర్చి
బోధించు – నా పరంజ్యోతివి – నీవె!

5

సంశయాందోళనా భయ పతనములు,
వ్యామోహ దౌర్బల్యము లపాయకోటి, –
ఏ జ్ఞాన తేజంబుచే ప్రీలి పోవు –
శత సహస్రాబ్దావృతాంధకారంబు,
జ్యోతిచే తక్షణంబున ప్రీలునట్లు –
ఆ దుఃఖదోష విదూరమై వెలుగు
జ్ఞాన తేజం బెవ్వరో కాదు – నీవె!

6

నీ నేత్రములలోన, నీ చేతులందు,
నీ పాదములలోన, నీ దేహమందు,
పనిచేయుచున్నట్టి చైతన్య మీవె!
నీలోనగలుగు నా ఏకైకశక్తి
సర్వత్ర వ్యాపించి వెలుగొందుచుండె.
ఆ యేకశక్తియే సర్వకారణము.
నీకు వేరైన వేరొకశక్తి లేదు;
నీకు శత్రుడు, పరు డనువాడు లేడు.
అఖిలకారణ మైన ఆత్మవు నీవె!

ఆత్మదృష్టితో—బ్రహ్మదృష్టితో—చూచినప్పుడు, సమస్త ప్రపంచం ఒక సౌందర్యధారగా, ఒకఆనందస్రవంతిగా మారుతుంది. ఖండదృష్టిపోగానే, మన కేదీ వికారంగా కనపడదు. సర్వం నాఆత్మయే ఐనప్పుడు, ప్రతివస్తువు ఆనందరూపంగాకాక వేరొకవిధంగా ఎట్లు కనబడుతుంది ? ఆత్మ ఆనందస్వరూపం. అందుచేత, ఆత్మసాక్షాత్కారమంటే, సమస్తప్రపంచాన్ని ఆనందస్వరూపంగా దర్శించడమైయున్నది. ప్రకృతిశక్తులను తనసొంతఅవయవాలుగా ఆవలోకించడమైయున్నది. సమస్తవిశ్వమును, నాఆనందాత్మయొక్కరూపమే అన్నదివ్యానుభూతి పొందడమైయున్నది.

ఓహో ! మహానందం ! నాకుభిన్నమైన దేదీ లేదు !

జ్ఞానిని బంధింపగలిగినయట్టి
ద్వారపాలకు డనువా డెందు లేడు.
సర్వసాక్షిగ వెల్గు సూర్యునివోలె
ఆతడు దృశ్యదుర్గంబు జయించి
అద్వితీయుండయి వెలుగొందుచుండు.
క్రమ్మి మేఘంబులు పోవుచున్నప్పుడు
ఆకాశమట్లు నిశ్చంచలుం డగుచు
జ్ఞాని సదా నిల్చు నిర్వికారముగ.
మేఘాలు గ్రమ్మినసమయమందైన,
మేఘాలు విచ్చినసమయమందైన,
నిత్యనిర్మలుడై ప్రకాశించు నతడు.
నిరత మాతనిలోన వెలుగే వెలుంగు !

ఓదివ్యాత్మమా ! ఈజగత్తును పరిపాలిస్తున్న దెవరు ? పరమాత్మ తప్ప వేరొకడు లేడు. భగవచ్ఛాసనాలకు వ్యతిరేకంగా ఏదైనా జరుగుతుందా ? ఎప్పుడూ జరగదు. సర్వం సక్రమంగా ఉన్నది. ప్రపంచం సత్య మనుకొనేవాండ్లను, ఊహలను, పన్నాగాలను, తంత్రాలను, ఆశ్రయించనీయండి. దేవుడే ఉన్నది. సర్వం ఖల్విదంబ్రహ్మ! ఆనందం! ఆనందం !

క్షణమాత్రమైనాసరే, దేహవ్యామోహం లోపల కలిగినట్లైతే, ఈశరీరాన్ని, ఈమనస్సును, నాశనంచేయండి. నాదేహాలు అసంఖ్యాకం. నాఆత్మ — నాస్వస్వరూపం — దేవుడే. అందుచేత రక్షణ అనవసరం.

నన్ను ఢీకొని బ్రద్దలుచేయగల బాహ్యశిలలు లేవు. నేనే ఏకైకశిలను! భద్రగిరిని! విశ్వసౌధమూలశైలమును! దీర్ఘదృష్టిలేని లౌకికమానవుల తారళతారలు, మనలక్ష్యదృష్టిని మార్చడానికి రవ్వంతకూడా జోక్యంకలిగించుకోసియకూడదు.

ఒక్కడు కలలోన దుఃఖింపసాగ —
ఆతడు చేసెడిపలవరింతలకు
పొరుగువా రరచిరి కలవరపడుచు.
వట్టిమిథ్యావిపత్తున కాతడెట్లు
దుఃఖించుచుండెనో గాంచు డోహోహో!
వచ్చుచున్నది ఆపజాలనినవ్వు!

సమస్తభూతకోట్లను స్వాత్మగా — హృదయాంతరాంతరాల్లోనుంచి ప్రేమించినవ్యక్తి ఒక డున్నట్లయితే, ఆతడు రాముడే. నాబిడ్డలు నన్ను అర్థంచేసికోలేకపోవచ్చు. అయినా సర్వదా నేను వాండ్ల శాంతిమయమైన, పావనమైన, ప్రేమనిధానమైన, ఆనందస్వరూపమైన, స్వాత్మయైన రామపరబ్రహ్మమైయున్నాను.

## హిమాలయారణ్యాలనుంచి ఒకలేఖ

డార్జిలింగు, జూన్ : 1905.

పగలు రాత్రిలోకి, రాత్రిపగటిలోకి జరిగిపోతున్నది. నీరాముడిక్కడ ఏపనిచేయడానికి కాలవ్యవధిలేక ఉన్నాడు. నైష్కర్మ్యానందనిరతుడై రాముడు రవ్వంతకూడా తీరికలేకుండా ఉన్నాడు. అత్యంత వర్షపాతంగల ఈ దేశంలో లాగనే నిరంతరం వెలువక ఆనంద బాష్పవర్షాలు కురుస్తున్నవి. రోమరోమం పులకరించి ఉన్నది. కండ్లు తెరచుకొని ఉన్నా ఏవస్తువూ కనబడడంలేదు. వాక్కులు ఆగిపోయినవి: పని ఆగి

పోయింది. ఇది దురదృష్టమా? కాదు. ఇది మహాదృష్టం. ఓహో! నన్ను ఏకాకిగా వదలండి.

వర్ణనాతీతమైన బ్రహ్మాపారవశ్యం. తరంగోపతరంగాలుగా నిరంతరం ఉప్పొంగిపోతున్నది. ఓ ప్రేమా! సర్వంపోనీ, ఓహో! మహా మధుర వేదన.

వ్రాతల కన్నింటికిదె స్వస్తి స్వస్తి.
ఏ యుపన్యాసముల్ వలదుపో వలదు
కీర్తి ప్రతిష్ఠలకెల్లను స్వస్తి.
గౌరవమర్యాదలా! నిరర్థకము.
మరి, అగౌరవములా, అర్థహీనములు.
ఈ ఆటబొమ్మలా! జీవితాశయము ?
తర్కశాస్త్రాదులు నిష్ప్రయోజనము !
అవి నన్ను దర్శించి ఇకమీదనైన
తమ గ్రుడ్డితనమును విడనాడుగాక.
కలలోన ఒక దివ్యవాహిని పారు;
జాగ్రతస్థితిలోన ఆమహానదము
కెరటాలు కెరటాలుగా పొంగులెత్తు.
ఒక్కొక్క తరి అది ఉప్పొంగి పొంగి
దేహేంద్రియాది తటంబుల ద్రెంపి
పెనుతరంగములతో పరవళ్ళు ద్రొక్కు.
అది పరివ్యాప్తమై జగము సర్వమున
అఖిలంబు ముంచెత్తి ప్రవహించుచుండు.
అది జలప్రళయంబు వలె విజృంభించు!
దీనికే సూర్యుడు నిత్యంబు పొడుచు;
దీనికే జగము పరిభ్రమించెడిని;
చావులు పుట్టుకల్ దీనికోసరమె.
బ్రహ్మ తన్మయత గంభీర వాహినిగ
ముంచెత్తుచున్నది పొంగి పొర్లుచును.
ఆనందజలధి మహాకాశమంటి

గర్జించుచున్నది పొంగిపొర్లుచును.
పొరలివచ్చెడి మహానంద హాసంబు!
పొరలివచ్చెడి మహామౌన ప్రశాంతి!

## అనుష్ఠాన వేదాంతమంటే ఏమిటి ?

"ఉత్సాహపూర్వకమైన, ప్రగతిపూర్వకమైన కృషి
గాని-గడ్డకట్టిన సోమరితనం కాదు.
కర్మలో ఆనందించడంగాని-ఈడుస్తూ, ఏడుస్తూ చేసేచాకిరీకాదు.
మనశ్శాంతిగాని-సంశయవ్రణంకాదు.
నిర్మాణంగాని-నిర్మూలనంగాదు.
సక్రమ సంస్కరణంగాని-అంధాచార దాస్యంకాదు.
సుదృఢమైన సత్యానుభవంగాని-గాలిమాటలుకావు.
సత్యప్రకాశకకవిత్వంగాని-గతించిన గ్రంథకర్తలప్రమాణాలుకావు.
సజీవ సాక్షాత్కారం గాని-నిర్జీవములైన ఉదాహరణాలను
ఏకరువు పెట్టడం కాదు.
ఈ అనుష్ఠాన వేదాంతమును ప్రతిష్ఠించుకో.

## అనుష్ఠాన వేదాంతమును ప్రతిష్ఠించుకో

**'అహం బ్రహ్మాస్మి'** **అన్న** మహావాక్యధ్యానం-వ్యక్తిత్వాల మీది సంఘాలమీది. బాహ్య దృశ్యాలమీది విభ్రాంతిరాహిత్యం - దానికదే శక్తిగా, స్వాతంత్ర్యంగా, ప్రేమగా మారుతుంది. మీ రోమ రోమంలో స్పందిస్తున్న ఈ అఖండబ్రహ్మతేజమే, ఈ వీర్యవంతమైన అద్వైతమే, ఈ శక్తిమంతమైన భక్తియే, ఈప్రజ్వలజ్యోతే-శాస్త్రాల చేత అమోఘమైన బ్రహ్మాకారవృత్తిగా పేర్కొనబడింది...

ఓసంశయతరళాస్తిమితమానసులారా! ఇక చాలు మీదుర్బలమైన పూర్వాచారపరాయణత్వం. ఇక చాలు మీ శుష్క సంస్కార సంరంభం. మీ సర్వ సంశయాలను, మీ దౌర్బల్యాలను, భస్మం **చేయండి.** ఈ సిద్ధాంతాలన్నీ మీస్పృష్టే. సూర్యుడు ఒక పాదరస పాత్రగా చూడబడవచ్చు. భూమి ఒక గోళాకారఘటంగా రుజువు

కావచ్చు. వేదాలు అపౌరుషేయాలు కావని నిర్ధారణ చేయబడవచ్చు. కానీ నీవు పరబ్రహ్మవే; తదితరము కానేకావు. నీ బ్రహ్మత్వమునుండి నిర్గతమైన ఏఒక్క విషయమైనాసరే-గడ్డిపోచలు, ఇసుకరేణువులు, ధూళికణాలు, ప్రసారవాయువులు, వర్షబిందువులు, పశుపక్ష్యాదులు, దేవ మానవులు, స్వీకరింపక తప్పదు. ఆ నీ సందేశం గుహాంతరాళాలు గర్జిస్తాయి. అరణ్యాగర్భాలు ఘోషిస్తాయి. పల్లెపల్లెల్లో అది వ్యాప్తమవుతుంది. నగరనగరాల్లో వీధివీధుల్లో అది ప్రతిధ్వనించి తీరుతుంది. సమస్తప్రపంచ గహ్వరంలో నిండి నిబడీకృతమై సమస్త మానవలోకాన్ని అది పులకితం చేస్తుంది. ఓహో! విముక్తి! స్వాతంత్ర్యం !

నదీజన్మస్థానము, అగణ్యాహిమఖండసంపదతో ప్రపూర్ణ మైనట్లయితే, ఆ నదీశాఖలు, దాని కాలువలు, దాని ప్రవాహాలన్నీ, జలముతో నిండి, పొంగి పారి, సస్యక్షేత్రాలను పోషించి తీరుతాయి. జీవశక్తిమూలం - ప్రేమమూలం - జ్ఞానస్రవంతి - తేజోనిధానము - ఆ అనంతశక్తి - ఆ పవిత్రత - ఆ దివ్యత్వం - అహంకృతిని పారద్రోలి ఏతత్ స్థానాన్ని ఆక్రమించనీ, బ్రహ్మైక్యభావుడవు కా! దివ్యత్వంతో మనస్సును నింపు. తప్పక, నీచేతులు, కండ్లూ, కాళ్లూ - నీనరనరం - నీపరిసరాలుసైతం, ఒకసామరస్య మహితస్వర్గకర్మను ఆచరించి తీరుతాయి. ఒకమహాశక్తి ప్రవాహాన్ని వరదలుగా పొంగిస్తాయి.

సింహాసనాలంకృతుడైన రాజుగారి సన్నిధిమాత్రం చేతనే, దర్బారంతా నియమబద్ధమై నిలుస్తుంది. అదేప్రకారం మానవుడు తన స్వస్వరూపబ్రహ్మమునందు నిష్ఠుడైతే, సమస్తమానవులలో ధర్మనియతిని, జీవశక్తిని తేగలుగుతాడు.

ఓ అవిశ్వాసీ ! మేలుకో! నీ పవిత్రబ్రహ్మపదవీ వైభవస్థితికి ప్రబుద్ధుడవుకా! ఒక్కనీరీవిగలఉదాసీనదృష్టి (నిస్సంగదృష్టి) మాత్రం చేత - నీబ్రహ్మానంద పారవశ్యోన్మత్తనిర్లక్ష్య స్థితినుండి వచ్చిన ఒక్క చిరుగాలితాకిడిచేత - ఘోరనరకగహ్వరాలు స్వర్గమందిరాలుగా మారుతాయి !

'సరగ, రా రమ్ము! నీస్వగృహంబు జేర' -
"ఓపాంథ! నీగృహం బోంకార మోయి!"

ఓం! ఓం!! ఓం!!!

ఓ మందమారుతాల్లారా! ఓ వాయువుల్లారా! మీ లక్ష్యమే లక్ష్యంగా కలిగిన ఈ వాక్కులతో మిళితంకాండి! ఈ సందేశము నలుదిశల కందించండి!

ఓహో! నవ్వు! ఆపుకోలేని నవ్వు!
అప్రతిహతమైన మహానందం! ఆపరాని నవ్వు!

శ్రీ రావ్‌సాహెబ్ బాజీనాథకు వ్రాసిన లేఖ

వసిష్ఠాశ్రమం, 1906 మార్చి 27

ఓ పరమ మంగళ దివ్యత్వమా!

నదివోలె ప్రవహించు నా లోనిశాంతి.
వాయువువలె వీచు నా లోనిశాంతి.
నా జటామండల భాగమందుండి
నా పాదపంకజ యుగ్మంబునుండి
శాంతి గంగాధునిగా బ్రవహించు.
ఉప్పొంగు ఈ మహాశాంతి ప్రవాహ
ఘన తరంగములలో బడిపోవుగాక -
సర్వహృన్మస్తక పాదసంతతులు!
ఓం! మహానందము! ఓం! ఓం! ప్రశాంతి!

ఈ వశిష్ఠాశ్రమం శీతహిమపంక్తులపైన ఉన్నది. రాముని గుహకు క్రిందిగా వాసిష్ఠగంగ అనే మనోహరమైన ప్రవాహమొకటి పారుతున్నది. ఈప్రవాహంలో అయిదారు జలపాతాలున్నవి. ఈ నది పారే లోయలో కఠినమైన రాతిచట్లమీద శివదేవుని స్వహస్తాలచేత తొలచబడిన ఇరవై చిన్నచిన్న అందమైనతటాకా లున్నవి. ఈ కొండ లన్నీ సూర్యకాంతిని నిజంగా ప్రేమించే పెద్దపెద్ద ఆకాశానికంటుతున్న వృక్షాలచేత ఆవరింపబడియున్నవి. వీటిచుట్టూ మంచు ఆరడుగులకు

మించి క్రమ్మియున్నా ఈ చెట్ల పచ్చదనం వాడిపోదు. నిజంగా ఇవి వనమాలి (శ్రీకృష్ణుని) యొక్క అనుగ్రహానికి పాత్రమైనవి.

అముంపురః పశ్యసి దేవదారుం।
పుత్రీకృతో౽ సౌ వృషభధ్వజేన॥

మహాదేవుని ప్రియసంతానమైన ఈ దేవదారు వృక్షాలే రాముని సహవాసులు. ఇప్పుడిక్కడ నారాయణస్వామికూడా లేడు. రాము డతనిని మైదానాలలోకి ఇంక రెండు సంవత్సరాలదాకానైనా కనీసం తిరిగి రావద్దని పంపాడు. ఒక యువకుడుమాత్రం ప్రతిదినం వస్తాడు. వంటచేసి రాత్రికి తిరిగి మూడుమైళ్ళదూరంలో వున్న ఒక పరిసరగ్రామానికి వెళ్ళుతుంటాడు.

ఇక్కడనుంచి కొండ ఇంకొక అరమైలు ఎక్కితే రాముడు బాసూన్ శిఖరము చేరుతాడు. కేదారము, బదరీ, సుమేరు, గంగోత్రీ, యమునోత్రీ కైలాసముల పవిత్ర హిమశిఖరాలు, ఇక్కడనుంచి కనబడు తుంటాయి.

కేదార ఖండంలో ఈ ప్రదేశాన్ని విపులంగా వర్ణించారు. యోగ వాసిష్ఠకర్త ఇట్టి ప్రదేశాన్నే ఆశ్రమపదంగా నిర్ణయించుకొన్నాడు. అదృష్టవశాత్తు దీనికి సమీపంలో ఏ పల్లెగానీ, ఏ పట్టణంగానీ రహ దారిగానీ లేదు. రాముని బ్రహ్మానంద పారవశ్యమునుగూర్చి ఇంక అడగ నవసరంలేదు. ఉప్పొంగి ప్రవహిస్తున్న తన్మయ శాంతి, రాము డిక్కడ చేస్తున్న ప్రముఖ రచనద్వారా వ్యక్తం కాగలదు. కొంత కాలానికీ రచన ప్రకటనార్థం మైదాన భూములకు వస్తుంది. అంతవరకు ఎవరూ, రామునివద్దకు రాకండి. . .భగవంతుడే సత్యం. సర్వం ఖల్విదం బ్రహ్మ.

ఈ రాత్రి ప్రియునినే చూడలేకున్న
ఈ కన్నులకు చూపులుండి – ఎందులకు ?
మృతశరీరమును గోరీలోన పూడ్చి
పైన పచ్చని మొక్క నాటుటలోని

అంతరార్థంబును గ్రహించినార ?
నే శరీరమున కతీతుండ నైతి –
ఈ మానవులు నన్ను నిందింత్రుగాక
లేక భూషింపగానిమ్ము నాకేమి ?
ఈ శత్రు మిత్రత్వములకంట నేను !
దూషణ భూషణల్ మంచి చెడ్డలును,
నేను దైవస్థానమును చేరుకొరకు
వేయగా బడినట్టి నిచ్చెన మెట్లు.
ఇప్పుడు నిచ్చెన తగులబెట్టండి !
ఇక్కడనుంచి నేనిక పైన దిగను,
నాయెద యనెడి 'మక్కా' మందిరమున
పరమాత్మ తప్ప మరెందు కింకొకరు ?
అవసర మేమున్న దితరంబుతోడ ?
ఓ ప్రపంచమ ! నీది నీకిచ్చినాడ,
ఇక వెళ్ళు ! పనిలేదు నీకు నాతోడ.
వలదు నీదయ నాకు రవ్వంతయైన,
నే పరబ్రహ్మతో తాండవించెదను !
సంశయ మనుమాట లేదుస్వాంతమున.

*　　*　　*　　*

బ్రహ్మైక్య మొందని బ్రదుకు నిష్ఫలము;
శవముపై ప్రాకెడి పురుగు కావలదు !
దేహదృష్టియె శవప్రీతి – ఇద్దాని
ఛేదించు ! ఛేదించు ! ముక్తుడ వగుము !

నీ ప్రయాగ కుంభోపన్యాసం అద్భుతంగా ఉన్నది. దాని ప్రతి ఒకటి రాముడు టెహ్రీమహారాజు కిచ్చాడు. ప్రియతమా ! విను ! వేదాన్తం వట్టి ముచ్చటగాదు. ఈ ప్రపంచం మిథ్య. ఎవరీ ప్రపంచాన్ని సత్యంగా సంభావిస్తాడో అతడు నశిస్తాడు. పరమాత్మయే సత్యం! నిజం! నిజం! నిజం! నిజం! ఓం!

—రామ

వసిష్ఠాశ్రమం, 1906 జూన్ ఆఖరు

... ... ... ...

జయాపజయాలను గూర్చిన ఆధ్యాత్మిక ధర్మాన్ని వేదాలు ఎంత మహోన్నతంగా ఉద్ఘోషిస్తున్నవి! :

"బ్రహ్మతం పరాదాద్యోఽన్యత్రాత్మనో బ్రహ్మవేద"

ఎవరైనాసరే తన అంతరాంతరాల్లో ఏవస్తువునైనా నిజంగా నమ్మినట్లయితే - ఆ వస్తువును విశ్వాసపాత్రంగా చేసుకున్నట్లయితే తప్పక ఆ వస్తువుచేత అతడు విడిచిపెట్టబడుతాడు. వంచింపబడతాడు. ఇది గురుత్వాకర్షణా ధర్మంకంటే ఎక్కువ సుస్థిరమైన ధర్మం. ఆ ఏకైక సత్యమైన ఆత్మ, జగత్సత్యత్వ భ్రాంతినుంచి మనలను విముక్తి చేసి స్వస్థానం చేరుస్తుంది.

జ్ఞానిని బంధింపగలిగినయట్టి
ద్వారపాలకుడను వాడెందు లేడు.
అన్నిటిపైనుండి, బంధింపబడని
సూర్యుపోలె నతండు మార్గంబుగెలుచు.
సర్వత్ర నతడు ప్రకాశించగలడు.
ప్రక్కగా మేఘాలు పోవుచున్నపుడు
ఆకాశమట్లు నిశ్చంచలుండగుచు
జ్ఞాని సదానిల్చు నిర్వికారముగ.
మేఘాలు క్రమ్మిన సమయమందైన
మేఘాలు విచ్చిన సమయమందైన
నిత్యనిర్మలుడై ప్రకాశించునతడు.
నిరత మాతనిలోన చీకటిలేదు.

ఒకడు ఏవాంఛకైనాసరే బద్ధుడైయున్నంతవరకూ ఆనందానుభూతి పొందలేడు.

యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది శ్రితాః ॥
అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే ॥ శ్రుతిః

# రెండవ ఘట్టం

## 1

స్వామి శివగుణాచార్యులకు,
కిషన్‌ఘర్.

ఫెబ్రే,
1902

నారాయణా!

మనలో ఆకలిపుట్టింది. ఆ పదార్థం ఎంత రుచిగావున్నా ఎంత విలువగలదైనా, ప్రియమిత్రులూ బంధువులూ మనతో కలిసి తింటామన్నా, మనం దాన్ని తినరాదని వైద్యులు చెపుతారు. నీవు వ్రాసిందంతా నిజమే. నేనిప్పుడుగనుక వెంటనే బయలు దేరివస్తే, సద్గుణవంతుడైన మీ కిషన్‌ఘర్ ప్రధానమంత్రిగారి సాంగత్యానందం అనుభవించవచ్చు. మీ సదాశయాలచేతకూడ లాభం పొందవచ్చు. కానీ నేను సంపూర్ణ సంసిద్ధుడనైనప్పుడు వాటంతట అవే సర్వావకాశాలు రాగలవని నా అంతర్వాణి నన్ను ఆగమని ఆజ్ఞాపిస్తున్నది. నేను వెనుకటి అపజయాలకు భయపడను. వాటిని అపజయాలని పిలువడానికి వీలుంటే నా భవిష్యత్ప్రవర్తనలో అఖండవిజయం ఉందని నాకు పూర్ణవిశ్వాసమున్నది. నేను చేస్తున్నపని సరిగ్గా మీరు ఆలోచిస్తున్న మహా కార్యానికే. అనుకూలావకాశాలు పొందడానికి మనం ఎప్పుడూ జాగరూకులమైయుండవలసి యున్నదన్నమాట నిజం. కానీ మనం ఆతురతపడడంకూడా పనికిరాదు. కావలసినదల్లాపని. మన దేశీయుల్లో క్రియాశక్తిని, ఉత్తేజమును ప్రబుద్ధంచేయడానికి అఖండశక్తితో నేను బయలుదేరవలసి యున్నది. ఆ సమయం రాగానే మీరునాతో తప్పక కలిసియుంటారు. చిన్నచిన్న స్వల్పవిషయాలకోసం హడావిడిచేయకుండా, మాతృభూమికి నిజమైన పరమోత్కృష్టమైన సేవచేయడానికి, నిజమైనప్రయోజనమును కలిగించడానికి – ఆ అద్భుతకర్మకు తగినంత సత్వమును ఇతోధికంగా నేను సమకూర్చుకోవాలనుకుంటున్నాను.

సమగ్రంగా నేనిక్కడ శాస్త్రాలను, ఉన్నత పాశ్చాత్య తత్వశాస్త్రాలను అధ్యయనం చేస్తున్నాను. నా స్వంత పరిశోధనలుకూడా చేస్తున్నాను. అయితే యీ పనితోనే నా జీవితం గడపను. నిరంతర

కృషితో నేను ఆర్జించిన తేజమును, త్వరలోనే మానవ హృదయాల కందిస్తాను. వారి వ్యావహారిక జీవితాలలో ప్రవహింపచేస్తాను. నేను గనుక సంకల్పించుకున్నట్లయితే దేశంలో ఒక మహత్తర సంచలనాన్ని తీసుకవచ్చి యుండేవాడిని. కానీ కీర్తినీ, లాభాన్నీ, ప్రమాదాన్నీ, మృత్యువునైనాసరే లక్ష్యించని నా హృదయం, నేను దర్శించని సత్యమును చెప్పడానికి యిష్టపడదు.

సత్యమునకు ఏమాత్రమైనా శక్తి ఉన్నట్లయితే-నిజంగా అది అనంత శక్తి అయితే - రాజులూ, సాధువులు సైతం, పండితులు పామరులు సైతం సర్వమానవులు ఏకగ్రీవంగా రామతీర్థస్వామి నిల బెట్టబోతున్న ధర్మధ్వజంముందు మోకరిల్లి, స్వాగత మివ్వవలసి యున్నది. నాకీ పనియందు ఒక అభిరుచియున్నది. తొందరపడి నేనొక స్వల్ప కార్యాని కుద్యమించినట్లయితే నాశక్తులు వృథాచేస్తున్న వాడ నవుతాను.

నేను ప్రబోధింపవలసియున్నది. లేకపోతే చిన్నతనంనుంచి నా కెందుకీ అభిరుచి ఉంటుంది ? నేను ప్రబోధానికే వచ్చాను. లేక పోతే తల్లిదండ్రులను, భార్యాపుత్రులను ప్రాపంచిక పదవులను, అదృష్టాలను ఎందుకు పరిత్యజిస్తాను? దివ్యాగ్నితో సండిపోయి, ధీరత్వంతో, నిర్భయత్వంతో,—సమస్త కష్టపరంపరలను ఎదుర్కొన్నా విషమ పరిస్థితులు విజృంభించినా-ఇక్కడ నేను పొందుతున్న సత్యాను భూతిని ప్రబోధింపవలసియున్నది.

నాభవిష్యదుద్యోమోపయోగానికి ధనముంచు విషయమును గూర్చిన మీ సలహాను నేను అంగీకరిస్తున్నాను.

ప్రతినిత్యం వ్యాయామం తీసుకుంటున్నాను. ఆరోగ్యం బాగా ఉంది. వాతావరణం ఆనందదాయకంగా ఉన్నది.

మీ యొక్క బాబూసాహెబుయొక్క క్షేమం తెలుప గోరుతాను.

శాంతిః ! శాంతిః ! శాంతిః

—రామతీర్థస్వామి

2

*వ్రజలాల్ గోస్వామికి,

Ranungo,
జమ్మూస్టేట్, ఫెబ్రు, 1902

ప్రియతమా !

నీకు ఉద్యోగం దొరికినందుకు సంతోషం. నిరంతరం నీతితో ధర్మదృష్టితో వర్తించు. నీ విధ్యుక్త కర్మలను అత్యంత విశ్వాస పాత్రంగా నిర్వహించు. నీ కాలవ్యవధిలో నిత్యమూ కొంతభాగం భగవద్గీతను యోగవాసిష్ఠమును పఠించడానికి వినియోగించు. నిరంతరం ఓంకారస్మరణం విడువకు. ఓం.

నీ ప్రవర్తనచేత నీ వంశగౌరవాన్ని రుజువుచెయ్యి. విషయ వ్యామోహాలకు వశుడవుకావద్దు.

3

పండిత రామధన సాహెబ్‌కు
అసిస్టెంటు సెటిల్‌మెంటు ఆఫీసర్,
భింబార్, జమ్మూస్టేట్, కాడియా 1902

ప్రియతమా ! రామా !

రామపాదుషా ఇప్పుడు ఒక మహోన్నత పర్వతాగ్రం పైన ఉంటున్నాడు. ఈ శిఖరమునుంచి యమునోత్రి, గంగోత్రి, కేదార బదరీనాథ శిఖరముల అతిమనోహర దృశ్యం కనపడుతూ ఉంటుంది. ఈ ప్రదేశంనుంచి ఏడెనిమిదిమైళ్ళ దూరంలో 'గంగి' కనపడుతున్నది. ఈ మహాద్భుత ఆనందసీమలకు రావాలంటే డెహరాడూన్ రైల్వే స్టేషనునుంచి, ఫెబ్రు రహదారిన రెండురోజులు ప్రయాణంచెయ్యాలె.

ప్రియతమా ! సర్వమూ ప్రేమార్పణంచెయ్యి !

నీ హృదయంబుతో శ్రుతిగల్పవోయి !
మిత్రుల, బాంధవజనసమూహముల,

---

*ఇతడు శ్రీరామతీర్థ స్వామివారికి మేనల్లుడు.

కాలమున్, ధనమును, సద్యశోగరిమ
నూహల, ఘనతల, వైదుష్యములను, –
ఏదైన గానిమ్ము ఒకటైన విడక –
సర్వంబు ప్రేమకే అర్పింపవోయి.

ఏప్రియల్ మాసంలో రాయ్ బాజీనాథుడు ఇక్కడికి వస్తాడు.

విలాసం :—రామపాదుషా, దర్బార్, కాడీయపర్వతం,
టెహ్రీ, గఢ్వాల్ పోస్టు, 1902 ఏప్రియల్ 9.

స్వామి శివగుణాచార్యులకు,

శాంతి ఆశ్రమం, మూత్రా.

పరమ ధన్యాత్మా!

1. దీనితో ఎ. యన్. క్నాప్ (Mr. A. N. Knapp) మహాశయుని వద్దనుంచి వచ్చిన ఒక ఉత్తరం అనుబంధించి పంపుతున్నాను. అతని ప్రస్తుతపు చిరునామా నిర్ధారణకాలేదు. కారణం, అతడు త్వరలో బర్కెలే నగరాన్ని వదలబోతున్నాడు.

2. వెల్మన్ సతి, (Mr. Eva A. Wellman) అక్టోబరు 23 న సైబీరియా అనే స్టీమరుపై అమెరికానుండి ప్రయాణమైనది.

...ఈ ఉత్తరం మీకందకముందే ఆమెగనుక ఆశ్రమానికి చేరియుండకపోతే మీరామెకు తంతినంపండి. లేదా వెంటనే స్వాగత లేఖ వ్రాయండి. ఆమె ఆశ్రమంలో ఉండదలచినది.

మీ ఆత్మ,
—రామస్వామి.

స్వామి శివగుణాచార్యులకు,
శాంతి ఆశ్రమం,
మూత్రా.

పూజ్యాత్మా.

శాస్తాజలస్రవంతులు,
క్యాలిఫోర్నియా.

*    *    *    *

భారతవర్ష సమస్యను, అభ్యుదయ ధర్మతేజంలో పరికించినట్లయితే, నిర్మాణకార్యము, సర్వజాతీయ సామరస్యం అత్యవసరంగా కనపడుతున్నది. చెదరిపోయిన విభిన్నశక్తులను క్రమవిధానంలో పెట్టవలసియున్నది.

భారతదేశంలోని విభిన్న సమాజాలు, సభలు, సంఘాలకూ మధ్య విస్పష్టమైన పరస్పరాశయగ్రహణశక్తిని, ఐక్యతను తేవాలని రాముని గాఢ సంకల్పం.

సాధారణ ధర్మోద్యమానికి రాముడు నిర్దేశించిన ఈ క్రింది సూత్రాలను మీరు బాగా సమాలోచనచేయండి. మీకు మీరు ఆలోచించండి. ఇంకా భారతదేశంలోని బుద్ధిమంతులకు వ్రాసి సంప్రతించండి. తరువాత వాటిని అవకాశముంటే వెనుకటి 1 మొదలు 8 సూత్రాలకు అనుబంధంగా ప్రకటింపవచ్చు. లేదా రాముని ప్రత్యేక లేఖగా ప్రకటించవచ్చు. ఈవిషయంలో మీ అభిప్రాయానుసారం చేయండి.

5 లేఖానుబంధం

## సాధారణ ధర్మసభాసూత్రాలు

(సాధారణపథ మహోద్యమం)

1. జగత్తుకు మూలకారణమై జగత్తును నియమబద్ధంగా పరిపాలిస్తున్నది సర్వశక్తిమయ పరమాత్మ.

2. అదృశ్యమానుడై, పరమాత్మ సమస్త వ్యక్తులయొక్క-సమస్తజాతులయొక్క- సమస్త మానవులయొక్క- గుణగణాలను, కర్మలను, ఇచ్ఛలను, ఆశయాలను, అవలోకించి-వారి వారికి తగిన విధంగా, సుఖదుఃఖాల రూపంగానో-పతనోన్నతుల రూపంగానో-ఫలప్రదానం చేస్తుంటాడు.

3. క్రమక్రమంగా నైతిక, శారీరక, ఆధ్యాత్మిక శక్తులను అభివృద్ధిచేసుకోవడంద్వారా, ఆ శక్తులను సక్రమోపయోగంలో పెట్టడంద్వారా, ఆ శక్తులను పరోపకార కర్మకు (మానవసేవా కర్మకు) వినియోగించడంద్వారా, మానవుడు పరమాత్మ సాక్షాత్కారం పొందగలడు.

4. పైన చెప్పబడిన ధర్మసూత్రాలలో విశ్వాసమున్న సమస్తజనులు ఈ సాధారణ ధర్మసభాసభ్యులు గావడానికి అర్హులు.

5. ప్రతిసభ్యుడు, తనకుతాను అనుభవాత్మకంగా అభ్యున్నతి పొందుతూ, అంటే తనకు తాను దైహిక నైతిక ఆధ్యాత్మిక శక్తులను సమార్జించడంలో సక్రమ సాధనచేస్తూ, తన కుటుంబముయొక్క, తన సంఘముయొక్క తన జాతియొక్క, సమస్త ప్రపంచము యొక్క పరిస్థితిని బాగుచేయడానికి ప్రయత్నించవలసియున్నది. ఈకర్మను నిజమైన పురుషార్థంగా, పరోపకారంగా ఎంచవలసియున్నది.

6. సామాన్య ప్రజానీకముయొక్క దృష్టిని మతాభిముఖం (ధర్మాభిముఖం) చేసి, వివిధ సంఘాలమధ్యగల విభేదాలను, అసూయలను పోగొట్టి, ఔదార్యము (క్షమ)ను ప్రతిష్ఠించడం ప్రతి సభ్యుని యొక్క కర్తవ్యం.

7. మతము, ధర్మమునుగూర్చిన "సాధారణధర్మం" లాంటి గ్రంథాలను చదివి, వాటిలోని ప్రబోధాలను తీవ్ర శ్రద్ధావిశేషాలతో ఆచరణలోపెట్టుకొని వాటిని ఇతరులకుకూడా అందజేసి, అనుష్ఠానంలో పెట్టజేయాలె.

8. సభ్యులందరూ మత (ధర్మ) ప్రచారంచేసే ఉత్తమ సాధువులకు, ఇతర ఉత్తమవ్యక్తులకూ, తమ శక్తికొలది తోడ్పడాలె.

## నిర్దేశిత సూత్రాలు

1. సాధారణధర్మం (సాధారణ మహాపథం) – విజ్ఞానశాస్త్రాదేశాలతో, సత్య వేదాంత ప్రబోధాలతో, ప్రస్తుత కాలావసరాలతో,

ఉపయుక్తమైన జీవనపథాన్ని చూపిస్తుంది. అభ్యుదయ విజ్ఞాన శాస్త్రంతో సామరస్యం పొంది, వర్తమానపరిస్థితులతో సమన్వయం పొంది, అది పురోగమిస్తుంది. అందుచేత సాధారణధర్మం – చైతన్య వంతమైందిగాని, జడమైందిగాదు.

2. ఈ సాధారణ పథం (సాధారణ ధర్మం) సమస్తజాతులకు, సమస్తమానవులకు సంబంధించింది. ఏ యితరమతాలకు సంబంధించిన వారైనాసరే, సాధారణ ధర్మాన్ని అవలంబించినప్పుడు, తమ మతాలను విడువనవసరంలేదు.

3. సాధారణ ధర్మం, బాహ్యాకారాలలో ఏకరీతిని తేవడానికి ఉద్దేశించదు. కానీ, భారతవర్షంలో, క్రమక్రమంగా యావత్ప్రపంచం లో గల విభిన్న మతాలలో విభిన్న సమాజ సంఘాలన్నింటిలో, – వివిధత్వంలో ఐక్యమును తేవడానికి ఆశిస్తుంది. దీని ఆశయమేమిటంటే శక్తికొలదీ ప్రతిసంఘానికీ చెందిన వ్యక్తులను, ఒకరికొకరు అత్యంత ఐకమత్యం కలిగియుండేలాగు చేయడం, వివిధ జాతులమధ్య అధికమైన సామరస్యాన్ని కలిగించడం. అంటే ప్రతి ప్రత్యేకసంఘాన్ని లేక జాతిని తన విశిష్టకర్మలో పురోగమింపజేయు ప్రయత్నంద్వారా, వ్యక్తిగత ద్వేషాన్ని, సంఘద్వేషాన్ని, జాతిద్వేషాన్ని పోగొట్టడం.

4. సాధారణ ధర్మప్రచారకులద్వారా అంతర్జాతీయ సంప్రతింపుల నేర్పాటుజేసి తద్వారా భారతదేశానికీ, ప్రపంచంలోని తదితర దేశాలన్నింటికీ మధ్య, మైత్రినీ, బాంధవ్యానుభూతినీ స్థాపించడానికి, సాధారణపథం ఆశిస్తుంది.

5. ప్రతి సాధారణ ధర్మపథ అనుయాయునకు విద్యాభ్యసనం, ధ్యానము, ఎంత ముఖ్యమో – భౌతికవిజ్ఞానంకూడా అంత ముఖ్యమే.

6. రాష్ట్రీ విశ్వవిద్యాలయ కార్యవిధానాలకు ఇతోధికోత్తేజ విధానాల ననుబంధింపజేసి, విద్యార్థులకు శీలనిర్మాణ విద్యాప్రదానం చేయించాలని సాధారణ ధర్మం నిర్ణయిస్తుంది. పురాతన అధునాతన తత్త్వదర్శనాలమీద క్రమోపన్యాసాలు ఏర్పాటుచేయబడడంతో

పాటు, జీవశాస్త్ర పరిశోధనలు, తదితర శాస్త్ర పరిశోధనలు అభివృద్ధి చేయబడుతాయి, విజ్ఞానమును వ్యాప్తంచేయడంలో, స్వతంత్ర చింతనను అభివృద్ధిపరచడంలో, శ్రద్ధవహింపబడుతుంది.

## మూడవ ఘట్టం

# వెల్మన్‌సతికి వ్రాసిన లేఖలు

వెల్మన్ సతి- అమెరికానివాసిని. శ్రీరామతీర్థస్వామివారి శిష్యురాలు. శ్రీ స్వామివారీమెకు ప్రసాదించిన సన్న్యాసనామం- సూర్యానంద. రామాదేశానుసారమీమె అమెరికానుండి భారతదేశానికి వచ్చి, భారతదేశానికి మహాసేవచేసింది. ఈ విదుషీమణికి అమెరికానుండి, భారతదేశమునుండి, శ్రీస్వామివారువ్రాసిన ఇరువది లేఖ లిందు ప్రకటింపబడుతున్నవి.

1

కాజిల్ స్ప్రింగ్స్,
క్యాలిఫోర్నియా (యు. యస్. ఏ)
జూన్ 11, 1903

అస్మత్ప్రియాతిప్రియ మధురాత్మా!

వ్రాయడానికి, చెప్పడానికి అవసర మేమున్నది. రాముడికి సర్వం తెలుసు. అంటే నీ కన్నీ తెలుసన్నమాట. రామునికి మహానందాన్ని కూర్చిన నిన్న మొన్నటి సంగతొకటి చెప్తాను. ప్రతిదీ రామునికి ఆనందమే కొలుపుతున్నది.

మే 19— నదీతీరంలో ఒక విశాల శిలాఫలకంమీద రాముడు శయనించి ఉన్నాడు. డాక్టర్ హిల్లర్‌కు రామునికని సెటెల్‌నుంచి ఒక స్నేహితుడొక ఉయ్యాలను పంపాడు. హిల్లర్ గృహయజమాని దానిని రాముని దగ్గరకు తీసుకవచ్చాడు. దానిని వెంటనే పచ్చని సింధూర వృక్షానికీ, ఎఱ్ఱని దేవదారు వృక్షానికీ- చిటారుకొమ్మన ఆకాశంలో- వ్రేలాడగట్టారు. ఉప్పొంగిపోయే ఆనందంతో ఆగక పొరలి వచ్చే నవ్వుతో రాముడా ఊయెలలో ఊగుతున్నాడు. మధుర సుగంధ

మలయానిలాలు రాముని మెల్లగా లాలిస్తున్నవి. నది ఓంకార గానం చేస్తూ ప్రవహిస్తున్నది. రాముడు నవ్వాడు- నవ్వాడు- నవ్వాడు. కడుపు చెక్కలయ్యేలాగు నవ్వాడు. నీ కానవ్వు వినపడిందా? రాముడు ఊయల ఊగే సమయంలో రాముని తలపై కొమ్మమీద ఒక రాబిన్ పక్షి కూర్చొని చూస్తున్నది. అది రాముణ్ణిచూచి అసూయ పడు తున్నదా ? లేదు. అసూయ పడడంలేదు, ఏవిహంగమూ రాముని చూచి అసూయపడదు. వాటన్నిటికి రాముడు తమవాడే అని తెలుసు. చివరకు ఎట్లయితేనేమి తనలో ఆపుకోలేని ఆనంద పరవశతను వెడల గ్రక్కను, తాండవించడానికి రాముడు క్రిందికి దిగాడు. ఆ ముద్దుల రాబిన్ పక్షి లభించిన ఆ మధురావకాశాన్ని దొంగిలించింది. ఊయల మీద ఒక చిన్న ఊపు ఊగింది. రాముని కత్యంత ప్రియమైన పక్షులూ, పుష్పాలు, ఆనందంగా ఉత్సాహంగా స్వేచ్ఛగా ఎందుకుండవు ?

మే 20, మధ్యాహ్నం. అమెరికా సంయుక్త రాష్ట్రాల అధ్య క్షుడు, ఉత్తర ప్రయాణం చేస్తూ మధ్యలో కొంతసేపు స్ప్రింగ్సువద్ద ఆగాడు. స్ప్రింగ్సు కంపెనీ ప్రతినిధి, అతనికి ఒక పూలబుట్ట బహూక రించింది. అధ్యక్షునకు తర్వాత రాముడు, "భారతదేశం తరఫున ఒక విజ్ఞప్తి" అనే తన గ్రంథాన్నొకటి ఇచ్చాడు. అధ్యక్షుడు దాన్ని ఎక్కువ ప్రేమతో స్వీకరించాడు. ఆ గ్రంథాన్నతడు తన కుడిచేతిలో పట్టుకున్నాడు. తనను చూడడానికని వచ్చిన ప్రజలందరిని అధ్యక్షుడు అభినందించినప్పుడల్లా, ఆ గ్రంథం అతనికి తెలీకుండానే కనీసం ఒక నూరుసార్లయినా అతని ఫాలభాగం ప్రక్కన మెరిసింది. రైలు కదలి నంతనే, ఆయనా గ్రంథం పఠింపసాగాడు. రైలు కదలబోయే ముందు మళ్ళీ అధ్యక్షుడు కృతజ్ఞతా పూర్వకంగా రామున కభివందనా లర్పించాడు.

కాని పాపం! రాముడు అధ్యక్షుణ్ణి తన మనోజ్ఞ డోలికలో ఆనంద విహారం చేయడానికి పిలువలేదు. ఎందుకో చెప్పగలవా ? చెప్పను ప్రయత్నించు! సరే నీవు చెప్పడంలేదు రాముడే చెపుతాడు. దీనికి కారణం తేటతెల్లంగానే ఉన్నది. రాముని ప్రియవిహంగాలకూ, మలయానిలాలకూ ఉన్న స్వేచ్ఛలో ఒక వెయ్యోవంతైనా, ఆ స్వాతంత్ర్య అమెరికాధ్యక్షునకు లేదు.

అధ్యక్షునిగూర్చి నీవాలోచించపనిలేదు. రాముడెంత స్వేచ్ఛగా ఉన్నాడో నీవూ అంత స్వేచ్ఛ పొందవచ్చు. తేజోవాయువులను హాయిగా నీ సేవకు వినియోగించుకోవచ్చు. రాముడవుకా! రాముడు నీకు ఈ సూర్యులనూ, తారలనూ, వాయువులనూ సముద్రాలను, మేఘాలను, పర్వతారణ్యాలనూ– అదేమిటిదేమిటి, సర్వస్వమునూ– ఇస్తాడు. సర్వం నీకై వశమవుతుంది. ఇది మనోహరమైన బేరంకాదా? ఇది నీకు ప్రియంగా లేదా? సర్వాధికారం పొందు.

తెల్లవారుఝామున నాలుగు గంటలకు, ఉషఃకాంతుల పరిచుంబనాలకు మేలుకొని, స్వేచ్ఛగావీచే చల్లనిపిల్ల వాయువుల చక్కిలిగింతలకు నవ్వుతూ, కిలకిలలాడే పక్షుల మధురస్వాగత గీతాలకు పరవశుడవుతూ, రాముడు పర్వతశృంగాలపైనా, నదీతీర ప్రదేశమందూ, విహరిస్తాడు.

రా, కలసి మనం నవ్వుకుందాం. నవ్వుదాం, నవ్వుదాం, నవ్వుదాం. రా ఓ సూర్యా! ఓ బిడ్డా! ఓ బిడ్డా! రాముని నిర్భయమంద హాస నేత్రాలలోని అమృతాన్ని పంచుకో. ప్రకృతితో–రామునితో– శ్రుతిగలుపు. బ్రహ్మానంద పారవశ్యమును నేనే!

నీ ఆత్మ,
రాముడు,

2

ఓం!

శాస్తాస్ప్రింగ్సు, (కాలిఫోర్నియా)
జులై 9, 1903.

ప్రియమైన ఆనందాత్మా,

నీవుత్తరం చేరింది. సత్యమే – సత్యం మాత్రమే – నిజమైన మిత్రుడు, నిజమైనబంధువు. సత్యమే – స్వాత్మ.

సత్యమును విడువకు. సత్యపథంలో నడువు; నీ శరీరం పైనగల ఒక్క వెంట్రుకనుకూడా అపాయం తాకలేదు.

యోగవాసిష్ఠమును, భగవద్గీతను మళ్ళీ మళ్ళీ విడువక పఠనం చెయ్యి.

నీ ఆత్మ,
రామస్వామి.

3

శాస్తాస్ప్రింగ్సు,
క్యాలిఫోర్నియా
అక్టోబర్ 8, 1903.

అతి ధన్య దివ్యమాతా!

...రాముడు నీ జీవితగమనంలోని అనుక్షణాన్ని పూర్ణంగా అభినందిస్తాడు. అపార్థంచేసుకోవడానికి రాముడంత స్వార్థపరుడుగాడు. భారతవర్షమును గూర్చిన, సత్యమునుగూర్చిన, పీడితమానవలోకాన్ని గూర్చిన ప్రేమలో, రామునితో విలీనమైన ఒక వ్యక్తిని రాముడు మరిచిపోతాడా? సూర్య అంటే సూర్యుడని అర్థం. రాముడన్నా అదే. "చెడును ఎదిరించవాకు" అన్న వాక్యానికి అర్థం నిరాశానిస్పృహత్వములతో జడత్వం వహించమనికాదు. ఇది కానేకాదు. ఈవాక్యం దేహకర్మ పరంగా చెప్పిందికాదు. మనస్సునుగురించి, కేవలం మనస్సును గురించి, మానసికశాంతిని పరిరక్షించుకోవడాన్ని గురించి చెప్పిన ఆదేశ మిది. మానసికమైన ప్రతినిరోధంచేత, ప్రతీకారంచేత, తిరుగుబాటు చేత, ఎప్పుడైనాసరే వచ్చే ఫలితం – అశాంతీ, ఆందోళనా, దుఃఖం మాత్రమే. విద్వేషక్రోధాదులతో మనస్సమతను కోలుపోవడానికి బదులు, చెడును, ప్రేమచేత (త్యాగశక్తితో లేక ఔదార్యస్వభావంతో) జయించు. ప్రేమకంటే మించిన శక్తి లేదు.

"చెడును నిరోధించకు". ఔదార్య హృదయంతో, ప్రసన్న చిత్తంతో, కష్టాలకు స్వాగతమివ్వు. మహాత్ములెప్పుడుకూడా అంతస్స

మతను కోల్పోరు. ఎప్పుడైనాసరే మనం, మనశ్శాంతిని పరిరక్షించుకోవడంచేత, అవరోధశిలలను సోపానాలుగా మార్చుకోగలం. నీ మనస్సులో ఎప్పుడుకూడా, నిరాశాదైన్యభావాలకు చోటీయవద్దు. వద్దు.

ఇప్పుడే రామునకొక విషయం తట్టింది. నీవు ఇండియాకు వెళ్ళగానే, నీకు వీలున్నంతత్వరలో, పంజాబులో పురాన్‌సింగు ఎక్కడున్నాడో, విచారించాలె. అతడు, "థండరింగ్ డాన్" పత్రికకు సంపాదకుడు. అతనికి పరిచయలేఖ లేమీ అవసరంలేదు.

నవోదయాన్ని పొందినవెంటనే, నీవు రామునకు తిరిగి లేఖ వ్రాస్తావుగాక!

నీ పరిశుద్ధమైన వీరవంతమైన ఆత్మ,
రామస్వామి.

సూర్యానంద భారతవర్ష ప్రయాణం నిశ్చయించుకున్నది. కానీ ఆమె ప్రయాణానికి అనేక అవరోధాలు వచ్చాయి. తీవ్రమానసికవ్యథ పడుతున్న ఆమెకు రాముడీ లేఖ వ్రాశాడు.

4

శాస్త్రస్ప్రింగ్స్,
క్యాలిఫోర్నియా
అక్టోబర్ 10, 1903

ప్రియజననీ!

నీ ప్రేమపూర్వకమైన లేఖా, కాగితాలూ, కవర్లూచేరాయి. నీ వాకారుణ్యాభూమి (భారతదేశం) పై అడుగుపెట్టగానే, నీకు హృదయపూర్వకమైన స్వాగతం లభిస్తుంది. ముందుగానే రాముడు భారతదేశానికి ఉత్తరం వ్రాశాడు. నీ వక్కడికిపోతే, నీకంటేముందే నీపేరక్కడ వ్యాపిస్తూఉండడం చూడగలవు. నీవు దారిలో ఎక్కడ ఆగినా, నీకు స్వాగతముంటుంది. (వెల్మాన్‌సతి అడిగిన ఒక ప్రశ్నకిది జవాబు) "మనం, దౌర్బల్యమునకూ, దుర్వ్యాపారములకూ, విలాసము

లకూ, వశులమైనప్పుడు- నిగూఢ ప్రకృతి ధర్మనియతివల్ల, ప్రతీకార శక్తులచేత మనం అణగారిపోతాము. వివేకశాలి, తన హృదయాన్నెప్పుడూ, స్వస్థానమందే నిలుపుకొంటాడు; ఏకైక పరమసత్యమందే నిమగ్నంచేస్తాడు.

ప్రపంచవిషయాల నతడు, నిస్సంగ నిష్కామ్య నిర్లిప్తదృష్టితో, ఆత్మవైభవ సంతుష్ట దృష్టితో, పరమోదార శీలుడైన మహాత్యాగియైన రాజకుమారునివలె వీక్షిస్తాడు.

ఆత డీ మహాదృష్టిని, తన సమస్త కర్మరంగాలలో కలిగియుంటాడు. ఈ సమస్త ప్రాపంచిక కర్మకలాపాలలో, ఆతని ముక్తాత్మ, వాటన్నిటికీ అంటక, చలింపక, మహోత్సాహంగా, నిరంతరం స్వస్వరూప ప్రతిభా స్ఫూర్తితో సంచరిస్తుంది. "నేను అద్వితీయుడను. ఏకైక పరమాత్మను! సూర్యుడు నా ప్రతిబింబమే." నీలోని సత్యసూర్యునిగూర్చిన, నీ నిజస్వరూపమునుగూర్చిన నిరంతరధ్యానంచేత, ఆ ధ్యానమును నిత్యజీవిత కర్మకలాపాలలో వినియోగించడంచేత, నీవు ఆత్మయొక్క రూపముగా మహోన్నత ప్రేమ జ్ఞానశక్తుల మూర్తీభావముగా ప్రకాశిస్తావు. నీవు నౌకాయాత్రకు బయలుదేరేముందు మళ్ళీ నాకొకలేఖ వ్రాయి. జపాను, హాంకాంగ్, చేరినప్పుడుకూడా తిరిగి ఒక ఉత్తరం వ్రాయి. భారతవర్షంలో రాముడు నీ కేసహాయం చేయడానికైనా సిద్ధంగా ఉన్నాడు.

నీ ఉదారప్రేమమయ దివ్యాత్మ,
రాముడు.

5

ఓం!

శాస్తాస్ప్రింగ్సు,
క్యాలిఫోర్నియా,
అక్టోబరు 16, 1903.

ఆనందమయ సూర్యానందా!

నీ రెండు ఉత్తరాలూ ఇవ్వాళ మధ్యాహ్నం నాకందాయి.

అంతా సరిగా తృప్తికరంగా ఉన్నది. నీవుదూరప్రయాణం చేస్తున్నావు గనుక, నీ మానవ ప్రకృతిసంబంధమైన జ్ఞానాన్ని కొంచెం ఉత్తేజితం చెయ్యడం నీకు శ్రేయోదాయకం. నీ మనస్సును నిరంతరం నిశ్చలంగా, వినిర్మలంగా, ఆత్మస్థితంగా ఉంచుకోవాలె.* దారిలో కనపడే ఆలస్యాలు, ఆటంకాలు, ఇవన్నీ నీ అంతశ్శక్తిని, నీ పరిశుద్ధతను అధికం చేయడానికే అయి ఉన్నాయి. ప్రకృతి తత్వశాస్త్రవేత్తలు, ప్రపంచ పరిణామంలో పోరాటాలు, వ్యతిరేక సంరంభాలు లేకుండా అభివృద్ధిజరుగదని సిద్ధాంతీకరించారు.

బ్రూనూ సాలీడుకథ నీకు జ్ఞాపకముందికదా? "ప్రతి మహోత్తమకర్మకూ, ముందు వందలకొలది, వేలకొలది కష్టపరంపరలను అతిక్రమించాలసుమా!" ప్రతిరోజూ ప్రాతఃకాలంలో దాదాపు ఒక అర గంటసేపు ఈ మంత్ర జపంచెయ్యి, జపసమయంలో ఈ మంత్రంలోని సత్యాన్ని నీలో జీర్ణింపచేసుకో. ఈ మననంవల్ల నీవు సంపూర్ణసన్న్యాసిని (స్వామి) వౌతావు. నీ ప్రయాణ విషయంలో చేసుకున్న వసతులను గురించి వ్రాయి. గాఢతర ప్రేమతో, హృదయపూర్వకమైన గణ్యతతో,

నీ ఆత్మ,
రామస్వామి.

6

శాస్తాస్ప్రింగ్సు,
క్యాలిఫోర్నియా,
అక్టోబరు 21, 1903.

మహోన్నత వహించిన దివ్యసూర్యానందా!

నిన్నటి నీ ఉత్తరం ఇప్పుడే నాకందింది.

ఓహో! భారతదేశానికి ప్రయాణం! ఎంతటి సంతోషవార్త! హాంకాంగులో వాస్సానుల్ అస్సానుల్‌ను (క్లాక్‌టవర్ దగ్గర) కలుసు

* మార్గంలో ఒక సందర్భంగా సూర్యానంద (వెల్మన్ సతి) తీవ్ర మానసికాందోళన పొందడం జరిగింది.

కోవలసింది. రామతీర్థస్వామి క్షేమస్థితినీ, నీ ఉన్నతాశయాన్నీ తెలిపితే ఆ హిందూవ్యాపారులు ఆనందపడతారు.

ఇదివరకే పరిచయ లేఖలు పంపాను. వారివల్ల కావలసిన సమాచారాలు నీకు విశదంగా తెలుస్తాయి. నీవు చెయ్యవలసింది ప్రయాణం కావడమే. తక్కినదంతా నెమ్మదిగా దానంతటదే జరుగుతుంది. ఒక్క విషయం మనస్సులో ఉంచుకో. నీవు ఏ తెగకు చెందిన ప్రజలను కలుసుకున్నా, వారి ఇతర సంఘాలమీద విమర్శలు నీవు చెవిని పెట్టనే వద్దు. పెట్టనేవద్దు. భక్తితత్వము, దివ్యప్రేమ, ఔదార్యశక్తి, ఆధ్యాత్మిక జ్ఞానం నీ కెక్కడైనాసరే కనపడితే, వానిని గ్రహించు. నీలో జీర్ణంచేసుకో. నీలో విలీనం చేసుకో. ఎవరి అసూయా భావమైనా సరే గ్రహించడానికి అవకాశం కలిగించుకోవాకు. వారి బలహీనతలను, పతనాలను నీవు పట్టించుకోవాకు.

కలకత్తాలో సీతారామశేట్‌ను మరిచిపోకుండా చూడు. నీవు కలకత్తాకు పోయిన తర్వాత సంస్కృతిగల "ది డాన్" సంపాదకుని కూడా నీవొకసారి చూడవలసింది. అతడు నిరహంకారి, నిర్మల హృదయుడు, స్వార్థత్యాగి, భక్తుడు, పూర్వాచార నిష్ఠుడైన వేదాంతి. విద్యావిషయకమైన భోజనాది వసతులు గల సంస్థకూడా ఒకటి ఆయన నడుపుతున్నాడు. ఇంకా కలకత్తాలో నీవు నామసంకీర్తన, భక్తిభావ నృత్యాదులు కూడా చూచి ఆనందించవచ్చు.

ఎన్నో సంవత్సరాలు ఎక్కడో ఉండి తిరిగి యింటికి వచ్చిన కన్నతల్లిలాగా, భారత జనని నిన్ను ఆదరిస్తుంది. ఇప్పటికి సెలవు. నిరంతరం రాముడు నీదగ్గరే ఉన్నాడు.

భరతవర్షమునకు పయన మోహోహో!
ఓహోహో! మనమింక నోర్వగాలేము!
ఓ ఆత్మ! మన మొక నావపై నెక్కి
దారులే లేని యనంత సంద్రముల
పయనించుదము లెమ్మ, పయనంబుగమ్మ!
అజ్ఞాతతీరంబులకు నిర్భయముగ

పరవశానంద తరంగ డోలికల
తేలిపోవుద మహో తేలిపోవుదము !
పూని కొట్టెడి గాలివానలలోన
ఏ బంధములు లేక హాయిగా మనము
పరమాత్మ సంకీర్తనల పాడుకొనుచు
మృదుమధురోంకార గానంబుతోడ
మనయాత్ర సాగింత మానందముగను.
భరతవర్షమునకు పయనమో హోహో !
ఈ సముద్రాలలో పయనించుచుండ
ఈ గిరిశృంగాల పై కెక్కుచుండ,
ఈ నిశీధంబులో గమియించుచుండ
భావముల్, స్థలకాల మృత్యుసంబంధ
మౌనభావంబులు, జలములవోలె
ప్రవహించి పోవుచున్నవి వడివడిగ !
నిజము, ఏ యమరలోకాలలో గాలి
నే పీల్చుచున్నానొ అదె నా స్థలంబు.
ఏ మహానందనోద్యానవాటికల......
చిగురాకు మర్మర ధ్వనుల

... ... ...

ఓ పరమేశ్వరా ! ఓ పరబ్రహ్మ !
నీలోన నన్ను స్నాన మొనరింపనిమ్ము.
నేను నా చిత్తము, ఓపరమాత్మ,
నీ సన్నిధికి చేరుచున్నాము త్వరగ.
భరతవర్షమునకు పయన మోహోహో !
సాగర గర్భముల్ తరియించినాము,
శిఖరాగ్రముల కెగబ్రాకినా మిపుడు
యాత్ర ముగిసిన దహో, యాత్రముగిసినది.
భగవంతు సన్నిధి చేరినా మింక
సిద్ధించె పరమాశయము నేటితోడ.
స్నేహంబు నిండగా ప్రేమ ఫలింప

అగ్రజు దర్శనంబైనది నేడు.
అగ్రసోదరుని ప్రేమాలింగనముల
తమ్ముడు లీనమై కరిగిపోయెడిని.
భరతవర్ష మనకు పయన మోహాహోహో!
ఇట్టి సుదీర్ఘ యానంబు చేయుటకు
నీ రెక్కలెంతయో గర్వింపలేద?
ఓ ఆత్మ! చేతువా ఈ మహాయాత్ర?
లోన వేదధ్వనుల్ విడబడలేద?
తడబాటులేకుండ సిద్ధమైనిలుము.
మీ చెంతకే యాత్ర ఓ తీర వితతి,
యుగయుగంబులనుండి పెరిగియున్నట్టి
ఓ భయంకరరహస్య సమస్యలార!
మీ చెంతకే యాత్ర! ప్రస్థానయాత్ర!
భరతవర్షమునకు పయనమోహాహోహో!
ఆకాశభూగర్భ గత రహస్యంబ!
ఓ సముద్రాపార జలరాసులార!
ఓ నదులారా! ఓ మహాగంగ!
ఓ అరణ్యములార! ఓ భూములార!
ఓ మహోన్నత హిమాలయగిరులార!
ఓ ప్రాతరారుణ ప్రాగ్దిశా కాంతి!
ఓ వర్షమా! మేఘసంఘంబులార!
ఓ హిమవర్షమా! మీరుండుకడకె –
ఓ దివారాత్రంబులార! మీకడకె.
ఓ సూర్యచంద్ర తారావళులార!
ఓ బుధా, ఓ మహాగ్రహరాసులార!
మీలోకి మార్గంబు మీలోకి దారి!
దారిండు, దారిండు, దారిండు త్వరగ
ఉడుకుచున్నది రక్తముప్పొంగి పొంగి,
పోపొమ్ము చిత్తమా! సత్వరమీవు.
పద! లంగరెత్తుము పడవకీక్షణమె!

పగ్గాల తెంపుము, తెరచాపఎత్తు!
పాతుకపోయిన వృక్షాలలీల
ఎన్నాళ్ళు మనమిట నిలచియున్నాము?
పదపద ముందుకు, నిర్భయలీల
ఆ యగాధ జలాలయందె పోవుదము.
ఇంతదా క్రేప్రాణి సాహసపడని
ఈ యాన మొనరింపవలయును, మనము.
నావపగిలిన, మనము పోయినను,
సర్వస్వమే పోయిననుగాని, మనము,
ఓ నాదు నిర్భయ చిత్తమా! తండ్రి!
ఓ తండ్రి! ఓ తండ్రి పోదాము పదర!
సాహసానందము భయములేదోయి!
ఓతండ్రి! పడవెక్కు పడవెక్కవోయి!
నీ నిజగృహముకు పయనింపవోయి!

7

ఓమ్.

చికాగో, ఇల్లినాయిస్,
ఫిబ్రవరి 15, 1904.

అతిధన్యాత్మా!

నీ అన్ని ఉత్తరాలూ, నీ టెలిగ్రామూ అన్నీ రామునికిచేరాయి. ఒకే పరమసత్యం ప్రకాశిస్తున్నది. ఎవరికి ఎవరు నమస్కరించడం? రాముడానందమయుడై యున్నాడు. రాముడు సంపూర్ణానంద స్వరూపుడై యున్నాడు. రాముడు నిత్యశాంతి స్వరూపుడైయున్నాడు. రామునిలోనుంచి కర్మ ప్రవహిస్తున్నది. రాముడు నైష్కర్మ్య సుగంధ మయమైన గులాబీపూవులాగా ఉండు. దాని అంతట అదే సుగంధం నీలోనుంచి నలుదిక్కులా వ్యాపిస్తుంది.

నీ హృదయపూర్వకంగా 'నేను హిందువును' అనే ఐక్యానుభూతి పొందావా? వారిలో ఐక్యమై, వారిదోషాలు, వారి మాధ్యభావాలు నీవిగానే చూచుకుంటున్నావా? వారిని నీస్వంత సోదరీసోదరులుగా విశ్వసించగలవా? తన నోళ గాఢస్వమత పక్షపాతంగల క్రైస్తవునిగా రాముడు తరచు చూచుకున్న విధంగా, నీవుకూడా నీ అమెరికా జన్మను మరిచిపోయి, ఆజన్మహిందువుగా మారిపోతావా? అలాగైతే మహాద్భుతకర్మ నీలోనుంచి దానంతటదే ప్రవహిస్తుంది.

నీ వెవరు? పతితులను రక్షించడానికి నీ వెవరవు? ముందు నిన్ను నీవు రక్షించుకున్నావా?

"తన జీవితాన్ని రక్షించుకో దలచినవ్యక్తి తన జీవితాన్ని పోగొట్టుకోవాలి" అనే విషయం నీకు తెలుసా? అయితే అలా నీవు కూడా జీవితాన్ని పోగొట్టుకున్నావా? (పరిత్యాగం చేశావా?)అయితేలే, రక్షకపదవిని స్వీకరించు! పాపాత్ముడే కానీ ఆతనితో అద్వైతానుభూతి (ఐక్యానుభూతి) పొందు; అతణ్ణి రక్షించగలవు. సమస్త విశ్వాన్ని జయించడానికి, ఈ ఏకైకపథం ప్రేమ పథమే!

ఓం! ఓం!!

నీ ఆత్మ
స్వామి రామతీర్థ.

8

ఓం!

మినాపలీస్, యు. యస్. ఏ.
ఏప్రియల్ 3, 1904

పరమధన్యాత్మా!

నీ నివాస మెక్కడ? క్రొత్త సంవత్సరాది లేఖ – మ్యూత్రా నుంచి వ్రాసిన దాని తర్వాత మళ్ళీ ప్రియజనని దగ్గరనుంచి ఉత్తరాలు లేవు. శాంతి, శాంతి, మహాశాంతి లోపలనుంచి ప్రవహిస్తున్నది, స్వర్గ

రాజ్యం లోపలనే ఉన్నది. గ్రంథాలలో, ఆలయాల్లో, పుణ్యక్షేత్రాలలో, ప్రవక్తలలో, ఋషులలో శాంతికోసరం వెదకడం వృథా వృథా. ఇప్పటికి నీ అనుభవంవల్ల ఈవిషయం నీకు తెలిసే ఉంటుంది. ఒకసారి మనకు పాఠం వచ్చిన తర్వాత, ఆగ్రంథాన్ని మనం ప్రియంగా కొనం. ఎంతవిలువ అయినా దానితో అవసరంలేదు. ఏకాంతంగా కూర్చో. నీ ప్రతి ఆవేదనా బ్రహ్మానందంలో నిమగ్నంచెయ్యి. "థండరింగ్ డాన్" లాంటి ఉత్తమగ్రంథాలనుంచి మంచి మంచి సలహాలు నీవు తీసుకోవచ్చు. ఓంకారధ్యానం చెయ్యి. మానవలోకానికి శాంతిదాతవుగా ఉండు. అంతేగాని శాంతికోసం వెదికే వ్యక్తిగా ఉండకు. కుమారీ! శాస్త్రాస్ప్రింగ్సు నదీశాఖ వొడ్డున రాముడు చెప్పిన ఆఖరు మాటలు గుర్తున్నవా? ఒక అన్వేషకుడుగా ఆ ప్రసంగం చేయలేదు. ఎడతెగకుండా, నిరంతరం జ్ఞానప్రేమల ప్రదానంచేసే నిత్యదాతగా ఆ ప్రసంగం చేశాడు. అన్వేషణాస్థితిలో ఉన్నప్పుడు, మన గుండెలు పగిలిపోతాయి. "అమెరికా దేశీయులకు విజ్ఞప్తి" అనే ఉపన్యాసంలోని విషయాలతో భారతదేశ పరిస్థితులు నీవు సమీక్షించి ఉంటావు. అవసరమైతే ఇంకొకసారి ఆ ఉపన్యాసం చదువు. నీ ప్రేమ ప్రేరిత కర్మకు, వెంటనే, అప్పుడప్పుడే ఫలితం కనబడాలని వేగిరపడకు. "సేవలోనే తృప్తివహించు" అని క్రీస్తు హృదయం చెపుతున్నది. సేవకంటే అధికమైన బహూకృతి, ఎక్కువలాభం మనం పొందలేము. లక్నోలో "అడ్వకేట్" ఎడిటరు బాబూ గంగాప్రసాదవర్మను నీవు కలువకపోతే, ఒకసారి కలువు. భారతదేశంలో నిరుపేద హిందూప్రజానీకపు కష్టాలు పంచుకోవడం నీ హృదయానికి ఎక్కువ సంతోషకరంగా ఉందా? లేకపోతే, అమెరికాలో సుఖజీవనం గడపడం ఎక్కువ సంతోషప్రదంగా ఉందా?

ఓమ్! ఓమ్! ఓమ్!

రాముడు, పోర్టులాండులో ఆరెగన్‌లో ఒకమాసం ఉన్నాడు. డెన్వర్‌లో ఒకమాసం చికాగోలో రెండువారలు మినోపలీస్‌లో రెండువారాలు ఉన్నాడు. ఈ ప్రదేశాలలో వేదాన్త సమాజాలు ఏర్పరుపబడినవి. వివిధ విశ్వవిద్యాలయాలలో పేదహిందూ విద్యార్థులకు ఉచిత విద్యావేతనాలు (Free Scholarships) ఇవ్వబడినవి.

ఇక్కడనుంచి రాముడు బఫేలో నగరానికి వెళ్లుతాడు. అక్కడనుంచి బోస్టను, న్యూయార్కు, ఫిలడెల్ఫియా, వాషింగుటన్ డి. సి. కి వెళ్ళుతాడు. జూన్ 29, 30, 31 తేదీలు రాముడు "సెయింట్ లూయిస్ వరల్డు యూనిటీలీగ్"లో జరిగే సభలకు పోవలసియున్నది. జులైలో రాముడు గెనేవాసరోవరం (Lake Geneva) దగ్గర ఉంటాడు. తర్వాత లండన్ వెళ్ళుతాడు. ప్రియజననీ! అధైర్యపడవద్దు. వస్తువులోని మంచినే వెతుకుమా. ముండ్లులేని గులాబీపుష్పంలేదు. కలితీలేని మంచి ఈ ప్రపంచంలో ఎక్కడా కనవడదు. పూర్ణస్వచ్ఛ వస్తువు, సంపూర్ణ సద్వస్తువు ఒక్కపరమాత్మే. భారతదేశప్రజలు అనుష్ఠానంలో వేదాంతమును (సత్యమును) కలిగిఉన్నట్లయితే, అమెరికాకు విజ్ఞప్తిచేసుకోవలసిన అవసరమేమున్నది ? నీ హృదయం సర్వాంతర్గత సౌందర్యజ్యోతితో విలీనమైనట్లయితే, నీ కెక్కడబట్టినా ఏ వస్తువులో చూచినా దివ్యత్వమేగోచరిస్తుంది. నిరంతరాత్మానంద! నిరంతర స్వస్వరూపానందం!

శాంతిః! శాంతిః!! శాంతిః!!!

నీ ఆత్మ,
స్వామిరామతీర్థ

9

ఓమ్!

విలియంసు బే, విస్, లేక
లేక్ గెనేవా,
జులై 8, 1904.

పరమధన్యమైన దివ్యాత్మా!

రామునికి నీ ఉత్తరాలు చేరినవి. అభివాదాలు. పరిస్థితులు అప్పుడప్పుడు రాముడికి తెలుస్తున్నవి. శాంతి, ఆనందం, విజయం, నిన్ను నిరంతరం వీడకుండుగాక! 'నాది' అనేస్వార్థభావాన్ని, వాంఛలను అవతలికి నెట్టివేసి నిస్సంగులైన పవిత్రాత్ములకు భయంలేదు,

అపాయంలేదు, ఎట్టి కష్టాలూ లేవు. నేను విశ్వైక్యం పొందుతాను. ఇంక స్వేచ్ఛగా, పరమ స్వేచ్ఛగా విశ్రాంతిలో మునిగి పోతాను. 'అహంకారమే హృదయంలో ఉన్న విషసర్పం. దాన్ని తరిమివెయ్యి. సమస్త ప్రపంచం నీకు స్వాగత మిస్తుంది. మినాపలీస్ నుంచి రాముడు తిరిగి వచ్చిన తరువాత "అనుభవజ్ఞానం" (Practical wisdom) లో ప్రకటించడానికి ఒక పెద్దసైపుచేసిన ఉత్తరం నీకు పంపబడింది. ఉత్తరం లోని విషయం "అనుభవజ్ఞానం" సెయింటులూయిస్ వద్ద వరల్డ్సు యూనిటీలీగ్ (ప్రపంచ ఐక్యతాసహకార సమాజం) ప్రథమసభకు రాముడు అధ్యక్షత వహించాడు. యూనిటీలీగ్‌లో యిచ్చిన ఉపన్యాసాలే కాక, థియసాఫికల్ సొసైటీలో, సెయింటులూయిస్ వద్ద చర్చి ఆఫ్ ప్రాక్టికల్ క్రిష్టియూనిటీలో, ఇంకా యితర ప్రదేశాలలో రాముడు కొన్ని ఉపన్యాసాలిచ్చాడు. కొద్దిరోజులలో రాముడు చికాగో వెళ్లు తాడు. అక్కడనుంచి బఫెలో, లిలీడేల్ గ్రీనా క్రీమెన్‌కు వెళ్లుతాడు. సెప్టెంబరులోనో, ఇంకాముందుగానో రాముడు అమెరికావదలుతాడు.

సర్వులకు శాంతి, దీవెనలు, ప్రేమ.

నీ ఆత్మ,
స్వామిరామ.

10

జాన్‌సన్ విల్లే, ఫ్లోరిడా,
అక్టోబరు 1, 1904.

మహాపూజ్యమైన ప్రియ బ్రహ్మాత్మమా!

కొంతకాలంనుంచి రాముడు నీకేమీ ఉత్తరాలు వ్రాయలేదు. ఎందుకంటే—

1. రాముడు నిరంతరం తీరికలేకుండా ఉన్నాడు.

2. పత్రికలకు ఏవో కొన్ని లేఖలుతప్ప, ఇండియాలో ఎవరికీ ఉత్తరాలు వ్రాయలేదు.

3. నీవు సత్కార్యక్రమ నిష్ఠలోనే ఉన్నావని తెలియడంచేత ఇంకా ఉత్తరాలు వ్రాయడం రాముడు అనవసరంగా తలచలేదు.

4. మినాపలీస్‌నుంచి వచ్చినదగ్గరనుంచీ, నీవు ఉత్తరాలు వ్రాయడంలేదు.

నిరంతరం నీకు దీవెనలు, ప్రేమ, ఆనందం.

నిజంగా నీ అంతర్వాణిని నీవు అనుసరించడంలో, ఎవరికీ నీవు చెడుకలిగించలేవు. మనం ఎవరినుంచీ ఏ ప్రతిఫలం ఆశించము. మన కృషి, ప్రేమమయకృషిగా ఉండాలి. నిరంతర స్వస్థత, ప్రేమ, మన కర్తవ్యం.

ప్రతివ్యక్తీ స్వేచ్ఛగా ఎవరి అనుభూతి వారు కలిగియుండవచ్చు. మనకున్న అధికారమేమిటంటే – వాండ్ల వాండ్ల పురోగమన పథంలో సహాయంచేసి మన సోదర ప్రజలకు సేవచేయడం మాత్రమే. ఆ గమనం నిజంగా ముందుకే అయిఉండాలె; అభివృద్ధికరమని నమ్మించడమే కాదు. నేను నామిత్రుల ఆధ్యాత్మిక క్షీణదశకు దోహదపడుతున్నానంటే నేను కూడా నాకు నేనే వాండ్లతోపాటు పడిపోతున్నానన్నమాట. నీవేపనిచేస్తున్నా, నీవెక్కడఉన్నా రామునిదీవెనలు, ప్రేమ నీకు తోడుగా ఉన్నవి. ఎల్లుండి రాముడు న్యూయార్కుకు బయలుదేరుతాడు. బహుశః తొంభైతొమ్మిదిపాళ్ళు, అక్టోబరు 8 వ తేదీ 'ప్రిన్సిస్ ఇరాన్' అనే నావమీద జిబ్రాల్టర్‌కు బయలుదేరుతాడు. ఇండియాకు చేరేసరికి బహుశా కొంతకాలం పట్టవచ్చు. ఎందుకంటే, దారిలో అది అనేకచోట్ల ఆగేలాగు తోస్తున్నది.

మనస్సులో ప్రతిష్ఠించుకోగలిగిన, ఆచరణలో పెట్టుకోదగిన ధర్మసూత్రాలు :–

నీ స్నేహితునిలో ఏదైనా దోషం కనపడుతుందనుకో, దాన్ని మరిచిపో.

ఆ వ్యక్తిలో ఏదైనా మంచి కనపడితే దాన్ని చెప్పు.

మానవులలోని దోషాలను ఎవడు ప్రేమమార్గంతో సవరిస్తాడో అతడు ప్రజల హృదయాలలో మహోన్నతస్థాన మలంకరిస్తాడు.

అట్టి ప్రేమ స్వరూపియొక్క ముఖవీక్షణమే, మహాశ్రీమంతమైన హోమవిద్యలాగా (రసవాదము) చెడును పవిత్రతగా మారుస్తుంది. సూర్యుని మాదిరి, నిర్భయత్వంతో, నిరంతర త్యాగగుణంతో ఫలితంకోసం ఆశించకుండా నిష్కామసేవ చేస్తూ, స్వేచ్ఛాప్రేమతో జ్ఞానశక్తులను ప్రసరింపజేస్తూ, బ్రహ్మతేజంలో వీలీనుడై జీవిస్తూ, సర్వవ్యక్తిత్వభావాలకు అతీతుడై స్వార్థత్యాగియై జీవించడమే విముక్తి, మోక్షం.

"నే త్రాగుచుందును స్వర్గామృతంబు,
నే తినుచుందును స్వర్గాన్న మెపుడు.
నాకు లో వెలులందు పరమాత్మగలడు.
సర్వమంగళములు నిరతంబు నావె."

నీ ఆత్మ,
స్వామీ రామ.

ఆనందం! ఆనందం!! ఆనందం!!!

ఓం! ఓం! ఓం!

11

బొంబాయి.

పరమపూజ్యమైన ప్రియమాతా!

రాముడు అయిదురోజులు బొంబాయిలో ఉన్నాడు. త్వరలో మధ్రాకు రాగలడు. ఉపన్యాసాలు, సభలు, దారిపొడుగున ఎక్కడబట్టినా జరగడంచేత రామునకు తీరిక చిక్కలేదు. ఇంతవరకూ నీవు భారతదేశంలోనే ఉన్నావని తెలిసికొన్నందుకు రామునికి చాలా సంతోషమైనది. పూర్ణారోగ్యంతో, ఉత్సాహశక్తులతో, ప్రశాంత

హృదయంతో, ఆనంద చిత్తంతో, నీవున్నావని ఆశిస్తున్నాను. నిన్ను మూర్తాలో చూస్తాను.

నీ ఆత్మ,
స్వామీ రామతీర్థ.

12

పుష్కరం,
ఫిబ్రవరి 14, 1905.

పరమధన్యాత్ములైన ఓ ప్రియమైన దివ్యజననీ!

బొంబే యూనివర్సిటీ గ్రాడ్యుయేటు ఒక మంచి యువకుడు ఈ దినం రామకార్యానికి తన జీవితాన్ని అంకితంచేశాడు. సారస్వత కార్యంలో సహాయంగా అతడు రామునితో ఉంటాడు. భగవంతుడు ఎంత దయామయుడు. తనపై విశ్వాస సంపన్నుడై పనిచేసే వ్యక్తిని పరమాత్మ ఎన్నడూ విడువడు.

దేశంలో నలుమూలల ఉపన్యసించడానికి నారాయణస్వామి త్వరలో వెళ్ళుతాడు.

బహిరంగ స్థానాలలో చేసే పని ఎంత గొప్పదో, మారుమూలల్లో చేసే పనికూడా అంత గొప్పదే. బండికి ఎద్దులు ఎంత అవసరమైనవో ఒకచిన్న సీలకూడా అంత అవసరమే. ప్రతిచిన్న ఆకుకూడా ఆ చక్రానికి ఎంతో ప్రాముఖ్యమే. చిన్నవిగా కనపడే ఆవస్తువులను శిశువులు ఉపయోగించకపోతే నేమి? భగవంతుని దృష్టిలో ఆపని ఎంత చిన్నదైనా—ప్రేమతత్వంతో చేసినదైతే చాలు, గొప్పదే. ప్రజ్వల సూర్య బింబం ముందు, చిన్నమంచు బిందువు లేనిదానిలో లెక్క. కానీ చూడగల కండ్లకు, — దాని చిన్న మధుర హృదయంలో, ఆ ఉజ్వల సూర్యమండలమంతా ప్రతిబింబించడం కనబడుతుంది. కనుక ఓ ప్రియజననీ! పనికిరావని తృణీకరించబడిన ప్రదేశాలలో, పేరు కీర్తులు మరచి, నిరాడంబరంగా, నెమ్మదిగా చేసే మానకర్మ—ప్రజలందరినీ ఆక

క్షించే బహిరంగ ప్రదేశాలలో చేసే సంరంభ కర్మ అంత గొప్పదే. నేను చేస్తున్న ఈకొద్ది కృషి నాకు తృప్తికరంగా లేదు. కానీ ఈకృషి అయినా, ఈదృక్పథంలో శ్రమించేవారికి, దీన్నే ఆకాంక్షించే వారికి తోడ్పడకపోదు. శైశవంలో పిల్లవాణ్ణి తల్లి పెంచుతుంది. పిల్లవాడు పెద్దవాడైన తర్వాత విశ్వవిద్యాలయానికి వస్తాడు. పెద్దవాడైన ఆ బాలుడికి, ఆ విశ్వవిద్యాలయాధ్యాపకుడు విద్యాశిక్షణ ఇస్తాడు. ఈ దశలో తల్లి చేసిన కష్టంకంటే, ఎక్కువగా అధ్యాపకుల కృషికే ప్రాముఖ్యం కనపడుతుంది. అయినా బిడ్డపెంపకంలో, తల్లి చేసిన శ్రమ ఎంతో మధురమైంది. దీనిని ఏ అధ్యాపకుని కృషీ, యదార్థంగా అధిగమించ లేదు. ఉయ్యాల ఊపి, ఒళ్లోలాలించి, జోలపాటలుపాడి, చేసిన తల్లి శ్రమ, కళాశాల గదుల్లోని ఉపన్యాసాలకంటే విలువగలదే.

సామాన్యమైనకూలీ అయినాసరే, తనవినమ్రు కర్మను, తన పరిశ్రమను, క్రీస్తూ, కృష్ణుల కర్మలతో సమానమైన ప్రాముఖ్యకర్మగా–పవిత్ర కర్మగా–చూడమని వేదాంతం కోరుతున్నది, మన మొక కుర్చీ కాలు కదిలిస్తే, మొత్తంకుర్చీని కదిలించడంలేదా ? అదేమాదిరి, మనం ఒక్క హృదయాన్ని ఉద్ధరిస్తే, ప్రపంచమంతా అతనిద్వారా ఉద్ధరించినట్లే. మానవుని ఐక్యసంబంధం అంత దృఢమైంది.

వారికై వారె దీక్షాబద్ధులగుచు,
తా మొనరించెడి పరమాత్మకర్మ
ఎట్టిదైననుసరే లక్ష్యించకుండ
తమతమకర్మల తమశక్తులెల్ల
ధారపోతురు మహాత్ములు నిరంతరము
వీరిదే మహనీయ జీవితమనిన !
ఓహోహో ! ఆకాశవాణి ! స్వచ్ఛముగ
నీ ధ్వని వినిపించు పూర్వమందుండి
నీ ధ్వనివంటిదే నాహృదయమున–
వినిపించుచున్నది వీనులకిపుడు.

స్వస్వరూపానుసంధానం చెయ్యి. తనను తాను తెలిసికొన్న మానవుడు, దుఃఖ విముక్తి పొందుతాడని తెలుసుకో.

ఓం!

ఆనందం! ఆనందం! శాంతి! దీవనలు! ప్రేమ!

—రామ.

13

పుష్కరము,
(అజ్మీరుజిల్లా)
ఫిబ్రవరి 22, 1905.

ఓం! శాంతి! దీవెనలు! ప్రేమ! ఆనందం! పరమధన్యమైన దివ్యజననీ!

నీ మధురమైన స్వర్గానందమయమైన లేఖ అందింది. పవిత్ర సూర్యానంద, అట్లు శారీరకనిగ్రహశక్తిని- నిజంగా అద్భుతమైన భగవదైక్యముచేతనే, ప్రేమైక్యసిద్ధిచేతనే ప్రకటించడం జరిగింది.*

ఓం! ఆనందం! జయం! జయం! నీవు పంపిన పద్యం చాలా బాగున్నది.

తన దివ్యమహిమల చూపించుకొరకు
పరమాత్మ విచిత్ర పథమందొ నడచు!
గంభీరమైపొంగు సాగరమందు
తన పాదముద్రల నంటించునతడు.
పెనుతుఫానులపైన స్వారీయొనర్చు.
అతిఅగాధములైన గనులందతండు
అప్రతిహతమైన సామర్థ్యమొప్ప,

* సూర్యానంద (వెల్మన్ పతి) రోగగ్రస్తురాలై, దైవశక్తిచేత- ప్రేమశక్తిచేత- స్వస్థతపొందింది.

దీపించు తన భావమణులనుదాచి,
పాలించునతడు నిజేచ్ఛాను సరణి
ఓ భయమొందెడి భక్తాళులార!
సమకూర్చుకొనుడు ధైర్యంబు మీ యెదల.
భయదమై కనుపించు ఆ మేఘసమితి
లోన బృహత్కృప లవి; ఆ రీతి
కనుపించునేకాని క్షణమునవచ్చి
మీశిరస్సులపైన కృపను వర్షించు.
కనుపించు ఈ చండ పాలన వెనుక
పరమాత్మ తన కృపాసందీప్తమైన
చిరునవ్వు లొలికెడి ముఖసరోజమును
దాచి యున్నాడహో భీతిలవలదు.
మొగ్గను రుచిచూడ కటికిచేదైన
వికసిత పుష్పంబు, అతిమధురంబు!

జ్యోతి స్వరూపబాబు నిజంగా అతిధన్యాత్ముడు; మంచి తనము యొక్క అవతారమతడు. ఎంతో దయార్ద్రహృదయుడు.

నీ ఆత్మ,
స్వామీ రామతీర్థ.

14

పుష్కరం,
అజ్మీరుజిల్లా.

ఓం! ఆనందం! ఆనందం! ఓం! శాంతి!

ఓ దివ్యజననీ!

రాముడు, నాడు మనమిద్దరమూ కూర్చున్న పైకప్పుమీాద కూర్చొని ఉన్నాడు.

రాముడు బ్రహ్మానంద తన్మయుడై యున్నాడు. నీ ఉత్తరాలు, ఇంకా కొన్ని ఉత్తరాలు తెచ్చి చేతికిచ్చేంతవరకు, స్మృతి విహీనుడైన

రామునికి తెలేనే తెలేదు. నీవు పంపిన కవరు చింపకముందే, హృత్పూర్వకమైన, సంతోషాతిశయ జనితమైన ఒక దీర్ఘహాసం, ఒక పెద్దనవ్వు నీకు పంపాడు. ఓం! శాంతి! శాంతి! ప్రియజననీ! నీమధుర లేఖ చదివిన తర్వాత, రాముడు ఇంకో నవ్వుల మాల పంపుతున్నాడు.

తల్లీ ! అన్ని విధాల నీ కృషి బాగా ఉన్నది. రాముడు నీ మృదుమధురమైన స్వచ్ఛమైన ప్రవృత్తిని సమగ్రంగా అర్థం చేసుకున్నాడు. భగవత్ప్రేరణానుసారం రాముడు గద్యపద్యాలలో వివిధ విషయాలను రచిస్తున్నాడు.

బాబూ గంగా ప్రసాదవర్మ భారత దేశంలోని ఇతర రాష్ట్రాలకు పర్యటనానికి వెళ్ళుతున్నాడు. ఈ పర్యటనంలో ఆయన దేశంలోని అనేక బాలికా పాఠశాలల దర్శించి స్త్రీ విద్యాపద్ధతులు గమనించి, లక్నోలో యితరచోట్లా, స్త్రీ విద్యాభివృద్ధికి కొన్ని సంస్కారణాలు ప్రవేశపెడతాడు. రాష్ట్రప్రభుత్వం, ఆయన నీ కార్యంలో నియోగించింది. అందుచేత ఆయన రాముని మార్చి నెల ముందుగా వచ్చి కలుసుకోలేడు. బహుశా రాముడు వేసవిలో, మైదానాలలో ఉండడు. రాముడు కాశ్మీరును ఎంతో ప్రేమిస్తాడు. ప్రియమైన మీ అందరి సమక్షంలోకి వస్తాడు. రాయ్ భవానీదాసునూ, ఇతర స్నేహితులనూ కలుసుకొని ఆనందిస్తారు. రాముని సాంగత్యం, అతని ప్రసంగాదులు, అనేకమంది ముముక్షువులకు ఎంతో సహాయ పడతాయి. దివ్యాజననీ! హృదయమనో దేహాలు, సర్వస్వం, సత్యపీఠంమీద, మానవసేవా పీఠం మీద నిరంతరం దగ్ధంకావాలె. ఇదే మానవుడు ఆనందింపదగిన మహోన్నతాధికారం. ఈమార్గాన్నే, పరమాత్మ, నిష్పాక్షికమైన విశుద్ధమైన, సూక్ష్మమైన, నిశ్చలమైన అంతర్వాణీరూపంలో ప్రబోధిస్తున్నాడు.

"విశ్వమందిర కుద్యమముల బాగుచేయ
విధ్యుక్త ధర్మము పిలుచుచున్నపుడు
వెనుకంజ వేయువాడెంత హీనుండు !

అమ్మా! భగవదంకితమైన జీవితం, ఏదో వ్యాఖ్యానింప వీలు పడని నిగూఢమైనదైవేచ్ఛ చేత నడుపబడుతుంటుంది.

రాముడు నీతోపాటు కాశ్మీరుకు రావచ్చు. కానీ యిక్కడ నుంచి బయలుదేరేటంతవరకు స్పష్టంగా చెప్పడానికి వీలులేదు.

నీ ఆత్మ,
రామతీర్థ.

15

జయపూర్,
మార్చి 9, 1905.

పరమధన్యమైన ప్రియదివ్యత్వమా!

పుష్కరతీరం విడచి రాముడు రానున్నాడని నీవు చెప్పినట్లే జరిగింది. ఏ మార్గంగా రాముడు వెళ్లుతాడో చెప్పలేము. అది భగవదిచ్ఛ. కాలమే నిర్ణయిస్తుంది అజ్మీరుటవున్ హాల్లో రెండు ఉపన్యాసాలు జరిగాయి. జయపూర్‌లోకూడా ఉపన్యాసాలు ఏర్పాటుచేస్తారు. పురాన్‌కూడా పుష్కరణికి వచ్చిన రాముడితోకూడా రెండు మూడు రోజులు పర్వతాలలో ఉన్నాడు. దిల్‌జంగ్‌సింగ్ ఎంత మధురమూర్తి! ప్రజలు గుంపులు గుంపులుగా రాముని చూడడానికి వస్తున్నారు. ఇంత జనసమర్దాన్ని తప్పించుకోవాలె. భగవంతుడూ, నేనే, కలిసిఉంటాము!

ఈ పగలల్లా మేము కలిసి తిరుగుతాము. నిశీథాలలో తనవినందని ప్రేమలో కలిసి నిద్రిస్తాము. ప్రాతఃకాలసందే లేచి మా అడుగులు ఎక్కడికి తీసుకవెళ్ళితే అక్కడికి వెళ్ళుతాము. అవి ఏకాంత ప్రదేశాలకే తీసుకపోనీ, లేక జనసమూహాల్లోకే దారితీయనీ, మేము మా ప్రయాణాన్ని ముగిద్దామని అనుకోం. ఎక్కడ ముగుస్తుందోకూడా మేము ఊహించం. మామూలుగా ఈ ప్రయాణాంతం, అందరికీ ఇతఃపూర్వమే నిర్దేశింపబడిఉంటుంది కదూ?

ఓం! ఓం!! ఓం!!!

త్వరలో రాముడు, ఉత్తరాలకు అందుబాటులోలేని—అరణ్యాలలో, పర్వత శృంగాలపైన, భగవంతునిలో నీలో—ఉంటాడు. రాముని

దగ్గరనుంచి, మళ్ళీ లేఖ ఎప్పుడు పంపబడుతుందో తెలియదు.

నీ ఆత్మ,
రాముడు.

శాంతి ! దీవెనలు, ప్రేమ, నిన్ను నిరంతరం అనుసరించు గాక !

16

ఓం !

హరిద్వారం,
బుధవారం, సాయంత్రం.

మహాధన్య ! ప్రియమాతా !

నీవు చెప్పిన భవిష్యత్తు నిజమైంది. రాముడు, డేరాకు తన దివ్యమాతృ సన్నిధికి వస్తున్నాడు. కానీ ప్రజలు అత్యంతప్రేమాతిశయాలచేత, మార్గంలో చాలాచోట్ల ఆపారు. ఆల్వార్, మురాదాబాద్, ఆజ్మీర్, జయపూర్ మొదలైన ప్రదేశాలలో ఉపన్యాసాలు జరిగినవి. రాముడు బాబూజ్యోతి స్వరూప మొదలైన ప్రియమిత్ర సంఘంతో వీడ్కోలు తీసుకొని హరిద్వారంలో ఆగాడు. రాముడుండే ప్రదేశాన్ని తెలుసుకోను ప్రజలిక్కడికి వచ్చారు. ఇంకా ఉండవలసినదిగా ప్రజలు రాముని అత్యంతప్రేమతో అర్థించారు. రాముని ప్రబోధాలను గ్రహించి ఆచరించాలని అఖండమైన ఆశతో కాచుకొనియున్న యువక సాధువులకు ఇతర ప్రజానీకానికి సహాయం చేయడానికి తగిన అవకాశాన్ని విడువడం మంచిది కాదని రాముని అభిప్రాయం. జననీ! మనం మధురలో కలుసుకున్నప్పుడు, ఈ సాధు ప్రజానీకంలో కర్మనే నీవు నన్ను అడిగింది. రాముని ప్రబోధాలు అత్యంతప్రేమతో స్వీకరిస్తున్నారు సన్న్యాస సహోదరులు.

రాముడివ్వాళ్ళ గంగకు అవతలితీరాన ఉన్న చండీ దేవాలయానికి వెళ్ళాడు. అతిసుందరమైన ఒక చిన్నకొండమీదఉంది దేవాలయం. నదికి ఆవైపునఉన్న అరణ్యాం చాలా దట్టమైంది. అతి మనోహరదృశ్యం! చాలా కాలువలుగా చీలుతూ, మళ్ళీ వెనక్కు

మళ్ళుతున్న గంగాదృశ్యం, అత్యంత నేత్ర పర్వంగా ఉన్నది. చండీ దేవాలయంనుంచి హిమాలయ శిఖరాలు, సువర్ణకాంతులతో వజ్ర దీధితులతో గోచరిస్తవి.

ధన్యాత్మురాలా!

నిందగానీ స్తుతిగానీ,
మిత్రులుగానీ శత్రులుగానీ
రాగముగానీ అసూయగానీ,
శరీరంగానీ, దాని బాంధవ్యాలుగానీ,
ఇల్లుగానీ, పరాయిస్థలంగానీ,—
లేదు !

ఈ ప్రపంచ సంబంధమైన దేదీ ప్రాముఖ్యంగాదు. భగవంతుడు ఒక్కడే ఉన్నాడు! భగవంతుడే సత్యం. పరమాత్మమాత్రమే ఏకైక సత్యం.

సర్వం పోనీ, భగవంతుడు మాత్రమే—భగవంతుడు మాత్రమే-సర్వస్వమై యున్నాడు. అమృతశాంతి వర్ష బిందువులుగా రాలుతున్నది. అమృతం, వర్ష బిందువులుగా వర్షిస్తున్నది. రాముని మనస్సు ఆనందభరితమైయున్నది. ఆనందం రామునిలోనుంచి వెల్లువలై ప్రవహిస్తున్నది.

రాముడు నిత్యానందస్వరూపుడై యున్నాడు. ప్రియజననీ! నీవూ నిత్యానంద స్వరూపిణివై యున్నావు.

శాంతి దీవనలు !

ప్రేమ! ఆనందం! ఆనందం! ఓం! ఓం!

మీ విద్యార్థులకు, మీ ఆతిథేయులైన బాబూ జ్యోతిస్వరూపునకు, అతని సతీమణికి ప్రేమ, దీవనలు, ఆనందం!

నీ ఆత్మ,
రాముడు.

17

జులై 5, 1905

పరమధన్యమైన ప్రియాత్మా,

దీనికి ముందు దాదాపు ఒక వారంక్రితం నీ మసోరీ చిరునామాకు వ్రాసిన రాముని లేఖ అంది ఉండవచ్చు. ఈ వేసంగికి రాముడు కాశ్మీరం వెళ్ళడు. అందుచేత నీవు సావధానంగా, కైలాసం, మానస సరోవరం, ఇంకా ఇతర ప్రదేశాలు చూడవచ్చు. రమణీయమైన పర్వతారణ్యా సీమలలో, నిజంగా నీవు నీ ధన్యమైన అమెరికాలో మొదటి రోజులలో ఉన్నట్లు ఆనందిస్తావు.

వెల్మన్ సతికి వ్రాసిన లేఖలు.

రాము డున్నాడు బ్రహ్మానందుడగుచు!
జీవనసాగరాభంగవీచికల!
కర్మ స్వరూప ఝంఝానిలంబులను!
అలుపెరుంగక నృత్యమొనరింతు నేను!
పుట్టింటినుండి శ్మశానంబువరకు!
ఒక అనంతంబైన సాలీడుగూడు!
ఒక మహాజీవన తరళార్ణవమును!
వింతవింతగ నేను విరచించుచుందు!
శబ్దించు కాలపు మగ్గంబుపైన
దివ్యజీవన రమ్యపీతాంబరమును!
నేయుచు అటునిటు విహరింతునేను!

ఓం!

నీ ఆత్మ,
రాముడు.

18

ఓమ్ !

ఆగస్టు 10, 1905

దీవెనలు ! ఆనందం !

శాంతి ! శాంతి !

పరమధన్య ! ప్రియమాతా !

కొద్ది రోజులక్రితం నీ ఉత్తరం అందింది. అయితే రాముడు, ఇంతవరకు ఏ ఉత్తరాలకూ ప్రత్యుత్తర మియ్యలేదు. రాముడు ప్రజల కోసం మాతృభాషలో వ్రాస్తున్న మహోపయోగకరమైన మూడు గ్రంథాలూ, యిహ్వాళ్ళ పూర్తి అయినవి. నీ ఆరోగ్యం ఎలా ఉంది ప్పుడు ? నీకు పరిపూర్ణారోగ్యాన్నీ, బలమునూ, రాముడు వాంఛిస్తు న్నాడు.

ఓం! ఓం! ఓం!

నీవు అమెరికాకు పోవడానికి ఏర్పాటు చేయడం ఏమంత కష్ట మైన పనికాదు. కానీ మేము నీ సహవాసాన్ని కోరుతున్నాము. బహుశః ఇది స్వార్థంకావచ్చు. కానీ, ఇక్కడ ప్రజలను నీవుకూడా ప్రేమిస్తున్నావుకదా.ఇండియాలో వాతావరణం పడకనే జబ్బువచ్చింది, అందుచేత అమెరికాకు పోతే నయమవుతుందని నమ్మకముందా నిజంగా నీకు ? అలా అయితే మేమెవ్వరం నీ కాటంకం చెయ్యము. క్షేమంగా నిన్ను క్యాలిఫోర్నియా చేర్చడానికి మేమంతా సహాయం చేస్తాము.

శాంతి ! హృదయపూర్వకమైన దీవెనలు ! ప్రేమ !

ఈ లేఖ నీకు మంచి ఆరోగ్యపరిస్థితిలో అందగలదని ఆశిస్తు న్నాము.

ఓం !

—రాముడు

19

ఓం! ఓం! ఓం!

శాంతి! దీవెనలు! ప్రేమ! ఆనందం! ఆనందం!

డార్జిలింగు

పరమధన్యమైన దివ్యత్వమా!

మసోరీకి 1000 మైళ్ళ దూరంలోవున్న కొండలమీద రాముడు నివసిస్తున్న సంగతి నీకు బహుశా తెలిసే ఉందనుకుంటాను.

బెంగాలు, అరణ్యప్రభుత్వశాఖకు చెందిన ఒకప్రాచీన భవనంలో రాముడున్నాడు. పోస్టాఫీసుకు రైల్వేస్టేషనుకు దూరంగా ఉందీప్రదేశం. వచ్చే, పోయే జనసమ్మర్దానికి చాలాదూరమై విజనమైన ఏకాంతప్రదేశ మిది. చుట్టూ అత్యద్భుత ప్రపంచ దృశ్యాలలో ఒకటిగా పరిగణింప దగిన మహారణ్యమున్నది. దగ్గరలోనే మనోహరములైన నీటిబుగ్గలు, సెలయేళ్ళు ప్రవహిస్తున్నాయి. మంచులేకుండా వాతావరణం ప్రశాంతంగా ఉన్నప్పుడు, ప్రపంచంలోకల్లా మహోన్నత శిఖరమైన కైలాస పర్వతశృంగం కనపడుతూ ఉంటుంది. ఇక్కడకూడా అడవిలోని పర్వత వాసులు మంచిపాలు తెచ్చి యిస్తుంటారు. అరణ్య సంచారంతో ఉద్గ్రంథపఠనంతో రాముని కాలం గడిచిపోతుంది.

"అరణ్యాలలో మానవుడు భగవదైక్య మొందవచ్చు." అలాంటప్పుడు ఈ పేరుకీర్తులు ఈ వాంఛావాసనలు ఈ భాగ్యభోగ్యాలు, ఈ ఆశాపరంపరలు ఇవన్నీ దేనికి? ఎందుకు మన మీ కర్మదాహజ్వరాన్ని పట్టుకొని వేదన పడడం?

మనం దివ్యత్వంలో విలీనులమవుతాంగాక. ఉషః కాలంలో చల్లని పిల్లవాయువు వీస్తుంది. కానీ అది ఏ ఏ రకాల పూవులు, ఎన్ని ఎన్ని పూలు వికసించాయో అని తహతహ పడదు. అది ప్రతిదానిపైన వీచుకుంటూపోతుంది. వికసించడానికి సిద్ధంగాఉన్నపూలు, మొగ్గలు విప్పి వికసిస్తాయి. సింహాల గుహాలూ, కారుచిచ్చులూ, చీకటికోనలూ, భూకంపాలూ, పడిపోతున్న కొండశిఖరాలూ, తుఫానులు, యుద్ధ

రంగాలూ, బావురుమంటున్న శ్మశానవాటికలూ – ఇవన్నీ మనలోని దైవచైతన్యమును ప్రబుద్ధంచేస్తున్నప్పుడు మర్యాదలూ మన్ననలూ, కీర్తిప్రతిష్ఠలూ, సింహాసనాలూ, భోగభాగ్యవిలాసాలు, వీటన్నిటికంటే మధురతరములుకావా ? ఎందుకంటే వీటికి మానవుని అంతర్ముఖునిచేసే, ఆత్మానుసంధానం కలిగించే శక్తి లేదు. ఓహో! నైష్కర్మ్యానందం! ఆ దివ్యతేజం, అడుగడుగునా గమ్యస్థానం చేరుస్తున్నది. ప్రతిరాత్రీ దైహికమృతి! ప్రతి పగలూ నవజీవనోదయం.

సెలవిదే సఖులార, విడిపోవుచుంటి
ఇరుకైన దీ జగత్స్నేహంబు నిలువ.
నేను నాప్రేమ ఏకాంతంబు నందు
క్రీడింపగావలె నోహోహో యిపుడు !
ఉభయుల మానందమున తేలుచుంటి –
మదియేమి ఉభయుల మనుమాట లేదు !
ఒక అకాండమహార్ణవం బేచు పొరలి
పొంగుచున్నది అభేదానందమహహా !

ఓం! ఆనందం! ఆనందం!

నీ ఆత్మ,
రాముడు.

20

ఈ క్రిందిలేఖ, శ్రీ సూర్యానందకు (శ్రీ వెల్మన్ సతికి,) శ్రీరామతీర్థస్వామివారు వ్రాసిన కడపటి లేఖ.

ఓంశాంతి ! ఓంశాంతి । ఓవత్స! లెమ్ము!
ఉదయారుణప్రకాశార్ణవమందు
నీ యెడందను గ్రుంకులిడనిమ్ము! లెమ్ము!
"మేఘముల్ గ్రమ్మిన చీకటులందు,
మేఘముల్ గ్రమ్మని వెలుగులయందు,
ధాత్రి, సూర్యైకలక్ష్యంబును విడక

సూర్యప్రదక్షిణ సలుపుచందమున
పృథ్వీసుతా ! నీవు పరమగమ్యమును –
పరమాత్మ – మరువక, పయనింపు మెపుడు."

"హిమకణమందున ఇనుతేజమట్లు,
సాగరమందు నక్షత్రంబులట్లు,
ఈ విశ్వమెల్ల నాప్రతిబింబ మహాహా !
అఖిలదృశ్యాదృశ్యవస్తువులెల్ల;
నా స్వయంరచనలే ! నావిలాసములె !
తర్కవితర్కముల్ తప్పిపోవచ్చు;
మతములన్నియు నసృతములు గావచ్చు;
కుంటిచిత్తమె కోరుకొను తర్కబలము.
శుద్ధమానవహృదయమో – ప్రత్యక్షముగను
వాయునిశ్వాసలో పరమేశు గాంచు.
పృథ్విలో గాంచు సత్యస్పందనంబు
మానవహృదయాంతరాళంబునందు
ప్రకృతియు పరమాత్మ ఏకమై వెలుగ –
అర్థింపవలసిన యవసరమేమి ?
సకలభూతంబులు సంసిద్ధపడును
నాయవసరముల దీర్చుటకొరకు.
ప్రేమకృతజ్ఞతానందంబు లొప్ప
నిర్భయవిశ్వాసములు వెలుగొంద,
నే జీవితమున ప్రవేశించుచుందు.
ద్వేషాది దుర్వికారంబులనెల్ల
నా హృదినుండి ప్రక్షాళనజేతు,
నా నిత్యజీవనకర్మను నేను
ఈశ్వరప్రార్థనాగీతంబు జేతు.
నా ఆత్మగా లోకమెల్ల ప్రేమింతు.
నాదుప్రార్థనము బ్రహ్మానందమొకటె !
నిఖిలచైతన్యము నేనయియుండ

నిఖిలశక్తులుమరి నేనయియుండ
పరమాత్మ నేనును ఒకటయియుండ –
పరసహాయముల నే గోరగా నేల ?
ఓమ్ !

నీ ఆత్మ
రాముడు.

ఓం

# చంపకు వ్రాసిన లేఖలు

'పాలైన్ వైట్ మాన్' సతికి ఆమె తల్లి చంపకు, ఆమె చెల్లెలికి వ్రాసిన లేఖలు*—

## 1

శాస్తాస్ప్రింగ్సు,
జులై 22, 1903.

ప్రియమైన చంపా !

ఇలా నిన్ను పిలవడం బహుశా నీ కిష్టంలేదనుకుంటాను. నీ కిష్టమున్నా లేక పోయినా నిన్నిలా పిలువాలని రాముని ఉద్దేశ్యం. హిందూస్థాన వాఙ్మయంలో ప్రతి పేరుకు ఒక ఉత్తమార్థం ఉంటుంది. చంపా అంటే (ఈ పేరు సామాన్యంగా మంచి ఉత్తమ కుటుంబాలలో కన్యలకు పెడతారు) మధుర సువాసనగల దివ్యసుగంధంగల ఒక వికసిత పుష్పమని అర్థం.

ఈ ఉత్తరం వ్రాయడానికి కలం కాగితంమీద పెట్టాను. అప్రయత్నంగా సహజంగా ఈపేరు రామునికి తోచింది. చంపా అని (Champa) వ్రాయవచ్చు లేక (Chumpa) అని వ్రాయవచ్చు.

---

ఈ "పాలైన్ వైట్ మాన్ సతి"కి శ్రీరామతీర్థ స్వామి వారు 'కమలానంద' అనే సన్న్యాసనామం ప్రసాదించారు. ఈమె తల్లిని 'చంప' అని పిలిచేవారు.

నిన్న ఒక దీర్ఘలేఖ కమలకు (పాఁలైన్) వ్రాయబడింది. నీప్రశ్నలకు ప్రత్యుత్తరాలన్నీ దానిలో ఉన్నాయి. ఆమె దగ్గరనుంచి నీవా ఉత్తరం తీసుకున్నావా? ఈ మధ్య రాముడు వ్రాసిన పద్యాలుకూడా దానిలో ఉన్నాయి.

## వే దాం త ప్ర బో ధా లు

1. వైదాంతిక మతాన్ని ఒక్క ఆదేశంలో ఇమిడ్చవచ్చు—

నీ మనస్సును నీవు పరిపూర్ణ ఆనందస్థితిలో, శాంతిస్థితిలో, సమస్థితిలో నిరంతరం ఉంచుకో. వ్యాధిరానీ, మరణంరానీ, ఏబాధలన్నా రానీ—ఏమిజరిగినాసరే లెక్కచేయవాకు.

నీ బ్రహ్మత్వంమీద ఆధారపడి నిరంతరం ప్రసన్నతవహించు, శాంతివహించు. నిరంతరం నీ బ్రహ్మత్వమునందు విశ్వాసం వదలకు.

2. నీ సత్యాత్మ ప్రతిభను ప్రతిష్ఠించుకో. ఈప్రపంచం—తద్విషయాలు, దాని బాంధవ్యాలన్నీ అదృశ్యమైపోతాయి.

పరిశోధించు, చూడు, కనిపెట్టుఏమైనాచెయ్యి, కానీ ఏమిచేసినా, నీ సత్యాత్మ తేజంలో చెయ్యి. అంటే నీ ఆత్మ సర్వాతీతమైనదనీ, సర్వవాంఛాతీతమైనదనీ మరచిపోకుండా ఉండమని అర్థం.

నిజంగా నీకే కోరికా అవసరంలేదు. దేన్నైనా నీవు వాంఛించడం దేనికి? నేను విశ్వనాథుడను అనే భావంతో — నీ బ్రహ్మత్వప్రతిభతో — విలాసార్థం, వినోదార్థం, నీపని చెయ్యి. కోరికనేది ఎప్పుడూ పెట్టుకోవద్దు — వద్దు — వద్దు.

3. ఈ వేదాంతసూత్రాలను నీ వాచరణలో వినియోగించు. నీలోనుంచి సత్యసుగంధం దానంతట అదే దశదిశావ్యాప్తమవుతుంది.

నిద్రపోవడానికిముందు, కండ్లుమూసుకోనేముందుగా—ప్రతిరాత్రి లేక మధ్యాహ్నం “నిద్రలేచేసరికి నేను వేదాంతిక సత్యస్వరూపుడను కావాలి” అని తీవ్రంగా సంకల్పించు!

నిద్రలేచిన అనంతరం, ఏదైనా పనిచేయబోయేముందు, నిద్ర పోవడానికి ముందు చేసిన సంకల్పాన్ని స్మృతికి తెచ్చుకో.

నీకు చేతనైనప్పుడల్లా, ఓంకారగానంచెయ్యి. లేదా ఓంకార మును జపించు.

ఈవిధంగా వర్తించు; నీవు యథార్థ చంపకపుష్పం మాదిరి, మధుర పరిమళాన్ని, నిరంతరం నలుదిక్కులకు వెదజల్లు తుంటావు.

ఒకనాడు తీవ్రబాధారూపమైన
ఆక్రందనమ్ములు, రోదనధ్వనులు,
ఇప్పుడో – నృత్తవాద్య వినోదయుక్త
సంగీతములబోలు మధురశబ్దములు.
ఓ దొంగ! ఓ ప్రియా! ఓ చోర! రార!
క్రీగంటి సునిశిత వీక్షణంబులను
రావోయి, రావోయి ఆలసింపకను.
భయమేలరా! ప్రాణసఖ! రమ్ము రమ్ము.
నా ఆత్మ నీయదే, నీఆత్మనాదె;
కాదేని నమ్మవా, ఇటు వచ్చిచూడు –
నాదని నీవెంచు ఈ వస్తువులను
తీసుకో తీసుకో సర్వమ్ము ప్రియుడ!
సరియె నీ వవసర మని యెంతువేని –
ఒక దెబ్బతోడ నీ తనువును కూల్చి,
ముక్కలు ముక్కలుగా చేయవోయి!
ఈ శరీరంబును సర్వంబుగొనుము;
కీర్తి ప్రతిష్ఠలనూడ్చి గైకొనుము;
తీసుకో తీసుకో సర్వమ్ముదేవ!
ఐనను – కొంచెము తిరిగి చూచితివ,
ఏకాకి నగునేను నిరపాయముగను
పరమశాంతిగనుందు, శాంతిగనుందు!
సుదినమో హో ప్రియా! సుదినమో నాథ!

## కమలకు కొన్ని సూచనలు

వైదాంతిక సామ్యవాదాన్ని వ్యాప్తంచేసే నిజమైన మార్గం - భాగ్యవంతులు మనముందు తమ దారిద్ర్యాన్ని గుర్తించి స్వామ్య బుద్ధిని, మమత్వబుద్ధిని, అధిగమించేటంతగా - మనం భాగ్యాన్నిగానీ పేదరికాన్నిగాని నిర్లక్ష్యించి, ఇప్పుడే, ఇక్కడే, మనం దివ్యానందం అనుభవించడమైయున్నది. భాగ్యవంతులనబడే వాండ్ల భారాన్నిచూచి జాలిబడడానికి బదులుగా వాండ్ల క్షణభంగుర సంపదనుచూచి అసూయ పడడమే నేటి కాలపు సామ్యవాదులు చేస్తున్న ఘోరమైనతప్పు.

అనుభవించడానికి తగిన బుద్ధిగలమానవులు, తారాకోటిచేత మెరిసిపోతున్న ఆకాశపుగనిలోని వజ్రాలను అనుభవింపవచ్చు. ప్రసన్నములైన అరణ్యభూములనుండి, నృత్యంచేసే నదీనదాలనుండి, కావలసినంత సుఖాన్ని అనుభవించవచ్చు. చల్లని మందమారుతాల నుంచి, మనోజ్ఞ సూర్యకాంతిలోనుంచి, పాలవెన్నెలలోనుంచి, తరుగని ఆనందాన్ని పండించుకోవచ్చు. ప్రకృతి ఈ దివ్యసంపదను, యథే చ్ఛానుసారం అనుభవించడానికి అందరిముందర ఉంచింది.

ప్రత్యేక పరిస్థితులమీద, ఆనందం ఆధారపడిఉంటుందని నమ్మే మానవులు, ఆ ఆనంద దినం వాండ్లకెప్పుడూ దూరంగా ఉంటుందనీ, అది వాండ్లకు చేచిక్కకుండా ముందు పారిపోతునే ఉంటుందని, కను గొనగలరు. ఈ ప్రపంచముయొక్క సంపద అనబడేది, ఆనందానికి మూలంకాదు; ప్రకృతియొక్క మనోజ్ఞసౌందర్యాన్ని, దివ్యప్రతిభను మూసివేసే ఒక కృత్రిమపు తెరగా మాత్రమే అది పనిచేస్తుంది.

కృత్రిమ సంగీతంచేత ఎప్పటికీ మానవునిలోని సహజభావ ప్రవాహం - నిశ్శబ్ద బాష్పాలరూపంతోగానీ, లేక ఏకాంతికానంద మందహాసరూపంతోగానీ - లేక - ఏకాంత కవితారసకేళీరూపంతో గానీ - వెలువడడానికి అవకాశంలేదు.

కృత్రిమ సంగీతమంతా, ముఖ్యంగా ఫోనోగ్రాఫిక్ సంగీత మంతా - వినంగా, వినంగా, వినంగా, చెవులకు అసహ్యం పుడుతుంది. దానిచేత ఆత్మ భౌతికరంగంలోకి దిగజారుతుంది.

రాళ్ళూ, రప్పలనూ, సమానంగా పంచుకోవడంకోసమని ఎందుకు మనం కీచులాడడం ?

'ధనము' అనే రోగాన్ని 'నాదీనాదీ' అని కౌగలించుకోని అవస్థపడుతున్న ధనికులనబడే మానవులు, తమ తెలివితక్కువను బైట పెట్టుకొనేలాగు చేయగల సమర్థత కమలకున్నది.

హి మా ల య శా ం తి

..................................................

గాఢధ్యానమగ్నత, వేదశాస్త్ర పఠనాదులు, తత్త్వ, మత సంబంధ రచనాదులు, ఈ మహోన్నతై కాంతస్థలంలో రాముని కాలాన్ని రవ్వంతకూడా తీరిక లేకుండా సద్వినియోగంచేస్తున్నాయి. ఇక్కడికి ఒక ఎనిమిదిమైళ్ళలో ఒక గ్రామము ఉన్నది. రామునికి వంటచేయడం కోసమని ఒక పరిచారకుడు, కొండకు దిగువ ఒక మైలుదూరంలో ఉంటాడు. అనేక మాసాలనుంచి రాముడు ప్రత్యుత్తరాలు ఏవైనా సరే వ్రాయడం పూర్తిగా మానాడు.

కమలా, ఓం, భారతదేశ యాత్రకు వేగిరపడనవసరంలేదు.

మనం ఏ గందరగోళం పడకుండానే, సర్వం దానంతటదే సకాలంలో మనోహరంగా జరుగుతుంది. మీరు చేయవలసినపని – భగవంతునిలో జీవించండి. భగవత్స్వరూపులు కండి.

నీవు దేహము కాదు, మనసువు కాదు.
బాంధవ్యములు లేవు, బంధముల్ లేవు.
ఆత్మ సంస్థితుడవు గమ్ము సత్వరము.
నీ ఆత్మ భగవంతుడే వేరు కాదు.

అతి ధన్యమైన గిరిజకూ, చంపకూ, శాంతి, దీవెనలు, ఆనందం.

రాముని ప్రియమిత్రునిచే అనువదింపబడిన 'అష్టావక్రగీత' అనే గ్రంథం ఇందులో ప్రత్యేకపు కవరులో పంపబడింది.

1. అహంకారదృష్టితో, దేహదృష్టితో ఏపనీ చేయకూడదు.

2. ఈ దేహమనేది, అసలు ఎప్పుడూ పుట్టనే పుట్టియుండలేదన్నట్లు మనం జీవించాలె.

ఒక సనాతన వేద గీతభాగముయొక్క అనువాదాన్ని ఈక్రింద పంపుతున్నాను. ఇది ఒక హిందూస్త్రీ అనువదించింది.

... ... ... ...

3. ఎవరుచూచినా, ఎవరు గాలిపీల్చినా, ఎవరువిన్నా, భుజించినా, నావల్లనే జరుగుతున్నది. వాండ్లకీవిషయం తెలియకపోయినా వాండ్లు నా అధీనంలో ఉన్నారు. ఓ సర్వమానవులారా! వినండి. ఇది నిజం.

4. నేను సమస్త ప్రపంచాలను చేతపట్టుకొని గాలివీచునట్లు వీస్తున్నాను. స్వర్గం గతించినా, భూమిగతించినాసరే. నేను సర్వశక్తి స్వరూపుడను.

5. నేను అనుల్లంఘనీయమైన ధర్మమును, నేను అవికల్పమైన సత్యమును, నేను ప్రకృతి అనే వింటెని ఎక్కుబెడతాను. ఆమె బాణం, దైవజీవన విహీనులైన మానవులను నాశనం చేస్తుంది.

స్వర్గంపైనా ఈ ప్రబలభూభాగంపైనా నా ఏలుబడేఉన్నది.

అడివిలోనుంచి సాయంకాలంపూట అంబా రవాలుచేస్తూ యిల్లుచేరే గోవులలాగా మానవుల ప్రార్థనలు నను సమీపిస్తాయి.

నీ ఆత్మ,
రామస్వామి.

ఓం.

2

సెప్టెంబరు 15, 1903

ప్రియకుమారి కమలా!

నీవు పరిశుద్ధురాలవు, నిష్కళంకవు, పరమ పవిత్రవు, నింద

అనేది లేదు, మచ్చ అన్నమాటలేదు, ప్రాపంచిక వాసన ఏమాత్రం లేదు, భయంలేదు, పాపంలేదు.

నీ కిష్టమైతే యీ క్రింది భావాలు పద్యాలుగా వ్రాయి. అలా చేయడంవల్ల, ఆ సాధన నిన్ను ఉన్నతపథాల్లో ఉంచుతుంది.

ఈ ఉదయం రాముడీభావాలు ఒక పారశీక పద్యంనుంచి అనువదించాడు. పోర్టులాండులోగానీ డెన్వారులోగానీ నీ వున్నప్పుడు వీటిని పద్యాలుగామార్చు. అర్థంచేసుకో.

భావాలను ఉద్దీపింప చేయడానికి నీకు సర్వస్వాతంత్ర్యమున్నది.

1. మహోగ్ర గంభీర తరంగాలు-తుఫాను. ఓ తన్మయ సముద్రమా ! భూస్వర్గాలను ఏకంచెయ్యి. ఈచింతా అభిమానాలను మొత్తం ఒకసారి ముంచెయ్యి. ఓహో! వీటితో నా కేమిపని ?

2. రాండి! ఇంకా త్రాగుదాం - త్రాగుదాం - భగవన్మధువును తప్పత్రాగుదాం మనం. ఓహో! తప్పత్రాగి, భేదభావాన్ని పెకికివేద్దాం, అహంకారకుడ్యాలను కూలత్రోద్దాము.

3. దివ్యోన్మత్తతా! రా! రా! త్వరగా రా! ఆలస్యం భరించలేను! నా మనస్సు దేహవాసనచేత విసిగిపోయింది. ఓహో! నీలో నా మనస్సును లగ్నంచెయ్యి; మరణాగ్నిలోనుంచి మనస్సును తక్షణం బైటికి తియ్యి.

4. నీవు నేననే భేదత్వానికి నిప్పు రగిలించు. ఆశాభయచతుర్వాయువులను బంధించు. వాతావరణం మారుతుంది. శిరస్సు పాదాలతో భేదించకూడదు.

5. నా కన్నం బెట్టవద్దు. నీ ళ్ళీయవద్దు. నిలువనీడ కల్పించవద్దు. ఓ అమూల్య ప్రేమదేవతాప్రణయదావాజ్వాలా! ఇలాంటి శరీరకోటులను దహించడానికి నీవే తగియున్నావు.

అదె పశ్చిమాకాశరంగంబు గనుము-
ఎంత సుందరముగ వెలుగుచున్నదియొ!
ఆ తేజమెవరిది-సూర్యగోళముద ?
నిజముగా, అదీ నీ ప్రకాశమేనోయి.

నీ ఆత్మ,
స్వామిరామతీర్థ

ఓమ్.

3

పుష్కరము,
అజ్మీరుజిల్లా.
ఫిబ్రవరి 22, 1905.

మహాదివ్యజననీ !

ఇక్కడ రాముడుండేచోట వాతావరణం ఎంతహాయిగాఉంది! ప్రతిదినమూ సంవత్సరాది - ప్రతిరాత్రి క్రిష్టమసురాత్రి! నీలాకాశం నాకు మధుపాత్ర. మెరుస్తూవున్న దివ్యకాంతి నామధువు. కొండలమీది చల్లటిగాలి. నేనేగాలిగా వీస్తాను. వీస్తాను. పర్వతాలమీదినుంచి నేను పట్టణాల్లోకి, నగరాల్లోకి, పరిశుభ్రంగా వాడవాడల్లోకీ ప్రసరిస్తాను. నే నతణ్ణి స్పృశిస్తాను. నే నామెను స్పృశిస్తాను-ఇది నా కేళీలీల.

నేనే కాంతిని. ఎంతో ప్రేమతో నా బిడ్డలకు పూలూ, పండ్లూ యిస్తాను. నేను సుందరమైన హృదయాల్లో మనోహర నేత్రాల్లో ఉంటాను.

నిన్నిదే ప్రార్థింతు నా తోడనిలుము,
పగలెల్ల నాతోడ నిలుమోయి నాథ !
పగలుగా నిమ్మది, రాత్రిగానిమ్ము,
సర్వకాలముల సర్వావస్థలందు
నిలుమోయి నిశ్చంచలముగ నాదేవ !

అదుగైన కదలకు మిటమీాదనింక,
నను వీడి నీవదుగైనపో లేవు
నీవున్న చోటనే నేనును గలను
నే నిన్ను గట్టిగా బట్టెదనోయి;
పులినతలంబుల, యమునాతటాల
కాదోయి—నా హృదయాంతరాళమున—
హృదయాంతరాంతర సింహపీఠమున—
నే నిన్ను గట్టిగా బట్టెదనోయి!

పరంజ్యోతిలో నివసిస్తున్నప్పుడు దారి దానంతటదే దారిస్తుంది. భక్తే, జ్ఞానం ప్రకాశిస్తున్నప్పుడు ప్రతి చిన్న విషయంకూడా సూర్య కాంతిలో పద్మం వికసించినట్లు వికసిస్తుంది.

నీకీపాటికి 'ది థండరింగ్ డాన్' జనవరి సంచికను 'పురాన్' (సూత్రమండీ లాహోరునుంచి) పంపించేఉంటాడు.

నీ ఆత్మ
స్వామి రామతీర్థ.

జనవరిసంచికలో, నీపద్యాలు 'కమలానంద' అనే పూర్ణ సన్న్యాసనామంతో ప్రకటింపబడియుంటవి.

నీవు మళ్లీ పద్యాలు పంపేటట్లయితే, అవి, "ఓం" అనేపేరట, నీ కిష్టమైతే ప్రకటింపబడతవి.

గిరిజకూ, అందరికీ ప్రేమ! దీవెనలు! ఆనందం! శాంతి! ఓం! ఓం! ఓం!

## తారలు

తారకాదీపిత స్వర్గమార్గాల,
శితసముద్రాకులపథములందుండి;
ఆగమించిన నిశీథానిలదూత,
చెవిలోన ఒకయుపదేశంబు చేసె :

"తారకాకోటులవలె నీవుకూడ
వెలుగొందదలతువా? విను మొక్కమాట :
ఆవృతనిశ్శబ్దమునకు భీతిలక,
దృశ్యముల్ గనుగొని వికలత గనక,
ఆ తారకలవోలె జీవింపవలయు.
పరులయనుగ్రహప్రేమలకొరకు
అవి దేబరింప వేనాడును గూడ.
ఆ తార లానందమున వెల్గులీను,
ఆ వెల్గులకు సాగరము పొంగిపోవు.
ఆత్మనిష్ఠానందమగ్నంబు లగుచు
శత్రుమిత్రభ్రాంతు లనుసివి లేక
సర్వదా వెలుగుల వర్షించు నవని.
తమకుతామై ధర్మనియతివహించి
భగవంతు డిడిన విధ్యుక్తధర్మమును
నిర్వహించుటలోన నిఖిలశక్తులను
ధారపోయుచు అనాసక్తచిత్తమున,
అది మహత్తరపదం బంది వెలుంగు.

4

పుష్కరం,
అజ్మీరు జిల్లా.

ఆనందం! ఆనందం! ఆనందం!

శాంతి! దీవెనలు ప్రేమ! ఆనందం!

నా ప్రియాతిప్రియమైన మహాధన్యాత్మా!

ప్రశాంతంగా, గంభీరంగా, అగాధంగా, ఉన్న ఒకసరస్సు ప్రక్కన రాముడుంటున్నాడు. ఎత్తైన కొండ, దాని ప్రక్కనే పచ్చటి శాలువ కప్పుకొనిఉంది. మామిడిచెట్లు బారులుతీరి ఉన్నాయి. రాముడు నివసించే ఇంట్లో, రెండు ఉద్యానవనాలున్నాయి. ఇక్కడ నెమళ్లు

దివ్యకంఠాలతో క్రేంకారాలు చేస్తుంటాయి. సరస్సులలో బాతులు కలకలారావంతో ఈదుతుంటాయి. నారాయణస్వామి, రాముని రచనలకు ప్రతులువ్రాసి తోడ్పడుతున్నాడు. (నారాయణస్వామిని గురించి నీకిదివరకే వ్రాశాను.) ఈ సరస్సును, భూమికి నేత్రం అంటారు. ఈ అరణ్యాలు, పర్వతాలు, ఆ సరోవర నేత్రానికి కనుబొమలు. ఈ సరస్సు అద్దంలాగా ఉన్నది.

దీన్ని ఏరాయీ పగలగొట్టలేదు. ఈ అద్దానికి ఉన్న నిగనిగ మాసిపోదు. ఎప్పటికీ ఇది మలినంగాదు. సూర్యుడు యీ అద్దాన్ని మచ్చపడకుండా శుభ్రంగా తుడుస్తుంటాడు. రాముడు చూచినటువంటి ఉత్తమ పాత్రల్లో ఈ సరస్సొకటి. ఇది దాని పవిత్రతను ఎంత భద్రంగా ఉంచుకుంటుంది! ఈ అద్దానికి గీర అనేదిలేదు, సరస్సు తరంగిత మవుతుంటుంది. ఇది నిత్య యవ్వనంతో ప్రకాశిస్తుంది. మన హృదయాలు ఇలా ఉండాలె. ఎండాకాలానికి రాముడు, శీతల హిమాలయాలకు నిర్గమిస్తాడు.

అదె పశ్చిమాకాశ రంగంబు గనుము.
ఎంత సుందరముగా వెలుగుచున్నదియో ?
ఆ తేజమెవరిది-సూర్యగోళముద ?
నిజముగా, అది నీప్రకాశమేయగును.

ఇక్కడ—

'రంగు రంగుల వస్త్రముల గట్టుకొనియు
తిరుగుచున్నవి శకుంతంబు లెల్లడల.
వంకల వంకలగా బార్లు దీరి
తేలిపోవుచునుండు, స్వప్నంబులట్లు,
పిట్టలబారులు చెట్టుచెట్టునకు
యింద్ర ధనుస్సులు కట్టినట్లుండి
ఆడుచు పాడుచు అవనీరుహముల,
పైపైననే యవి విహరించుచుండు,
మృదుగాన మొనరించి, నిద్రించునవ్వి.

దూరంబు నందుండి వినిపించునట్టి
కొలను శబ్దమువోలె వినిపించుచుండు—
ఆ మనోహర పతంగముల రావములు.
లోకప్రసక్తియే వాటికి లేదు,"

"థండరింగ్ డాన్" తిరిగి ప్రారంభింపబడింది – నాలుగు క్రొత్త సంచికలు ఇంతవరకు వెలువడ్డాయి. జనవరి అంటూ ఇంచుమించు రామునిరచనే. కమలయొక్క కొన్నిపద్యాలుకూడా, కమలానంద అనే పేరున ప్రకటింపబడ్డాయి.

ఇండియాకు కమల ఉత్తరం ఒకటికూడా రాలేదు.

శాంతి, దీవెనలు, ప్రేమ,

నీ ఆత్మ,
రామతీర్థస్వామి.

ప్రియమైన శిశూ! ఓం! ఆనందం, ఆనందం, ఆనందం. గిరిజకు నా ప్రేమ.

సకాలంలో రామునివద్దకు రావడానికి నీవు సంసిద్ధంగాఉండాలె. సమయంరాగానే రాముడు తెలుపగలడు. ఓం! ఓం!

—రాముడు.

5

(డార్జిలింగునుంచి)
30 ఆగష్టు, 1995.

ఆనందం! దీవనలు! శాంతి! ప్రేమ!

మహోదివ్యాత్మా!

మూడు మాసాలనుంచి రాముడు లోకోన్నత కైలాసశిఖరానికి ఎదురుగావున్న పర్వతసానువులమీద (8,000 అడుగుల ఎత్తు) నివసి

స్తున్నాడు. ఎల్లుండి మళ్ళీ పర్వతపాద ప్రదేశాలకు వెళ్లుతాడు; అయిదు పుస్తకాలు వ్రాసాడు. ఇతరమైన గ్రంథాలు అవలోకించాడు. రాముని హృదయం, ఆనందంతో శాంతితో తొణికిసలాడుతున్నది. లోకస్మృతి లేదు.

సర్వత్ర సర్వత్ర! – బాహ్యాంతరముల
దూరమందున సమీపంబందు కలడు,
భగవంతుడొక్కడే! భగవంతుడొకడె!
ఓహో! మహానంద పరవశత్వంబు!
ఓహో! మహాఖండ పరమప్రశాంతి!
ఓహో! అపార దివ్యానందరాశి!
ఏమి స్వర్గంబిది! ఎట్టి సుఖంబు!

శాంతి! దీవనలు! ప్రేమ!

ప్రియమైన చంపకు, గిరిజకు, నీ ప్రియులందరికీ ఆధ్యాత్మికమైన మానసికమైన భౌతికమైన ఆరోగ్యం! ఆనందం!

వర్షబిందువులొచు అమృత ప్రశాంతి
రాలుచున్నది మనోహర లీల నహహ
అమృతము సంగీత వర్షమై కురియు
చినుకులు! చినుకులు! చినుకుల జల్లు!!!
నాప్రతిభా మేఘములు దిగంతముల
విహరింపుచున్నవి యుల్లాస లీల
ముత్యాలవలె ప్రపంచంబు లందుండి
రాలుచున్నవి మనోహరముగ నహహ!
చినుకులు! చినుకులు! చినుకుల జల్లు!!
నాధర్మ వాయువుల్ సక్రమరీతి,
వీచుచున్నవి, అవే జనపదతరులు
రాలుచున్నవి పుష్పదళముల రీతి,
చినుకులు! చినుకులు! చినుకుల జల్లు!!!
నాసుగంధశ్వాస, ధర్మమారుతము

వీచుచున్నది మనోజ్ఞంబుగా నహహా!
చిరుకొమ్మలట్టుల కొన్నివస్తువులు
కదలాడుచున్నవి, అటు నిటు నూగి;
మరికొన్ని మంచు బిందువులట్లు రాలు;
చినుకులు! చినుకులు!! చినుకుల జల్లు!!!
నా ప్రతిభా తేజమొక మహోవనధి.
ధవళకాంతుల జిమ్ము క్షీరసాగరము
అలలతో మృదువుగా కులుకుచు వెలికి
త్రోయుచున్నది జగచ్ఛయశీకరముల.
సుందరతారకా జలకణంబులను
విరజిమ్ము చున్నాడ వినువీథులందు.
చినుకులు! చినుకులు! చినుకుల జల్లు!!!

ఓం! ఓం! ప్రశాంతి! ఓం! ఓం! ఓం! ప్రశాంతి!

రాముడు.

## నా లు గ వ ఘ ట్టం

# అమెరికానుండి లేఖలు

1

శాస్తాస్ప్రింగ్సు, క్యాలిఫోర్నియా,
ఆగస్టు 10, 1903.

(నక్షత్రాలు వెలుగుతూఉన్న ఆకాశమనే ఛత్రంక్రింద ప్రకృతి అనే మహానందనోద్యానవనంలో, కొండల్లోంచి ప్రవహించే సెలయేటి ఒడ్డున)

ఆనందమయమైన నా అంతరాత్మా,

(14444 అ) ఎత్తుగల అతి మనోహరమైన శాస్తాశిఖరాన్నుంచి యిప్పుడే వచ్చాను. వచ్చిన వెంటనే మరికొన్ని ఉత్తరాలతో నీ

ప్రుత్తరాన్ని చూచాను. ప్రియా! నీవేమీ చెయ్యవద్దు; నీ యింటిని చక్కబెట్టుకో. తలుపు తెరచివెయ్యి. అందరినీ రానియ్యి. దరిద్రులను నీ ధనాన్ని తీసుకోనియ్యి. తర్వాత నీకోసం నేను కాచుకొని ఉన్న యీ స్థలానికిరా. ఆనందమా! స్వేచ్ఛగా ప్రవహించుచు, సమానతా సముద్రంలో యీదులాడు. ఒక్క దెబ్బతో బంధాలన్నిటినీ తెంచుకొని నీ దివ్యత్వంలో విలీనమైపో.

లోపలికిచూడు. లోపల అన్వేషించు. నీకు అన్నీ జవాబులు వస్తాయి.

నీ ఆత్మ,
రామతీర్థస్వామి

2

పోర్టులాండు
ఆరెగన్.

మిసెస్ ఇ. సి. కాంప్ బెల్
డెన్వర్, Colorado

మానవులు తమ హృదయాన్ని ఒక వస్తువుమీద నిలిపి తత్ఫలితంగా ఒక ప్రత్యాఘాతాన్ని పొందుతారు. అప్పుడు వికలులై మనస్సమతను కోలుపోతారు. కలతకూ అశాంతికి కారణం? చెడును ప్రతిఘటిద్దామనే ఉన్ముఖతే "చెడును ప్రతిఘటించవాకు" అని ప్రబోధించిన క్రీస్తు సముచితుడు కాకపోతే అలా చెప్పగలడా? నిన్ను నీవు శాంతిస్థితిలో పూర్ణఆనంద స్థితిలో ఉంచుకో. నీ ఆశయప్రవాహానికి వ్యతిరేకంగా కనపడే దేనినైనాసరే సంతోషంతో ఆహ్వానించు. మనం మన మనస్సమతను కోలుపోక ఆత్మస్థితులమై వున్నప్పుడు కనపడే చెడంతా మంచిగా మారుతుంది. రాము డెప్పుడూ ఈ విషయాన్ని అనుభవంలో చూస్తున్నాడు, నీకు గుర్తులేదా—ఒక హిందూ విద్యార్థి మొదట కష్టపడినా తరువాత పదిరూపాయలు అతనికి పంపబడ్డాయి. కాని మనస్సమతను కోలుపోవడంచేత వైకల్యంచేత మనకు మనమే, సమస్త సుఖాలను, మనకోసరమే ఎదురు చూస్తున ఉదాత్త సంకల్పాలను, సమస్తశుభాలను, రాకుండా అవరోధించుకుంటాము.

సమస్త చెడులను కష్టాలను, ప్రాపంచిక జీవితానికి ఇవ్వవలసిన విలువనే యిస్తూ జయించు. అంటే అనన్య మహాశక్తివంతమైన ప్రేమతో చెడును జయించు. ఓం!

నీ ప్రియమైన ఆత్మ
రామస్వామి.

3

పోర్టులాండు.
ఆరెగన్,

మిసెస్ కాంప్ బెల్,
డెన్వర్, Colorado

నీవు రాముని స్మృతిపథంలో నిరంతరం ఉన్నావు.

ఓం! ఓం!

నీవు నిష్కల్మషవు, పరిశుద్ధురాలవు. ఉదాత్తహృదయవు. శ్రద్ధా విశ్వాసదీప్తవు. మహాగుణవంతురాలవు – కాదా ?

(1) ఒకవ్యక్తితో ఒకవ్యక్తిని మనస్సులో పోల్చడం.

(2) ఒకరితో ఒకరిని మానసికంగా పోల్చడం.

(3) వర్తమానాన్ని గతించిన వాటితో పోల్చి ఆ వెనుకటి విభ్రమల్లోపడి కొట్టుకపోవడం.

(4) భవిష్యత్తు పన్నాగాలమీాద ఆధారపడి ఏమిటేమిటో ఊహించుకొని ప్రతిదానికి భయపడడం.

(5) ఏకైక పరమ సత్యం మీాదకాక ఏ బాహ్యావస్తువు మీాదనైనా హృదయాన్ని నిలపడం.

(6) ఈ బాహ్యాదృశ్యాలమీాద ఆధారపడి సమస్త వస్తువులకూ అధిష్ఠానమైయున్న అంతర్గత ఏకత్వంలో ఆచరణాత్మకమైన విశ్వాసం లేకపోవడం.

(7) మానవులయొక్క బాహ్యప్రవర్తనల చూచి, మాటలు చూచి, వేగిరపాటుతో నిర్ణయాలకు దిగడం, దైవధర్మంలో పూర్ణ విశ్వాసం లేకపోవడం.

(8) ప్రజలమాటలలో తప్పుదారిన పడికొట్టుక పోవడం.

వీటిచేతనే మానవులు మనశ్శాంతిని కోలుపోతున్నారు. అందు చేత ఈ ఎనిమిది అశాంతి కారణాలను విసర్జించు. ఓం!

నీ పవిత్రాత్మ,
రామస్వామి,

ఓం

ఐదవ ఘట్టం.

# భారతదేశపు మైదానాలనుంచి లేఖలు

కిషంఘర్ గృహం,
పుష్కర్, అజ్మీర్.

("థండరింగ్ డాన్" లోగానీ ఇంకో పత్రికలోగానీ వెంటనే ప్రకటించడానికి–)

## 1

### నేనెవరు?

ఓ అతిధన్యప్రియాత్మా!

ఒక అద్దం తీసుకో. దానిలోకిచూడు. నీ ప్రతిబింబమే కనపడుతుంది. ఆంతరేకాంతంలోకి ప్రవేశించి, నేను మానవశక్తినని సంభావించు. సూర్యునివైపు అవలోకించు; నా ప్రతిబింబమేనని గ్రహించు. "నిజంగా నన్ను (ఆత్మను) తెలుసుకో, మానవుడు పొందవలసిన మహోత్తమ లాభమిదే. నన్ను తెలుసుకో. ఎవడు నన్ను తెలుసుకుంటాడో, అతని ఆనందానికి అడ్డురాగలదేదీ లేదు. ఎవడు నన్ను తెలుసుకుంటాడో, అతని ముఖరంగంమీద ఆనందతేజం ఎన్నడూ మాసిపోదు." (ఉపనిషత్.)

నన్ను దర్శించడానికి అడ్డంకిగాఉన్న కొలత బద్దలను తమ కండ్లల్లోనుంచి ఎవరు తీసేసుకుంటారో వారు ధన్యులు. నీవు నడిచినచోటల్లా ధన్యమవుతుంది. ఎందుకంటే, నీవు అడుగుపెట్టిన స్థలమల్లా, నీ "రామ దర్శనం" చేత (బ్రహ్మదృష్టి) స్వర్గంగా మారి తీరుతుంది.

'నీ హృదయంలో స్పందిస్తూ, నేత్రాలలో పరికిస్తూ, నీ నాళాల్లో ప్రతిస్పందిస్తూ, పూలలో నవ్వుతూ, మెరుపులలో మందహాసంచేస్తూ నదులలో గర్జిస్తూ, పర్వతాలలో మౌనియై రాముడున్నాడు. బ్రాహ్మణత్వాన్ని అవతల పారవెయ్యండి. ఈ బిరుదులన్నీ, గౌరవాలన్నీ, గంగలో కలపండి. ప్రియతమా! రాముడు నీతో ఒకటైయున్నాడు. నీవు పండితుడవైనా, పామరుడవైనా, శ్రీమంతుడవైనా, నిరుపేదవైనా, పురుషుడవైనా, స్త్రీవైనా, పుణ్యాత్ముడవైనా పాపాత్ముడవైనా, క్రీస్తువైనా, జూడస్ ఇస్కాలియేటువైనా, కృష్ణుడవైనా లేక గోపికవైనా, రాముడు నీ ఆత్మయై యున్నాడు. నీ హృదయంలో, నా దివ్యత్వాన్ని-నీ దివ్యత్వాన్ని-ఉద్ఘోషించి, అడుగడుగునా, అనుక్షణమున దాన్ని ప్రకటించడానికి, రాముడు సంకల్పించి యున్నాడు.

జర్మనీ, ఇంగ్లాండు, అమెరికా, ఇండియా సమస్తదేశాలను కదలించి స్వాతంత్ర్య స్థితికి ప్రబుద్ధం చేస్తాను. నేను పాత ఆటతో విసిగిపోయాను. ఓ స్వప్నసంచారీ! హిమాలయగర్జనం నీకు వినపడడంలేదా? వేదాంతమేఘగర్జనారావం నీ చెవులకు సోకలేదా? స్వేచ్ఛ! విముక్తి!

ఇది శుష్కభ్రమకాదు. నీ అంతరాత్మయైన రాముని సంకల్పమిది. రాముని పదవి సంపూర్ణత్వమే.

స్వేచ్ఛ! విముక్తి !!

బుద్ధునివలె, మహమ్మదువలె, క్రీస్తువలె, ఇంకా ఇతర ప్రవక్తలవలె, అవతారపురుషులవలె కోటానుకోట్ల అనుయాయులను సమకూర్చడం కాదు—ప్రతిమానవుడిలో, ప్రతి స్త్రీలో, ప్రతిశిశువులో అంతర్గతుడైయున్న రాముని ప్రకటన పరచటమే, ప్రబుద్ధపరచడమే రాముని ఆశయం. ఈ దేహాన్ని త్రొక్కండి, ఈ వ్యక్తిత్వాన్ని నమిలి

తినండి. నన్ను జీర్ణించుకోండి. నన్ను విలీనం చేసుకోండి. అప్పుడు మాత్రమే రాముసకు మీరు హితముచేసిన వారవుతారు.

ఓం! ఓం!! ఓం!!!

నిన్ను నీవు తెలుసుకో. తనను తానెవడు తెలుసుకుంటాడో, వాడు దుఃఖవిముక్తు డవుతాడు.

2

ఆడ్వొకేట్ ఆఫీస్,
లక్నో.

1902, ఆగష్టు 20 వ తేదీ, కలకత్తానుండి జపానుకు బయలు దేరుతుంది.

రాముడు తిరిగి భారతదేశానికి ఎప్పుడువస్తాడో తెలియదు. ఆతడు ఎక్కడ దిగుతాడోకూడా ముందుగా చెప్పడానికి వీలులేదు. సర్వదా నీతో ఏకమైయుండు —

ఓం!

—రాముడు.

3

ముజఫర్ నగర్,
18 అక్టోబరు, 1905.

మధురహృదయా! విశాలహృదయా!

బూడిదను చేతులకు రుద్దుకొని, చేతులకున్న మురికిని పోగొట్టు కుంటాము. బూడిద, మురికిని వదలించి తానుకూడా వదలిపోతుంది.

అలాగే, శరీరవాసనను (దేహదృష్టిని) వదలించి దానితోపాటు తాముగూడ వదలిపోయే వ్యాధిబాధలు ముమ్మాటికి ధన్యమైనవి.

ఓ వ్యాధి బాధల్లారా! స్వాగతం!

ఇంట్లో శవమున్నంతవరకూ, రకరకాల విషక్రిములవల్ల సర్వ విధములైన అపాయాలకు ఆస్కారముంటుంది. శవాన్ని పారవేస్తే ఇల్లు నిరపాయకరమై ఆరోగ్యకరమై ఆనందం గొల్పుతుంది.

అదే మాదిరి, శరీరవాసన అంటిపెట్టుకొని ఉన్నంతవరకూ, ప్రపంచంలో బాధలన్నీ మనలనే పీక్కుతింటవి. శరీరవాసన, దాని బంధాలు భస్మంచెయ్యి. ఆక్షణమందే సాటిలేని ఆనందం కలుగుతుంది.

నే తాండవించెద నే తాండవింతు
పరవశత్వముతోడ పొరలినవ్వుచును
నే తాండవించెద నే తాండవింతు.
లేదనసూయయు నాకు, లేదు భయంబు.
నేనె ప్రియాతి ప్రియుండను నేనె
లేదు పాపము మరి దుఃఖంబు లేదు,
నిన్న మొన్నలు లేవు రేపులు లేవు,
ప్రతిపక్షమును లేదు వైరులు లేరు,
లేదపాయము మరిశోకమ్ము లేదు.
ఆనంద పులకిత శీర్షు లుత్కృష్ట
జ్ఞానాన్నతృప్త లంబోదరులైన
బ్రహ్మవిద్వద్వరిష్ఠులు, మహామునులు,
విద్యార్థులను ముగ్ధపరచు మార్గమున
బోధించు నాచార్య వృద్ధజనంబు.
వేదికలం దెక్కి సింహంబు లట్లు
సభిక లోకములు కిక్కురుమనకుండ
ఘనతరోపన్యాస గర్జనల్ సేయు
మేధాప్రదీప్తులౌ వక్తలు, మరియు
భాగ్యవంతులు, నిరుపేదలు, నేనె!
స్వర్గముల్, తారలు, సర్వలోకములు,
నా గానమున శ్రుతిగల్పి నటించు!
ఈ సర్వమేనె ఈ సర్వస్వ మేనె!

నా కషాయము సేయగల దేది లేదు.
నను భయపెట్టెడి వస్తువే లేదు.
నేనె సర్వాత్మను, అమృత వర్షమును!
మధురాతి మధురమా ఆత్మను నేను!
నిజము! నే సచ్చిదానంద రూపుడను!
జల జల బారెడి వాహినీచయము,
మలయానిలములు, మధుర స్వప్నములును,
అల రామరావణుల్ నే సహా నేనె!
నే శుద్ధ బుద్ధ శాంతి స్వరూపుడను!

రాముడు.



# కావాలె.

"కావాలె: సంస్కర్తలు కావాలె—

పరసంస్కర్తలు కాదు — ఆత్మసంస్కర్తలు.
విశ్వవిద్యాలయ పట్టభద్రులు కాదు—అహంకార విజయపట్టభద్రులు.
వయస్సు: బ్రహ్మానందోత్సాహ నవయౌవనం.

జీతము: బ్రహ్మపదవి.

త్వరగా దరఖాస్తులు పంపుకోండి—

భైక్షుక ప్రార్థనలతో కాదు,

అర్హతాయుక్తమైన ధృఢసంకల్పంతో

ఎవరికి?

## "విశ్వాత్మయైన పరమేశ్వరునికే"

ఓం! ఓం! ఓం! ఓం!

ఓం శాంతిః

సర్వం శ్రీ మట్టపల్లి లక్ష్మీనృసింహ పరబ్రహ్మార్పణమస్తు!

సంపూర్ణము

# శ్రీ రామతీర్థ వేదాంతభాష్యము

## శ్రీ రామతీర్థ సంపూర్ణ సారస్వతము



నవమ సంపుటము



శ్రీ రామతీర్థ సేవాశ్రమము

పిడుగురాల (పోష్టు) గుంటూరు జిల్లా - ఆంధ్ర

# భక్తి - ఉపాసన

అనువాదకులు

శ్రీ కేశవతీర్థస్వామి

శ్రీ ఋలుసు సూర్యప్రకాశము



రాయబహాదుర్ లాలావైద్యనాథ్, తాను వేదవేదాంత పురాణాదులను ఆధారంగా తీసుకొని "ఉపాసన" అనే గ్రంథమొకటి వ్రాస్తున్నట్లు పర్వతములందు విహరిస్తున్న రామునకు లేఖవ్రాశాడు. రాయబహాదూర్ సంకలనం చేసిన "సూక్తములు, భజనలు"– అత్యుత్తమమైనవి అనడానికి సందేహం లేదు.

ఆ పుస్తకానికి ప్రస్తావన వ్రాయవలసిందిగా రాముడు ప్రార్థింపబడినాడు. అందుకు సమానంగా ఆతడు చిన్న చిన్న అభిప్రాయాలను సరళభాషలో వ్రాశాడు. ఆ ఆశయాలు లేఖకునకు బహిరంతరాల్లో రామసందర్శనం కలిగించాయి. ధగధగ మెఱసి మిఱుమిట్లుగొలిపే వజ్రంలాగా ప్రపంచమంతా తేజఃపుంజములను వెలిగ్రక్కే– రామ సాగరం కాజొచ్చింది.

బ్రహ్మై వేదమమృతం పురస్తా ద్బ్రహ్మ,
పశ్చాద్బ్రహ్మ దక్షిణ త శ్చోత్తరేణ.

ముండక. ఉప. 2-2-10

ఓం

రా మ తీ ర్థ.

# శ్రీ రామతీర్థస్వామి



"ఆహా ! వైకుంఠం మీలోనే యున్నది. ఇంద్రియ సుఖాలలో ఆనందము నన్వేషించవద్దు. సత్యమైన ఆనందం మీ ఆత్మలో — మీ స్వస్వరూపమైన పరమాత్మలో ఉన్నది. ఆ ఆత్మానందానుభూతి పొందండి !...."

SRI RAMA TIRTHA SEVASHRAM, PIDUGURALLA (P. O.) GUNTUR DT., A. P

# PREFACE

**SRI SANTI PRAKASH**

*President* : SRI RAMATIRTH PRATISTHAN,

SARANATH.

*Dear Divinity in form of Swami Keshava Tirtha,*

I am glad to acknowledge the receipt of your Bhakti-yogamu, which you have sent me for my opinion. It is the translation of Swami Rama's upasana, which is his only Hindi work, while all his other works are either in English or Urdu. This upasana was the introduction to Rai Bhadur lala Baijnath's shahshtrokta upasana and is the final song of this divine swan, I mean Swami Rama. You have rendered a yeoman's service in translating it into your mother-tongue.

I have translated it in Urdu and it is incorporated in the 3rd volume of his Urdu works. Its translation in English is also ready to be Printed.

The printing of your book is very neat and clean and its get-up also is very nice. I believe you have left no stone unturned to translate it accurately.

Concentration of mind is most essential for upasana or divine love.

"The first bar (in concentration of mind) is the faith in the existance of the unreal cause", says Swami Rama, who adds that "the cause of all causes is God alone". How is this? Every action is Caused or acturated by the knowing or acting senses, which are acturated by mind, which is goaded by intellect, that in its turn, is goaded by God. Thus God alone is the cause of all causes or the real Actor.

Now the question arises why is God; who is the real actor, not responsible for human actions and why is man

held responsible for them. It is because man is the only creature, who is free to act though he is bound to bear the consequences of his actions.

This freedom of action was given to him to attain **Moksha** or salvation that is the **Summum bomum** of human, nay every life. It is the cause why the **devas** of gods, in heaven, aspire to be born as men upon the globe of ours. This superiority of man over the **devas** or angels is given not only in the Aryan or Hindu sacred Scriptures; but it is found in the Semetic Sacred Scriptures also, wherein Lord God is said to have cost the leader of the angels into the hell on account of disobeying the divine order, to pay obesiance to the Father of Man, Adam.

As man is free to act, so God is not responsible for human action, just as the sun, without whose heat and light not even a blade of grass will grow, is not responsible for human actions. In the same way the steam power is not responsible for the direction towards which the engine is driven by the engine-driver even, though without that power the engine will not move even an inch.

This freedom was given to man to follow the divine path that is not only **straight** and **shortest** but is **simplest** and **easiest natural** and **universal** and **practical** as well. This path is that of the **Satogun** or moderation. It is between the **Tamogun** or under activity and the **Rajogun** or over activity. Deviation from the right path is sin, that is always followed by sorrow. Man deviates from the right or straight path on account of his selfishness, that makes him either lag behind on account of his laziness, or go a head on account of haste. It is selfishness that makes man desire for the fruit of his actions. He, who has no such desire is not involved by his actions, as the Lord sings in His Devine songs : "No actions affect me nor is the fruit of

action desired by me.* This selfishness ceases to exist, when individual self develops to or is sub-merged into the Universal Self. The more does this little or individual self expand the more does it approach to the big or Universal Self, that is the divinity viz. the goal of humanity.

Blessed are they, who realise the truth contained in this brochure. Doubly blessed are they, who bring it into action; and thrice blessed are they, who teach and preach it to others.

Rama Tirtha Ashram,
Camp at 29 Lajpatirai Road,
New Katra, Allahabad-2
Dated December 30th 1957.

Yours everin Shanti

*Sd, Shanti Prakash*

# శ్రీరామతీర్థ వేదాంతభాష్యము

## -శ్రీరామతీర్థ సంపూర్ణసారస్వతము-

## భక్తి - ఉపాసన

"యుయోధ్య స్మజ్జు హురాణమేనో,
భూయిష్ఠాంతే నమ ఉక్తిం విధేమ."

(శు. య. సం. 5. 36)

ఓ ప్రభూ! మమ్ము పాపాలనుండి వేరుచెయ్యి. మేము నిన్ను అనేకవిధాల స్తుతిస్తూ నమస్కరిస్తున్నాము.

"ఉపాసనా" శబ్దం "ఉప - ఆస - యుచ్" నుండి సముద్భూతం. "ఉప" అంటే సమీపం. "ఆస" అంటే కూర్చుండడం. "యుచ్" అనేది ప్రత్యయం. మనస్సును భగవంతుని సాన్నిధ్యమందు చేర్చడమే ఉపాసన. లేక రోమరోమంలో రాముడు తాండవిస్తుంటే మనస్సు ఆనందామృతంలో ఓలలాడుచుండేస్థితి ఉపాసన.* దీనిని మూడు తరగతులుగా విభజించవచ్చు. ఒకటి- రాతిబొమ్మ గంగలో బడి చల్లబడినట్లు భగవద్భక్తిలో మునగడం. రెండు- గుడ్డబొమ్మ గంగలోబడి లోపలా వెలుపలా జలపూరితమై తడిసినట్లు, బాహ్యాంతరాల్లో మనస్సు భక్తిభరిత మవడం. మూడవది- చక్కెరబొమ్మ గంగలోబడి, నామరూపాలు నశించి, గంగలో లీనమై గంగా భిన్నమై పోయినట్లు బ్రహ్మైక్యమును పొందడం. ఉపాసనను ఆయా సందర్భాలనుబట్టి భజన, ధ్యానము, ఆరాధన, అనుసంధానమనికూడా అంటారు. సామాన్యంగా ఉపాసన అంటే భగవచ్చింతనం. భక్తి అన్నా ఉపాసన అన్నా ఒకటే. జాగ్రత! మరువవద్దు.

శ్లో॥ పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్,
అశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్.

---

* ఈ విషయము శ్రీరామతీర్థ సంపూర్ణ సారస్వతమందలి చతుర్థసంపుటము లోని "మతాదర్శము" అన్న ఉపన్యాసంలో వివరింపబడింది.

ప్రలపన్ విసృజన్ గృహ్ణన్,
ఉన్మిషన్ నిమిషన్నపి. (గీత. 5-8-9)

చూస్తూ, వింటూ, స్పృశిస్తూ, ఆఘ్రాణిస్తూ, నడుస్తూ, నిద్రిస్తూ, శ్వసిస్తూ, మాట్లాడుతూ, ఇస్తూ, ప్రతిగ్రహిస్తూ, నేత్రాలను మూస్తూ, తెరుస్తూ కూడా భగవంతుని స్మరణ మరువవద్దు.

## స్థిరనియమం

అగాధకూపంలో దుమికికూడా అపాయం పొందకుండా ఉండవచ్చు. కానీ ఏప్రాపంచిక పదార్థంచేతనైనా ఆకర్షింపబడినవాడు, జగద్వస్తు వ్యామోహకూపంలో బడినవాడు అపాయమునుండి తప్పించుకొనడం అసంభవం; అసాధ్యం. సూర్యోదయానంతరం కూడా వెలుగు కరవుకావచ్చు. కానీ, హృదయాకాశంలో పవిత్ర బ్రహ్మానందభానుడు ఉదయించినపిదప, సకలశక్తులూ ఇంటిలో ఊడిగంచేసే పరిచారికలవలె స్వాధీనమవడం తథ్యం.

పర్వత శిఖరంపైన ఎక్కి గంభీర భేరీధ్వనితో ఈ విధంగా ఉద్ఘోషించు :—

"సత్యమేవ జయతే నాఽనృతమ్" (ముండక. ఉప. 3-1-6)

సత్యమే జయిస్తుంది. అసత్యం జయించదు.

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" (తైత్తి. ఉప. 2-1-1)

బ్రహ్మము, సత్యమూ జ్ఞానమూ అనంతమూ ఐనది. ఆ సత్యమేమిటి ?

"తమేవైకం జానథ ఆత్మానమన్యావాచో విముంచథ"
(ముండక. ఉప. 2-2-5)

ఆ సత్యమును ఆత్మమాత్రముగా గుర్తించు. ఇదే తెలిసికోదగింది. ఇతరమును వదలివెయ్యి.

ఆత్మజ్ఞాన మొక్కటే అమృతసాగరం. ఇతరములన్నీ వ్యర్థ ప్రసంగాలు.

"నాన్యః పంథా విద్యతేఽయనాయ" (శ్వేత. ఉప. 3-8)

ముక్తికి ఇంకొక మార్గమేదీ లేదు.

"జ్ఞాత్వాతం మృత్యుమత్యేతి నాన్యః పంథా విముక్తయే."

(కైవల్య. ఉప. 9)

దానిని (పరమాత్మను) తెలిసికొని మృత్యువును అతిక్రమించు. ముక్తి పొందడానికి ఇది తప్ప వేరే మార్గంలేదు.

"మృత్యోః సమృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి."

(కఠ. ఉప. 4-10)

ఈ యాత్మయందు నానాత్వమును దర్శించేవాడు మృత్యువు నుండి మృత్యువునే పొందుతుంటాడు.

"అసన్నేవ సభవతి అసద్బ్రహ్మేతి వేదచేత్,
అస్తి బ్రహ్మేతి చేద్వేద సంతమేనం తతో విదురితి."

(తైత్తిరీయ. 2-6-1

పరబ్రహ్మను అసత్స్వరూపునిగా (లేనివానిగా) భావించేవాడు అసత్స్వరూపు (తానే లేనివా) డవుతాడు. ఆవిధంగాకాక పరబ్రహ్మను సత్స్వరూపునిగా (ఉన్నవానిగా) తెలుసుకున్నవాడు సత్పురుషు (ఉనికి గలవా) డనబడతాడు. అతడు విశ్వాసపాత్రు డౌతాడు.

"బ్రహ్మజ్ఞానమును పొందనివాడు అపరిమితములైన అనంతములైన దుఃఖాలను పొందుతాడు. రామనామమును స్మరించనివాడు ఖర సూకర శునక సమానుడు. వాని జన్మ వ్యర్థం."

— తులసీదాసు.

శౌర్యమూ, విజ్ఞానము, సుపుత్రత్వమూ, గురుత్వమూ మొదలైన సుగుణాలు అనేకం ఉన్నా, హరి (భగవత్) భజన లేకపోతే అవన్నీ విషముష్టి ఫలాలలాగా వెగటునే కలిగిస్తాయి; సంప్రీతి కలిగించలేవు. రామకథావిరహితుల సాంగత్యం కంటే సాంగత్యరాహిత్యమే మేలు. దున్నడానికి ఉపయోగించని ఎద్దువల్ల ప్రయోజనమేమిటి? భక్తివ్యవసాయ నిరుపయోగములై, భగవత్తత్త్వ శ్రవణం చేత ఆనందాశ్రువులు వెలిబుచ్చలేని నేత్రము లుండడంకంటే జన్మాంధుడై యుండడం ఎంతో మంచిది.

# లక్ష్యము

'ఆత్మానం రథినం విద్ధి శరీరం రథ మేవతు'
బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహ మేవచ.

(కఠ. ఉప. 1. 3. 3.)

"ఆత్మను రథికునిగా, శరీరాన్ని రథంగా, బుద్ధిని సారథిగా, మనస్సును కళ్లెంగా తెలిసికో."

జీవాత్మ శరీరరూపరథాన్ని అధిష్ఠించి, బుద్ధి అనే సారథిని ఏర్పాటుచేసికొని, మనస్సనే పగ్గాలను చేతబట్టి, ఇంద్రియాలనే గుఱ్ఱాలను తోలుతూ చివరకు చేరే దెక్కడ? విష్ణోః పరమంపదం.

లక్ష్యం బ్రహ్మతత్త్వం. బ్రహ్మసాక్షాత్కారం పొందకుండా పూర్ణతలేదు. జీవిత పరమాశయం బ్రహ్మదర్శనం. 'దేహమే నేను'–అనే అనాత్మదృష్టి దుఃఖదాయకం. నీవు సంతోషంతో రాగమోహాదులకు హృదయంలో స్థానమిస్తున్నావా? ఇది నల్లత్రాచును ఒడిలో ఉంచుకొని పాలు త్రాగించడమే. ఈపని చేయవాకు. సత్యమైన పరమాత్మ కంటే భిన్నమైన భావాలుకూడా నీ మనస్సులో ఉన్నవా? వానికి బదులు తుపాకిగుండ్లను నీ గుండెలో ఉంచుకోవడం మంచిది. ఈవిధంగా మధ్యమార్గంలో ఎన్ని మజిలీలు చేస్తావు? ఎన్ని ఆతిథ్యాలు స్వీకరిస్తావు? ఈ ప్రపంచమనే సత్రంలో నీకు ప్రేమతో అన్నంబెట్టే తల్లి లేదు. నీకు విశ్రాంతీ, సుఖమూ కావాలా? రామ (భగవంతుని) సాన్నిధ్యాన్ని చేరడానికి త్వరపడు.

# ఉపాసనావశ్యకత

"యస్త్వ విజ్ఞాన వాన్భవత్యయుక్తేన మనసా సదా,
తస్యేంద్రియాణ్యవశ్యాని దుష్టాశ్వా ఇవ సారథేః.

(కఠ. ఉప. 1-3-5)

"విజ్ఞానం లేకుండ అస్థిరచిత్తుడై యుండేవాని ఇంద్రియాలు దుష్టాశ్వాలు సారథికి లొంగనిమాదిరి వశంగావు."

విజ్ఞానరహితుడై అస్థిరచిత్తుడై యుండేవాని ఇంద్రియాలు పెంకె గుఱ్ఱాలవలె గమ్యస్థానాన్ని చేరకపోవడమే గాక, మార్గమధ్యంలో రథాన్నీ, రథారూఢుణ్ణీ నూతుల్లో గోతుల్లో పడవేసి విషమస్థితిని కల్పిస్తాయి. అప్పు డేడిస్తే ఏమిలాభం? పండ్లు కొరుక్కుంటే ఏమి ప్రయోజనం? ఈజన్మ నరకంనుండి తప్పించుకోవాలంటే ముందుగానే గుఱ్ఱాలను అదుపులో పెట్టుకొని సరియైన మార్గంలో నడపడానికి 'యమనియమములు' అవసరం. కానీ సారథి కండ్లుమూసుకొని, చెవులు మూసుకొని, చెవిటివాడై ఉదాసీనంగా ఉన్నంతవరకూ నీవు లక్ష ప్రయత్నాలు చేసినా బురదలో పడడం, దుమ్ములో పొర్లాడడం, గోతుల్లో కూలడం, దెబ్బలు తినడం, ఏడుపులూ పెడబొబ్బలు పెట్టడం తప్పదు. సాంసారికబుద్ధిని సారథిగా చేసుకుంటే సంతాపం దప్ప నీకేమీ మిగలదు. ఇప్పుడు నేను చెప్పే విషయం విను; నీవు ఈ జీవిత సంగ్రామంలో పరాజయాన్ని పొందక విజయాన్ని పొందాలంటే నీ మనస్సనే కళ్ళెమును కృష్ణపరమాత్మ చేతికివ్వు. అంతే. ఇంక ఏ బాధలూ ఉండవు. ఆతడు ఈ ప్రపంచ కురుక్షేత్రంనుండి నీరథాన్ని విజయవంతంగా తోలుతాడు. రథసారథ్యంలో ఆ పార్థసారథి నిరుపమానుడు. శ్రీహరికి, ఆ పరమాత్మకు రథాన్నీ, గుఱ్ఱాలను, కళ్ళెమునూ సమర్పించడం అవసరం. అంటే ఉపాసన అవసరమన్నమాట.

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః."

(గీత. 18-66)

సర్వధర్మాలను పరిత్యజించి నన్నే శరణుపొందితే నిన్ను సర్వ పాపాలనుండి విముక్తుణ్ణి చేస్తాను. దుఃఖపడకు.

"సంగాత్సం జాయతే కామః కామాత్క్రోధోభి జాయతే."

(గీత. 2-62)

విషయసాంగత్యంవల్ల కోరికలూ, వాటివల్ల క్రోధమూ జనిస్తుంది.

భోగవాంఛలతో – విషయవాసనలతో – పీడింపబడే మానవుల గతి, సముద్రంలోబడి అలలతో గాడ్పులతో అల్లాడే సొరబుర్రలాగా దీనమై ఉంటుంది.

ఇలాంటి అనర్థదాయకాలైన విషయాలతో నిరంతరసాంగత్యం చేస్తూ, ఈరోగాన్ని నివారించే ఓషధిని (ఉపాసనను-ఆత్మానుసంధాన మును) ఉపయోగించుకోకపోతే నీవుచేసే ఈ ఆత్మహత్యకు ప్రతి ఫలంగా—

"అసూర్యా నామ తే లోకా అంధేన తమసావృతాః."

(ఈశ. ఉప. 3)

'సూర్యుడులేని అంధకారబంధుర లోకాలలో' అంటే అలాంటి నరకాలలో దారుణదుఃఖం అనుభవించడం తప్పదు.'

భగవత్పరితపన హృదయంలో జనింపజేసుకో. బాధ కలిగినప్పు డన్నా భగవంతుడు స్మృతికివస్తే మంచిదే. ముండ్లమీద అడుగుపెట్ట గానే రాముడు జ్ఞప్తికివస్తే ఓ ప్రియతమా! సాంసారిక కృత్యాలలో నిమగ్నుడవై రాముని మరచినప్పుడు వెంటనే నీ పాదాలను మంచి వాడిగల ముండ్లమీద ఉంచు. అందులో విశేషమేమీ లేకపోయినా బాధవల్ల భగవంతుడు జ్ఞప్తికి వస్తాడు. ఏడుపుకు పోగొట్టే ఏడుపు కావాలె. రహస్యంగా భగవంతునికోసం నిర్వేదించు. ఆత్మవిచారం చేసుకో. హృదయాన్ని మథించుకో. ఏకాంతంగా భగవత్సాక్షాత్కృ తికి పరితపించు. నీటికొరకు చేపలాగా, భగవదైక్యమునకు నీవు హృత్పూర్వక పరితాపమును పొందు. ఈ విషాదయోగంవల్ల గూడా తప్పక నీకు లాభం కలుగుతుంది. శ్రేయస్సు లభిస్తుంది.

## సాకారోపాసన, నిరాకారోపాసన

ఒకటి- ప్రతీకోపాసన (సాకారోపాసన). రెండవది- అహంగ్ర హోపాసన (నిరాకారోపాసన). బాహ్యపదార్థము లందు పదార్థదృష్టిని తొలగించి బ్రహ్మభావనతో మననం చేయడం, చింతనం (ధ్యానం) చేయడం, ప్రతీకోపాసన. బాహ్యవస్తువులందు వస్తుభావాన్నివదలి బ్రహ్మస్వరూప సందర్శనం చేయడం ప్రతీకోపాసన. రెండవదైన అహంగ్రహోపాసన- అంతరంగమందున్న అహంకారాన్ని, మమతారూప పరిచ్ఛిన్న భావాన్ని త్యజించి స్వస్వ రూపము పరబ్రహ్మమని తలచి, అట్టి భావంతో మననము, చింతనము

ఉపాసన ద్వివిధం

చేయడమైయున్నది. అయితే ప్రతీకోపాసనలో బాహ్యపదార్థాన్నే బాహ్యప్రతీకమునే సత్యమని భావించి, కేవలం దానియందే ఈశ్వర భావనకలిగి, ఇతర పదార్థాలయందు లేకపోతే అది ఈశ్వరోపాసన కాదు; అది కేవలం విగ్రహారాధనే.

"బ్రహ్మదృష్టి రుత్కర్షాత్."

(వేదవ్యాసకృత బ్రహ్మమీమాంసాదర్శనం)

ప్రతీకమందు బ్రహ్మభావాన్ని కలిగిఉండు. కానీ, బ్రహ్మమందు ప్రతీకమును సంభావించకు. అంటే ఆదిత్యాది ప్రతీకములందు బ్రహ్మ దృష్టి వహించు కానీ బ్రహ్మమందు ఆదిత్యాదులను భావించవద్దని అర్థం. బ్రహ్మదృష్టితో భావితమవడంచేత ప్రతీకమందుగూడా ఉత్కృష్ట బ్రహ్మధ్యానం ఏర్పడుతుంది, అందుచేత అది ఉత్కృష్టఫలాన్ని ప్రసాదిస్తుంది. బ్రహ్మమును ఆదిత్యాదులుగా భావించరాదంటే అర్థం ఆదిత్యాదులే ఉపాస్య దైవ (బ్రహ్మ) మని, అన్యములన్నీ బ్రహ్మము కానివని బ్రహ్మమందు ఖండభావాన్ని కలిగియుండకూడదని.*

ఇక అహంగ్రహోపాసనలో –

"ఆత్మేతి తూపగచ్ఛన్తి గ్రాహయన్తిచ"

(బ్రహ్మమీమాంస. 4-1-3)

ఆత్మను పరమాత్మగా భావించి ధ్యానించాలి. అంటే బ్రహ్మ సాక్షాత్కారానికి ఉపాసకుడు బ్రహ్మమును స్వస్వరూపంగా నిరంతరం అనుసంధానం చేస్తుండాలి. వేదోపదేశం కూడా ఇదే. ఈ రెండు రకాల ఉపాసనల ఆశయమూ లక్ష్యమూ ఒక్కటే.

"సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితిశాన్త ఉపాసీత"

(ఛాందోగ్య. 3-14-1)

శాంతంగా కూర్చుండి ఈ దృశ్యమానజగత్తంతా బ్రహ్మరూపంగా భావించు. ఎందుకంటే, ఈ ప్రపంచమంతా ఆ బ్రహ్మమునుండే

---

* సమస్త చరాచరప్రపంచం బ్రహ్మమందు కల్పితం. బ్రహ్మ భిన్నమైన దేదీ లేదు. అందుచేత దేనియందైనా బ్రహ్మభావనచేసి ఉపాసన చేయవచ్చు. దీనిచే ఉపాసింపబడేవస్తువు ఫలప్రదాయి అవుతున్నది. (దీన్నే ప్రతీకోపాసన అంటారు) ఈ ప్రతీకోపాసన పరిపక్వదశలో సర్వత్ర బ్రహ్మదృష్టికి కారణ మవుతున్నది.

ఉత్పన్నమై, స్థితికలదై, మళ్ళీ అందులోనే లీనమవుతున్నది. అందుచేత శాంతచిత్తుడవై బహిరంతరాల్లో బ్రహ్మమును సందర్శించు.

"అథఖలు క్రతు మయః పురుషః"

ఈ పురుషుడు ఇచ్ఛామయుడై ఉద్భవించాడు. ఎలాంటి భావనలు, ఎలాంటి చింతనలు కలవాడౌతాడో, తప్పక అలాంటివాడవుతున్నాడు. అట్టి సందర్భంలో బ్రహ్మభావమే, బ్రహ్మచింతనమే ఎందుకు అవలంబింపకూడదు? తాను బ్రహ్మమే అని యెందుకు భావింపకూడదు?

"సయోహవైతత్ పరమం బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి"

(ముండక. ఉప. 3-2)

ఆ పరబ్రహ్మమును ఎరిగినవాడు పరబ్రహ్మమే అవుతున్నాడు.

అహంగ్రహ ప్రతీకోపాసనలు రెండూ నామరూప ప్రపంచాన్ని అపవదించి విలయంచేయడానికి ఏర్పడినవేగాని, దాని ఉనికిని సాధించడానికి కాదు. ఈ ద్వివిధోపాసనలలో నామరూప ప్రపంచభావాన్ని సంపూర్ణంగా విడువడమే ముఖ్యమైన విషయం. జలం బ్రహ్మము; స్థలం బ్రహ్మము; వాయువు బ్రహ్మము; ఆకాశం బ్రహ్మము; గంగ బ్రహ్మము. ఇవన్నీ బ్రహ్మము అనే ఈ మొదలైన సాకారోపాసనా రూపదర్శక వాక్యాలలోని అర్థం జలస్థలాది వస్తువులతోపాటు బ్రహ్మమును జోడించడం కాదు.

ఈ పాము నలుపు అన్నప్పుడు ఇందులో సర్పమున్నది; నలుపు కూడా ఉన్నది. ఇక్కడ సమానాధికరణముయొక్క బాధ ఉన్నది.

అయితే ఇక్కడ అదేవిధంగా 'జలం బ్రహ్మము' అన్నచోట జలమున్నూ, బ్రహ్మమున్నూ రెండు లేవు. భ్రాంతిపొందినవాణ్ణిచూచి, "ఈ పాము త్రాడు" అన్నప్పుడు పైన చెప్పిన 'నల్లనిపాము' అన్న మాటలో 'నల్లనితనమూ-సర్పత్వమూ' రెండూ ఉన్నట్లు 'పామున్నూ-త్రాడున్నూ' సమానసత్తాకములై రెండుగా లేవు. ఉన్నది త్రాడే. పాములేదు. అదేవిధంగా ద్రవరూపజలం ఉపాసకుని దృష్టికి రాకూడదు. అది బ్రహ్మభావనలో ఇమిడిపోవాలి. కేవలం బ్రహ్మరూపమే మనస్సుకు గోచరించాలి. స్పందనరూపవాయువు భావనలోనికి రాక

కేవలం బ్రహ్మసత్తయే అనే భావం కలగాలి. విగ్రహమందలి విగ్రహ భావం నశించి తత్స్థానంలో చైతన్యస్వరూప భగవానుని దర్శించాలి. ఇదే వాస్తవికమైన ఉపాసన. ప్రేమతో గాయపడి వివశుడైన ఒక ప్రేమికునకు ప్రియురాలి ప్రణయలేఖ వస్తుందనుకోండి, వాడు దానిని చదువుతాడు. ఆ ప్రేమలేఖ కనపడగానే వానిదృష్టి ప్రియురాలి స్వరూపంలో లీనమవుతుంది. ప్రేమలేఖ అతని కప్పుడు కనబడదు; ప్రియురాలిరూపమే కనబడుతుంది. అదేమాదిరి విగ్రహమందు భగవద్దర్శనం కలగాలి. గోపికలు ఉద్ధవునితో ఇట్లన్నారు: "నీవు తెచ్చిన ఈ ప్రేమలేఖ ఎక్కడ ఉంచేమి? హృదయంమీద ఉంచుకుంటే దగ్ధమవుతుంది. నేత్రాలకు అద్దుకుందామంటే తడిసిపోతుంది!" ఉపాసనా నిమగ్నుడికి ఇంద్రియజ్ఞానం చక్కిలిగింతవంటిది మాత్రమే. భగవంతుని వీణాస్పందనం వంటిది. ప్రియుడొక చిటిక వేశాడనుకోండి. ఆ చిటిక వాస్తవానికి ఒక వస్తువుకాదు. దానికి స్వరూపమే లేదు. సత్యవస్తువు ప్రియుడే. అదేవిధంగా ఇంద్రియజ్ఞానంకూడా ప్రియుడైన మురళీధరుని సంగీత స్పందనవలె గోచరిస్తుంది. బృందావనంలో వీచే వాయుశబ్దం గోపికలకు శ్రీకృష్ణుని పిలుపుగా వినబడింది:

"మందమందంబుగా మలయమారుతము
వీచుచు వీనుల విందుగా దెచ్చె
శ్యామసుందరు దివ్యసందేశ మహహా!"

ఉపాసనలో, నాలుకయొక్క సంచలనంమాత్రమే కాదు, సర్వాంగాలు హరినామంతో సంచలితములు కావాలి. శరీరంలోని అణువణువూ బ్రహ్మానంద పారవశ్యమును పొందాలి. ఈవిధంగా కానప్పుడు కండ్లు మూసుకున్నా, ముక్కు మూసుకున్నా, చెవులు మూసుకున్నా, నోరు మూసుకున్నా, గానం చేసినా, అరచినా నీ ఉపాసన నిర్జీవచిత్రం వంటిదే. ఎంతో సుందరమైన చిత్రమే కావచ్చు; కానీ కేవల జడ చిత్రంవల్ల ఏమి ప్రయోజనము?

చదరంగమందు కొయ్యముక్కలను రాజనీ, మంత్రియనీ, యేనుగనీ, గుఱ్ఱమనీ, బంటనీ, భావించడం వంటిదే ఉపాసన. జలం బ్రహ్మము, స్థలం బ్రహ్మము, ఆకాశం బ్రహ్మము, అగ్ని బ్రహ్మము, మనస్సు

బ్రహ్మము- అని ఈవిధంగా ఉపాసనారూపంగా ఆయా వస్తువులందు ఆయా వస్తుభావాన్ని తొలగించి, వానియందు బ్రహ్మభావాన్ని ఏర్పరచుకొంటాము. దీనిచేత చిత్తశుద్ధి, ఏకాగ్రత, బ్రహ్మజ్ఞాన ప్రాప్తి సిద్ధిస్తుంది. మొదట ఈ భావన కల్పనామాత్ర పర్యవసితమైయున్నా, ఇది, బాలుడు తన గురువుయొక్క ఆదేశానుసారం గుణకారము, భాగహారమూ చేసేపద్ధతులను స్వీకరించడం వంటిది. భాగహారం, గుణకారం ఎందుకు ఈవిధంగాచెయ్యాలి? ఈవిధంగా చేస్తే సమాధానం సరిగారావడానికే కారణం ఏమిటి? అనే విషయాలన్నీ ఆపిల్లవానికి తరువాత బీజగణితం చదివేటప్పుడు తెలుస్తాయి. కానీ జాగ్రత్త! గురువుగారు చెప్పినపద్ధతులను, సూత్రాలను ఒకదాన్ని ఇంకొకదానిగా భావించి తికమకపడవాకు.

విగ్రహం (ప్రతిమ) అంటే ఏమిటి? పరిమాణమును తెలిపేది. (Unit of Measurement) తూచేది- కొల్చేది. తూకపురాయి చిన్నదైతే, తూచబడే వస్తువుయొక్క బరువు ఎక్కువగావుంటుంది, తూకపురాయి ఒకపావుబరువుఅయితే, వస్తువుబరువు నాలుగవుతుంది. తూకపురాయి బరువు చటాకైతే వస్తువుబరువు పదునారౌతుంది. హిందూధర్మమందుప్రతీకములుఈశ్వరుని తూచేతూనికరాళ్లు.హిందూధర్మమందు అత్యుత్కృష్టములైన సూర్యచంద్రరూప ప్రతీకములూ, గురుబ్రాహ్మణరూప ప్రతీకములూ ఉన్నవి. తరువాత గోగరుడరూప ప్రతీకములూ, అశ్వత్థ తులసీరూపప్రతీకములూ ఉన్నవి. కైలాసగంగారూప ప్రతీకములూ ఉన్నవి. ఇవిగాక సాలగ్రామములు, చిన్న చిన్న రాళ్లుకూడా ప్రతీకములుగా ఏర్పడినవి. ఇవి ఏర్పడింది సర్వేశ్వరుని తక్కువచేయడానికేనా? కాదు నాయనా కాదు! ప్రతీకములు చిన్నవిచేయడం ఈశ్వరుని గొప్పచేయడానికే. ఈశ్వరభావం- బ్రహ్మదృష్టి అనే సముద్రం ఎల్లలు త్రెంపుకొని వెల్లివిరిసి ప్రవహించడానికే ప్రతీకం తగ్గించబడింది. చిట్టచివరకు ఇలాంటి చిన్న రాతిముక్కనే బ్రహ్మంగా దర్శించినపుడు, మిగతా సమస్తపదార్థాలు, యావత్ప్రపంచంగూడా బ్రహ్మరూపంగా భాసించగలుగుతుంది. ఆవిధంగాకాక, ఈచిన్న రాయి

మాత్రమే బ్రహ్మమని తలిస్తే, అలాంటివాడు రాతికిబట్టిన పురుగులాంటి వాడే.

## అహంగ్రహోపాసన - పరాపూజ

పదార్థములయొక్క నామరూపాలను గమనింపకుండా వాని యందున్న ఆనంద సత్తాంశములయందు చిత్తమును లగ్నంచేయడం - శబ్దాలను వదలి శబ్దార్థాలను గ్రహించేవిధంగా చర్మచక్షువులకు గోచరించే ఆకారాలను మరచి బ్రహ్మమందు లీనమవడం - ఉపాసన. ఇది ప్రతీకం ద్వారానే అభ్యస్తం కావాలా? అంటే మొదట యిది ఉండవలసిన దే. తరువాత ఉండితీరవలసిన పనిలేదు. ఈప్రతీకసహాయం అక్షరాభ్యాసకాలంలో పలకమీాద వరవడి వంటిది. ఇది అభ్యాసకాలమందే సహాయకారి. బాగా వ్రాయడం నేర్చుకున్న పిదప ఎక్కడబడితే అక్కడ స్వేచ్ఛగా వ్రాయడం సాధ్యమవుతుంది. అదేమాదిరి బ్రహ్మదర్శనవిధానం తెలుసుకున్నమీాదట, ఎక్కడ దృష్టిపడ్డాసరే బ్రహ్మానందమును అనుభవించడానికి శక్యమవుతుంది. విగ్రహారాధన సర్వత్రా బ్రహ్మమునే దర్శించే యోగ్యతను మనకు కలిగించేదిగా ఉండాలి. విశ్వమంతా విష్ణుమందిరమై పోవాలి. అంతా రామమయంగావాలి. ప్రతివస్తువూ భగవద్రూపమై కనపడాలి. ప్రతిపనీ పూజయై ప్రకాశించాలి. నడకంతా ప్రదక్షిణం కావాలి. గృహోద్యానాదులన్నీ గోవిందమందిరాలు కావాలి. విగ్రహారాధనకు ఫలితంగా ఇట్టిదృష్టి కలగాలి.

సత్యమై సజీవమైన ఉపాసన ఎవరిలో పరిపక్వదశ పొందుతుందో వారినిగూర్చి, "యావద్ధ్రియతే సాదీక్షా యదశ్నాతి తద్ధవిః యత్పిబతి తదస్య సోమపానం, యద్రమతే తదుపసదో, యత్సంచర త్యుపవిశత్యుత్తిష్ఠతేచ, ప్రవర్గ్యోయన్ముఖం తదాహవనీయో, యావ్యాహృతి రాహృతిర్యదస్య విజ్ఞానం తజ్జుహోతి॥" అని మహానారాయణోపనిషత్తు (ఖండ 25) గానం చేస్తున్నది.

ఎవడీ విధంగా ధైర్యం వహిస్తాడో అదే దీక్ష; అత డేదిభుజిస్తాడో అదే హవిస్సు. అతడు పానం చేసేదంతా సోమపానం. అతని క్రీడలే

సేవోపచారాలు. అతడు కూర్చుండడం, నిలబడడం, నడవడం- ఇదే ప్రవర్గ్యం. అతనిముఖమే హవన యోగ్యమైన అగ్నిహోత్రం. అతని వ్యాహృతే ఆహుతి. ఆతని విజ్ఞానమే హవనం.

ముక్తిని, శాంతిని, సౌఖ్యాన్ని పొందాలనుకుంటే భేదభావాన్ని నిర్మూలించి, సర్వత్ర బ్రహ్మదృష్టి కలిగియుండాలి. దీని కిదే ఏకైక సాధనం.

ఈ బ్రహ్మదృష్టి యొక్క ఆవశ్యకత దేనికంటే - "బ్రహ్మసత్యం జగన్మిథ్యా" వస్తుతః జగత్తు బ్రహ్మముగానే ఉన్నది. తత్త్వం ఈవిధంగానే ఉన్నది. "బ్రహ్మమే సత్యం, జగత్తు కాల్పనికం, మిథ్య."

ఈశ్వరనియమాలను విస్మరించి లక్ష యత్నాలు చేసినా అంధకార వలయంలోనుంచి నీవు ఎక్కడికిపోగలవు? వేదప్రోక్తమైన ఆధ్యాత్మిక సిద్ధాంతం భౌతికవిజ్ఞాన శాస్త్రానికి(సైన్సుకు) శాస్త్రమైయున్నది. అమెరికా దేశీయుడైన మహాత్మా అమరసేన్ (ఎమెర్సన్) తన దైనందిన జీవితంలోని ఆత్మానుభూతిని ఎంతో వాస్తవికంగా ఇట్లు నిర్వచించాడు. "ఏవస్తువునైనా వాంఛించడం, భిక్షుకునిలాగా పరుని ప్రీతికోసం నోరుతెరుచుకొని యుండడం ఇది పవిత్రప్రేమకాదు. ఇది అధమమైన నీచమైన మోహం. నాకోసం నీవు నిన్ను త్యాగంచేసుకొని 'నీవూ నేనూ' అనే భేదదృష్టిలేని ఆ పరమోచ్చభావంలో ఎప్పుడు ప్రవిష్టుడవౌతావో, (ఆ దేహాతీతమైన నిస్స్వార్థమైన ఆత్మైక్య స్థితిని ఎప్పుడు అందుకుంటావో) అప్పుడు నేనే స్వయంగా ఆకర్షింపబడి నీవద్దకు రావలసియుంటుంది. అప్పుడు నీవు నన్ను నీ పాదసన్నిధిలో చూడగలుగుతావు. నీ వెవరినైనా ప్రేమిస్తూ ప్రతిఫలంగా వారి ప్రేమను వాంఛిస్తే, నిరాదరణా తిరస్కారమే నీకు లభించేది. ఈ విషయాన్ని గుర్తుంచుకో."

ముంజేతి కంకణానికి అద్దం అవసరంలేదు. నీకు క్లేశరూప మృత్యువునందు విముఖత వుంటే శాంతిగా ఏకాంతంలో ఉపవిష్టుడవై చిత్తస్థితిని దానియొక్క సుఖదుఃఖ కారణాలను విచారణ చెయ్యి. సత్యాసత్యాలు నీకే తెలుస్తాయి, మనస్సు సర్వసంగ పరిత్యాగమును

పొంది, బ్రహ్మానంద పదవిని పొందినప్పుడు, ఐశ్వర్యము, సౌభాగ్యము, ఆకలైన పిల్లవాడు తల్లివద్దకు పరుగెత్తుకొనివచ్చినట్లు వాటంతటవే నీవద్దకు పరుగెత్తుకొనిరావడం దృఢమైన విచారశక్తివల్ల నీవు గమనించగలవు.

"యథేహ క్షుధితా బాలా మాతరం పర్యుపాసతే."

(సామవేదము)

మనయందు సత్వగుణము, శాంతిరూపియైన విష్ణువు వసించియుంటే, భర్తృసేవకోసం లక్ష్మీదేవి, సహస్ర రూపాలతో మన వాకిటిలో పడియుంటుంది. కానీ, భక్తులూ ధర్మాత్ములు దుఃఖ దరిద్రాలతో పీడింప బడుతుంటే, అధర్మపరాయణులు అత్యున్నతిని పొందుతున్నా రేమిటని కొందరు ఫిర్యాదు చేస్తుంటారు. పాపం ఈ అమాయకులైన దుఃఖితులు కార్యకారణ నిర్ణయంలో అన్వయ వ్యతిరేకాలను వాడుకోలేకున్నారు. ధర్మము–భక్తి–అంటే ఏమిటో వీండ్లకు తెలియనే తెలియదు. స్వార్థాన్ని, ఈర్ష్యను, దేహాభిమానాన్ని వాండ్లు వదలనేలేదు. దేహాభిమానాన్ని విసర్జించడమే ధర్మాచరణం. అప్పుడు ధర్మాచరణం చేస్తూ దుఃఖితులమై యున్నాము – అనే వారి ఈ ఆరోపణ యుక్తమైంది, సత్యమైంది ఎట్లవుతుంది? ధర్మాచరణ ఉన్నప్పుడు, స్వార్థేర్ష్యా సంపూరితమైన ఈ ఆరోపణం చేయడమే కలగదు. అహంకారాభిమానాలను పెంపొందించే దానమూ, భజనా గూడ ధర్మంగా పేర్కొనబడవు. అధార్మికుడు అభివృద్ధి పొందుతుంటే, అతని అభివృద్ధికి అతనిలో ఒకవైపుఉన్న అతని ఏకాగ్రత, ఒకరకమైన ఆత్మాకారస్థితి కారణాలు. నీవు దీనిని గమనించలేదు. మరియొక భాగంలోని ఆతని పాపకర్మలకు ఫలం మహాక్లేశం వుండనే వున్నది. దీనిని గూడా నీవు గమనించలేదు.

వ్యర్థంగా ఎవరైనా నీకు చెడు చేస్తారనుకో, అప్పుడు నీవు నిరహంకారుడవై, నిష్పక్షపాతదృష్టితో నీ పూర్వాపర సందర్భాలను ఏకాంతంగా విచారించుకో. అయుక్తమైన రజోగుణంలో నీమనస్సు ప్రవేశించి ఆత్మకు విముఖుడవై రాముని సిద్ధాంతాన్ని ఉల్లంఘించడం చేతనే నీకీ కొరడాదెబ్బ తగిలింది. మనస్సు బ్రహ్మాకృతి నందకుండడం

వల్లనే నీకీ శిక్ష లభించింది. కొంచెం తెలివి తెచ్చుకొని ఆలోచించు - నీకు కీడు కలిగించిన శత్రువుమీద నీవు పగతీర్చుకోదలిస్తే, నీ మొదటి తప్పును నాలుగైదురెట్లు పెంచుతున్నావన్నమాట. ప్రతిక్రియచేత అపరాధి రూపమైన జగత్తును సత్యంగానూ, బ్రహ్మమును మిథ్యగానూ చేస్తున్నావు. ఇది ఈశ్వరధర్మాన్ని తలక్రిందుచేయడం.

గుర్తుంచుకో. గర్వించి విర్రవీగినట్లైతే అప్పడాలపిండికి లాగా సర్వతోముఖ సమ్మర్దనం తప్పదు. సాధారణంగా జనులు ఇతరులదోషాలను పెద్దగా ఏకరువుపెడుతూ తమను సత్యవంతులుగా నిర్దోషులుగా చెప్పుకుంటుంటారు. అవును! ప్రత్యగాత్మరూపంలో ఉన్న నీవు కళంకరహితుడవే. కానీ, నిన్ను నీవు శుద్ధమైన ఆత్మగా భావించికూడా, ఆవరణరూపంగా (శరీరము) గూడ భావించడం దేనికి? శరీరము, మనస్సు, బుద్ధి వీనితో తాదాత్మ్యంబొంది అహంభావంతో తనను తాను నిష్పాపునిగా ప్రకటించుకోవడం- సమస్త పాపాలకు మూలకందమైన ఘోరపాపం. నీవు సత్యరూపమైన ఆత్మకు విముఖుడవై యున్నప్పుడు రుద్రరూపమైన ఈశ్వరన్యాయం నిన్ను ఏడిపించకుండా వదలదు. అలాంటి ఈశ్వరుడు నీ శత్రువును మాత్రం విస్మరించాడనుకొన్నావా? ఈశ్వరన్యాయ త్రిశూలమును హస్తగతం చేసుకోడానికి నీకేమి అధికారమున్నది? ఇతరుల విషయం నీకెందుకు? నిన్ను నీవు సంపూర్ణునిగా చేసికో. ప్రతీకారయత్నం భగవద్విశ్వాసరహితమైన నాస్తికత్వమై యున్నది. ఓప్రియా! ఆత్మీయా! ఓద్వేషాతురుడవైన అవివేకీ? నీ శత్రువును నీవెంత పరిమాణంలో బాధించడానికి ఆలోచిస్తున్నావో, అంతపరిమాణంలో నీవు బ్రహ్మధ్యానానందంలో మగ్నుడవుగా. నీ శత్రువుయొక్క శత్రుత్వం రూపుమాసి పోకపోతే నన్నడుగు. బ్రహ్మవిస్మరణమే దుఃఖరూపమైన ఝంఝూటం. నీయందున్నదే అందరియందున్నది.

"యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ"

(కఠ. ఉప. I-4-10)

'ఇచ్చట ఉండేదే అచ్చట, అచ్చట ఉండేదే ఇచ్చటాఉన్నది.'

నీవు ఆత్మను ద్రోహంచేస్తే, జగత్తు నీకు ద్రోహంచేస్తుంది. నీలో ఉండే అంతర్యామివే నీవైనప్పుడు ప్రపంచ రంగమందు నీకు ప్రమాదమెక్కడిది? నిన్ను ప్రపంచంలో చెనకే వాడెవడు?

"యో మనసి తిష్ఠన్మనసోఽన్తరో, యం మనో వేద,
యస్యమనః శరీరం, యో మనోఽన్తరో యమయతి,
ఏషత ఆత్మాఽన్తర్యామ్యమృతః" (బృహ. ఉప. 3-7-20)

"మనస్సులో ఉండునదీ, మనస్సుకు వేరై యుండునదీ; మనస్సుచే గ్రహింపబడనిదీ, మనస్సును శరీరంగాగలదీ, మనస్సులో ఉండి మనస్సును నియమించేదే నీ ఆత్మ. అదే అంతర్యామి, అదే అమృత స్వరూపం."

నీవు నీ మనః కాపట్యాన్ని వదలి శాంతుడవైనప్పుడు నీ భూత భవిష్యద్వర్తమానములు మూడూ శాంతిప్రదములౌతాయి.

హృష్టపుష్ట శరీరం గలవాడొకడు బండిమీద వెళ్ళుతున్నాడు. ఆతని పుష్టికి బండిగానీ, బండికిగూర్చిన గుఱ్ఱాలుగానీ కారణాలు కావు. అన్నం-అతనిలో జీర్ణమయ్యే అన్నమే కారణము. అదేమాదిరి నీ వెక్కడైనా ఐశ్వర్యమునుగానీ, సౌభాగ్యాన్నిగానీ చూచినప్పుడు అందుకుకారణం మోసం, కపటం కాదు. ప్రమాణంచేయించి, ఒట్లు పెట్టించి, నీవు వాండ్లను అడిగిచూడు - మోసమూ కపటమూ నడచినంతవరకూ తప్పక హానికలిగిఉంటుంది. ఆనందానికి సుఖానికి కారణం-తెలియకనో తెలీకుండానో దేహభావంపోయి చిత్తంలో బ్రహ్మభావం వ్యాప్తినొందడం తప్ప వేరేమిలేదు. అన్నం తింటూ నీవు దానిని చూడకపోతేనేం? కడుపు నిండుతున్నది. ఆతని సంపద్విశేషానికి కారణాన్ని ఆతడు మరచిపోతేనేం? పిల్లలు ఒక్కొకసారి రాత్రిళ్ళు పాలుత్రాగి ఉదయాన్నే మరచి పోవడంలేదా? నూనె నువ్వులనుండే పుడుతుంది. సుఖం, ఆనందం, సౌభాగ్యం ఆత్మాకారవృత్తి లేంది ఎన్నటికి కలుగబోవు.

"యదా చర్మవదాకాశం వేష్టయిష్యంతి మానవాః,
తదా దేవ మవిజ్ఞాయ దుఃఖస్యాంతో భవిష్యతి."

(శ్వేతా - ఉప. 6-20

ఆకాశాన్ని చర్మం విధంగా మనుష్యులు చుట్టజుట్ట గలిగి నప్పుడు దేవుని తెలిసికోకుండానే దుఃఖం నశిస్తుంది.

దృష్టాంతంచేత, ప్రమాణంచేత, యుక్తిచేత, ఊహలచేత ఈవిషయం సత్యమే. కానీ–నేనిప్పుడు యుక్తి, ఉక్తిమొదలైన వాటిని గూర్చి శాస్త్రార్థాలు చేయడంలేదు. నేను ఎంతో దగ్గరదారి తెలుపు తున్నాను. ఇదిగో నీవు! ఇదిగో నీప్రపంచం! ఇదిగో చూడు! బాగా కళ్ళు తెరచిచూడు! సత్యం స్పష్టంగా గోచరిస్తుంది. నీ మనస్సులో ప్రాపంచిక సంబంధాల తూకం ఈశ్వర భావాన్ని మించిఉన్నంతవరకూ 'నేనూ, నాది' అనే భావాలు చిత్తంలో వ్యాపించి త్యాగశాంతులను అణచివేస్తుండే టంతవరకు, "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" రూపమైన సత్య సిద్ధాంతం ఉపేక్షింపబడుతున్నంతవరకూ, దుఃఖక్లేశ పీడనం తప్పదు. అంతవరకూ అంధకూపపాతిత్వం తప్పదు. వనస్పతి రసాయన శాస్త్ర సిద్ధాంతాలవలె, ఈ సిద్ధాంతం అనుభవపూర్వకంగా పరి శోధనాపూర్వకంగా ఋజువైన విషయం.

ప్రపంచంలోగల రోగం ఒక్కటే. దానికిగల ఔషధం కూడా ఒక్కటే. మానసికంగాగానీ, కాయికంగాగానీ బ్రహ్మమును మిథ్యగా, జగత్తును సత్యంగాచూచే ఈ విపరీతవృత్తే సర్వరంగాలలోని దుఃఖంగా ప్రకటితమవుతుంటుంది. ఇక ప్రతి విపత్తుకు మహౌషధం – బ్రహ్మాగ్నిలో శరీరాదికం లేనేలేదని తలచి జ్వాలారూపంలో లీనంగావడమే; బ్రహ్మైక్య జ్ఞానమును పొందడమే.

ప్రాపంచిక పదార్థప్రేమకు ఫలితం లభిస్తున్నది. భగవంతుని ప్రేమించడం గాలిని గుప్పిటలో పట్టడంవంటిదేగాని అందువల్ల లాభ మేముంటుందని ప్రజలభయం. ఇది వట్టిభ్రమ. భగవంతునిమీది ప్రేమతో మన గుండె రవ్వంత కొట్టుకుంటే, భగవంతుని గుండె ఒక్క సారిగా దడదడ కొట్టుకొంటుంది – మనకు సమాధానం లభిస్తుంది. ప్రాపంచికపదార్థాలనుండి మన ప్రేమకు సమాధానం ఎప్పుడు వస్తు న్నది? వాటినుండి నిరాశపొంది, వాంఛాతీతులమై ఈశ్వరభావంలో లీనమైనప్పుడే లభిస్తున్నది. భగవంతుడు సర్వసిద్ధిప్రదాత.

లోకమానవులు, నీ చెవిలో వారివారి మంత్రాంగాలు నూరి పోస్తారు. "ఇదిగో నిన్ను వాండ్లు అట్లంటున్నారు. ఇట్లంటున్నారు. ఆయన కోపించాడు. దావా వేశారు. రోగం వచ్చింది." - ఇలాంటి ఏవేవో చెపుతారు. పిచ్చివాడా! వీటిమీద ఆధారపడి నీహృదయాన్ని మలినం చేసుకోవాకు. నీవు వీనియందు ఒక్కదానినికూడా లెక్క చేయవాకు. వితథమైన ఈ దృశ్యప్రపంచానికి ఉనికి పరబ్రహ్మమే. బ్రహ్మమే సత్యం. ఈ సుఖదుఃఖ స్వప్న ప్రపంచ దృశ్యాలకు విభ్రాంతి పడకు. బ్రహ్మానంద మధుపాన పారవశ్య నిర్లక్ష్యత్వంతో ముందుకు నడువు. మనస్సును నిస్సంగత్వంతో బ్రహ్మానందంతో నింపిచూడు - ఈ విపత్తులన్నీ సప్తసముద్రాలను దాటి కొట్టుకోని పోకపోతే నన్ను సముద్రంలో పారవెయ్యి.

ఒకబాలుడు తన అన్నను ఈవిధంగా బెదిరిస్తున్నాడు: "నేడు నిన్ను నాన్న కొడతాడు. చచ్చేదాక గుర్తుండేలాగు కొడతాడు." ఆ రెండవ పిల్లవాడు శాంతంతో ఇట్లు సమాధానం చెప్పాడు: "ఆయన నన్ను కొడితే నామేలుకోసమే కొడతాడు. మరి నీకేం లాభం?" ఈ బాలుడికున్న విశ్వాసంవంటి భగవద్విశ్వాసం మనకుండాలి. ముందు నా గతేమిటా అని ఎందుకు ఏడ్వడం? ఏ సందర్భంలోనూ దైవవిశ్వాసాన్ని విడిచి వైకల్యం పొందనవసరంలేదు. సర్వత్రా, సర్వకాలాలలో నీతండ్రియైన ఆత్మదేవుడు - ఆత్మేశ్వరుఁడు - తప్ప ఇతరు లెవరున్నారు? ఒకవేళ నిన్నాయన శిక్షించినా నీమంచికే శిక్షిస్తాడు. నీవాయన సంకల్పానుసారం సంచరిస్తే వ్యర్థంగా నిన్ను శిక్షించడానికి ఆయన పిచ్చివాడుకాడు. ఆకులపడకు. సుఖదుఃఖ సమతవహించి, అకించనుడవై శాంతి వహించు. బ్రహ్మనిష్ఠుడవైన నీకు నిత్యశాంతి కరతలామలకం.

# ఉపాసనకు 'ఏకాగ్రతకు' విఘ్నములు

మానవుడు తనను సంపూర్ణంగా పరమాత్మకు సమర్పించుకోవ
మిథ్యాకారణసత్తాయందు* డంవల్ల కలిగే ఆనందం అత్యద్భుతం. అయితే
విశ్వాసం సమస్తానికి కారణభూతుడు (నిజరూపుడు)
పరమాత్మే అన్న దృఢవిశ్వాసం కలిగితేనే అట్టి ఆనందం లభిస్తుంది.

అరబ్బీ, పార్శీ, ఉరుదు భాషల్లో కారణమును 'సబబ్' అంటారు. అరబ్బీలో 'సబబ్' అనే పదానికి 'డోర్' 'రస్సీ' అంటే త్రాడు – అని. మౌలానాజలాల్ అనే రోం దేశీయుడీ విధంగా వ్రాశాడు – కార్యకారణ భావరూపమైన త్రాడు, ఈ ప్రపంచ కూపమందు సమస్త ఘటాలను (జీవుల కంఠాలను) బంధించి త్రిప్పుతున్నది. ఎందుకు త్రిప్పుతున్నది? ఆధారరహితంగా త్రాడు త్రిప్పగలదా? బావి పైన ఉండి పరమాత్మ త్రాడును త్రిప్పుతున్నాడు. అయినా ఈ త్రాడే పైకి ఈ సమస్త ఘటాలను త్రిప్పుచున్నమాదిరి మనకు కనబడుతున్నది. కానీ, ఈ త్రిప్పువాడు ఆతడే, ఆ పరమేశ్వరుడే. "కారణం కారణానామ్."

"సయథా దున్దుభేర్హన్యమానస్య న బాహ్యాఞ్ఛబ్దాఞ్ఛక్నుయాత్ గ్రహణాయ, దున్దుభేస్తు గ్రహణేన దున్దుభ్యాఘాతస్య వా శబ్దోగృహీతః; సయథా శంఖస్య ధ్మాయమానస్య న బాహ్యాంఞ్ఛబ్దాఞ్ఛక్నుయాద్గ్రహణాయ, శంఖస్యతు గ్రహణేన శంఖధ్మస్య వా శబ్దోగృహీతః; సయథా వీణాయైవాద్యమానాయై బాహ్యాఞ్ఛబ్దాఞ్ఛక్నుయాద్గ్రహణేన, వీణాయైతు గ్రహణేన వీణావాదస్య వా శబ్దో గృహీతః"
(బృహ. ఉప. 4-5-8-10)

"దుందుభి మ్రోగించబడేటప్పుడు బాహ్య శబ్దాలను మనం పట్టుకోలేము. దుందుభిని లేదా దుందుభిని మ్రోగించేవాణ్ణి పట్టుకుంటే దుందుభి ధ్వనులు మనకు వశమవుతాయి. శంఖం పూరించబడుతున్నప్పుడు బాహ్యశబ్దాన్ని మనం పట్టుకోలేము. కానీ శంఖాన్ని,

---

* వ్యావహారిక దృష్ట్యా జీవేశ్వరులకు, జగత్తుకు, ఈశ్వరునకు కార్యకారణ భావం అంగీకరింపబడినా వస్తుతః ఇది మిథ్యగా ఉన్నది. వాస్తవానికి జగత్తు, జీవుడు, ఈశ్వరుడు, సమస్తమూ ఒకే బ్రహ్మపదార్థముగా ఉన్నది. ఐనా బంధం మిథ్యాభావంచేత ఏర్పడుతున్నది.

లేదా శంఖము నూదేవాణ్ణి పట్టుకుంటే ఆ శంఖధ్వనులు మనవశమవుతాయి. వీణ మ్రోగుతున్నప్పుడు ఆ వీణాధ్వనులను పట్టుకొనడం మన కసాధ్యం. కానీ వీణను లేదా వీణావాదకుని పట్టుకుంటే ఆ వీణాధ్వనులు మన వశమవుతాయి."

డోలు, మృదంగం, వీణ, శంఖం, హార్మోనియం ఇత్యాది యంత్రాల ధ్వనులు పట్టుకోవాలనుకుంటే అవి పట్టుబడవు. యంత్రాలను లేదా యంత్రవాదకులను పట్టుకుంటే యంత్రశబ్దాలన్నీ తమకు తామే పట్టుబడతాయి. ఇట్లే, ఒక్క పరమాత్మను దృఢంగా పట్టుకుంటే వెంటనే సమస్తం మనకు పట్టుబడుతుంది. నీ వాంఛాసిద్ధికి, నీ ఆశాపూర్ణతకు ఆత్మదృష్టిని ఆశ్రయింపకుండా, ఎవరో ఒక పెద్దమనిషి ప్రాపునూ, ధనధాన్యాలను, విద్యను, బలాన్ని ఆశ్రయిస్తే మోసపోతావు. దుఃఖభాజనుడ వవుతావు.

గోపికల యిండ్లల్లో కృష్ణుడు పాలూ, పెరుగూ, వెన్నా తిని, ఇంట్లో కట్టబడియున్న చిన్నదూడల ముట్టెలకు కొంత పెరుగో వెన్నో పట్టించి పోతుండేవాడని, ఇంక ఆ గోపికలు ఆ దూడలే దొంగలని తలచి పాపం వాటిని పట్టుకొని కొట్టడం జరగేదని చెపుతారు. సర్వ విషయాలకు కారణం ఆ భగవంతుడొక్కడే; మిగిలిన కారణాలన్నీ ఆ తెల్లని ముట్టెలుగల అమాయకపు దూడల వంటివి. గర్భదరిద్రులకు లక్షాధికారనీ కోటీశ్వరుడనీ పేర్లుంచబడ్డాయి. నీవెందుకు భ్రమిస్తావు? బాహ్యములైన ప్రాపంచిక మిథ్యాకారణాలు చూచి సుఖహేతువులని మోసపోకు. ఆనందానికి ఇవి వాస్తవకారణాలుకావు. కన్యక వివాహం కానంతవరకే బొమ్మలతో ఆడుకొంటుంది. వరుడు లభించిన తరువాత ఆడుకోదు. పరమకారణమైన పరబ్రహ్మ స్వరూపం లభించినప్పుడు, మిథ్యాకారణాలతో నీవు వినోదించడం ఉండదు.

భానుమతి నాటకంలో బొమ్మలాడుతున్నవి. "ఒకటె ఒకదాన్ని పిల్చింది, కనుక అదివచ్చింది. ఒకటె ఒకదాన్ని కొట్టింది. అది చచ్చింది." ఇలాంటి మిథ్యా విషయాలనుచూచి జనులు భ్రమిస్తుంటారు. అసలు కారణం సూత్రధారి అని గ్రహింపరు. నిజమైన కారణం ఆ రంగ

నాథుడు, ఆ నటరాజు, ఆ అంతర్యామి కాక ఇంకొకరులేరు. ఒక పాట గానీ, పిల్లనగ్రోవిగానీ వినబడుతున్నప్పుడు ఒకశబ్దం వెనుక ఇంకొక శబ్దం, ఒక స్వరం వెనుక ఇంకొక స్వరం పరస్పర సంబంధితాలై వస్తుంటాయి. ప్రజ లీకారణ కార్యభావాలను గుర్తించడంలో భ్రమపడు తుంటారు. సత్యకారణం ఆ గాయకుడే, ఆ మురళీధరుడే!

ఎత్తైన మేడపైని అంతస్తుకు క్రిందిఅంతస్తునూ, దానికి దాని క్రిందవుండే గచ్చును, కారణాలుగాభావించి లోకులు విభ్రాంతులవు తుంటారు. కానీ వీటన్నిటికి కారణభూతం భూమికదా!

సుఖశాంతులకు ప్రాపంచిక కారణాలను ఆశ్రయించి వానిమీద ఆశతో ఆధారపడడం ఉత్తాలతరంగాకుల సముద్రంలో మునుగుతూ గడ్డిపోచను ఆధారంగా పట్టుకోవడం వంటిదే. కురుక్షేత్రరణాంగంలో భీష్ముని ప్రతాపజ్వాలకు అర్జునుడు వెరగుపడినసమయంలో, కృష్ణ పర మాత్మ క్రోధపరవశుడై సుదర్శనచక్రానికి బదులు రథచక్రాన్ని తీసు కొని భీష్మాచార్యునిపైకి కుప్పించి దుమికాడు. కాని పనికాలేదు. తన ప్రతిజ్ఞా భంగమైంది. ఈదృశ్యాన్నిచూచి వృద్ధుడైన భీష్ముడుకూడా నవ్వాడు. ఇక ఇప్పుడుకూడా అలాంటిపనే జరుగుతుందా? జరుగ కూడదు. ఈచర్మచక్షువులకు గోచరించే కారణాలు ఆధారాలు, ఆశ్ర యాలు అతితుచ్ఛములు. వీనినాశ్రయించడం, వీనిపై ఆధారపడడం అనుచిత రథచక్రాన్ని ఎత్తడంవంటిదే. దీనివల్ల అయేదేమిటి? సుఖ శాంతులు రావు. నీ నిజస్వరూపమును స్మృతికిదెచ్చుకో. విభ్రాంతివిడిచి కండ్లుదెరువు. నీ వీ కలహమందు, కలకలమందు వికలతపొందడం దేనికి? తత్త్వమసి! నీవు అపరబ్రహ్మవు! సంశయపడకు, నీ అసలు సుదర్శ మును - నీబ్రహ్మదృష్టిని- పట్టుకో! అదిగోచూడు - నీ భయంచేతనే సూర్యుడు కంపిస్తున్నాడు. వాయువు పలాయనంచేస్తున్నాడు. సముద్రం కళవళపడుతున్నది. మృత్యువు నీచేతి కొరడానుచూచి పారిపోతున్నది.

భీషాస్మాద్వాతః పవతే భీషోదేతి సూర్యః,
భీషాఽస్మాదగ్నిశ్చేన్ద్రశ్చ మృత్యుర్ధావతి పఞ్చమ ఇతి".

(తైత్తిరీయ. 2-7-1)

"ఈ పరబ్రహ్మమునకు భయపడి వాయువు చలిస్తున్నది. ఈ భయంచేతనే సూర్యుడు ఉదయిస్తున్నాడు. ఈ భయంవల్లనే అగ్ని, ఇంద్రుడూ, మృత్యువుకూడా పరుగెత్తి పనులు చేస్తున్నారు.

విషయాధీనుడవై యుండడమంటే పరాధీనుడవై మృతి నొందడమే. ఈవిధంగా అవశుడవై శరీరాన్ని సమాధిజేసి క్రుళ్ళబెట్టడమే. మమకారాహంకార మలిన దూరమైన శరీరంలో (నిర్మమో నిరంహంకారః) ఆత్మజ్యోతి విద్యుద్దీపంలో విద్యుత్తులాగా సువ్యాప్తమై వెలుగొందుతోంది. బాహ్యవిషయ విశ్వాసంవల్ల ఏపనీ సాఫల్యం కాదు. ఈ బాహ్యాకారణాలు, ఈమెరుపులన్నీ మిథ్యారూపాలే కాని సత్యంగావు. ఇవి ఎర, చేపను బంధించినట్లు ఆశగొలిపి సంసారంలో బంధిస్తాయిమాత్రమే. బాహ్యవిషయాలపై ఆధారపడక, స్వార్థపరిత్యాగంచేసి ఏకార్యమైనా సరే, "ఓరామా! ఇది నీకార్యం. ఈ కార్యం అయినా సరే కాకపోయినాసరే, దీని లాభనష్టాలతో నాకు పనిలేదు. నీతో అభేదంగా ఉండడమే నాకానందం. నీ వీ కార్యాన్ని చక్కబెట్టినా సంతోషమే. చెడగొట్టినా సంతోషమే. నీ యిష్టమే యిష్టము" అనే ఈశ్వరైక్యభావంతో నీవు ఆచరించినట్లైతే ప్రపంచంలోగల సర్వశక్తులు నీయాజ్ఞను శిరసావహించి వెంటనే నీ కార్యాన్ని నెరవేరుస్తాయి. రామకార్యానికి ఆటంకాలే? ఎప్పుడూ కలగవు!

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్"
(గీత 9-22)

"అనన్య చిత్తంతో నన్ను చింతిస్తూ, నన్నుపాసిస్తూ *నిత్యయుక్తులై యుండే జనుల యోగక్షేమాలను నేను వహిస్తాను."

ఈశ్లోకం భగవద్గీతామధ్యమందుండి గురుత్వ కేంద్రంలాగా ఇరుపార్శ్వాలను సరిసమానంగా తూస్తున్నది.

---

* భగవత్సేవ కుపయోగపడే శరీరాన్ని నిలుపుకోవడానికిచేసే ప్రయత్నం తప్ప వేరే ఏయిచ్ఛయు లేని భక్తులు.

భగవానుని ఈ నిబంధన, ఈశాసనం, అగ్ని అధోముఖంగా జ్వలించినా, సూర్యుడు పడమరదిక్కున ఉదయించినా అసత్యం కాదు. కాదు.

మిత్రుడా! మానవజన్మమెత్తికూడా శాంతిపథాన్ని విడిచి దుఃఖాకులుడవై యుండడం ఎంతో సిగ్గుపడదగినవిషయం. తల్లీ తండ్రీ చనిపోయిన దిక్కులేని దీనులు దుఃఖిస్తారు. కానీ నీ రాముడెప్పుడూ జీవించేఉన్నాడుకదా! ఇంక దుఃఖమెందుకు? శరీరాన్నిగూర్చి చింతించకు. విషయవాసనలను పరిత్యజించు. కామనలను కాలదన్ని వెయ్యి. ఇతరులను తృష్ణావశుడవై దేహీ అని ఆశ్రయించకు. అంతర్ముఖుడవుగా, ఆత్మదృష్టిని స్థిరంజేసుకో. ఇకచూడు - విచిత్రం! నీకు దేవతలందరూ భయపడతారు.

"ఋచం బ్రాహ్మం జనయంతో దేవా అగ్రే తదబ్రువన్,
యస్త్వైవం బ్రాహ్మణో విద్యాత్తస్యదేవా అసన్వశే."
(శు. య. అ. 31. మం. 21.)

దేవతలందరు ప్రకాశస్వరూప బ్రహ్మజ్యోతిని ఆదిత్యునిగా సంభావిస్తూ ఇట్లన్నారు: "ఓ ఆదిత్యుడా! నిన్ను స్పష్టంగా గ్రహించిన బ్రాహ్మణునకు దేవతలందరూ వశులవుతారు." అంటే బ్రహ్మమును యథాయోగ్యంగా ఉపాసించిన హృదయంలో ప్రకాశం ప్రకటమవుతుంది. బ్రహ్మజ్యోతి ప్రకటంకాగానే వానికి నిశ్చలమైన బ్రాహ్మీస్థితి కలుగుతుంది. అప్పుడు దేవతలందరూ వానికి వశులవుతారు.

"సర్వాణ్యేనం భూతా న్యభిక్షరంతి" (బృహ. ఉప. 4-1-3)

"సర్వభూతాలు - సర్వపదార్థాలు ఆతని వైపునకే మ్రొగ్గుతాయి."

"సర్వేఽస్మై దేవా బలిమావహంతి" (తైత్తి. 1-5-3)

"దేవతలందరూ వీనికి బలిని (కానుకలు) తెస్తారు."

"నపశ్యో మృత్యుం పశ్యతి నరోగం నోత దుఃఖతాం,
సర్వగ్ం హ పశ్యః పశ్యతి సర్వమాప్నోతి సర్వశః ఇతి."
(ఛా. ఉ. 7-26-2)

"సర్వమునూ ఆత్మస్వరూపంగా చూచేవాడు మృత్యువును చూడడు, దుఃఖరోగాలతనికి కనపడవు. ఇలాంటివాడు సర్వజ్ఞుడౌతున్నాడు. సర్వపదార్థాలను అతడు పొందగలడు."

వేద మీ విషయాన్ని నిస్సందిగ్ధంగా చెప్పింది. "సర్వాత్మదృష్టి కలగడంతోటే, దుఃఖరోగ మృత్యువులు దరిజేరలేవు. ఆత్మను తెలుసుకున్న మీదట తెలియనిదేముంటుంది? ఆతనికి సర్వపదార్థాలు లభ్యమవుతాయి."

ద్వేషదృష్టి

మానసమును ఆనందధామానికి పరుగెత్తించాలి. లేకపోతే ద్వేషభావమనే దారిదోపిడిదొంగ చిత్తమును హరిస్తాడు. యూరపులో తత్త్వవిజ్ఞానియైన పండితుడొకడు తనవద్దకు వచ్చేవారిని నిందించేవాడు. మీరు వారిని నిందిస్తున్నారా అని అడిగితే, "లేదు: నేను వారి మనస్తత్వమును పరిశోధిస్తున్నాను"— అని చెప్పాడు. ప్రపంచంలో మనమంతా చేసేదికూడా ఇదే. ద్వేషదృష్టికి ఏదోఒక మంచి పేరుబెట్టి, కండ్లకు గంతగట్టుకొని, ఈ కాలసర్పాన్ని నిరంతరం కౌగలించుకొని తిరుగుతున్నాము. మళ్ళీ నేను ఆ పండితు నిట్లు ప్రశ్నించాను. "మహాశయా! హితులయొక్క మానసికస్థితిని ఒక్కదాన్నే విచారించడం యోగ్యంకాదు. దానితోబాటు మన ఆభ్యంతర దశనుకూడా విచారించుకోవాలికదా. మీమిత్రులు కొందరు దుష్టచిత్తులే అనుకోండి. మరి, మీమానసికస్థితి పూర్ణంగా దోషరహితమేనా?"

అతడు సత్యవంతుడు, అందుచేత కొంచెం ఆలోచించి ఇట్లన్నాడు — "స్వామీ! మీరు చెప్పేది పూర్ణంగా సత్యమే. వాస్తవానికి నా మనస్థితికి తుల్యమైన మనస్సు గలవాండ్లే నావద్దకు వస్తుంటారు. ఇతరుల మంచిచెడులను విచారించడంచేత ఎప్పటికీ శాంతి లభించదు. తననుతాను పరిశుద్ధపరచుకుంటే, అన్నీ పరిశుద్ధములుగా గోచరించే ఏకత్వం అంతరంగంలో ఉన్నది. మనకంట్లోఉన్న దూలాన్ని తీసుకోలేము. ఇతరుల కంట్లోఉన్న నలుసును చూపించబోతాము. అందుబాటులోని తననుతాను బాగుచేసుకోలేడుగానీ, దూరంగా

ఉన్న ఇతరులను బాగుచేయడానికి పరుగెత్తుతుంటాడు. ఇదీ జరగడం లేదు. అదీ జరగడంలేదు.''

నీ ముఖంమీది వికారములను సవరించుకొన్నప్పుడు అద్దంలోని బింబం అందంగా కనబడుతుంది. స్వాత్మసంస్కర్తలే జగత్తును సంస్కరించగలుగుతారు.

బాహ్యదృష్టికి గోచరించే శత్రువులను, విరోధులను, నిందకులను గంగాప్రవాహం తృణములను హరించేటంత ఆలస్యమైనా చేయకుండా క్షమించగలిగినప్పుడే, ఈశ్వరదర్శనం మనకు లభిస్తుంది.

సర్వత్ర సమబుద్ధి (సమదృష్టి) కలగనంతవరకూ సమాధి ఏ విధంగా సిద్ధిస్తుంది? ద్వేషదృష్టిని విడువనంతవరకూ సమాధి సంప్రాప్తి విషయం అట్లుంచి, ధ్యానధారణలు కలగడమే అసంభవం. పరగుణావగుణవిమర్శనాదృష్టి నశించినప్పుడే సమదృష్టి ఏర్పడినట్లు భేదభావాన్ని విడిచి సమస్త మానవులు బ్రహ్మస్వరూపులుగా బ్రహ్మమయులుగా సంభావించినప్పుడే ఈ విమర్శనం మన చిత్తంలోనుండి తొలగిపోతుంది. సముద్రంలో తరంగాలు బయలు దేరుతుంటాయి. కొన్ని చిన్నవి, కొన్ని పెద్దవి, కొన్ని నిమ్నోన్నతాలు, కొన్ని వంకరవి, కొన్ని చక్కనివి. అయితే వీటి అన్నింటిసత్త సముద్రంకంటే వేరుకాదు. అలలు, వాని స్వరూపం - అంతా సముద్రమేగాని వేరుకాదు. అదేవిధంగా మంచి వాండ్లు, చెడ్డవాండ్లు, ధనవంతులు, దరిద్రులు, అలలవంటివాండ్లు. వాండ్లందరిలో ఒకేబ్రహ్మసముద్రం ప్రకాశిస్తున్నది. ఆహా ! దుర్జన సజ్జనులందు మన బాహ్య (జీవ) దృష్టి నశించి, వారందరూ ఏకైక బ్రహ్మసముద్ర తరంగములని సంభావించినట్లైతే హృదయంలో రాగ ద్వేషాగ్నులు చల్లారి శాంతి కలుగుతుంది. పైకెగిరిన అల తప్పక క్రింద బడుతుంది. కపటి, కల్మషహృదయుడు, గర్వితుడు తప్పక దుఃఖమును పొందుతాడు. కానీ అలలు నిమ్నోన్నతులను పొందుతున్నా సముద్రపు అడుగు నిశ్చలంగానే ఉన్నది. అదేవిధంగా మానవులు కర్మఫలాలను పొందుతున్నా స్వస్వరూపబ్రహ్మసముద్రముయొక్క సమత్వం, నిర్వికారత మారదు. ఆహా! ఈ తరంగాల వైచిత్ర్యం ఎంత

సుఖదాయకం! ఆనంద వర్ధకం! అయితే ఎవరైనా ఆ తరంగాలలో తడిసినా మునిగినా ప్రమాదం కలుగుతుంది. తరంగదృష్టి దృశ్య పదార్థ దృష్టి ఉపద్రవకరం. ఏకైకబ్రహ్మసముద్రదృష్టివల్ల, సమధీ (సమబుద్ధి) – సమాధి – సిద్ధిస్తుంది.

త్యాగపూర్ణమైన ఆత్మసమర్పణమే, ఆత్మనివేదనమే ఉపాసనకు ప్రాణం. ఇది లేకపోతే ఉపాసన నిష్ఫలం, నిర్జీవం. నిజానికి మిత్రులందరూ నీవల్ల ఏదో కోరుతుంటారు. నీవు నీ స్వార్థాన్ని, నీ అహంకారాన్ని పరమేశ్వరాధీనం చేయనంతవరకూ అతడు నీ సమీపానికే రాడు. సరికదా, కృష్ణుడు కాలయవనుడనే రాక్షసుడికి చిక్కకుండా పరుగెత్తినట్లు బహుదూరం పరుగిడుతుంటాడు. జ్ఞానచక్షువైన సూరదాసు విలవిలలాడే బాలుని లాగా ఎంత సముద్వేగంతో ఈ సత్యాన్ని ఉగ్గడించాడో చూడండి :

స్వార్థము, కపటము.

"నీ కెవ్వరిడిరి గోవిందనామంబు ?
నీ విచ్చి పుచ్చుకొనేటి మిత్రుడవు.
నానుండి నీకేమి లభియింపబోదు.
విప్రుడైన సుదాము (కుచేలు) యాచించి నీవు
అటుకులు కానుకగా గ్రహియించినావు.
ఆమెచే వస్త్రదానము పొంది ముందె,
ద్రౌపదిమానంబు కాపాడినావు.
మొదట పుష్పంబుల చేవైచుకొనియె,
పాప మా గజనాథు గాపాడినావు.
ఈ సూరదాసుని విషయమం దకట
నిష్ఠురత్వముబూని నీవు శ్రీకృష్ణ!
అడవిలో కనబడకుండ దాగితివి."

భజనవల్ల (ఉపాసన వలన) ఫలం ఉన్నదో లేదో తెలుసుకోవాలనుకుంటే పరీక్షించిచూడు – కానీ జ్ఞప్తియందుంచుకో – పరీక్షకై చేసే భజన పసలేనిదే సుమా! ఎందుకంటే అగ్నియందాహుతిని సమర్పించినవిధంగా ఫలమునూ దానితోపాటు తననూ భగవంతునికి సమర్పించినప్పుడే, భజన 'నిష్కామభజన'గా పేర్కొనబడుతుంది.

"ఓ ప్రభూ! రఘురామా! నాకున్న ఇతరమైన ఆశలను, విశ్వాసాన్ని, ఆధారాలను, జడత్వాన్ని హరించు. నేను ఎలాంటి సుగతినీ, సుమతినీ, సంపదనూ, వృద్ధిసిద్ధులనూ కోరడంలేదు. కేవలం నీ పాదపద్మాలయందు అహేతుకమైన దృఢానురాగం దినదినాభివృద్ధి పొందాలని మాత్రమే నేను వాంఛిస్తున్నాను" - ఇదీ ఆత్మార్పణ భక్తి.

"ఆత్మార్పణం చేయడంలో, ఆహుతిగావడంలో ఏమి ఆనంద మున్నదని ఎవరైనా అనవచ్చు. అట్టివారికి ఆ యానందమే, ఆ రుచే తెలియదు. స్వార్థం నశించడమే, అహంభావం లయంగావడమే ఆనందం. శిశువు తన చిట్టి శరీరంతోపాటు, తన సరళమైన మనస్సును కూడా తల్లికి సమర్పించి ఆమె యొడిలో విశ్రమించినప్పుడు తన కే ప్రాపంచికసుఖం కావాలని విచారిస్తాడు? వర్షాలు కురిసినా, తుఫానులు చెలరేగినా, భూకంపాలే పుట్టినా ఏమి జరిగినా వానికేమి భయం? వాడు కేవలం నిర్భీకుడు! అకించనుడు! వాని కెలాంటి ఆపదకూడా రాదు!

నీ శారీరక క్రియలన్నీ ఉపాసనారూపములు గావాలి. పైకి కనుపించాలనిచేసే డాంబికరూపమైన ఉపాసన నిష్ఫలమైంది. క్రియా రూపమైన ఉపాసన అంటే ఆహారవిహారాలు, నిద్రాజాగరణాలు మొదలైన వానియందు ప్రకృతి నియమాలను అణు మాత్రమైనా ఉల్లంఘింపకుండడమని అర్థం. విషయ భోగాపేక్ష, విషయవిలాసమగ్నత, ఈశ్వరాజ్ఞో ల్లంఘనమే. దీనికి రోగరూపకంగానో మృత్యురూపకంగానో దండన తప్పదు. ఈవిధంగా దుఃఖాలతో రోగాలతో పీడింపబడుతూ ఎప్పుడూ ముక్కుతూ మూల్గుతూ ఉండేవాడు ఉపాసన ఏరకంగా చేయగలడు?

ప్రకృతి నియమోల్లంఘనము

ఈశ్వరనియమాల కనుగుణమైన క్రియలు ఈశ్వరేచ్ఛను అనుస రించే ఇచ్ఛలు, ప్రకృతితత్త్వానికి అనురూపమైన అలవాట్లు, బలమూ, గలిగి, ఆచరణాత్మకంగా "శివోఽహం" గానముచేసే మానవుని దుఃఖాలు తాకవు.

"నాయమాత్మా బలహీనేన లభ్యః" (ముండ. ఉప.2-4)

"దుర్బలునకు ఈయాత్మ లభ్యంకాదు."

ఇక్కడ బలమనుంటే శారీరకబలమూ (శరీరారోగ్యం) ఆధ్యాత్మిక బలముకూడా అని అర్థం. ఆధ్యాత్మిక బలాన్నే 'అధ్యవసాయ' మని కూడా చెపుతారు. గీతలోని "ప్రజ్ఞా ప్రతిష్ఠితా" అనేదికూడా బలరూపమే.

ప్రతిదినమూ పనులుచేస్తూ ప్రజలు ప్రపంచం సత్యమని తలవడం మొదలుపెడతారు, కానీ పనిచేయడానికి శక్తి, ఆనంద స్వరూపమైన ఆత్మవల్లనే లభిస్తుంది. ఆత్మసత్తాముందు ప్రపంచ నామరూపాల సత్తాలున్నూ, భేదభావాలున్నూ నిలువలేవు. ప్రాపంచిక

నిద్రావశ్యకత

కార్య బంధితుడైయున్నవానికి ఈ నిద్ర, "ఈ ప్రపంచం అసత్యం. ఇదంతా ఆత్మస్వరూపం" అన్న పాఠాన్ని నేర్పుతుంది. నిద్రలో ప్రపంచం అసత్యమై అజ్ఞాతంగా ఆత్మ ఒక్కటే మిగిలియుండడం దీనికి కారణం.

"సంసారముయొక్క నామరూపాలూ, వాటి పోలకువకూడా లేని సుషుప్త్యవస్థలో ఈ జగత్తుయొక్కగుట్టు బయటబడుతుంది."

"స యథా శకునిః సూత్రేణ ప్రబద్ధో దిశం దిశం పతిత్వాఽన్య త్రాయతన మలబ్ధ్వా బంధన మేవోపశ్రయత, ఏవమేవ ఖలు సోమ్యతన్మనో దిశం దిశం పతిత్వాఽన్యత్రాయతన మలబ్ధ్వా ప్రాణమేవోపశ్రయతే."

(ఛాందో. ఉప. 6-8-2)

"త్రాటిచేత కట్టబడిన పక్షి దశదిశలు తిరిగి ఎక్కడకూడా ఆశ్రయందొరకక తిరిగి తాను బంధింపబడినచోటికేవచ్చి చేరుతుంది. సౌమ్యుడా! సరిగా ఇదేవిధంగా మనస్సు దశదిశలా తిరిగి ఎక్కడకూడా ఆశ్రయందొరకక ప్రాణాలనే ఆశ్రయిస్తుంది. కారణమేమిటంటే- మన మనస్సు ప్రాణాలచేత కట్టుబడియున్నది."

సుషుప్తిలో తెలియకుండానే పరతత్త్వంలో లీనమవడంచేత శక్తిసామర్థ్యాలు, ఆనందం కలుగుతుంటే, ఉపాసనా ధ్యానాదులచేత

జ్ఞానపూర్వకంగా పరతత్త్వంలో లీనమైనప్పుడు శక్తిసామర్థ్యాలు, ఆనందం ఎందుకు వృద్ధిగావు ?

మనస్సు కామక్రోధాదులవల్ల, ఇతరచింతలవల్ల బాధపడే సమయంలో మాట్లాడకుండా తక్షణంవెళ్ళి చన్నీటితో ముఖమూ చేతులూ కడుక్కొని ఆచమనంచెయ్యి. లేదా స్నానం చెయ్యి. తప్పక శాంతి లభిస్తుంది. శ్రీహరి ధ్యానరూప క్షీరసాగరంలో నిమగ్నుడవై, కామక్రోధాదులనే పొగను జ్ఞానాగ్నిజ్వాలగా మార్చు.

## ఉపాసనకు ఔదార్యము అవసరం

యజ్ఞదాన కర్మములద్వారా ఉపాసన ప్రారంభమవుతుంది. యజ్ఞములందుగానీ, తదితర సమయములందుగానీ చేయబడే దానములచేత చిత్తశాంతి కలుగుతుంది. ఆ ఆనందం మళ్ళీ అనుభవించాలనే కోరిక జనిస్తుంది. స్థూలములైన బాహ్యపదార్థాలను దానం చేస్తుంటే క్రమంగా కష్టసాధ్యమైన సూక్ష్మదానం - చిత్తాన్ని భగవచ్చరణ సమర్పణం చేయడంకూడా సాధ్యమవుతుంది. ఉపాసన- ధ్యానము స్థిరపడ సాగుతుంది. ఇక్కడ ఒకచిత్రమున్నది - దానంచేయడం ఒక దృష్టిలో పోగొట్టుకోవడంలాగా కనపడ్డా, రెండవదృష్టిలో ఇది తిరిగి సర్వసమృద్ధి దోచుకోవడమే అవుతున్నది. ఇది మనం గమనించడంలేదు. హరినామమునకు మనలను మనం సంపూర్ణంగా సమర్పించుకోవడమే భక్తి (ఉపాసన). సంకుచిత మనస్కుడు ఉపాసనానందాన్ని అనుభవింపలేడు. హృదయసంపద లేనివాడు భక్తి రసాస్వాదనం చేయలేడు. వాస్తవానికి మహాసంపదగల ప్రభువెవడు ? తృణమునందుకూడా అపేక్షలేని అకించనుడే నిజమైన ప్రభువు.

ధనసంపదలు హరింపబడినవా ? ఏడవడం దేనికి ? దొంగలెత్తుకొని పోయారా ? నీ తెలివితెల్లవార! ప్రియతమా! దొంగిలించడానికి పరులెవ్వరులేరే ! శుక్రాచార్యుని నేత్రంలాగా ఒక్కడే ఒకడున్నాడు. కృష్ణుడు వెన్నను దొంగిలించాడు. ఇంతకుమించి గోపికలకు సౌభాగ్య

మేముంటుంది ? హృదయమూ, చిత్తముకూడా మిగలకుండా ఎవరి సర్వస్వం అపహృతమవుతుందో వాండ్లు ధన్యులు.

"కకుభాయ స్తేనానాం పతయే నమః
నమో నిచేరకే పరిచరాయ నమః
తస్కరాణాం పతయే నమః (శు. యజు. సం. 16–20)

"సుప్రసిద్ధ చోరులకు అధిపతియైనవానికి నమస్కారం. గుప్త చోరులకు పాలకుడైనవానికి నమస్కారం. చోరులకు అధీశ్వరుడైన వానికి నమస్కారం."

ఋగ్వేద, యజుర్వేద పురుషసూక్తములందు ఇట్లు చెప్పబడింది: ఋషులు, దేవతలు విరాట్పురుషునకు హవిస్సులు అర్పించగానే వారి కామనలన్నీ వానికవే సిద్ధించాయి. యజ్ఞమువలన జగత్తు ఏర్పడింది. బృహదారణ్యకోపనిషత్తులో ఈచరాచర విశ్వమనే అశ్వముయొక్క మేధము ఎంతో మనోహరంగా వర్ణింపబడింది. వహవ్వా ! నామరూప మైన సమస్త ప్రపంచాన్ని విరాడ్రూపమైన సర్వజగత్తును సమగ్రంగా దానంచేసి యజ్ఞబలియందు ఆహుతి చేయనంతవరకూ, అమృత రసా స్వాదనం ఎట్లు లభిస్తుంది ?

"సర్వం ఖల్విదం బ్రహ్మ" "ఇదంతా బ్రహ్మమే" అన్న జ్ఞానాగ్నిలో లౌకికవిషయాలను, కామనలనూ సంపూర్ణంగా ఆహుతి చేసినమీదట స్వారాజ్యప్రాప్తికి ఆలస్య మేముంటుంది ?

బలిచక్రవర్తి జలపూరిత కమండలాన్ని చేతబట్టి ముల్లోకాలను భగవంతునకు దానంచేశాడు. నీవొక రాక్షసుని పాటికూడా త్యాగం చేయలేవా? నీ శిరస్సనే*చమసమును అంటే కపాలమును అరచేతిలో పెట్టుకొని, సమస్త ప్రపంచసత్తాను (అస్తిత్వమును) బ్రహ్మార్పణం చెయ్యి.

భజనయందు మనస్సు స్థిరంగా నిలవడంలేదని జను లంటుంటారు. ఏకాగ్రత ఏవిధంగా లభిస్తుంది? లోభంతో, కోతిలాగ పిడికిలిలో

* యజ్ఞపాత్ర విశేషము.

ఉన్నది వదలిపెట్టవు. కానీ రాముని హస్తగతంచేసుకోవాలని కోరు తున్నావా ?

"కాముడున్నచోట రాముడుండడు. రాముడున్నచోట కాము డుండడు" అన్న తులసీదాసువాక్యం విను.

హనుమంతునిలాగా వజ్రవైడూర్యాలను పగులగొట్టి పారవేసే వానికే రాముడు లభిస్తాడు. వాటియందు రాముడులేకపోతే వాటిని ధరించడం దేనికి? ప్రయోజనం ఉండాలెకదా?

"కుందకుంజ మముం పశ్య పరసీరుహాలోచనే!
అమునా కుంద కుంజేన సఖీ మే కిం ప్రయోజనమ్॥"

(సభాతరంగము)

"ఓసఖి! ఈ కుంద కుంజమును చూడు. "ము"విరహితమైన కుంద కుంజంవల్ల నాకేమి ప్రయోజనం? అంటే ముకుంద (శ్రీకృష్ణ) విరహితమైన కుంద కుంజం (మొల్లపూల పొదరిల్లు) వల్ల ఏమి ప్రయో జనమని."

భజన సమయంలో సిగ్గుమాలిన మనస్సు ఇల్లువాకిండ్లు, గౌరవా గౌరవాలు, ప్రాణపోషణ మొదలైనవాటిని గూర్చి చింతిస్తుంటుంది. ఈ వస్తువులు ధ్యానింప దగినవేనా ? ధ్యానింపదగినవాడు రాము డొక్కడేనని మూర్ఖులు గమనింప లేకున్నారు.

"ఆత్మసంస్థం మనంకృత్వా నకించిదపి చింతయేత్".

(గీత. 6-25.)

"మనస్సును ఆత్మయందు నిలిపి ఇతరమేమీ చింతించకూడదు."

ఆ విశ్వనాథుడు మన హృదయపీఠమును అధిష్ఠించినట్లయితే, ఆశయాలన్నీ వాటికవే అనాయాసంగా నెరవేరుతాయి. వస్తువులందు నీకు సవ్యదృష్టియున్నా, వానిచేత నీవు ఆకర్షింపబడినా, నీవు తల బ్రద్దలు కొట్టుకొన్నా నీకా వస్తువు లభించదు. ఒకవేళ లభించినా సుఖకారి కానేరదు. ప్రయత్న పూర్వకంగాగానీ, సహజంగాగానీ, ఆ వస్తువునుండి నీ మనస్సు విముఖత వహిస్తుందా, ఆత్మరూపమైన అగ్నికుండంలో ఆ పదార్థం ఆహుతి అవుతుందా, ఆ యిష్టవస్తువు

స్వతఃవచ్చి నీయెదుట నిలుస్తుంది. ఒకవేళ గాలితాకిడికి హిమాలయం బంతిలాగ పైకి లేవవచ్చు; కానీ ఈ సిద్ధాంతం రవ్వంతకూడా చెక్కుచెదరదు.

"బ్రహ్మతం పరాదాద్యో ఽన్యత్రాత్మనో బ్రహ్మవేద, క్షత్రం తం పరాదాద్యోఽన్యత్రాత్మనః క్షత్రం వేద, లోకాస్తం పరాదుర్యోఽన్యత్రాత్మనో లోకాన్వేద, దేవాస్తం పరాదుర్యో ఽన్యత్రాత్మనో దేవాన్వేద, వేదాస్తం పరాదుర్యో ఽన్యత్రాత్మనో వేదాన్వేద, భూతాస్తం పరాదుర్యో ఽన్యత్రాత్మనో భూతాని వేద, సర్వం తం పరాదాద్యో ఽన్యత్రాత్మనో సర్వం వేద, ఇదం బ్రహ్మ ఇదం క్షత్రం, ఇమే లోకా, ఇమే దేవా, ఇమే వేదాః, ఇమాని సర్వాణి భూతాని, ఇదం సర్వం యదయ మాత్మా. (బృహ. ఉప.2-4-6.)

బ్రాహ్మణులను ఆత్మకు (తనకు) భిన్నంగా గ్రహించిన వాణ్ణి బ్రాహ్మణులు దూరంగా త్రోసివేస్తారు. క్షత్రియులను ఆత్మకు(తనకు) భిన్నంగా గ్రహించినవాణ్ణి క్షత్రియులు పరిత్యజిస్తారు. లోకాలను ఆత్మకు భిన్నంగా ఎరిగినవాణ్ణి లోకాలు బహిష్కరిస్తాయి. దేవతలను ఆత్మకు భిన్నంగా భావించినవాణ్ణి దేవతలు వదలిపెడతారు. వేదాలను ఆత్మకుభిన్నంగా భావించినవాణ్ణి వేదాలు దూరంగా నెట్టివేస్తాయి. భూతాలను ఆత్మకు భిన్నంగా చూచినవాణ్ణి ఆ భూతాలు దూరంగా నెట్టివేస్తాయి. ప్రతివస్తువును ఆత్మకు భిన్నంగా చూచినవాణ్ణి ఆయా వస్తువులు దూరంగా వదలివేస్తాయి. ఈ బ్రాహ్మణులు, ఈక్షత్రియులు. ఈలోకాలు, దేవతలూ, వేదాలూ, ఈభూతములూ అన్నీ ఆత్మే. 'నేనే యున్నాను. జగత్తులేనేలేదు. ప్రాపంచిక విషయాలున్నవంటే అవి కేవలం నా కటాక్షమాత్రములు'-అని రాముడు ప్రతి విషయంలో నిరూపిస్తున్నాడు.

నీవు నీ పుత్ర మిత్ర కళత్రాదులను ధనధాన్యాలను, శత్రుమిత్రులను, సుఖదుఃఖాలను, సమస్తబంధాలను పరిత్యజించి పరిశుద్ధుడవై రామనామ మహాస్రోతస్సులో నీ సర్వస్వాన్ని ప్రవహింపజేసినప్పుడే నీకు మానసిక ఏకాగ్రత సమాధి లభిస్తుంది. 'సమస్తమూ రాముడే' అన్న తుఫాను బయలుదేరి, ఆ ఝుంఝూమారుతంలో 'నా' అనే నీసర్వస్వం కొట్టుకొనిపోయిన పిదపనే నీకు ఏకాగ్రత (మనస్సునకు నిలుకడ) సిద్ధిస్తుంది.

అత్ర పితాఽపితా భవతి మాతాఽమాతా లోకా అలోకాః; దేవా అదేవాః, వేదా అవేదాః, అత్రస్తేనోఽస్తేనో, భ్రూణహాఽ భ్రూహా, చాండాలోఽచాండాలః పౌల్కసోఽపౌల్కసః శ్రమణోఽశ్రమణః, తాపసోఽతాపసః."

"ఇక్కడ తండ్రి తండ్రికాదు. తల్లితల్లికాదు. ప్రపంచం ప్రపంచం కాదు. వేదాలు వేదాలుకాదు. దొంగ దొంగకాదు. హంతకుడు హంతకుడుకాదు. చండాలుడు చండాలుడుకాడు. పుల్కసుడు పుల్కసుడుకాడు. శ్రమణుడు (సన్న్యాసి) శ్రమణుడుకాడు. తాపసి తాపసి కాడు." సర్వం బ్రహ్మమయంగా ఉన్న ఆదృష్టిలో పోవడానికి వేరే స్థానమే లేనప్పుడు భడవమనస్సు ఇంకెక్కడికి పోతుంది? అప్పుడు సహజసమాధే!

"ఓడ స్తంభముమీద ఉన్న పక్షికి అఖండ జలరాశిలో మరొకచోట కాలూదే తావు దొరక్క అక్కడే నిలుస్తుంది. కామిర్లు వచ్చినవానికి అంతా పసుపురంగుగానే గోచరిస్తుంది. నాకు ఆ ఏకైక బ్రహ్మము తప్ప వేరొకటి గోచరించడం లేదు."

## యాచన కూడా ఉపాసనాంగమా?

కామన రెండువిధాలు. ఒకటి తుచ్ఛమైన ఈ 'నేను'ను (అహంకారమును) లక్ష్యంగా చేసికొని ఐశ్వర్యాలను భోగాలను కోరడం. రెండవది జ్ఞానప్రాప్తిని, తత్త్వదర్శనమును, హరిసేవను పరమ ప్రయోజనంగా పెట్టుకొని ఆత్మోన్నతిని కోరుకోవడం. మొదటిది తుచ్ఛవిషయాలకు భగవంతుని సేవకునిగా చేసుకొనడం వంటిది. ఇది పెడదారి. ఇక రెండవరకపు ప్రార్థన ఉత్తమమైంది. ఇది రాజమార్గం.

మనస్సు ఆత్మయందు లీనమయ్యే తరుణంలో కలిగే సంకల్పం సత్సంకల్పము. అది తప్పక నెరవేరుతుంది. అయితే ఆ సంకల్పం అజ్ఞానయుతమై, అధార్మికమై, స్వార్థయుతమై యున్నట్లయితే అది కంటకయుతమైన విషవృక్షంలాగా పుట్టి, పెరిగి దారుణ ఫలానికి కారణమవుతుంది. అహంకార మమకారాలతో విషయభోగాలకై భగవంతుని ప్రార్థించడం చిలుముబట్టిన రాగిపాత్రలో పాలు పోయడంవంటిది.

నీకు తెలియదా ?-దుఃఖాలను పొందినప్పుడు నేర్చుకొనవలసిన ప్రథమ గుణపాఠం- అపవిత్ర వాసనలను వదలడమే. అపవిత్ర కామనచేత ఇతరులకూ తనకూ హానికలుగుతుంది. పవిత్ర భావాలచేత జ్ఞానమూ, విజ్ఞానమూ కలుగుతుంది. నీనివల్ల నీకూ ఇతరులకూ శ్రేయస్సు కలుగుతుంది.మనస్సులో, సత్త్వగుణము, శాంతి, పవిత్రత, ఆనందమూ ఉన్నట్లయితే మనకార్యములన్నీ భగవత్కార్యములై ప్రకాశిస్తాయి. అవి పూర్ణంగావడానికి ఎట్టి ఆటంకములూ ఉండవు.

"దేవాసుర మనుష్యేషు యేభజంత్య శివం శివం,
ప్రాయస్తే ధనినో భోజా నతులక్ష్మ్యాః పతింహరిం." (భాగవతం)

"త్యాగియైన శివుని అర్చించేవాండ్లు ధనవంతులవుతారు. భోగి (లక్ష్మీపతి) యైన విష్ణువును ఉపాసించేవాండ్లు నిర్ధనులై యుంటారు."

ఈశ్లోకం హరిహరులకు గల న్యూనాధిక్యములను సూచించడం లేదు. వాస్తవానికి హరిహరు లిద్దరూ ఒకటే. ఇక్కడ తీసికోవలసిన అర్థం- "శివరూపములైన త్యాగ వైరాగ్యాలు గలవాండ్లకు వాటంతట అవే ధనధాన్య సంపదలు లభిస్తాయి. కానీ లక్ష్మియందు ధనధాన్యములందు అతి మోహం గలవాండ్లు దరిద్రులుగా ఉంటారు. సూర్యుని వైపునకు వీపుజూపి తన నీడను పట్టుకోను పరుగెత్తేవానికి నీడ దూరమవుతుంటుందేగాని పట్టుబడదు. కానీ సూర్యునకు అభిముఖుడైన వానికి నీడకూడా వెనువెంట పరుగిడి వస్తుంది. బ్రహ్మాభిముఖుడైన వానికి, త్యాగవైరాగ్యనిష్ఠునకు సంపదలు సేవ జేస్తాయి.

అత్యుత్తమ ప్రార్థన

మన ప్రార్థన స్వార్థరహితమై, సత్యమైనదై, పరిశుద్ధమైనదై వున్నట్లయితే, మనప్రార్థనను భగవంతుడు తప్పక వింటాడు. ఉపాసనా సమయమందు, ఆనందాతిరేకముచేత చిత్తము—

"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ"

(తైత్తిరీయ ఉప. 2.8)

"వాక్కులాప్రదేశాన్ని చేరకుండగనే మనస్సుతో మరలి వస్తాయి."—ఇట్టి స్థితిని పొందితే అదే బ్రహ్మావస్థ. సత్యసంకల్పత్వము

స్వాభావికంగానే కలగడానికి ఇదే కారణం. ఇది పరమోత్తమమైన ఉపాసన.

ఇది పసిబిడ్డకు గల శ్రద్ధ - విశ్వాసము - వంటిది. ఇలాంటి నిష్ఠకూడా ఎంత మనోహరం! ఎంత ప్రబలమైంది! పసిబిడ్డ తన తల్లి కొంచెముతక్కువమెట్టు దండ్రులను అనంత శక్తిమంతులని భావిస్తాడు. ఉపాసన వారిశక్తి సామర్థ్యాలు తన సామర్థ్యాలుగా తలచి తల్లియొళ్ళో కూర్చొని ఏకచ్ఛత్రాధిపత్యమును సాగిస్తుంటాడు. శైలును బెదిరిస్తాడు. వాయువునూ పక్షులనూ ఆజ్ఞాపిస్తాడు. సముద్రమును శపిస్తాడు. ఆతని దృష్టిలో అసంభవమనేది ఏదీ ఉండదు! సూర్య చంద్రాగ్నులను పట్టుకొన యత్నిస్తాడు.

"ఆ ఆటబొమ్మను ఆ చందమామ-
నో అమ్మ! నా కివ్వవే ఆడుకొందు."

సర్వశక్తి సంపన్నుడైన ఆ పరమపితయందు ఈవిధమైన దృఢ విశ్వాసం కలవాండ్లు ధన్యులు. వాండ్లు పాలు కావలిసివస్తే దైవము నుండి, కూడు కావలసివస్తే దైవమునుండి, గుడ్డకావలసివస్తే దైవము నుండి, ఏది కావలసివచ్చినా దైవమునుండే సాధించుకొంటారు.

"ప్రపంచంలో ఎవ్వరినీ యాచింపవద్దు. జానకీ హృదయనాథునే యాచించండి. జనులను యాచిస్తే స్వల్పఫలం లభిస్తుంది. జానకీ నాథుని యాచిస్తే ప్రబలమైన చక్రవర్తిత్వమే లభిస్తుంది."

సకామ భక్తునకు, నిష్కామ భక్తునకు గల భేదం ఇంతే. ఒకని హృదయంలో కాముడు(కోరిక)పైనా, రాముడు (భగవంతుడు) అడుగునా ఉంటాడు. పరొకని హృదయంలో రాముడు పైనా, కాముడు క్రిందా ఉంటాడు. మొదటిది ఆసురీభక్తి. రెండవది దైవీ భక్తి.

ఉపాసనయందు యాచనాంశముకంటే భక్తీ, త్యాగమూ అధికంగా ఉంటే ఆ యాచనకూడా దానమువంటిదే. నిజానికి యాచన ఉపాసనాంగం కాదు. దానమే (ఔదార్యమే) ఉపాసనా స్వరూపం. నేను నా స్వార్థానికి నిన్ను సేవిస్తే నీయందు నాకు భక్తి ఏమున్నట్లు?

స్వాభావికంగానే కలగడానికి ఇదే కారణం. ఇది పరమోత్తమమైన ఉపాసన.

ఇది పసిబిడ్డకు గల శ్రద్ధ - విశ్వాసము - వంటిది. ఇలాంటి నిష్ఠకూడా ఎంత మనోహరం! ఎంత ప్రబలమైంది! పసిబిడ్డ తన తల్లి కొంచెము తక్కువమెట్టు ఉపాసన దండ్రులను అనంత శక్తిమంతులని భావిస్తాడు. వారిశక్తి సామర్థ్యాలు తన సామర్థ్యాలుగా తలచి తల్లియొళ్ళో కూర్చొని ఏకచ్ఛత్రాధిపత్యమును సాగిస్తుంటాడు. శైలును బెదిరిస్తాడు. వాయువునూ పక్షులనూ ఆజ్ఞాపిస్తాడు. సముద్రమును శపిస్తాడు. ఆతని దృష్టిలో అసంభవమనేది ఏదీ ఉండదు! సూర్యచంద్రాగ్నులను పట్టుకొన యత్నిస్తాడు.

“ఆ ఆటబొమ్మను ఆ చందమామ-
నో అమ్మ! నా కివ్వవే ఆడుకొందు.”

సర్వశక్తి సంపన్నుడైన ఆ పరమపితయందు ఈవిధమైన దృఢవిశ్వాసం కలవాండ్లు ధన్యులు. వాండ్లు పాలు కావలిసివస్తే దైవమునుండి, కూడు కావలసివస్తే దైవమునుండి, గుడ్డ కావలసివస్తే దైవమునుండి, ఏది కావలసివచ్చినా దైవమునుండే సాధించుకొంటారు.

“ప్రపంచంలో ఎవ్వరినీ యాచింపవద్దు. జానకీ హృదయనాథునే యాచించండి. జనులను యాచిస్తే స్వల్పఫలం లభిస్తుంది. జానకీ నాథుని యాచిస్తే ప్రబలమైన చక్రవర్తిత్వమే లభిస్తుంది.”

సకామ భక్తునకు, నిష్కామ భక్తునకు గల భేదం ఇంతే. ఒకని హృదయంలో కాముడు(కోరిక)పైనా, రాముడు (భగవంతుడు) అడుగునా ఉంటాడు. మరొకని హృదయంలో రాముడు పైనా, కాముడు క్రిందా ఉంటాడు. మొదటిది ఆసురీభక్తి. రెండవది దైవీభక్తి.

ఉపాసనయందు యాచనాంశముకంటే భక్తీ, త్యాగమూ అధికంగా ఉంటే ఆ యాచనకూడా దానమువంటిదే. నిజానికి యాచన ఉపాసనాంగం కాదు. దానమే (ఔదార్యమే) ఉపాసనా స్వరూపం. నేను నా స్వార్థానికి నిన్ను సేవిస్తే నీయందు నాకు భక్తి ఏమున్నట్లు?

"జగత్తులో కనబడే ప్రతివస్తువును ఈశ్వరదృష్టితో ఆచ్ఛాదితం చెయ్యి. ప్రపంచదృష్టిని త్యాగం చెయ్యి. ఈ త్యాగంవల్ల సుఖాన్ని పొందు. ధనాశకు దూరంకా.

"తత్తు విషయత్యాగాత్సఙ్గత్యాగాచ్చ." (నారదభక్తిసూత్రములు 35)

"విషయత్యాగమువల్లా, సంగత్యాగముచేతా ఆ పరాభక్తి లభిస్తుంది."

బాహ్య త్యాగములన్నీ ఈ అసలుత్యాగానికి సాధనాలు. త్యాగరూపమైన ఈ బ్రహ్మదృష్టిని ప్రయత్నపూర్వకంగా సాధించడమే ఉపాసన. ఈ త్యాగరూపమైన ఉపాసన ఆయా ఇతర త్యాగముల (దానముల) వలె చేసినా చేయక పోయినా మన యిష్టమని భావించే వాండ్లు కేవలం విభ్రాంతులు సుమా. ఈ త్యాగస్వరూపమైన ఉపాసన మానవులకుపరమావశ్యకం. ఎందుకంటే అన్యథా శాంతిలభించదు.

మనస్సులో కొంతసేపు ఒక కోరిక, మరికొంతసేపు మరొక కోరిక ఉండేటంతవరకు మనోవృత్తి ఉపశమించదు. ఏకాగ్రంకాదు. సకల వాసనలు వానికవే జారిపోయే ఉత్తమస్థితి లభించాలె. కర్తవ్యాలు, అవసరాలు ఎవణ్ణిఆకర్షింపలేవో అతడే శాంతుడు. జీవితేచ్ఛను గూడా త్యజించి మనస్సును బ్రహ్మానందసాగరంలో నిమగ్నంచెయ్యి. ఈ శరీరం ఏదోఒకరోజు తప్పక రాలిపోతుంది. శాశ్వతంగా నిలిచిఉండేలాగు ఎవరూపట్టా వ్రాయించుకోని రాలేదుకదా? అందుచేత ఈనాటినుంచే ఈ శరీరాన్ని లేనిదానిగా భావించు. నిస్సందేహంగా బ్రహ్మానందసాగరంలో దుముకు. ఆశ్చర్య మేమిటంటె, మన మీవాంఛలను విడవగానే, వాంఛలు వానికై అవ్వే నెరవేరడం చూడగలం. నారిని వెనుకకులాగి వదలగానే బాణం ముందుకుపోయి లక్ష్యాన్ని భేదిస్తుంది. వాంఛాపరిత్యాగంచేత వాంఛాపూర్ణత కలుగుతుంది.

"శ్లో॥ గంగాతీరే హిమగిరి శిలాబద్ధపద్మాసనస్య
బ్రహ్మధ్యానాభ్యసన విధినా యోగనిద్రాంగతస్య,
కింతై ర్భావ్యం మమసుదివసైర్యత్ర తే నిర్విశంకాః
కండూయంతే జరఠహరిణాః శృంగమంగే మదీయే."

(భర్తృహరి)

"గంగాతీరంలో హిమాలయ శిలావేదికపైన పద్మాసనాసీనుడనై బ్రహ్మధ్యానమును అభ్యసిస్తూ, యోగనిద్రపొందిన నా శరీరాన్ని వృద్ధహరిణాలు నిర్భయంగా రాచుకొని దురదను తీర్చుకొనేసుదినం ఎన్నటికైనా నాకు లభిస్తుందా ?"

త్యాగము, జ్ఞానము హృదయంలో నిండినకొద్దీ శాంతి తాండవింపసాగుతుంది. విచారణాశక్తి ప్రస్ఫుటమవుతుంది. మాయా యవనికగా కనుపించే ఈదృశ్యప్రపంచం రాముని దివ్యతేజః పుంజంగా ప్రకటమవుతుంది. దర్శనధార వెల్లివిరుస్తుంది. తత్త్వము ఏకరసంగా – అఖండంగా అభివ్యక్త మవుతుంది. భేదాభేద వాదాలనుగూర్చి శాస్త్రార్థాలు చేసికొనె వాండ్లను చేసికోనివ్వండి. జ్ఞానజ్యోతి వెలుగొందినపుడు ఈ వివాదాలు పరిష్కృతిని పొందుతాయి. మానవుని హృదయాంతరంలో రాముని భేరి మ్రోగనంతవరకూ శుష్కోపాసన వలన ఆనందం కలుగదు; శుష్కజ్ఞానంవలనా ఆనందం కలుగదు. వేద సంహితల అర్థం తెలియదు. ఉపనిషత్తుల అర్థం తెలియదు.

"అన్నార్తునకు అన్నమూ, తృష్ణార్తునకు జలమూ, కాముకునకు స్త్రీ ప్రియమైన విధంగా నాకు మురారి నామం అత్యంత ప్రియమైంది. తన ప్రియుడు టెలిఫోనులో మాట్లాడాడు. అందుచేత టెలిఫోను ప్రియమైనది. తన ప్రియుడు దూరంగా ఉన్నంతవరకూ టెలిఫోను పరమప్రేమాస్పద మవుతుంది. కానీ ప్రియుడు ఇంటికే వచ్చినప్పుడు టెలిఫోనువల్ల ఇంక ప్రయోజనమేముంటుంది? ఈమిత్రులు, ఆత్మీయులు; రాజులు, మహారాజులూ – అందరూ టెలిఫోనులే. వీటిద్వారా రాముడు మనతో మాట్లాడుతున్నాడు. రాముడు లభించినంతవరకు "అయ్యో! వీండ్లు లేకపోతే ఎట్లు జరుగుతుంది?" అని హృదయం ప్రకంపిస్తుంది. "ఆప్రియుడు (భగవంతుడు) లభించాడు. అతడు ఇంటికి చేరాడు. ఇంక ఓమిత్రులారా! ఆత్మీయులారా! నన్ను త్యజించండి. ధనధాన్య సంపదలారా! నన్ను వదలివేయండి. గౌరవసత్కారాల్లారా! నన్నువదలి వేయండి! ఓ రాజా! నిస్సందేహంగా నీరాజ్యాన్ని నీవు మూటగట్టుకొని నన్ను నీ దేశంనుంచి నిర్వాసితుణ్ణిచెయ్యి.

రాజు కోపగించి నన్ను తనరాజ్యమునుండి బహిష్కరిస్తాడు. అయితే నాకేం? నేను రుద్రుడు కోపగించినా లక్ష్యపెట్టను. ఇక నా ప్రాణప్రియుడు (భగవంతుడు) ఇంటికివచ్చాడు. నేత్రములనే రత్న కంబళములను పరుస్తాను. సద సద్గుణములందు విస్ఫులింగములుంచి ధూపమువేస్తాను. ప్రాణాలను పర్యంకంగాజేసి నేను శ్రీహరిని కౌగలించుకుంటాను."

## శివోఽహం భావనే పరమపవిత్రము

"శివోఽహం" భావన అందరికీ ఉన్నది. భేదవాదిగానీ, అభేద వాదిగానీ, భక్తుడుగానీ, కర్మనిష్ఠుడుగానీ, హిందువుగానీ, అహిందువు గానీ; వాని హృదయపులోతులను చూచినట్లైతే, ప్రతివాడూ తనను తాను మహాప్రభువనే భావిస్తున్నాడు. తాను తుచ్ఛుణ్ణి అనే భావం ఎలాంటివానికీ లేదు. కావలసివస్తే ఋజువుచేయవచ్చు. భేద వాదియైన భక్తుడొకడు దేవాలయంలో దేవతా విగ్రహం ఎదుట, "నేను పాపిని; పాపకర్ముణ్ణి; నీచుణ్ణి; నీచాధముణ్ణి (పాపోహం పాప సంభవానాం)" అని తనను తానే నోరునొచ్చేలాగా చెప్పకుంటాడు. ఆతడు వీధిలోకి రాగానే ఎవడో ఆభక్తునిచూచి, "ఓరీ పాపీ! ఓ నీచుడా!" అని పిలిచాడనుకోండి. ఇక ఏమని చెప్పాలె? ఆ క్షణమే కోర్టులో ఆతడు పరువు (మాన) నష్టముపై దావా వేస్తాడు. దీని అర్థమేమిటి? ఎంతచెప్పినా - అంతరంగంలోని 'శివోఽహం' భావం చచ్చేదికాదు. అది ఎందుకు చస్తుంది? సత్యం నశిస్తుందా? అంత రంగంలో దేహాభిమానాన్ని వీడకుండా బాహ్యంలో "శివోఽహం" అనే వాచావిడంబరమును చూపేవాడు, పౌండ్రకునిలాగా ఊర్ధ్వ పుండ్రాలుధరించి, కపటవేషధారియై 'నేను వాసుదేవుడనని చెప్ప కొనడమే అవుతుంది. ఈవిధంగా 'వాసుదేవోహం' అని పలుకుతూ ప్రపంచమంతా అహంకారవాసనా పూరితమై యున్నది. ఇది చిలుము పట్టిన రాగిపాత్రలో పాయసాన్ని వండి ఆ విషాహారాన్ని తిని చావడంలాంటి విషయమే. వేదాంత సందేశం ఏమిటంటే - పాలు పానయోగ్యమే; కానీ చిలుముపట్టిన రాగిపాత్రలో పోసికాదు. అంత రంగంలో దేహాభిమానాన్ని ఉంచుకొని, బాహ్యంలో 'శివోఽహం'

అని ప్రకటించుకోవడంవల్ల లాభంలేదు. అంతరంగలోనే 'శివోఽహం' అనే భావన కలిగి, తద్భావప్రదీప్తమైన జ్ఞానాగ్నిచేత దేహాభిమానాన్ని దగ్ధం చెయ్యాలె. అప్పుడు దేహాభిమానం, కార్పణ్యాం, భయం, శోకం ఏరకంగా సమీపిస్తుంది? ఈరహస్యమును తెలిసికొన్నవాడు అభయుడవుతాడు. ఔదార్యస్వరూపుడవుతాడు. తేజశ్శక్తులచే ఓతప్రోతమైన మహాస్రోతమే అతడు. బలశక్తులు ఎక్కడనుండి వస్తాయి? తన తనుమనః ప్రాణములను సర్వార్పణం చేయగల మహౌదార్యమునుండే అట్టి బలశక్తులు సముద్భూతమవుతాయి. తనను తాను 'జ్యోతిషాం జ్యోతిః' అని గ్రహించినపుడు దానంతట అదే వీరత్వం బలశక్తులు నీలోనుంచి ఎందుకు ప్రవహించవు? నీకు తీయగా ఉండనీ; చేదుగా ఉండనీ, ఇది సత్యం. ఉన్నత పర్వత శిఖరాగ్రమునుండి రాముడు ఉద్ఘోషిస్తున్నాడు:- "సంసారాన్ని సత్యంగా దలచి అందు దుముకుతున్నావు. తాపత్రయాగ్నిలోపడి క్రమంగా దగ్ధమవుతున్నావు. ఈ యుగ్రతపస్సును నీవు చేయడం దేనికి? దీనివల్ల నీకే సిద్ధికూడా లభించదు. భ్రమపడుతున్నావు. నీవు శుద్ధ సచ్చిదానంద స్వరూపుడవు. దేహాభిమాన పంకంలోపడి మునిగి పోతున్నావు. బ్రహ్మమును విస్మరించి దుఃఖాలను ఆహ్వానిస్తున్నావు. నీ శిరస్సుపై అగ్నికణాలను పోసుకుంటున్నావు. ఓ మానవపుష్పమా! దగ్ధమవుతావు. సత్యమును వదలి మిథ్యానామరూపాలను వెంటాడి ఎదురుదెబ్బలు తినడం దేనికి? ఈ విషయవస్తు స్వరూపాలు వెన్నముద్దలుగా, మధుర పక్వ ఫలాలుగా నీవు భావిస్తున్నావు. ఇవన్నీ సున్నపు ఉండలు. తింటావా నాలుక బద్దలవుతుంది. నామాటలు సత్యం. ప్రాపంచిక పదార్థాలన్నీ మిథ్య. తెలివిదెచ్చుకో- బ్రహ్మమే సత్యం"

వైశాఖ జ్యేష్ఠములందు మిట్టమధ్యాహ్నసమయంలో మటమటమండిపోతున్న మరుస్థలంలో మంకముహాముని వ్యాకులుడై సమీపంలో ఉన్న గ్రామానికి వెళ్ళి విశ్రాంతి పొంద దలచాడు. అప్పుడే ఆయనకు వసిష్ఠమహర్షి దర్శనమిచ్చి ఇట్లన్నాడు:- "నిశ్శంకగా నీవు ఈ యుత్తప్త మరుభూమిలో శతసహస్రపర్యాయాలు దగ్ధంగా! కానీ శరీరమందలి ప్రతిరోమకూపాన్ని దగ్ధంచేసే ఆ గ్రామసీమలకు వెళ్ళకు.

ఇచ్చట దగ్ధమయ్యేది శరీర మొక్కటే. కానీ అక్కడ అవిద్యా తాపముచేత నీ సద్వాసనలన్నీ దగ్ధమవుతాయి.

"వరమంధగుహాऽహిత్వం శిలాన్తః కీటతా వరమ్,
వరం మరౌపంగు మృగో న గ్రామ్యజన సంగమః॥" (యోగవాసిష్ఠము)

"చీకటిగుహలో సర్పమైయుండడం, శిలాంతరాళంలో కీటకమై యుండడం, మరుభూమిలో కుంటిలేడియై యుండడమైనా మంచిదిగాని గ్రామ్యజనసంగమం ఎంతమాత్రమూ మంచిదికాదు."

సాంసారిక పదార్థ వ్యామోహితుడవై ఇష్టానిష్టాలను, గౌరవా గౌరవాలను, దేహాలాలసత్వాన్ని, స్వపరభేదాలను మనస్సులో జొప్పించుకొని, శుద్ధాత్మస్వరూపాన్ని విస్మరించి పరిచ్ఛిన్నమైన యీ దేహమే నేనని తలుస్తుంటావా - త్రితాపములందేదో ఒకటి నిన్ను చుట్టుముట్టుతుంది. జ్ఞానదృష్టి పతితమైనకొద్దీ ఈ తాపం పెరుగుతుంటుంది. ఈ క్షుద్ర దేహదృష్టికి, ఈ తుచ్ఛభావాలకు ఫలితంగా దుఃఖ దైన్యాలు లభించకతప్పవు. స్వప్నప్రాయమైన దేహాదులందు మోహమును దూరంజేసి, భేదభావాన్ని భస్మీపటలంజేసి, ఆత్మదృష్టిని విప్పు. ప్రాపంచిక విషయాలన్నీ నీ యవయవాలు నీ వశంలో వున్నట్లు నీకు వశమవుతాయి. సర్వులయొక్క సుఖదుఃఖాలకు కారణం ఈ సిద్ధాంతంలోనే ఉన్నది. దీనిని తెలిసికోకనే జనులు మృత్యుగహ్వారంలో పడుతున్నారు. ఈ సిద్ధాంతం పురిలేని దారంవంటిదికాదు. ఇంద్రుని, సూర్యునికూడా బంధించివేసిన ఉక్కుపాశమిది. సంసారసముద్రంలో ఇది ఒకపెద్ద పర్వతసానువు. దీనిని కనుక్కోలేకనే మహారాజులు, పండితులు, దేవదానవులు తమ జీవితనౌకలను భగ్నం చేసుకుంటున్నారు. వంశాలకు వంశాలు, జాతులకు జాతులు, దేశాలకు దేశాలీ సిద్ధాంతాన్ని తెలుసుకోక మట్టిలో కలసి పోయినవి.

అజగరము (కొండచిలువ) కృష్ణుని తిని జీర్ణించుకో దలచింది. ఉదరంలో గొడ్డలిపెట్టులు ప్రవేశించినవి. అందుచేత హృదయమంతా ఖండఖండాలై అజగరం విక్షిప్తమై పోయింది. కృష్ణుడుమాత్రం ఎప్పటిలాగే ఉన్నాడు. నీ వీ సత్యరూప సిద్ధాంతాన్ని మ్రింగగలవా? అణచి,

దాచిఉంచగలవా ? ఈ సత్యమునకు ఎవరివల్లా భయంలేదు. కృష్ణవంశ జులే స్వయంగా ఈ సత్యమును పరిహసించి, ఈ సత్యాన్ని అరగదీసి సైకతంలో కలిపివేసినా, మళ్ళీ అది జన్మించింది. కృష్ణుడేమిటి ? యాదవులేమిటి ? అది అందరినీ హరించింది. ద్వారకా గౌరవమే లుప్త మైంది. శివుడు శవాన్ని లేవదీసి చెవిలో, "రాముడే సత్య"మని ఉప దేశిస్తున్నాడు. ఇప్పుడే ముందుగా నీవా విషయాన్ని గుర్తిస్తే మృత్యువు నీ దగ్గరికి రాలేదు. చావబోయేముందా – నీవు గీతను పట్టుకోవడం ? నీ జీవితాన్నే భగవద్గీతగా చేసుకో. దీపముండగానే ఇల్లు చక్కబెట్టుకో. ఇప్పుడే హృదయంలో హరిప్రబోధదీపమును వెలిగించు !

"కృష్ణ త్వదీయ పదపంకజ పంజరాంత ।
మద్యైవ మే విశతు మానసరాజహంసః ॥
ప్రాణప్రయాణ సమయే కఫవాత పిత్తైః
కంఠావరోధన విధే స్మరణం కుతస్తే ॥"

"ఓ కృష్ణా! నీ చరణకమలపంజరంలో నా మనోహంస యిప్పుడే ప్రవేశిస్తుందిగాక! ఎందుకంటే, ప్రాణవసాన సమయంలో– కఫవాతపిత్తాలచేత కంఠం అవరుద్ధమై, మనస్సు అస్వస్థమైనప్పుడు నీ స్మరణ ఏ రకంగా జరుగుతుంది ?"

"పతితః పశురపికూపే నిస్సర్తుంచరణచాలనం కురుతే ।
ధిక్త్వాచిత్త! భవాబ్ధే రిచ్ఛామపినో బిభర్షి నిస్తర్తుం ॥"

"బావిలో పడిన పశువైనా బయట రావటానికి కాళ్లు కదలి స్తుంది. కానీ, ఛిః! ఛిః ! ఓ చిత్తమా! సంసారసముద్రంలో పడియున్న నీకు వెలుపలికి రావాలనే కోరిక జనించడంలేదే !"

ఒక పేదవాడు ఆకలితో మరణించాడు. ఆ పిదప వానితల్లి ఒక పైసా నేయి తెప్పించి ఆ శవముయొక్క ముఖానికీ పృష్ఠానికి పూసి, అందరికీ చూపిస్తూ, "చూడండి నాయనలారా! నా కొడుకు ఆకలితో చావలేదు. నెయ్యితిని నెయ్యినే విసర్జిస్తూ మరణించాడు" అని చెప్పిన దట. ఎప్పుడోవచ్చే ముక్తి ఆ పేదవాని నేతివంటిది. జీవన్ముక్తి లభి స్తుంటే దేనికి నీవు స్వీకరించవు ?

# సత్యమైన ఉపాసకుడు 'ప్రేమికుడు'

నిజం చెప్పమంటావా? ఉపాసకుడై, భక్తుడైయుండే పదవి దుర్లభం. ఈ సమస్త ప్రపంచంలో మనం సత్యోపాసకుని ఒక్కణ్ణే చూడగలం. తక్కిన భక్తులను, ఋషులను, మునులను, పైగంబరులను, "ప్రేమమయోపాసకు"లని మాత్రం చెప్పవచ్చు. మనం ఉపాస్యదైవమని పేర్కొనే ఆ సత్యస్వరూపుడైన భగవంతునికంటె నిజమైన ఉపాసకు డెవ్వడు? ప్రేమికుడైన ఆ పరమాత్మ చాటున దాగి బాధిస్తుంటాడు. నెమ్మదిగా మనోవృత్తులనే చెఱగులను పట్టుకొని లాగుతాడు. వివిధవేషాలు ధరించి మనోజ్ఞరూపవిలాసాలతో తెరచాటు నుండి చురుకైన క్రీగంటిచూపులు పరపుతాడు. మన మనస్సు అనాత్మపదార్థాలయందు తగుల్కొన్నప్పుడు ఆతని కోపం ఇంతంత గాదు. కుటిలభృకుటులలో కోపమును ప్రదర్శిస్తాడు. వృత్తి, మార్గమధ్యంలో ఆగినప్పుడు చిటుక వేస్తాడు. ఊపిరాడనివ్వడుకదా! విశ్రాంతా? ఒక్క రాముని నిష్కామశయ్యపైదప్ప నీకు విశ్రాంతి ఎక్కడు దొరుకుతుంది?

"ప్రియా! నీవు ప్రేమికుడవైకూడా కోపిస్తే ఎలాగు? నీ భక్తి రుచిచూపి ఆడిస్తున్నావా? ఆ దుష్టశిశుపాలుఁడు వచ్చి నీ ఈశ్వరత్వాన్ని హరించాడు. ఏమయినా సిగ్గుబిడియాలున్నవా? ఇది కోపించడానికి సమయంకాదు.

"త్వమసి మమ భూషణం త్వమసి మమజీవనం త్వమసి మమజలధిరత్నమ్
భవతుభవతీహమయి సతతమనురోధిన సత్ర మమహృదయమతియత్నమ్"
(జయదేవమహాకవి)

"నాకు భూషణాలు నీవే. నీవే నాజీవన సర్వస్వం. నీవే నాకు అంభోధివినిర్గత రత్నానివి. నాయందు నిరంతరం దయజూపే నీయందు నాహృదయం ప్రయత్నపూర్వకంగా సంలగ్నమవుతుంది గాక!"

సూర్యునకు పండ్రెండు నెలలు తేజఃప్రదానం చేశావు. అలాంటి నీవు ఇరవైనాలుగు గంటలకాలం మాకు నిజానందాన్ని ప్రసాదిస్తే నీకు పోయేదేమిటి!

కుని చెయ్యి. ధనుష్కోణముల రెంటిని నారి ఆకర్షించిన విధంగా అవి నా వద్దకు రావడానికి యిష్టపడకున్నా బలత్కారంగా నాకడకు చేర్చ వలసింది. హే విధాతా! ఇచ్చిన సమస్తఫలాలను నాయందు స్థిరం చెయ్యి. అందరికన్నా నాయందు మేధాదికమును అధికంచెయ్యి.

సమీపానికి ఆహ్వానింపబడిన (వాచస్పతి) వేదశాస్త్రాది పాలకుడు మేధాదికమునుగోరే నాకోరికలను తీర్చడానికి అనుజ్ఞ యిస్తాడుగాక! తదనుజ్ఞా సంప్రాప్తమైన మేధస్సుచే వేదశాస్త్రాలను పొందిన మమ్ము అవి (వేదశాస్త్రాలు) ఎన్నటికైనాసరే వదలకుండు గాక! అంటే మేము ఎప్పుడూ వేదశాస్త్రాది యుక్తులమై ఉంటాము గాక!"

ఇందు వాకృతిరూప బ్రహ్మధ్యానమున్నది. ఇనుమును అగ్నిలో ఉంచినప్పుడు, అగ్నిగుణములు దానికి ప్రాప్తిస్తాయి. అదేమాదిరి బుద్ధి కూడా, వాక్కులకు అధిపతియైన సర్వవ్యాప్త చైతన్యంతో కొలది కాలం అభేదమును కలిగియున్నట్లైతే దానియందు విచిత్రమైన శక్తి ఎందుకు ప్రవేశించదు?

ఏమంత్రమునైనా సరే ఊరిక చదివినంతనే, పాడినంతనే సరి పోదు. ఏతన్మంత్రార్థంలో మనస్సును లీనంజేసి శాంతి పొందేలాగు చెయ్యాలె.

(ఖ) "యజ్జాగ్రతో దూర ముదైతి దైవం తదు సుప్తస్యత థై వేతి,
దూరంగమం జ్యోతిషాంజ్యోతిరేకం తన్మేమనః శివసంకల్పమస్తు."
(యజుర్వేదము)

భావార్థం:- జాగ్రత్స్వప్నములందు ఆత్మచింతన వినా అన్య విషయాలయందు నా మనస్సు ప్రవేశింపకుండా ఉంటుందిగాక! నడుస్తూ, తిరుగుతూ, కూర్చుంటూ, సర్వదా నా మనస్సు సత్యస్వరూపమైన ఆత్మను వదలి అన్యచింతనం చేయకుండా ఉంటుందిగాక!

గాయత్రీ మహామంత్రము

(గ) "ఓం భూర్భువః స్వః తత్స వితుర్వ రేణ్యం భర్గోదేవస్య ధీమహి,
ధియో యోనః ప్రచోదయాత్".

ప్రథమంలో ఇందులో చూడవలసినవి– 'ధీమహి', 'నః' అనేవి బహువచనాలు. ఈ బ్రహ్మగాయత్రీ ధ్యానం ఏకాంతంగా చెయ్యాలి. అలాంటప్పుడు, "మేము, మాబుద్ధులు ధ్యానించుచున్నాము – అనడం దేనికి? నేను ధ్యానిస్తున్నాను; నాబుద్ధి ధ్యానం చేస్తున్నది" అని ఎందుకు ఉండలేదు? ఇక్కడగల వేదాదేశం:– ప్రథమంలో దేహాభిమాన రూపమైన స్వార్థదృష్టిని, పరిచ్ఛిన్నత్వాన్ని పరిత్యజించాలి. సర్వదేశీయులను. సర్వశరీరాలను తనవిగానే భావిస్తూ, సర్వులతో ఏకాకారుడై అభేదబుద్ధితో ఈవిధంగా ధ్యానంచెయ్యాలి.

"మన బుద్ధులను ప్రేరేపించే ఆ సూర్యునియొక్క పూజ్యమైన తేజస్సును మేము ధ్యానిస్తున్నాము" "ప్రచోదయాత్" అనేచోట మహీధరుడు, సాయనాచార్యుడుగూడా "వ్యత్యయ" మన్నారు. ఈ విషయం సత్యమే. సూర్యరూపుడైన సవితృదైవమును మన బుద్ధి ప్రేరకుడని తలచాము. సూర్యుని ప్రకాశింపజేసేవాడే మన బుద్ధులను కూడా వికసింపజేస్తాడు. అతడే ఆత్మ.

"యోఽసా వాదిత్యే పురుషః సోఽసావాహం." (యజుర్వేదం)

'సూర్యునిలోఉన్న పురుషుడను నేనే'. అయితే, అతణ్ణి ధ్యానిస్తే లాభ మేమిటి? పెద్దచిక్కే. సంధ్యావార్చనసమయంలో పరమేశ్వరుని అసత్యంగా భావించడం కాదిది. వాస్తవానికి, దేహదృష్టిని వదలి మాటిమాటికి "నేను సూర్యునియొక్క పూజ్యమైన తేజస్సును. అది నా ధామమే" అని ప్రార్థిస్తే చింతలు నశించవా? దగ్ధంగావా? దినానికి మూడుపర్యాయాలు, లేకపోతే రెండుపర్యాయాలు, అదీగాకపోతే ఒక్కపర్యాయం సత్యభావంతో "బుద్ధి ప్రేరకుడను నేను, ఆత్మను నేను, సూర్యచంద్రులలోని తేజఃపుంజమును నేనే" అని తల్లీనుడనై ప్రార్థించినట్లైతే హృదయంలో అజ్ఞానపు చీకటి, దుఃఖాంధకారం ఏవిధంగా నిలుస్తుంది? చదువుతున్నా, ఇతరపనులు చేస్తున్నా, ప్రతిదినమూ ఏకాంతంలో కూర్చుండి బహుముఖాల పరిగెత్తే మనస్సును ఏకాగ్రపరచి, తేజఃపుంజమునందు అభేదభావంతో సంలగ్నం చేసినట్లైతే, ఓ మిత్రులారా! కీర్తి, యశస్సు, శాంతి మిమ్మ ఆశ్రయించకపోతే నాప్రాణాలను మీకు బలియిస్తాను. "ఖలుక్రతుమయః

పురుషః” (ఈ పురుషుడు సంకల్పమయుడు) అనే ఈ శ్రుతివాక్యం అసత్యమేనా ?

చిత్తం సంసారమగ్నమై, ఆత్మసిద్ధాంతాన్ని ధిక్కరించి, పాప కర్మలుజేసి, పరమాత్మను విస్మరించినప్పుడు, చేతులు జోడించి, అశ్రు ధారలు కారుస్తూ, వినమిత శిరస్సుతో, పశ్చాత్తాప దగ్ధహృదయంతో ఉపాసనచేస్తే, నశించి దగ్ధంగాని పాపం ఏముంటుంది ?

“మోషు వరుణ మృన్మయం గృహం రాజన్నహం గమం,
మృడా సుక్షత్ర మృడయ.
యదేమి ప్రస్ఫురన్నివ దూతిర్న ధ్మాతో అద్రివః,
మృడా సుక్షత్ర మృడయ.
క్రత్వః సమహ దీనతా ప్రతీపం జగమాశుచే,
మృడా సుక్షత్ర మృడయ.
అపాం మధ్యే తస్థివాంసం తృష్ణావిదజ్జరితారం,
మృడా సుక్షత్ర మృడయ.
యత్కించేదం వరుణదైవ్యే జనేఽభి ద్రోహం మనుష్యాశ్చరామసి,
అచిత్తీయత్తవ ధర్మాయుయోపిమమాన స్తస్మాదేనసో దేవరీరిషః.

(ఋ. మం. 7. సూ. 89).

“ఓ రాజా ! వరుణా ! మృణ్మయమైన నీగృహంలో నేను ప్రవేశింపకుండా ఉంటానుగాక ! సువర్ణమయమైన నీ గృహంలోనే నేను ప్రవేశిస్తానుగాక ! ఇట్టి సుఖాన్ని నీవు నాకు ప్రసాదించు. శుభ్ర మైన ధనముగల ఓ వరుణా ! నీవు నామీద దయజూపు.

ధన స్వభావివై నిర్మలుడవైన ఓ వరుణుడా ! నేను అశక్తు డనై కర్తవ్యకర్మకు విరుద్ధమైన కర్మను (శ్రుతి విరుద్ధకర్మను) ఆచరి స్తున్నాను. అంటే శ్రుతి స్మృతి విహిత కర్మను ఆచరింపలేకపోయాను. అందుచేత నేను నీచేత బంధింపబడ్డాను. ఇలాంటి స్థితియందున్న నాకు సుఖాన్ని అనుగ్రహించు.

సముద్రజలమందున్న నిన్ను స్తుతించే నాకు దప్పిక అవుతున్నది. ఉప్పగా ఉండడంచేత సముద్రజలం త్రాగడానికి వీలుకలగలేదు. ఈ విధంగా దప్పికతో ఉన్న నాకు సుఖాన్ని ప్రసాదించు.

హేవరుణ! మనుజులమైన మేము దేవతాజనానికి అపకారం చేస్తున్నాము. నీయొక్క ధర్మకర్మను అజ్ఞానంచేత విస్మరించాము. హే ప్రభో! ఈ పాపంచేశామని మమ్ము శిక్షింపకు.

స్వర్ణదుర్గాన్ని వదలి నేను కంటకములందు నివాసంచేయకుండా ఉంటానుగాక! వజ్రవైడూర్యాలను దూరంగా పారవైచి మట్టిని గ్రహించకుండా ఉంటానుగాక!"

"రామా! ఇక దయజూపు, నేను అజ్ఞుణ్ణి. పతితుణ్ణి. ఓ రామా! ఇక దయజూపు." దేహాభిమానము, కామనలు ఎంతవరకు ఉంటాయో అంతవరకు భేదోపాసనే మనస్సులోంచి వెలువడుతుంది. ప్రేమానురాగాలు అత్యధికమైనప్పుడు ఉపాసనారూప మీ విధంగా ఉంటుంది :-

"తంత్వా భగప్రవిశానిస్వాహా। సమా భగప్రవిశస్వాహా!
తస్మి న్సహస్రశాఖే। నిభగాహం త్వయిమృజేస్వాహా।"
(తైత్తి. ఉప.)

"సర్వకారణరూపుడవైన హే బ్రహ్మన్! నేను నీ యందు ప్రవేశిస్తున్నాను. నీవు నా యందు ప్రవేశించు. (స్వాహా) హే! భగవన్! నీ సహస్రరూపములందు, లేదా నీ యందు నిమగ్నుడనైన నన్ను నేను శోధించుకొంటున్నాను."

ఈ భేదోపాసన ఉచ్చతమస్థితిని పొందినప్పుడు ఈ విధంగా ఉంటుంది :-

"ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే।
ప్రియాణాం త్వా ప్రియపతిగ్ం హవామహే।
నిధీనాం త్వా నిధిపతిగ్ం హవామహే।
వసోమమ, ఆహమజాని గర్భధమాత్వమ జాసిగర్భధమ్॥"

గణములమధ్యమందు గణపాలకుడవైన హేగణపతే! మేము నిన్నాహ్వానిస్తున్నాము. ప్రియములమధ్యమందు ప్రియపాలకా! మేము నిన్నాహ్వానిస్తున్నాము; సుఖనిధులయందు సుఖపాలకా! మేము నిన్నాహ్వానిస్తున్నాము హే వసో! హే ప్రజాపతే! సంసారంలో ప్రాణ

వ్యాపకుడవై యుండడంచేత నీవు నాకు పాలకుడవుగా? గర్భతుల్య మైన సంసారాన్ని ధరించే, ప్రీతినిధరించే, తనశక్తిచే సమస్తసంసారము యొక్క అనాదికారణరూపమైన గర్భమును ధరించే, లేదా మూర్తి మంతములైన పదార్థాలన్నిటినీ రచించే నిన్ను అన్నివిధాలా సమ్ముఖ మొనర్చుకొంటున్నాను. సర్వజగత్తత్వములందు గర్భరూప బీజ ధారకా! నీ కన్నీ తెలుసు. తప్పక సమ్ముఖుడవవుతావు.

"ఏడ్చి ఏడ్చి ప్రణయకలహమును జరిపేది నీతోటే. నే నింత భాగ్యవంతుడను ఐనానంటే నీవే కారణం. నా మనశ్శరీర సంచలనానికి నీవే కారణం. మణినుండి వెలివడే కాంతిపుంజమును ప్రధానం చేసింది నీవే. నేను త్యాగిననేగౌరవం పొందింది నీవల్లనే. సర్వదా ఏకత్వ స్థితియందు నా కభిరుచి యుండడానికి నీవేకారణం. మిత్రులందు నేను ప్రేమకలిగియుండడానికి నీవేకారణం. ఖజానాలందు ధనమున్నదంటే నీవేకారణం. ధనవంతులయందుగల భోగవిలాసాధిక్యతలకు నీవే కారణం. విద్వాంసులయందుగల విద్యాధిక్యమునకు నీవేకారణం. తేజము, ప్రభావము, సంపద, మహత్త్వము ఎక్కడ ఉన్నా అందుకు నీవేకారణం."

"మహేచనత్వాద్రివః పరాశుల్కాయ దేయాం,
న సహస్రాయ నాయుతాయ వజ్రివోనశతాయ శతామఘ.
(సామవేదం. ఇంద్రపర్వము. అ. 3 ఖం. 6 మం. 9)

"హే వజ్రధారీ! ఇంద్రుడా! బహుమూల్యానికి నేను నిన్ను విక్రయించను. హే! వజ్రహస్త! ఇంద్రా! సహస్రరూప్యాలకుగానీ దశసహస్ర రూప్యాలకుగానీ నేను నిన్ను అమ్మను. హే అపరిమిత ధనాధికారీ! ఇంద్రా! అపరిమిత ధనానికి కూడా నేను నిన్ను విక్ర యించను. అంటే ధనమెంత లభించినా నేను నిన్ను హవిస్సులతో పూజించడం మానను."

నిమ్నకక్ష్యకు చెందిన ఉపాసననే సర్వదా చేయడం అనర్థకరం. క్రమక్రమంగా ఉన్నతోపాసనకు మనస్సు అధిగమించాలె. సత్యమైన హృదయంతో ఒక్కసారి ప్రార్థించినా మనస్సువికాసం పొందితీరుతుంది. ఎన్నాళ్ళయినా ఆ ప్రాథమికదశలోనే మనస్సు ప్రాకులాడడం విచార

కరం. మనస్సు మార్పుచెందకపోతే అది బకధ్యానమేగాని భగవత్ప్రార్థనకాదు. ఉపాసనవల్ల గలిగే పరమశ్రేయ మేమిటి? చిత్తము శరీర సాంగత్యాన్ని వదలి ఆత్మసాంగత్యాన్ని పొందాలి. యథార్థోపాసకుడు శారీరకంగాజరిగిన పాపమేదైనా స్మృతికివచ్చినా, 'అది ప్రకృతితః జరిగింది' అని దానిని వదలి శ్రీహరిని శరణుపొంది పరమాత్మతో ఏకాకారతను పొందుతాడు. పూర్వవాసనలను అతిక్రమించే తరుణంలో పశ్చాత్తాపపూర్వకమైన ప్రార్థన ఉండవచ్చు. కానీ పొడుగూతా, 'పాపోహం, పాపకర్మాఽహం, పాపాత్మా పాపసంభవః' అని నిత్యమూ ఆవృత్తి చేసేవాండ్లకు ఈ ఆవృత్తి దైహిక సంబంధాన్ని సడలించదు. సరికదా, పాపసంస్కారాన్నే చిత్తంలో స్థిరం చేస్తుంది. శుద్ధాంతఃకరణులకు, సత్యహృదయులకు ఎన్నడూ భేదోపాసనలో ఆనందం కలగదు. ఎం. ఏ. క్లాసు విద్యార్థి మిడిల్ క్లాసు విద్యార్థి పుస్తకాల్లో ఆనందాన్ని పొందుతాడా?

## జ్ఞాని

ఇక కొంచెం శ్రద్ధతో గమనింపవలసిన సమయంవచ్చింది. మళ్ళీ మహారహస్య మిప్పుడు వివృతం చేయఁబడుతున్నది. తనను తాను సచ్చిదానందరూపమైన పూర్ణబ్రహ్మగా సంభావించి, ఏతదనుభూతి పొందినవానికి దక్కు నిర్భయత్వం, జీవన్ముక్తి, సామ్రాజ్యము, స్వారాజ్యము, ఇతరులకు ఎన్నటికీ లభింపవు. ఆత్మవినా అన్యమును ఏ మాత్రమూ ఎరుగని వానిమనస్సు ఎందుకు చలిస్తుంది? భయంకరసింహగర్జనం విని సింహం భయపడుతుందా? అది దాని గర్జనే కదా! ఖడ్గం తన ఝుళిపింపుకు తానే భయపడుతుందా? అగ్ని తన జ్వాలచేత తాను తపిస్తుందా? నక్షత్రాలు రాలినా, సముద్రాలు చెలియలికట్ట దాటి ఏకమైనా, హిమాలయం బంతిలాగా ఎగిరినా, సూర్యుడు మంచుగడ్డలాగా చల్లారిపోయినా, ఎవని యాజ్ఞలేనిది తృణమైనా కదలదో అట్టి ఆత్మదర్శియైన జ్ఞానికి, బ్రహ్మైక్యజ్ఞానికి ఏమిభయం?

"తత్ర కో మోహః కః శోకః ఏకత్వ మనుపశ్యతః"

(ఈశ. ఉప. 7)

"ఏకత్వమునే దర్శించినప్పుడు (సర్వత్రా ఐక్యానుభవాన్ని పొందినప్పుడు) శోకమోహాలు ఎక్కడనుంచి వస్తాయి?"

"అపి శీతరుచావర్కే సుతీక్ష్ణేచేందు మండలే,
అప్యధః ప్రసరత్యగ్నౌ జీవన్ముక్తో న విస్మయీ॥
ప్రలయస్యాపి హుంకారైః మహాచలవిచాలకైః,
విక్షోభం నైతి తస్యాత్మా స మహాత్మేతి కథ్యతే."

"సూర్యుడు చల్లబడినా, చంద్రమండలం అగ్నిమండలంగా మారినా, అగ్ని అధోముఖంగా జ్వలించినా, జీవన్ముక్తులకు విస్మయం కలగదు. మహాపర్వతాలను చలింపజేసే హుంకారమునువిన్నా ఆతని మానసం విక్షుబ్ధంకాదు. ఆతడు మహాత్ముడన బడతాడు."

సూర్యుడు ఆతని (బ్రహ్మజ్ఞాని) ఆజ్ఞ చేతనే జ్వలిస్తున్నాడు. ఇంద్రుడు నీరుమోసే దతనికే. అతనికి ప్రణామం చేయడానికే నదులు ఇసుకలోపడి పొర్లాడుతున్నవి. రాజులు, మహారాజులు, వేదాలు, గ్రంథాలు సర్వస్వము కేవలం ఒక్క ఆత్మ ద్రష్టయొక్క సంకల్ప మాత్రాలు. త్రిభువనాలు, చతుర్ధామములు, వట్టి పనికిమాలిన అర ణ్యాలు. వాటికిగల ప్రభావం కేవలం ఒక్క జ్ఞానిదే. ముల్లోకాలు ఒక దీపగోళం వంటివి. అందలి జ్యోతి జ్ఞాని. చతుర్దశభువనాలు ఒక శరీరం. అందలి ప్రాణం జ్ఞాని. అతడుగాక అన్యమేదీ "సత్" కాదు. భూమి అన్నమును ఉత్పాదిస్తున్నది. దేనికి? బ్రహ్మనిష్ఠుని చరణము లందు అర్పించడానికే. ఋతువులు మారుతున్నవి. కారణం? ఆత్మ స్వరూపుడైన మహాత్ముని దర్శించడానికే. మనుష్యులు, దేవతలు, యక్షులు దుఃఖాలు పొందుతున్నారు. ఎందుకు? అజరామరరూపుడైన జ్ఞానిని ప్రకటముగా కనుగొనడానికే. ప్రాపంచిక కార్యకలాపమంతా అతనికొరకే. అతడు రాగానే సర్వము సంపూర్ణమవుతుంది. గృహాలు నిర్మింపబడుతున్నవి. వస్త్రాలు ధరింపబడుతున్నవి. ఇదంతా దేనికి? బ్రహ్మనిష్ఠునకు స్వాగత మివ్వడానికే. అతడు ఆగమించినట్లైతే సర్వము సఫలమవుతుంది. రైళ్ళు పరుగెత్తుతున్నవి. ఓడలు నడుస్తున్నవి. ఎందుకు? బ్రహ్మనిష్ఠుని ఏనాటికైనా చేరడానికే. యుద్ధాలు జరుగు తున్నవి. ప్రజలు మరణిస్తున్నారు. దేనికి? జీవన్ముక్తుని దర్శించడానికే.

విధివికాసమంతా (Evolution) ఒక్క జ్ఞాని (జ్ఞానం) అనే ఫలమును పొందడానికే జరుగుతున్నది. ఉపాసన, ప్రార్థన, భక్తి, పరితాపము ఇదంతా ఎంతవరకు? బ్రహ్మజ్ఞానరక్తిమ కనబడునంతవరకే.

"బ్రహ్మవిద్ ఇవ సోమ్య తే ముఖం భాతి."

(ఛాందో. ఉప.)

"సోమ్యుడా! నీముఖం చూడగా బ్రహ్మవేత్తవలె కనబడుతున్నావు."

## ప్రసంఖ్యానము

ఆభేదోపాసనావిధి, మననము, నిధిధ్యాసనము

మనస్సునకు నచ్చిన, నీ హృదయమును ఆకర్షించిన మహావాక్యాలను శాస్త్రాలనుండిఏరుకో. ఏకాంతంలో కూర్చుండి ఈ క్రింద వ్రాయబడిన శంకరుని ఆత్మ పంచకములో లాగా ఆత్మ సంభావనచేస్తూ దేహదృష్టిని అతిక్రమించు.

"నాహం దేహో నేంద్రియా ణ్యంతరంగం,
నాహంకారః ప్రాణవర్గో నబుద్ధిః||
దారాపత్య క్షేత్ర విత్తాది దూరః,
సాక్షీ నిత్యః ప్రత్యగాత్మా శివోఽహం||"

గీ. ఈ శరీరేంద్రియాంతస్సు లేనుగాను,
ఈ యహం ప్రాణ బుద్ధ్యాదు లేనుగాను,
ఈ సతీసుత ధన భూము లేనుగాను,
ప్రత్యగాత్మనై భాసిల్లు పరమశివుడ!

"దేహము, ఇంద్రియాలు. అంతరంగము నేనుగాను. అహంకారము, ప్రాణాలు, బుద్ధి నేనుగాను. ఆలుబిడ్డలు, ఆస్తిపాస్తులు నేనుగాను. ప్రత్యగాత్మయైన శివుడనే నేను!"

నాలుగవ పాదాన్ని చాలాసార్లు మననం చెయ్యి. మనస్సు శిథిలమయ్యేటంతవరకు ఇట్లే మననం చెయ్యి. స్వప్నంలోకూడా వికల్పంలేని "నేను దేహాదికమును కాను" అనే మీమాంస వల్ల దేహభ్రాంతి మళ్ళీ కలుగదు. దేహాభిమానం చూపడం మహా మూర్ఖత. "నేను ప్రత్యగాత్మయైన శివుడనే" అనేదే నిస్సందేహంగా

వేదవేదాంతములయొక్క అంతిమ నిష్కర్ష. వేదాలు, సచ్ఛాస్త్రాలు "నేను దేహాదికమునకు భిన్నుడను" అని ప్రబోధిస్తుంటే, "నన్ను నేను దేహాదిక మని భావించడం శుద్ధనాస్తికత్వం; ఈ యపరాధం నే నెందుకు చెయ్యాలి?" అని సంభావించు.

"ప్రత్యగాత్మా శివోఽహం" "నేను శివుడను. ప్రత్యగాత్మయైన శివుడనే నేను" అని ధ్యానంచెయ్యి. శారీరక సంబంధాలు, బాధలు, అన్యుల ఈర్ష్యాద్వేషాలు, మాన మర్యాదలు – వీనితో నీకేం పని? నిన్ను చెడ్డవాడన్నా, మంచివాడన్నా నీవు నమ్మకు. భ్రాంతచిత్తులైన వారిమాటలు విశ్వసించడం దేనికి ? కేవలం శాస్త్రప్రమాణాలే విశ్వసనీయాలు. నాకు బాధలు, శోకములు లేవు. ఈర్ష్యాద్వేషములు, జన్మ మృత్యువులు, దేహేంద్రియాదులు నాకు లేవు.

"ప్రత్యగాత్మా శివోఽహం. ప్రత్యగాత్మా శివోఽహం"

"ప్రత్యగాత్మయైన శివుడనే నేను. ప్రత్యగాత్మయైన శివుడనే నేను." అని అనుధ్యానం చెయ్యి.

తల్లి కుమారుడికి మామిడిపండు తినడానికి ఇస్తుంది. అలవాటు ప్రకారం బాలుడు దానిని చేతబట్టుకొని రసమును పీల్చ నారంభిస్తాడు. పీల్చగాపీల్చగా చివరకు ఆ పండుబ్రద్దలై, బాలునిచేతులందు,ముఖము పైన, వస్త్రములందు రసము వ్యాప్తమవుతుంది. ఇంకవాడు రస రూపుడు, రసమయుడై పోతాడు. అదేమాదిరి వేదమాత ప్రసాదించిన యీ పక్వమైన మహావాక్యమనే ఫలాన్ని ఏకాంతహృదయంలో మననం చేయగా చేయగా చివరకు ఆవరణభంగమై పరమానంద సమాధి కలుగుతుంది.

"ఆవృత్తి రసకృదుపదేశాత్" (బ్రహ్మసూ. 4-1-3)

సర్వదేశములను ఆత్మయందే చూచువానికి పరోక్షమేముం టుంది? స్థానచింత ఎందుకు కలుగుతుంది? సర్వకాలములందు తననే (ఆత్మను) చూచేవానికి రేపు, నిన్న అనే చింత ఏవిధంగా కలుగుతుంది? సర్వమానవులు, సర్వపదార్థాలు స్వస్వరూపంగా జ్ఞాతమైన ప్పుడు "పరజనభయం" ఎందుకు కలుగుతుంది? కార్యకారణాలుతానే

అయినప్పుడు చిత్తవృత్తులు ఎందుకు నశించవు? పాదరసం మ్రింగిన ఎలుకలాగా మనస్సు కదలకుండా పడియుంటుంది. అప్పుడు సమాధి సహజంగా దాని అంతట అదే కలిగి తీరుతుంది. ఈ రసాన్ని అనుభవించిన వానికే దీనియందలి రుచి తెలుస్తుంది. రాజర్షియైన జనకుడు ఈ యమృతాన్ని ఆస్వాదించి, తన అనుభవాన్ని యీవిధంగా వర్ణించాడు :

"నాహ మాత్మార్థ మిచ్ఛామి గంధాన్ ఘ్రాణగతానపి,
తస్మాన్మే నిర్జితా భూమి ర్వశే తిష్ఠతి నిత్యదా.
నాహ మాత్మార్థ మిచ్ఛామి రసానాస్యేపి వర్తతః,
ఆపో మే నిర్జితా తస్మాద్వశే తిష్ఠన్తి నిత్యదా.
నాహ మాత్మార్థ మిచ్ఛామి రూపం జ్యోతిశ్చ చక్షుషః,
తస్మాన్మే నిర్జితం జ్యోతిర్వశే తిష్ఠతి నిత్యదా.
నాహ మాత్మార్థ మిచ్ఛామి స్పర్శాన్ త్వచిగతాశ్చయే,
తస్మాన్మే నిర్జితో వాయుర్వశే తిష్ఠతి నిత్యదా.
నాహ మాత్మార్థ మిచ్ఛామి శబ్దాన్ శ్రోత్రగతానపి,
తస్మాన్మే నిర్జితా శబ్దా వశే తిష్ఠన్తి నిత్యదా.
నాహ మాత్మార్థ మిచ్ఛామి మనో నిత్యం మనోఽన్తరే,
మనో మే నిర్జితం తస్మాద్ వశే తిష్ఠతి సర్వదా.

(మహాభారతము)

"నేను ఘ్రాణగతములైన గంధములను సైతము ఆత్మకై విసర్జించాను. అందుచేత భూమి నాచేత జయింపబడి సర్వదా నా వశమందుంటుంది. నేను జిహ్వాయందుగల రసము లన్నిటిని ఆత్మకై విసర్జించాను. అందుచేత రసములన్నీ(అభిరుచులన్నీ) నాచేత నిర్జింపబడి నాకు సర్వదా వశమందుంటాయి. నేను దృశ్యమాన సౌందర్యమును ఆత్మకై కోరడంలేదు. అందుచేత సౌందర్యం నాచేత నిర్జింపబడి సర్వదా నాకు వశమందుంటుంది. నేను స్వయంగా వచ్చిన స్పర్శలను గూడా ఆత్మకై కోరడంలేదు. అందుచేత వాయువు నాచేత నిర్జింపబడి సర్వదా నావశమందుంటుంది. శ్రోత్రగతములైన శబ్దాలనుగూడా నేను ఆత్మకై వాంఛించడం లేదు. అందుచేత శబ్దములు నాచేత నిర్జింపబడి సర్వదా నావశమందున్నవి. నేను ఆత్మకోసం మనోన్తరమున మనస్సును

కోరడంలేదు. అందుచేత మనస్సు నాచేత నిర్జింపబడి సర్వదా నావశమందుంటుంది."

ఖండదృష్టి వదలిన జ్ఞానికి సమస్తవిశ్వమూ తన శరీరమే అవుతుంది. ఆతడు విశ్వైక్యానందము ననుభవిస్తాడు.

## పసివాడైన వామదేవుని అనుభవం

"అహం మను రభవం సూర్యశ్చాహం కక్షీవాంబుషిరస్మివిప్రః,
అహం కుత్సమార్జునేయ మ్యృజ్జేహం కవిరుశనా పశ్యతామా,
అహం భూమిమద దామార్యాయాహం వృష్టిందాశుషేమర్త్యాయ.
అహమాపో అనయం వావశాన్త మమ దేవాసో అనుకేతమాయన్."

గర్భస్థుడైన వామదేవఋషి జ్ఞానం ఉదయించగానే స్వీయానుభవాన్ని ఈవిధంగా ప్రకటించాడు:-

"నేనే మనువును. నేనే సూర్యుడను. మేధావియైన దీర్ఘతముని పుత్రుడైన "కక్షీవంతు"డను ఋషిని నేనే. అర్జునీపుత్రుడైన 'కుత్సఋషిని' గూడా నేనే. కవియైన 'శుక్రుడను' నేనే. నేనే మనువునకు భూమినిచ్చింది. ఆజ్యాది హవిస్సులను హోమంజేసే గృహస్థుడికి ధాన్యాభివృద్ధికై వర్షము నిచ్చేది నేనే. గర్జామేఘాలను అంతటికి పంపేది నేనే. సర్వదేవతలూ నా ఆజ్ఞానువర్తులు."

ప్రణవమునందు (ఓంకృతిలో) ఈ మంత్రార్థాలను నింపి, అంటే 'ఓం'కారానికి మహావాక్యార్థము (అహం బ్రహ్మాఽస్మి) నిచ్చి జపించడం' గానంచేయడం, శ్వాసయందు కూడా పూరించడం, సర్వకాల సర్వావస్థలలో స్మరించడం, బ్రహ్మసాక్షాత్కారానికి పరమోపయోగకరం.

స్వస్వరూప జ్ఞానము పొందిన 'వాక్' ఆనే ఒక స్త్రీ ఈ విధంగా గానంచేసింది:-

1. "అహం రుద్రేభిర్వసుభిశ్చరామ్యహమాదిత్యైరుత విశ్వదేవైః,
అహం మిత్రావరుణాభా బిభర్మ్యహ మింద్రాగ్నీ అహమశ్వినోభా.
2. అహం సోమమాహనసం, బిభర్మ్యహం త్వష్టారముతపూషణంభగం,
అహం దధామిద్రవిణం హవిష్మతే సుప్రావ్యేయజమానాయసున్వతే.

3. అహం రాష్ట్రీసంగమనీ వసూనాం చికితుషీ ప్రథమాయజ్ఞియానా,
తాం మా దేవావ్యదధుః పురుత్రాభూరిస్థాత్రాం భూర్యావేశయంతీం.
4. మయాసో అన్నమత్తియోవిపశ్యతియః ప్రాణితియఈం ఋణోత్యుక్తం,
అమంతవోమాం త ఉపక్షియంతి శ్రుధిశ్రుతః శ్రద్ధివం తే వదామి.
5. అహమేవ స్వయమిదం వదామి, జుష్టం దేవేభిరుత మానుషేభిః,
యం కామయే తం తముగ్రకృణోమి తం బ్రహ్మాణం తమృషి సుమేధాం.
6. అహం రుద్రాయ ధనురాతనోమి బ్రహ్మద్విషే శరవేహన్తవావు,
అహం జనాయ సమదం కృణోమ్యహం ద్యావాపృధివీ ఆవివేశ
7. అహం సువే పితర మస్యమూర్ధన్మమ యోనిప్స్వన్తః సముద్రే,
తతో వితిష్ఠే భువనాను విశ్వోతామూద్యాం వర్ష్మణోపస్పృశామి.
8. అహమేవ వాత ఇవ ప్రవామ్యారభమాణా భువనాని విశ్వా,
పరో దివా పర ఏనా పృథివ్యైతావతీ మహినా సంబభూవ.

(ఋ. వే. 8-7-11 సూక్తము 125)

ఈ సూక్తమందు అంభృణమహర్షి పుత్రిక వాగాఖ్యయైన విదుషీమణి పరమాత్మతో తాదాత్మ్యమును పొంది సర్వజగత్తు, సర్వాధిష్ఠానము తానే అని సంభావించి తన స్వస్వరూపమును ఇట్లు స్తుతించింది:-

1. రుద్రరూపంలో వసురూపంలో చరించింది నేనే. ఆదిత్యరూపంలో విశ్వదేవరూపంలో సంచరించింది నేనే. నేనే (బ్రహ్మరూపమవడంచేత) మిత్రావరుణులను ధరిస్తున్నాను. ఇంద్రాగ్నులను, అశ్వినీకుమారులను నేనే ధరిస్తున్నాను. నాయందే జగత్తంతా శుక్తి (ముత్యపుచిప్ప) యందు రజతం (వెండి) లాగా అధ్యస్తమైయున్నది.

2. సోమమును ధరించేది నేనే. అదేవిధంగా 'త్వష్ట, పూష, భగుడు' వీరినిగూడా నేనే ధరిస్తున్నాను. సుందర హవిస్సులతో దేవతలను తృప్తిపరుస్తూ, సోమలతనుండి సోమరసాన్ని వెలికిదీసే యజమానికి యజ్ఞఫలమును (ధనమును) నేనే ఇస్తున్నాను.

3. సర్వజగదీశ్వరిని నేనే. ఉపాసకులకు ఉపాసనాఫలమునిచ్చేది నేనే. యజనము చేసేవారిలో నేనే ప్రధానం. ఈ విధంగా సర్వగుణోపేతనై జగత్ప్రపంచంలోగల సర్వభూతాలను జీవరూపంలో నాయందే ప్రవేశపెట్టుకొన్న నన్నే దేవతలు అనేక స్థానాలకు ఆహ్వానిస్తుంటారు. అంటే చేసేదంతా నాకొరకే చేయబడుతున్నది.

4. అన్నము తింటున్నారంటే నాచేతే తినబడుతున్నది. చూడడం, శ్వాసించడం నావల్లనే. చెప్పేది వినేదికూడా నేనే. (నావల్లనే చెప్పగలగడం, వినగలగడం). ఈవిధంగా అంతర్యామినై యున్న నన్ను ఎరుగనివాండ్లు క్షీణిస్తారు. హే విద్యుత! శ్రద్ధాయత్నములచేత లభించే బ్రహ్మపదార్థమును నేను ఉపదేశిస్తున్నాను; విను.

5. స్వయంగా నేనే ఈ (బ్రహ్మ) వస్తువును తెలుపుచున్నాను. మానవులచేత ఆరాధింపబడి, నేను ఏ పురుషుని రక్షింపదలచానో, అతణ్ణి అందరికంటే అధికునిచేస్తాను. అతనినే సృష్టికర్తయైన బ్రహ్మగా చేస్తాను. అతనిని అతీంద్రియ పదార్థ ద్రష్టగా చేస్తాను. అతనికి సద్బుద్ధి కలుగజేస్తాను.

6. బ్రహ్మద్వేషులై, హింసకులైన త్రిపురాసురలను సంహరించడానికి మహాదేవుని ధనుస్సును ప్రత్యంచాయుక్తంగా చేసింది నేనే. నేనే భక్తసంరక్షణార్థం శత్రువులతో సంగ్రామం చేస్తాను. పృథివ్యాకాశములందు అంతర్యామినై యున్నది నేనే.

7. భూలోకానికి ఉపరిభాగంలో పితృరూపమైన ఆకాశాన్ని సృజించింది నేనే. (ఆత్మనుండి ఆకాశం, ఆకాశమునుండి సృష్టి ఉద్భవించిన కారణంచేత ఆకాశమును 'పిత' అన్నారు.) క్రిందఉన్న సముద్రానికి జలప్రదానం నావల్లే జరుగుతున్నది. ఇంకా నేను సంపూర్ణ స్వర్గాది వికారాలను మాయాత్మకమైన నా దేహంతో స్పృశిస్తున్నాను. ఈవిధంగా ఉండడంచేతనే కారణరూపమైన నేను ఈ సర్వజగత్తులో వ్యాప్తమైయున్నాను.

8. వాయువులాగా, ఇతర ప్రేరణ లేకుండానే కార్యరూపములైన సర్వభువనాలను కారణరూపంతో నేను ఉదయింపజేస్తున్నాను. పృథివ్యాకాశాది సర్వ వికారాలను అధిగమించి సంగరహితము, కూటస్థము, ఉదాసీనము, చైతన్యస్వరూపమగు బ్రహ్మమైయున్న నేను నా మహిమచేత సర్వజగత్తును సృజిస్తున్నాను.

"వారాసు లుప్పొంగు వాహినుల్ పారు
నాయందె నాయందె నాయందె అహహా!

పూలకన్నెలు నవ్వ పుష్పాడు లురుల
మలయానిలంబులు కులుకుచు మసలు
నాయందె నాయందె నాయందె అహహా!
మహదుత్సవంబులు మంచిగా జరుగు
సంగ్రామములును ప్రచండమై రేగు
నాయందె నాయందె నాయందె అహహా!
పర్వతశిఖరముల్ పై కెత్తు తలలు
ప్రకృతిసుందరి నవయౌవ్వనం బొలుకు
నాయందె నాయందె నాయందె అహహా!
ధూమకేతువులు పై కెగురుచు పోవు
ఉల్కాలురాలు మహోద్ధృతంబుగను
చలిగాడ్పు లేడ్చును హోరుమటంచు
ఉరుములు గర్జించు ధమధమా అనుచు
నాయందె నాయందె నాయందె అహహా?
శత్రువు పోరు, మిత్రుడు కౌగలించు
అమ్మ నిద్రించు నాక్రందించు శిశువు
నాయందె నాయందె నాయందె అహహా!
సర్వమత గ్రంథ మూలంబు నేనె
సర్వమతాచార్య తాత్త్వికమణులు
నాయందె కలరహా! నాయందె కలరు!"

సర్వత్ర సర్వత్ర బాహ్యాంతరముల
నేనె ఉన్నాడను నేనె ఉన్నాడ!
... ... ...
నాకు మార్పులు లేవు భయమృతుల్ లేవు
నే నెప్పుడును పుట్టుటనునది లేదు.
నా కారయన్ తల్లిదండ్రులు లేరు
పరిపూర్ణ జ్ఞానస్వరూపుడ నేను!
నే నఖండామృతానంద రూపుడను!
ఓమహం బ్రహ్మాస్మి ఓ మహం బ్రహ్మ!

ఏను శోకంబును గూర్చ నెప్పుడును
మరి నాకు నైతము దుఃఖంబు లేదు,
నాకు శాత్రవుడను వా డెందు లేడు;
మరి నేను శాత్రవుడను కాను కాను
పరిపూర్ణజ్ఞాన స్వరూపుడ నేను!
నే నఖండామృతానంద రూపుడను!
ఓమహం బ్రహ్మాస్మి ఓమహం బ్రహ్మ!
నాకు రూపము లేదు, పరిమితి లేదు.
స్థలకాల కారణాతీతుండ నేను.
నేను సర్వములోన నధివసించెదను.
సర్వంబు నాలోన నధివసించెడిని.
వాసుదేవుడ నేను వాసుదేవుడను!
సర్వ విశ్వానంద రూపుడ నేను!
నేలేని స్థలమేది? నే సర్వమయుడ
పరిపూర్ణ జ్ఞానస్వరూపుడ నేను!
నే నఖండామృతానంద రూపుడను!
ఓమహం బ్రహ్మాస్మి ఓమహం బ్రహ్మ!
నే నిరాకారుడ నిర్వికారుడను
ఇంద్రియంబులు మరి యింద్రియంబులకు
కానవచ్చెడి పదార్థంబు లే గాను
నేనఖండామృతానంద రూపుడను
పరిపూర్ణ జ్ఞానస్వరూపుండ నేను!
ఓమహం బ్రహ్మాస్మి ఓమహం బ్రహ్మ!

పరిపూర్ణమైన ఆనందంబు నేను
ఓం! ఓం! ప్రశాంతి! ఓం! ఓం! ఓం! ప్రశాంతి!
పరిపూర్ణమైనట్టి జ్ఞానంబు నేను,
ఓం! ఓం! ప్రశాంతి! ఓం! ఓం! ఓం! ప్రశాంతి!
పరిపూర్ణమైనట్టి సత్యంబు నేను
ఓం! ఓం! ప్రశాంతి! ఓం! ఓం! ఓం! ప్రశాంతి!

పరిపూర్ణమగు పరంజ్యోతిని నేను
ఓం! ఓం! ప్రశాంతి! ఓం! ఓం! ఓం! ప్రశాంతి!
నిర్భయుడ నిర్భయుడ నిర్భయుడ నేను!
ఓం. ఓం! ప్రశాంతి! ఓం! ఓం! ఓం! ప్రశాంతి!
రాగమోహంబులు మందుకు లేవు
సర్వవాంఛా పరిపూర్ణత్వ మేను
ఓం! ఓం! ప్రశాంతి! ఓం! ఓం! ఓం! ప్రశాంతి!
నే పరమాత్మను బుద్ధ్యతీతుడను
ఓం! ఓం! ప్రశాంతి! ఓం! ఓం! ఓం! ప్రశాంతి!
అందరి చెవులతో వినెదను నేను
ఓం! ఓం! ప్రశాంతి! ఓం! ఓం! ఓం! ప్రశాంతి!
అందరి మనసులతో చింతసేతు
ఓం! ఓం! ప్రశాంతి! ఓం! ఓం! ఓం! ప్రశాంతి!
పరమసత్యంబైన నన్నెరుంగుటకె
ఋషులు తపంబొనరించుచుండెదరు.
ఓం! ఓం! ప్రశాంతి! ఓం! ఓం! ఓం! ప్రశాంతి!
సూర్య నక్షత్రాది గ్రహరూపములను
కనవచ్చు జీవతేజంబును నేనె
ఓం! ఓం! ప్రశాంతి! ఓం! ఓం! ఓం! ప్రశాంతి!

## ఇంద్రుని ఆనందసముద్రంబిట్లు ఘోషించింది :

1. “ఇతి వా ఇతిమే మనోగా మశ్వం సను యామితి ।
   కువిత్సో మస్యాపామితి ॥
2. ప్రవాతా ఇవ దోధత ఉన్మాపీతా అయంసత । కువి.
3. ఉన్మాపీతా అయంసత రథమశ్వా ఇవాశవః । కువి.
4. ఉపమా మతి రస్థిత వాశ్రా పుత్ర మివప్రియం । కువి.
5. అహం తష్టేవ బన్ధురం పర్యచామి హృదామతిం । కువి.
6. నహినే అక్షి పచ్చనాచ్ఛాంత్సుః పంచకృష్టయః । కువి.
7. నహిమే రోదసీ ఉభే అన్యం పక్షం చనప్రతి । కువి.
8. అభిద్యాం మహినా, భువమభీకిమాం పృథివీం మహీం । కువి.

9. హన్తాహం పృథివీ మిమాని దధానీహ వేహ వా । కువి.
10. ఓషమి త్పృథివీమహం జంఘనానీహ వేహ వా । కువి.
11. దివిమే అన్యః పక్షోకిధో అన్యమచీకృషం । కువి.
12. అహ మస్మి మహామహో౽భినభ్య ముదీషితః । కువి.
13. గృహోయామ్యరం కృతో దేవేభ్యో హవ్యవాహనః । కువి.

(ఋ. వే. 8-6-26 సూ. 119)

ఇంద్రు డీ సూక్తంలో తన నీ విధంగా స్తుతించుకున్నాడు:-

1. స్తుతించేవారికి గోవులను, అశ్వములనూ ఇవ్వడం నాకిష్టం. కారణమేమిటంటే? నేను చాలాసార్లు సోమపానం చేశాను.

2. అతికంపిత వాయువు వృక్షాదులకు జలమును జేర్చినవిధంగా పానముచేయబడిన సోమము, నన్నతిశీఘ్రంగా (సోమపాన పరులకడకు) చేరుస్తుంది. కారణం? నే ననేక పర్యాయములు సోమపానం చేశాను.

3. వేగవంతములైన గుఱ్ఱాలు రథాన్ని చేర్చేవిధంగా పానము చేయబడిన సోమము నన్నతిశీఘ్రంగా చేరుస్తుంది.

4. 'అంబా అంబా' అనగానే ఆవు దూడయొక్క దాపుకు చేరినమాదిరి, స్తుతించేవారి స్తోత్రాలు నన్ను వారి దగ్గరకు తీసుక పోతాయి. కారణం? నే ననేకపర్యాయములు సోమపానం చేశాను.

5. వడ్రంగి రథాన్ని సరిజేసేవిధంగా, నేను సంకల్పంచేత స్తుతిని సఫలం చేస్తాను. కారణం? నే ననేక పర్యాయములు సోమపానం చేయడమే.

6. దేవతలు, మానవులు నా దృష్టినుండి ఏ వస్తువునూ దాచ లేరు. కారణం? నే ననేకపర్యాయములు సోమపానం చేయడమే.

7. భూమి, స్వర్గము నా రెక్కకుగూడ పోలవు. కారణం? నే ననేకపర్యాయములు సోమపానం చేయడమే.

8. నేను నామహిమచేత స్వర్గమును లజ్జింప జేస్తున్నాను. అదే విధంగా భూమినిగూడ క్రిందుపరుస్తున్నాను. కారణం? నే ననేక పర్యాయములు సోమపానం చేయడమే.

9. నేను ఈ భూమిని ఉద్ధరించి స్వర్గమునందు – అంతరిక్షమునందు ఉంచదలుస్తున్నాను. కారణం? నే ననేక పర్యాయములు సోమపానం చేయడమే.

10. భూమికి ఎదురుగా తన తేజస్సుతో సంతాపమును కలుగజేసే ఆదిత్యుని స్వర్గమందు (అంతరిక్షమందు) చేర్చాను. కారణం? సోమపానమే.

11. నాపక్ష (రెక్క) మొకటి స్వర్గమందూ, రెండవది భూమియందూ కలదు. కారణం? నే ననేకపర్యాయాలు సోమపానం చేశాను.

12. అంతరిక్షమందు సూర్యరూపంలో ఉదయించిన నేను అత్యాధిక తేజస్విని. కారణం? నే ననేక పర్యాయాలు సోమపానం చేశాను.

13. యజమానులచేత (గృహస్థులచేత) అలంకృతుడనై, హవిస్సులను గ్రహిస్తూ, ఇంద్రాది దేవతలకు హవిస్సులను అందజేసే అగ్నిరూపుడనై హవిస్సులను గ్రహిస్తున్నాను. కారణం? నే ననేక పర్యాయాలు సోమపానం చేశాను.

ఈ విధంగా ఇంద్రుడు తన బ్రహ్మానంద సోమపాన ప్రభావాన్ని స్తుతించుకున్నాడు.

"అహాహా! నా ఆనంద మధుపాత్ర నిండె;
సర్వవాంఛలు పరిపూర్ణంబు జెందె.
సుధుర మంజుల మలయానిలంబులను
వీయుచున్నది నేనె అతిమనోజ్ఞముగ.
మందమారుతములు కొసరి ముద్దాడ
పూవులలో నేనె పులకరించెదను.
వరదగూడున గల సప్తవర్ణములు
నా భూషణంబులే నా యలంకృతులె!
నాదు సందేశముల్ నల్దిక్కులకును
విద్యుదగ్నికణాల విధముగా నురుకు.
ప్రేమస్వరూపంబులన్నియు నేనె-
పారవశ్యము నేనె వాంఛలు నేనె.

మధురపుష్పంబుల మందహాసములు
మంచుబిందువులను మంచిముత్తెములు
మాధుర్యరసమున ముంచగాబడిన
ఉద్దీప్త భాస్కర కిరణజాలములు
పరిశుద్ధ నవనవ రుక్మమాలికలు
రమణీయ నిర్మల చంద్రబింబంబు
నీటిలో క్రీడించు నీబుద్బుదములు
ఇటునటు లూగెడి నీవృక్షపంక్తి
తరుషండముల కౌగలించుకున్నట్టి
వనలతాసుందరి సందోహములును
మధురగీతిక పాడు భృంగ కన్యకలు
నాముఖాంభోజ విన్యాసంబులగును!
నే వీడు పరిమళ నిశ్వాసలగును.
బ్రతుకు చావులు రెండు పరికించి కంటి
అస్మదీయోచ్ఛ్వాస నిశ్వాసలేను!
ఏనింక చేయగా వలసిన దేమి?
ఏసింక కదలు టెచ్చోటికి? అహాహా!
నేను సర్వవ్యాప్త వాసుదేవుడను.
నే లేని నెలవేది కదలుదమన్న.
నేను కోరున దేమి? వద్దను టేది?
నాస్వరూపంబెగా సకలకాలంబు.
అఖిలమా శక్తి నాబాహువీర్యంబె.
నాకు సంశయ విచారంబులుకలవె?
లేవు— నేనే మూలకారణంబగుట.
ఇప్పుడై యున్నది సర్వకాలంబు.
ఇక్కడై యున్నది సర్వదూరంబు.
అఖిలసమస్యలు విడివడిపోయె.
ఘనరహస్యము తేటతెల్లమైపోయె.
ఈ మంచిచెడుగుల, సుఖదుఃఖములను
నా రక్తనాళమే స్పందనసేయు.

ప్రేమస్వరూపంబు లన్నియు నేనె.
మాధుర్యహృదయంబు లన్నియు నేనె.
నేనె భావంబులు వాంఛలు నేనె!
స్వార్థాశయము లేదు, బంధంబు లేదు
నాకంద రనుగుణంబుగ నుందు రెపుడు
శత్రు మిత్రులలోన సమముగానున్న
కర్తృత్వరహిత పరబ్రహ్మమేను!
సర్వంబు నాయుందు సాష్టాంగపడును.

"కిం కరోమి క్వగచ్ఛామి కిం గృహ్ణామిత్య జామి కిం,
ఆత్మనా పూరితం విశ్వం మహాకల్పాంబునా యథా.
సబాహ్యాఽభ్యంతరేదేహి హ్యధ ఊర్ధ్వంచ దిక్షుచ,
ఇత ఆత్మా త థేహాత్మా నాస్త్యనాత్మమయం జగత్.
నతద స్తి నయత్రాహం నతద స్తి నయన్మయి,
కి మన్యదభివాంఛామి సర్వం సం విన్మయం తతం.
స్ఫారబ్రహ్మమలాం బోధి ఫే నాః పర్వకులాచలాః,
చిదాదిత్య మహాతేజో మృగతృష్ణా జగచ్ఛ్రియః."

"నేనేమి చెయ్యాలి? వెళ్ళేదెక్కడికి? విడిచేదేమిటి? గ్రహించేదేమిటి? ప్రళయకాల మహాజలములో లాగా ఆత్మతో ఈ విశ్వమంతా నిండియున్నది. ఆత్మ యీ దేహం లోపలా వెలుపలా, పైనా క్రిందా సమస్త దిక్కులందు నిండిఉన్నది. ఇక్కడ ఆత్మ, అక్కడ ఆత్మ. ఆత్మలేని జగత్తేలేదు. నేనులేని చోటూ, నాయందులేని వస్తువేలేదు. అంతా ఆత్మస్వరూపమై, విస్తృతమైయుంటే, నేనేమికోరేది? విస్తృత బ్రహ్మసాగరమునుండి ప్రాదుర్భవించిన నురుగులే కులపర్వతాలు. చిదాదిత్యుని ప్రఖరతేజమే సర్వవ్యాప్తమైయున్నది. ఈ ప్రాపంచిక భోగభాగ్యాలన్నీ మృగమరీచికలు (ఎండమావులు).

"అస్మే సూర్యా చంద్రమసాభిచక్షే,
శ్రద్ధే కమింద్ర చరతో వితర్తురం."

హే ఇంద్రా! మా హృదయంలో శ్రద్ధ (భక్తి) ఉత్పన్నంగావడానికే సూర్యచంద్రులు క్రమబద్ధంగా పరిభ్రమిస్తున్నారు. ఇందుకే బ్రహ్మాండం గూడా తిరుగుతున్నది.

# సారాంశము

సమస్తధర్మాలను మూడువిధాలుగా విభజింపవచ్చు.

1. "తస్యైవాహమ్" "నేను ఆతనివాడను" ఇది భక్తియొక్క ప్రాథమిక దశ. ఈ దశలోనివారికి భగవంతుడు తెరచాటున ఉన్నాడు.

2. "తవైవాహం" "నేను నీ వాడను" * ఇది భక్తియొక్క ద్వితీయ దశ. ఈ దశలోనివారికి భగవంతుడు అత్యంత సమీపానికి వచ్చియున్నాడు. ముఖాముఖిగా ఉన్నాడు. ఇక్కడ తెర ఇంకా సూక్ష్మీకరింపబడింది.

3. "త్వమేవాహమ్" "నీవే నేను" † ఇది భక్తియొక్క తృతీయదశ. ఈ దశలోనివారికి బ్రహ్మాకారవృత్తి సంప్రాప్తించింది. భేదము పటాపంచలై పోయింది. తెర ఉన్నదా? లేదా? అన్న స్థితి యిది. తెర పూర్ణముగా ఎత్తిన పిదప (ఈ వృత్తికూడ ఉపశమించిన తరువాత) ఆ స్థితి నిర్బీజసమాధి - సహజావస్థ. అది మనోవాక్కులకు అగమ్యం. "యతోవాచో నివర్తన్తే అప్రాప్యమనసా సహ." అదే మహానిర్వాణం.

వాక్కు, శబ్దంకూడా అక్కడికిపోయి గోడకు తగిలిన బంతిలాగా మరలివస్తుంది. అక్కడ వాక్కు లేదు. శబ్దం అసలే లేదు. అక్కడ "అహం బ్రహ్మాఽస్మి" "శివోఽహం" అనడంకూడా (బ్రహ్మాకారవృత్తి) లేదు. నిజమైన భక్తిలో దూరమూ - భేదమూ ఉండడం అసంభవం. ఇక తెర ఎక్కడ? లేనేలేదు.

మనస్సుయొక్క పరిణతినసుసరించి, మానవుడు ఆయా భక్తి స్థితిని ఆశ్రయిస్తాడు. ఏ దశలోని భక్తిపథంలో ఉన్నవాడైనా సరే హృత్పూర్వక భగవత్ప్రేమచేత, తీవ్రశ్రద్ధాపరాయణచేత పరాభక్తిశిఖ

---

* "మమైవాసౌ" నీవు నా వాడవు - అనియు భావనాంతరము.

† "స ఏవాహమ్" ఆతడే నేను - అనియు భావనాంతరము.

"తస్యైవాహం మమైవాసౌ స ఏవాహమితి త్రిధా,
భగవచ్ఛరణత్వంస్యాత్ సాధనాభ్యాస పాకతః"

రాన్ని తనకు తెలియకుండానే అప్పుడప్పుడు అందుకుంటూ క్రమతః శాశ్వతంగా అందుకుంటాడు. ఆ యా భక్తిదశలలోని సత్యశ్రద్ధాన్వితులైన భక్తుల జీవితాలలో ఈ మహాభక్తిమయత, లక్ష్యసిద్ధి గోచరిస్తుంది.

ఓం తత్సత్.

## దైవభక్తి

"మేమెన్నడును మద్యమును త్రాగలేదు
మాకు మదిరోన్మాద మనునది లేదు.
మేము స్వప్నములోన మా ప్రాణనాథు
మధురాధరములను చుంబించినాము,
ఆ స్వాప్ని కావేశమే యిదియెల్ల!"
సూర్యు డాపరమాత్మ ప్రతిరూప మనుచు
మానవుండాతని విగ్రహంబనుచు
అతడు తారలలోన మెరయుచున్నాడు
ప్రసవగుచ్ఛములందు నవ్వుచున్నాడు,
కృష్ణపక్షులలోన పాడుచున్నాడు
నిశ్వసించును మలయానిలంబును
వర్ష మేఘంబు లందు గర్జించు మరియు
శీతలరాత్రుల నిద్రించుచుండు
కొండవాగులలోన పరుగులుబారు
వరదగూడులలోన నూయలలూగు
విద్యుత్ప్రవాహంబులందు పర్వెత్తు –
అని చెప్పుచున్నారు మహనీయులెల్ల :
అవునవు నది అంతియే యగునిజము.
ఈ స్థల కాల స్వరూపంబు లెల్ల
ఆ నా సముజ్జ్వల ప్రేమవిభుండు
వయ్యారముగ సగమగపడకుండ
సగము కానగవచ్చునట్టుల దాల్చు
రమణీయ ఘనవస్త్ర భూషణావళులు.

## ప్రార్థన

ప్రియతమా! ఎందుకీ ముసుగులు, తెరలు?
నీవు కురూపివా? గర్వమా? సిగ్గ?
బహిరంగపడినచో దృష్టిదోషంబ?
ఎందుకీ ముసుగులు తెరలెందుకోయి?
దయచేసి నగ్నుడవై రమ్ము రమ్ము!
నీపాదముల వ్రాలి వేడుచున్నాను
'కాదు-లేప'ను మాట వలదు నాముందు

## భగవదుపదేశం

ప్రియుని జవాబు నాయెదలోన దోచె
మెరపు తళుక్కున మెఱసిన రీతి
లేదు డంబంబును, సిగ్గును లేదు
నాకు గూర్పకు కళంకం బీ విధాన!
ఏ దిగంబరునిగా నగ్నునిగాగ
వాంఛింపుచున్నావ భావంబులోన?
అయినచో నీవు మనఃపూర్వకముగ
నిష్కపటంబుగా కోరుచున్నావ;
మరి ప్రియా! నీ వెందుకారీతిగావు?
ఆచ్ఛాదనములెల్ల విడనాడిరావు?
చింపుము చింపుము తెరల నన్నిటిని,
మరుగున నీవు దాగుండగా వలదు,
భేదభావంబను తెరయేది వలదు,
కీర్తిప్రతిష్ఠల, సర్వసంపదల
దేహచిత్తంబుల, ఆస్తిపాస్తులను
రాగమోహాసూయ కామభావముల,
వాంఛల, తృష్ణల, సంకల్పములను,
'నీది నాద'ను వాని నెల్లను విడుము

చింపుము చింపుము తెరల నన్నిటిని
నీవును నగ్నత్వమును పొందిరమ్ము
తగులబెట్టుము సకలాచ్ఛాదనములు
తుత్తుమురొనరింపుమీ తెరలెల్ల
రమ్ము స్వాగతము! స్వాగతము! రారమ్ము!
ఆలస్య మొనరింపగా వద్దు, వద్దు,
నను కౌగలింపగా నగ్నవై రమ్ము –
... ... ...

## బ్రహ్మైక్యానందము – మహానిర్వాణము:

ఇదిగో యిప్పుడు నీవు నేనొక్క టహాహా!
ఆనంద మానంద మానంద మహాహా!
అహా! ఎట్టి ప్రణయమాధుర్యానుభూతి!
అతని వస్త్రంబులే నా వస్త్రములుగ
అతని పచ్చడములు నావిగా నయ్యె
ఇవిగో! పోయినవి పచ్చడములు శాల్వా
లివిగో పోయినవి వస్త్రాచ్ఛాదనములు!
ఆతడే నేను! నే నాతడే! అహాహా!
ఆతడు నే ననేభావమే లేదు
అద్వయానందము! ఓం! ఓం! ప్రశాంతి!

ఓం శ్రీ మట్టపల్లి లక్ష్మీనృసింహార్పణమస్తు!

ఓం! ఓం!! ఓం!!!

# తప్పొప్పుల పట్టిక

## సప్తమ సంపుటం - "వందేమాతరం"

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 8 | 5 | పట్టణంలోనే | పట్టణంలోని |
| ,, | 7 | ఉ్నది. | ఉన్నది. |
| ,, | 10 | మృత్యు | మృత |
| 11 | 16 | ఫలితంగాకూడ | ఫలితం కూడ |
| 14 | 20 | భరతమాత | భారతమాత |
| 15 | 8 | కపాలమూ | కపాలమో |
| 16 | 19 | గులాబిలను | గులాబీలను |
| ,, | 28 | ముకిగి ఎరువును | ముకికి ఎరువును |
| 17 | 5 | సు తీక్ష్ణణత | సుతీక్ష్ణత |
| ,, | 26 | బహ్మసమాజం | బ్రహ్మసమాజం |
| 18 | 16వ పంక్తి క్రింద 17వ పంక్తిగా - ముకికి గుంటనుగల యొక్క నీటిచుక్క - అను పంక్తిని చేర్చుకొనవలెను. | | |
| ,, | 26 | సంస్పర్శనముచే | స్పర్శచే |
| 20 | 9 | పంతసిస్తారు. | పంతపిస్తారు. |
| 23 | 13 | అద్వై దాంతికమైన | అద్వైదాంతికమైన |
| ,, | 18 | జీవప్రతాణి | జీవప్రాణి |
| 23 | 12 | అకాలికంగా | అకాలికంగా, |
| 29 | 10 | ఆకోశిస్తున్న | ఆక్రోశిస్తున్న |
| ,, | 22 | పాశవికశక్తి | (పాశవికశక్తి) |
| 31 | 11 | అవిలేకుండా | లేకుండా |
| 33 | 18 | విరామయ | నిరామయ |
| 36 | 20 | ి ధదేశములు అనే | యనే వివిధదేశములు |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 42 | 2 | భావిస్తవి. | భాసిస్తవి. |
| ,, | 6 | జీవితానికీ | జీవితానికి |
| ,, | 16 | ప్రాచీన పరాయణలు, | ప్రాచీనాచారపరాయణులు, |
| 43 | 17 | తెలుసుకుకోతున్నది. | తెలుసుకోబడుతున్నది. |
| 45 | 18 | పరమేశ | పరమేశ! |
| 57 | 2 | యీ అవ్యక్తధ్వని, | యీ అవ్యక్తధ్వని. |
| 58 | 12 | చేయలేకపోయినా, | బుజావుచేయలేకపోయినా, |
| 61 | 12 | వెళు | వెళ్లు |
| 71 | 25 | జనులనుంచే | జలనుంచే |
| 73 | 27 | నిశ్చలంగా | నిశ్చయంగా |
| 77 | 11 | దీర్ఘజీవితంలో. | దీర్ఘజీవితంలో, |
| 77 | 29 | 'తన ప్రియాలో' | తన 'ప్రియాలో' |
| 80 | 8 | వలసి | వలస |
| 100 | 3 | యాత్రికాధికార | యాంత్రికాధికార |
| 101 | 14 | నేటికి | నేటికీ |
| 103 | 21 | అంతఃపుర ప్రకృతిని | అంతః ప్రకృతిని |
| 120 | 22 | నేమి | నేమీ |
| 127 | 1 | భారతదేశపరిస్థితులు-ఆర్థిక విశేషాలు | భారత స్త్రీత్వము |
| 129 | 1 | ,, ,, | భారతసతీత్వము |
| 131 | 1 | ,, ,, | ,, |

## అష్టమ సంపుటం — "శ్రీరామతీర్థ లేఖావళి"

7 నుండి 97 వరకు బేసిసంఖ్యగల పేజీలలో 1 వ పంక్తి - హిమాలయ లేఖలు అను శీర్షికకు బదులు - శ్రీరామతీర్థ లేఖావళి - అని సవరించుకొనవలెను.

| | | | |
| --- | --- | --- | --- |
| 7 | 27 | సుదర | సుందర |

